बम्बई
११-१०-५८

प्रिय महाशय,

सादर वन्दे।

पिछले दिनों मैं बाहर गया हुआ था, वापस आने पर बीमार होगया, इसलिये पत्रोत्तर लिखने में विलम्ब होगया।

आप "तूफ़ान की कलियाँ" तेलगू में प्रकाशित करलें।

छपने पर कापी भेजना।

कृष्णचन्द्र

కొండచెరియల్లో రెండు దార్లున్నాయ్.

ఒకటి లోయలోనుండి కొండమీదకు పోయి, చీళ వృక్షాలగుండా ముందుకు పోతుంది. మరొకటి లోయలోనే కొండ నానుకొని క్రిందగా పోతుంది. క్రింది దారిని ఆనుకొనే ధాన్యపుచేలు, చేల మొగదల్లో పశువుల గుంపులు–వాటిని మేపే పశువులకాపర్ల సమూహాలు వున్నాయ్ కొండ ఏమంత పెద్దది కాకపోవడం వల్ల పైదారిన పోయేవాళ్ళకు క్రింద దారి స్పష్టంగా కనుపిస్తూంటుంది.

పై దారిన ఒక యువకుడు పోతున్నాడు. క్రింద దారిన ఒక యువతి పోతున్నది. దూరాలవరకూ ఆదార్లన మరెవ్వరూ లేరు!

యువకుడు ఒక్క–క్షణం ఆగాడు. వ్యాఘ్ర వృక్షాన్నొక దాన్ని ఆనుకొని నిలబడి నుదుటన వున్న చమటను తుడుచుకొన్నాడు. తన చేతిలోని ఖాకి రంగు సంచీని సర్దుకొన్నాడు. కొంచం వంగి క్రింది దారివంక దృష్టిసారించాడు. యువతి ఆగకుండా వెళ్ళిపోతున్నది. అబ్దుల్ చిరునవ్వు నవ్వుకొన్నాడు. ఇద్దరూ ఏడుకోసుల దూరాన్నుండి ఇలాగే కలిసి వస్తున్నారు. రెండు దార్లూ ప్రత్యేకమైనవే. రెండు దారులకూ మధ్య కొండకూడా వుంది. పైగా తాము ఇద్దరూ అపరిచితులు! అయినా తమ ఇద్దరిలో, ఒకేదారిన ప్రయాణం చేసే ఇద్దరు బాటసార్లలో వుండే సాధారణమైన సానుభూతి వుంటే ఎంత బాగుంటుంది? అనుకొన్నాడు అబ్దుల్.

"కాని యువతికి ఒంటరిగా ప్రయాణం చేయడం అల వాటుగావును. అందువల్లే తోటి ప్రయాణీకుడి సానుభూతిని నిర్లక్ష్యంచేసి అలా వెళ్ళిపోతున్నది!" విశాలమైన అబ్దుల్ ఫాలం ముడతలు పడ్డది. అతని బలమైన దవుడలు పైకి ఉబికి న్నాయ్. ఉదాసీనంగా ఒకమాటు నవ్వి, తనబిరుసైన గడ్డాన్ని గీరుకొన్నాడు అబ్దుల్! అలాగే ముందుకు పోతున్న యువ తిని అబ్దుల్ చూస్తూ వుండిపోయాడు...అతడికి ఈ యువతి గోరాహో దగ్గిర కలిసింది. అక్కడ క్రిందిదారిని ఆనుకొని వున్న ఒక ఇంటిదగ్గిర మధ్య వయస్కురాలయిన ఒక గృహిణి ఈయువతిని పంపిస్తున్నది. ఈ రెండు దారులకూ మధ్యదూరం బాగావుంది. అయినా కొండదారి కావడం వల్ల క్రిందకూ పైకీ దిగుతూ ఎక్కుతూ వుంటుంది. క్రిందికి వచ్చినప్పుడు రెండు దారులూ చాలా సమీపానికి వచ్చే సాయి. పయికి పోయినప్పుడు కేక కందని దూరాలు ఏర్పడ తాయ్. అవును మరి; కొండదార్లాయె! ఒకప్పుడు దూరం... ఒకప్పుడు దగ్గిర! దగ్గిరదూరం! దూరందగ్గిరా! ఈ కొండ దారులకు మానవజీవితం బాగా అవగతం! గోరాహో దగ్గిర ఈరెండు దారులూ బాగా దగ్గిరకు వచ్చేస్తాయి. అక్కడే అబ్దుల్ ఈ యువతి సౌందర్యాన్ని చాలా దగ్గిరగాచూశాడు. ఆగిపోయాడు. అతను యవ్వనుడు, ఆ వయస్సులో ప్రతిస్త్రీ అందంగానే కనపడుతుంది. పైగా తాను వుండే కాగాక్ నదీ ప్రాంతపు స్త్రీల సౌందర్యం జగత్ ప్రసిద్ధం! అయినా అబ్దుల్ ఇంతవరకూ ఇలాంటి రంగు, ఆకారం, సౌందర్యం—చూడలేదు! అతని కాళ్ళు వాటంతట అవే ఆగాయి. శ్వాస ఆగింది. ఆకాశంలో మేఘాలు ఆగాయి. అవును మరి సౌందర్యం

ఎదురైతే, జీవితం ఒక్కక్షణం ఆగి, వంగి అభినందించి ముందుకు పోతుంది. అబ్దుల్ తల వంచుకొని ఓరగా చూస్తూ ముందుకు సాగాడు. యువతికి వీడ్కోలు ఇస్తున్న గృహిణి కండ్లలో నీళ్ళు నిండాయి. యువతి ముఖంమీద ఎర్రని ఎండ రాగిరేకులా మెరిసింది.

తరువాత యువతికూడా తను పోయే దిశకే వస్తూండడం అబ్దుల్ గమనించాడు. ఈ రెండు దారులూ పదవ కోసు వరకూ కలిసే పయనిస్తాయ్. పది కోసుల తరువాత క్రింది దారి దక్షిణానికి తిరుగుతుంది...పది కోసులతరువాత! అప్పటివరకూ ఇద్దరూ తోడు తోడుగా నడుస్తారు! కాని, విడివిడిగా! అబ్దుల్ ఒకమాటు చుట్టుపట్లకు తల తిప్పిచూశాడు. దూరాలవరకూ మరెవరూ బాటసారులు లేరు. అంత పెద్ద లోయలో తామిద్దరే వుండడం-అబ్దుల్‌ని పులకింప చేసింది. ప్రకృతి అంత పెద్దలోయను తమకోసరమే నిర్మించిందేమో అనుకొన్నాడు. క్రింద దారిన అక్కడక్కడ మనుష్యులూ పశువులూ-కనిపిస్తూంటయ్యి. మధ్యదారిలో తగిలిన ఆ మనుష్యులతో క్షణం ఆగి మాట్లాడుతుంది కూడాను! అయినా అబ్దుల్‌కు వాళ్ళమీద ఏమీ ద్వేషం కలగడం లేదు. కారణం; వాళ్ళు గమ్యాన్ని వెతుక్కుంటూ వెళ్ళే తమలాంటి బాటసారులు కారు. మధ్య మధ్య వచ్చే వూళ్ళనుండి ఎవరైనా వచ్చి క్రింది దారిన నడుస్తున్న యువతికి జత అవుతారేమోనని అబ్దుల్‌కు భయం. అలా ఆ అమ్మాయికి మరెవరైనా జతకావడం, అతనికి ఇష్టంలేదు. సహించలేడు! ఏదైనా వూరిసమీపానికి చేరినప్పుడు, ఈ భయంతోనే అబ్దుల్ హృదయం దడదడా కొట్టుకొనేది. వూరిని దాటిన తరువాత, ఎప్పటిలా

జత కాలేదని తెల్సుకున్న తరువాత, అతనిహృదయం శాంత పడేది. గోరాహాదగ్గిరనుండి ఇప్పటికి ఏడుక్రోసులు నడిచారు. ఎవరి దారినవాళ్ళు మౌనంగా ఒంటరిగా నడుస్తున్నారు. ఇంతవరకూ అతడా యువతితో ఒక్కమాటా మాట్లాడలేదు. ఇలామాట్లాడకుండా మౌనంగా నడవడం వల్ల అతడికి ఏదో బాధకలుగుతున్నది. అతనిది బస్తీయువకుల్లా సిగ్గిల్ స్వభావం కూడాకాదు. అతడు పెరిగిన పల్లెటూరిలో స్త్రీ పురుషులు అతి సహజంగా, స్వతంత్రంగా మాట్లాడుతూ పని పాటలు చేసుకొంటారు. కనుక ఆ యువతిని పలుకరించడానికి అతడేమీ సిగ్గుపడడం లేదు. పైగా రెండు మూడుసార్లు పలుకరించ డానికి ప్రయత్నం చేశాడు కూడాను. కాని; ఆ అమ్మాయి మాట్లాడలేదు. అందు కతను చాలా బాధపడ్డాడు. మొదటి రెండు మూడు క్రోసులూ తప్పనిసరై మౌనంగా వున్నాడు. ఆ తరువాత పైదారి చాలా ఎగువకు పోయింది. రెండు దారు లకూ మధ్య దూరంకూడా బాగా ఏర్పడ్డది. అంత దూరా న్నుండి మాట్లాడడం కష్టం. అయినా పేరూ వూరూ మొదలైన వివరాలను అడిగి తెలుసు కొనవచ్చును.

అబ్దుల్ పెద్దగా అరిచాడు. "ఓ క్రింది బాటన వెళ్ళే అమ్మాయీ! ఎక్కడికి వెళ్ళుతున్నావ్ ?"

అబ్దుల్ స్వరం కొండల్లో ప్రతిధ్వనించింది. మొదట దగ్గరి కొండలనుండి తరువాత దూరపు కొండలనుండి. "ఓ క్రింది దారిన వెళ్ళే అమ్మాయీ! ఎక్కడికి వెళ్తున్నావ్?"

క్రిందిదారిన నడుస్తున్న యువతి వులిక్కిపడ్డది. కొండ లన్నీ ఒక్కసారిగా ప్రతిధ్వనించడంవల్ల, అసలు శబ్దం ఎటు నుండి వచ్చిందో తెలియక నాలుగువైపులా చూసింది. ఆ

లోనే స్వయంగా తననుసంభోధిస్తున్నదా అనిపించిందామెకు. తరువాత ఆమెదృష్టి అబ్దుల్ మీదికి పోయింది. తెల్లని మేఘాలా క్రింద పొడవైన యువకుడు నిలబడివున్నాడు.

అబ్దుల్ తనప్రశ్నను మళ్ళీ వేశాడు.

యువతి ఒకమాటు అబ్దుల్ వైపు చూసి తల తిప్పేసు కొన్నది. ఎవడితను? తను ఇతడిప్రశ్నకు సమాధానం ఎందుకు చెప్పాలి? అంతవరకూ నిదానంగా నడుస్తున్నయువతి తొందరగా నడవసాగింది. అబ్దుల్ కూడా తననడకను తీవ్రం చేశాడు. అబ్దుల్ అంతటితో ఊరుకొన్నాడు. తాము చాలాదూరం కలిసిపోవలసిన వాళ్ళు... ఇప్పుడీ ఎత్తునుండి అరిచి గొంతు నెప్పితెచ్చుకోవడం దేనికి? అతడు మౌనంగా తనదారిన నడవసాగాడు.

మరి ఒక క్రోసు గడిచాక పైదారి క్రిందివల్లానికి దిగింది. అంటే అబ్దుల్ ఆ యువతికి దగ్గరగా వచ్చేస్తున్నాడన్నమాట! కొద్దిక్షణాల తరువాత అతడా యువతికి బాగా దగ్గిరకు వచ్చాడు. అప్పుడా అమ్మాయి అతడికి స్పష్టంగా కనుపిస్తు న్నది. చిరుగాలికి ముఖంమీద చిందులాడే తలవెంట్రుకలను, చుక్కల చొక్కాను, పూవుల పై జమాను స్పష్టంగా చూడ గలుగుతున్నాడు. త్వరత్వరగా నడవడంవల్ల సముద్రపు అలల్లా స్తనాలు పైకీ క్రిందికీ ఉబుకుతున్నై, తగ్గుతున్నై! పైదారిన నడుస్తున్న యువకుడు తనకు బాగా దగ్గిరకు వచ్చాడని ఆమెకూ తెలిసింది. అయినా తలఎత్తి చూడలేదామె! తను ఒకడివంక ఎందుకు చూడాలి? ఒకడితో తనెందుకు మాట్లా డాలి? యువతి మరీత్వరగా నడవసాగింది. అబ్దుల్ చిన్నగా నవ్వుకొన్నాడు. దారిలో పడివున్న ఒకరాయిని కాలితో

తీన్నాడు. అది దొర్లుకుంటూ పోయి ఒక చెట్టు మొదటికి పొడుచుకొన్నది. అక్కడినుండి దొర్లుకుంటూ పోయి క్రింది దారికి అడ్డంగా యువతికాళ్ళముందు పడ్డది. యువతి చప్పున ఆగింది. కోపంగా అబ్దుల్ వంక చూసింది. అతడు మరొక రాతిని దొర్లించాడు. యువతి ఎగిరివస్తున్న రాయిని తప్పుకొని, ముందుకు పరుగెత్తసాగింది. అబ్దుల్ నవ్వుకొన్నాడు. ఎర్రని పైజామా...ఎర్రని చొక్కా... గులాబీ ముఖము ... అబ్దుల్ లయం కలిపి పాటకట్టాడు.

"ఎర్రని గులాబీపూవు
దారేపోతున్నది అలిగిందేమో!
కోపంవచ్చిందేమో! గబగబ, చకచక
పోతున్నది!"

యువతి వెనుకకుతిరిగి అబ్దుల్ వంక చూసింది. కోపాన్ని పట్టలేక అక్కడేవున్న ఒక రాయినితీసి అబ్దుల్ మీదకు విసిరింది. చప్పున అతడొక పొదచాటున దాగాడు. రాయి ఒక చీళవృక్షానికి తగిలి క్రిందికి దొర్లింది. అబ్దుల్ నవ్వుతూ పాట పాడుతూ పొదచాటునుండి ఇవతలకు వచ్చాడు.

"గులాబీపూవు రాయి
విసరి మరీపోతున్నది!"

అబ్దుల్ స్వరం దూరమౌతున్నది. మళ్ళీ రెండుదార్ల మధ్య దూరం ఏర్పడ్డవి. అతడిలా అనుకొన్నాడు. 'ఎంత మూర్ఖురాలు! పాటా తెలియదు. మాటా తెలియదు. తోటి ప్రయాణీకుడి పాటలకు ఎదుకుపాటలు పాడుతూ, మాట్లాడు కొంటూ ప్రయాణంచేస్తే ఎంత ఆనందంగా వుంటుంది? వట్టి మూర్ఖురాలు, దురభిమాని... ఎన్నడూ ఈ దార్లన ప్రయా

ణంచేసిన రకంగాలేదు... గర్విష్టి... ఈ గర్వం అభిమానం ఏం చూసుకొనో? ఎంతగర్వం అయినా, ఇంత అన్యాయమా? ఏడుక్రోసులనుండి కలిసివస్తున్నాం, ఒక్క మాటకూడా మాట్లాడలేదు... ఇవతలివాళ్ళు మనుష్యులు, కాదను కొన్నదా?' అబ్దుల్ తన ఆలోచనను మాని, సంచీని సరి చేసుకొని ముందుకు చూశాడు. యువతి చాలా ముందుకు వెళ్ళిపోయింది. చెట్టుకు ఆనుకొని నిలబడి వున్నతను మెల్లగా ముందుసాగాడు.

తరువాత రెండు రెండుక్రోసులవరకూ అబ్దుల్ ఆమెను పలుకరించడానికి ఏ విధమైన ప్రయత్నమూ చేయలేదు మౌనంగా తనదారిన నడిచాడు. ఈ రెండుక్రోసుల దూరం లోనూ ఆ రెండు కొండదార్లూ ఎన్నోమార్లు దగ్గరకు వచ్చాయి. ఒకసారైతే రెండుదార్లూ కలిసిపోయినట్టయ్యాయి. అప్పుడూ అబ్దుల్ తలవంచుకొనే నడిచాడు. రెండుక్రోసులూ గడిచాయి. ఇంకొక్క క్రోసునడిస్తే జంటగావస్తున్న ఈ రెండు దార్లూ. ఒకటి ఉత్తరానికి, మరొకటి దక్షిణానికి చీలిపోతాయి అబ్దుల్ హృదయంలో ఎందుకనో సన్నని కంపన బయలు దేరింది. అతడి మనస్సులో వ్యాకులత గూడుకట్టుకొంటున్నది. ఎన్నో ఏండ్లుగా పరిచయమువున్న జీవిత సహచరిని ఎడబాసి పోతున్నట్టవుతున్నది. తాము చీలిపోయే ప్రదేశం దగ్గరకు వస్తున్నకొలదీ అబ్దుల్ గుండెలు దడపెడుతునాయ్. అడుగులు ముందుకు సాగడంలేదు.

యువతి నడకకూడా మందగించింది. ఈ రెండుక్రోసులు దూరంలోనూ ఆమె చాలాసార్లు కనుకొలకుల చివరలనుండి అబ్దుల్‌వంక చూసింది. కాని, అతడు మౌనంగా ఉదాసీనంగా

వుండడం చూచేసరికి విద్యుత్ స్పర్శ తగిలినట్లు ఆమె హృద యము కంపించినది. ఆ వెచ్చని స్పర్శతో ఆమె సర్వాంగాలూ ఆక్రందించాయి. రోమరోమమూ పులకించింది. కండ్లలో ఆశ వెలిగింది. ఉత్సుకంగా అబ్దుల్ వంక చూస్తూ మౌనంగా నడు స్తూంది.

అబ్దుల్ ఆగిపోయాడు.

యువతికూడా ఆగిపోయింది.

ఇద్దరూ ఒకరిని ఒకరు చూసుకున్నారు.

యువతి సిగ్గుపడింది. విశాలమైన తన కనురెప్పలను క్రిందికి వాల్చేసుకొన్నది. దాహంగొన్న మేఘాలు సరోవరం మీదకు వ్రాలినట్టుగావుంది. అబ్దుల్ అస్తిమితంగా తన ముఖాన్ని అవతలికి త్రిప్పుకొన్నాడు.

యువతి అక్కడే ఒకరాతిమీద కూర్చున్నది.

అబ్దుల్ ఉత్తరదిశగా వెళ్ళాలి. అక్కడే బ్రహ్మాండమైన వృక్షాగ్రాలకు తేనెపట్టులు వ్రేళ్ళాడుతూ వుంటాయి. దట్టమైన పూపొదరిండ్లలో ఎర్రనిపూలు ఆహ్లాదంగా మెరుస్తూవుంటాయి. సుదీర్ఘాలయిన వ్యాఘవృక్షాలు ఆకాశసౌధాలకు పహారాలిస్తూ వుంటాయి. ఆకాశంలో నల్లని తెల్లని మేఘాలు తమ వింత రంగుల్తో రాజ ప్రాసాదాలను నిర్మిస్తూంటయ్యి. మంచు గాలులు తుఫాను రూపాలను దాలుస్తూంటాయి. అక్కడే జహంగీరూ నూర్జహానూ తియ్యని ప్రేమ కలలను కన్నారు.

అక్కడే ఉత్తరదిశగా అబ్దుల్ గ్రామము, అబ్దుల్ గృహమూ వున్నాయి.

యువతి అక్కడే రాతిమీద కూర్చునివుంది.

అబ్దుల్ ఉత్తరపుదారికి మళ్ళాడు. కాని అతని కాళ్ళు ముందుకు సాగడంలేదు. కాళ్ళకు మణుగురాళ్ళు కట్టుకున్నట్టుగా వుంది. ఎవరో వెనుకనుండి పుచ్చువేసి లాగుతున్నట్టుగా వుంది. అయినా అబ్దుల్ ముందుకుపోతూనేవున్నాడు.

యువతి చాలాసేపు అలాగే ఆ రాతిమీద కూర్చుని వుండిపోయింది. అబ్దుల్ దృష్టిపథాన్ని దాటి దట్టమైన వృక్ష సమూహాల్లో అదృశ్యుడయిన తరువాత మెల్లగా తన దారిన నడవసాగింది ఆమె. రెండుజాములు గడిచాయి. మరొక రెండు క్రోసులు నడిస్తేగాని 'రంగడ్' అడవిరాదు అక్కడే ఆమె తండ్రి రంపపుకోత పనిచేస్తున్నాడు. గోరాహోనుండి బయలుదేరి నప్పుడు ఆమె ఎంత సంతోషంగా వున్నది! తల్లి ఆమెతండ్రి కోసరం బెల్లం, టీ ఆకు, సోడాపుప్పు, ఒకక్రొత్తచొక్కా పంపించింది. తండ్రి ఆ చొక్కా వేసుకొంటే ఎంత బాగుం టాడో! యువతి ఒకమాటు కొంగుకు కట్టుకొన్న వస్తువులను తడివి చూచుకొన్నది. సంతోషంతో ఆమె ముఖంకొంచెంగా వికసించింది. కాని, ఆమె ముఖంలోని ఉత్సుకతోనిండిన విచా రము చిరునవ్వును మింగేసింది. ఆ యువకుడిని చూచినప్పటి నుండీ తనకు ఎందుకీ విచారం? తనెలా తండ్రిని కల్సుకోవ డానికి వెళుతున్నదో, అలాగే అతనుకూడా తన యింటికి వెళ్ళుతున్నట్టున్నాడు. ఐతే తనకెందుకీ విచారం? ఎందుకిలా అవుతున్నది తనకు? రోమాలన్నీ ఎందుకిలా సుళ్ళుతిరుగు తున్నాయి! చిన్నతనంలో ఇలా అయ్యేదికాదే? ఇప్పుడు... ఇప్పుడు... ఆ యువకుడు తనవెనక రాలేదేం? ఆమెకు తన శరీరంలో, జీవితంలో, ఆత్మలో ఏదో తీరని కొరత స్ఫురిం చింది.

వెళ్తోన్న యువతి ఒకమాటు వెనుదిరిగి చూసింది. వెనుకనుండి అబ్దుల్ వస్తూ కనుపించాడు. తనదారిని వదిలి ఈ దారికి వస్తున్నాడు. ఆమెహృదయం దడదడకొట్టుకొన్నది. అంతవరకూ దాగుకొనివున్న భయం బయటపడ్డది; భయమూ సంతోషంకూడాను! ఆమె హృదయంలో ఆశలనే చిన్న మొక్కలు అసంఖ్యాకంగా మొలకలెత్తాయి. ఇవి ఇంతవరకూ హృదయంలో దాగుకొనివున్నాయెగావును! ఆమెకు ఆశ్చర్యము, సంతోషము, భయమూ – ఒక్కసారిగా ఈ మూడు భావాలూ కలిగాయి. చకచకా ముందుకు నడవసాగింది.

కాని, అబ్దుల్ మెల్లగా తలవంచుకొని నడుస్తున్నాడు; ఆమె వెంట! అతడు అనుకొంటే చకాచకా నడిచి ఆమెను కలుసుకోగలడు. కాని, అలాచేయలేదు. అతనికాళ్ళు త్వరగా నడవడానికి ఎంతగానో ఆత్రపడుతున్నై. అయినా అతడు మెల్లగానే నడుస్తున్నాడు. ఆమెకు తను బాగా దూరంగా వుండేట్లు చూస్తున్నాడు. ఈ యువతి అతడిని ఉత్తరాన్నుండి దక్షిణానికి లాక్కువచ్చింది. ఇప్పుడతనికి తన ఇల్లు, తండ్రి అక్కడికి పోవడం – ఇవన్నీ శుద్ధదండుగ విషయాలుగా కనుపిస్తున్నాయ్. ఎవరో మంత్రగాడు సూర్యుడినుండి కిరణాలను, రాత్రినుండి నక్షత్రాలను – మాయం చేసినట్టుగా వుంది. అందుచల్లే అతడికాళ్ళు ఉత్తరాన్నుండి దక్షిణానికి మళ్ళాయి. అతడు ఈ ప్రయాణం ఎక్కడ ఆగుతుందో చూడాలను కొన్నాడు. ఈ గులాబి ఏ కోనలో పరిమళిస్తుందో తెలుసుకోవాలనుకొన్నాడు!

అబ్దుల్ యువతి వెనకాలే మెల్లగా నడుస్తున్నాడు యువతి చకచకా నడిచిపోతున్నది. ఇది ఆమెకు సుపరిచిత

మైన ప్రదేశమే! కానీ. వెనకటి తనకు పరిచయమైన మార్గ మేనా ఇది? క్రొత్తదారి కాదా? ఆమె దృష్టికి ప్రతివస్తువూ క్రొత్తదిగా కనుపిస్తున్నది ఇవ్వాళ! దారి ప్రక్కనవున్న అడవి పూలు వెనక ఎన్నడూ ఇంత ఆశ్చర్యంగా ఆమెవంక చూడ లేదు. చెట్ల కొమ్మలు ప్రేమగా ఆమెమీదకువాలుతున్నాయ్. చల్లనిగాలులు తియ్యని రహస్యాలను చెవులల్లో వూదుతు న్నాయ్ కాలిక్రింద పడి జారిపోతున్న నల్లనిగులకరాళ్ళుకూడా ఇవ్వాళఆమెను ఎందుకనో చిత్రంగా పులకింపచేస్తున్నాయ్. వున్నట్టుండిఆమెకు నాట్యంచేయా లనిపించింది. కాని, ఆ కోర్కను బలవంతాన అణచుకొన్నది.

ఇక 'రంగడ్' అడవి ప్రారంభమైంది. ఈ అడవిలోనే ఆమెతండ్రి పనిచేస్తున్నాడు. ఇంతవరకూ కొండను ఆనుకొని వచ్చిన కాలిబాట. ఇక కొండమీదుగా పోతుంది. దారిలో అక్కడక్కడా కోసివడేసిన చెట్ల మొద్దులు కనుపిస్తు న్నాయ్. ఎర్రని మొదళ్ళు సాయంత్రపు ఎండలో మెరుస్తున్నై. అడవి అంతటిలోనూ - ఒకచోట సగంకోసిన మొద్దులు, పూర్తిగా కోసిపేర్చిన మొండెలు - కనుపిస్తున్నాయి. యువతి ఒకమాటు వెనక్కుతిరిగి అబ్దుల్‌వంక చూసి చరచరా కొండ ఎక్క సాగింది. అబ్దుల్ చాలాసేపటివరకూ క్రిందే నిలబడివుండి పోయాడు. యువతి బాగా దూరానికి పోయినతరువాత అతడు కదిలాడు. యువతి కొద్దిక్షణాల్లోనే కొండమీది దట్ట మైన అడవిలో అదృశ్యమైంది. అతడు ఈమె ఎటుపోయిందో తెలియక ఒకక్షణం బాధపడ్డాడు. త్రుటికాలం ఆలోచించి కొండమీదకు తనూ ఎక్కాడు. యువతి అదృశ్యమైనవైపుకే అతనూ నడుస్తున్నాడు.

కొండమీదకు వెళ్ళి నాలుగువైపులా కలయ చూశాడు. యువతి ఎక్కడా కనుపించలేదు. ఎదురుగా కొంత మేరకు అడవిని కొట్టివేసి, ప్రదేశాన్ని శుభ్రంచేశారు. అక్కడొక చిన్నపందిరి వుంది. దానికి కొద్దిదూరంలో ఒకగుడిసె వుంది పందిరిక్రింద రంపపుపని సాగుతున్నది. నలుగురు మనుష్యులు రంపపుకోత కోస్తున్నారు. అక్కడికి కొంచం అవతల నుండి పల్లుడు ప్రారంభమౌతుంది. ఆ పల్లుడులో కోసినచెట్ల మొద్దులను మొండెలుగా పేర్చారు. మొండెలు వంకర్లు తిరుగుతూ క్రింద కాగాన్ నదివరకూ పోయాయి. కాగాన్ నీలి జలాలు, స్వచ్ఛనీలి ఆకాశాన్ని మరిపిస్తున్నాయ్.

ఎక్కడా ఆ యువతి కనుపించలేదు.

అబ్దుల్ మురెదుకు నడిచాడు. రంపపుకోత కోస్తూ వాళ్ళు పని ఆపి అబ్దుల్‌వంక చూడసాగారు. అతడు ఓ మాటు కుడికాలి మడెమతో ఎడంకాలి గిలకలను రుద్దుకుని ముందుకు నడిచాడు.

పొట్టిగా వున్న వాడొకడు – అతడి తల నున్నగా గొరిగివుంది, కండ్లు లోతుగా నీలంగా వున్నాయ్, గుండెల్లో ఎర్రనిబొచ్చు వుంది–అతడి రెండుచేతులూ రంపపు పిడులమీద వున్నాయ్–అబ్దుల్ వంక తీక్షణంగా చూసి ఇలా అన్నాడు "పట్నాన్నుండి వస్తున్నావా ?"

అబ్దుల్ అవునన్నట్టు తలవూపాడు.

"నిన్ను జ్ఞానచంద్ పాటకీదారు (గుత్తదారు) పంపించాడా ఇక్కడికి ?"

అబ్దుల్ కాదన్నట్టు తలవూపాడు.

పొట్టి వ్యక్తి సంతోషంగా శ్వాసపీల్చి ఇలా అన్నాడు "ఐతే ఈ అడవిలోకి ఎందుకు వచ్చావ్? ఎలుగొడ్లలా తేనె తుట్టెలను పట్టడానికా?" అని నవ్వాడతడు. అతడి ముగ్గురు మిత్రులుకూడా నవ్వారు. మిగిలిన ముగ్గురిలోనూ ఒకడు బాగా పొడుగ్గా సన్నగా వున్నాడు తలమీద గుండ్రని నల్లనిటోపీ వుంది రెండవవాడు సన్నగా పీలగా చేతిువేళ్ళు బాగా పొడుగ్గా వున్నాయ్. ఖాకీ నిక్కరు. చినిగిన చొక్కా వేసుకొనివున్నాడు. మూడవవాడు అడవిగొల్లలా వున్నాడు. మనిషి నల్లగా వున్నాడు. పెద్దపెద్ద పండ్లు, నల్లని చిగుళ్ళు, ఇతడి నవ్వు ఆదొక తరహా...ప్రత్యేకంగా వుంటుంది!

అబ్దుల్ కూడా వాళ్ళనవ్వుల్లో తన నవ్వును కలిపాడు. తను దారితప్పినట్టు చెప్పాడు. కాగాన్ వెళ్ళాలి దారితప్పి యిటు వచ్చానన్నాడు.

పొట్టివ్యక్తి మళ్ళీ పెద్దగా నవ్వి ఎడమచేతితో వుత్తర దిశకు చూపుతూ కుడిచేత్తో దక్షిణపుదిశను సంజ్ఞ చేసి "కాగాన్ అటుగా? మరి నీవు ఇటు వచ్చావేం?" అన్నాడు.

అబ్దుల్ అన్నాడు "అదే పొరపడ్డాను. నాలుగేళ్ళు అయింది. పట్నం వెళ్ళాను! ఇదే రావడం. అందువల్ల దారి మర్చిపోయాను!"

"అయితే, ఇవ్వాల్టికి ఇక్కడే వుండు. ఇక నీవు తిరిగి వెళ్ళడం కష్టం. అప్పుడే రెండు జాములు దాటాయి. నీవు వెళ్ళేసరికి చీకటిపడిపోతుంది. నువ్వు ఒకవేళ వెళ్ళినా, సర్కారు వారి హద్దులవరకూ వెళ్తావేమో...చీకటిపడిపోతుంది. చీకటి పడ్డ తరవాత ఆ హద్దులను దాటడం ఎవ్వరి తరమూకాదు. చిరతపులులు...ఎలుగ్గొడ్లు...తోడేళ్ళు...తెల్సిందా?"

"సరే అయితే!" అబ్దుల్ అన్నాడు.

సరిగా అదేసమయాన గుడిశముందు ఆ యువతి నిల బడి వుండడం చూశాడు అబ్దుల్.

## 2

మూడవజాము దాటిపోవస్తున్నది. అబ్దుల్ వులిక్కి పడి లేచి కూర్చున్నాడు, బాగా అలసివుండడంవల్ల అతడు అక్కడే చల్లని రంపపుపొట్టు మీదపడి నిద్రపోయాడు. ఇంత వరకు తన ఇంట్లో హాయిగా మెత్తని పక్కమీద పడుకున్న ట్టుగా వుంది అతనికి. సూర్యుడి తుదికిరణాలు అడవి ఖాళీ స్థలంలో పడుతున్నాయ్. రంపపుపని ఇంకా సాగుతూనే వుంది. రెండు మొద్దులను అడ్డంగాపాతి, వాటిమీద ఒక దేవదారు మొద్దును వేసుకొన్నున్నారు. దేవదారు:ది ఒకకొస క్రిందకు ఒకకొస పైకి వుంది. క్రింద ఇద్దరూ పైన ఇద్దరూ నిలబడి రంప ముతో కోస్తున్నారు. పైన పొట్టి బలిష్టుడైన కాశ్మీరు వ్యక్తి నిలబడివున్నాడు. అతడికి జతగా నల్లని అడవిగొల్ల వున్నాడు క్రిందివైపున లావుగా పొడుగ్గావుండి గుండ్రని టోపీ పెట్టు కొన్న అతను వున్నాడు. అతడికి జతగా సన్నటి పొడుగాటి ఇతడి వ్రేళ్ళు పొడుగ్గా వున్నాయ్. చొక్కా చాలా చోట్ల చినిగివున్నది. 'ఓ...హో...' అనే స్వరంతోపాటు రంపంపైకి పోతున్నది. తిరిగి 'హో' అనే స్వరంతో క్రిందకు దిగుతున్నది. ఇలా "ఒహో...హో..." అనే స్వరాలమీద రంపపుకోత జరుగుతున్నది. రంపపు చివర్ల నుండి రంపపుపొట్టు క్రిందకురాలుతున్నది. చుట్టూ దేవదారు, చీళ, వ్యాఘ, పరాట్ కాండ్. తుంగ మొదలైన వృక్షాలు

వున్నాయ్. సూర్యుడి తుది కిరణాలు రంపపుపొట్టుమీద మెరుస్తున్నాయ్. రంపపుపొట్టు బంగారు కణువుల్లా మెరుస్తున్నది. ఈ సూర్యకిరణాల మెరుపు, పదునైన రంపపువళ్ళమీద పడుతున్నది. దేవదారు మొద్దులమీద పడుతున్నది. కోతగాళ్ళ వుబుకుతున్న ఛాతీలమీద మెరుస్తున్నది. వాళ్ళ ప్రతి రక్తనాళమూ, పీల్చే ప్రతిశ్వాసా, నిర్ణీతమైన, ఒక లయకు బద్ధమై తమగతుల్లో చరిస్తున్నాయ్. వాళ్ళు రంపంతో దేవదారును కోస్తున్నట్టు లేదు. 'పరిశ్రమ' అనే సితారును పట్టుకొని దివ్య గీతాన్ని సంగీతాన్ని ఆలాపిస్తున్నట్టుగా వుంది!

అబ్దుల్ అలా చాలాసేపటివరకూ తన్మయుడై వాళ్ళ రంపపుకోతను చూస్తూ వుండిపోయాడు. చివరకు పొట్టి కాశ్మీరు వ్యక్తి నడినెత్తినుండి తుదికిరణాలు చీలవృతుపు క్రిక్కిరిసిన ఆకుల్లో అదృశ్యమైనాయి. పనివాళ్ళు పని ఆపారు. అందరూ నుదుటిమీద చమటను తుడుచుకొంటూ అబ్దుల్ దగ్గరకు వచ్చి పచ్చిరంపపు పొట్టుమీద కూర్చున్నారు.

పొట్టి కాశ్మీరు వ్యక్తి అబ్దుల్‌ను అడిగాడు "నువ్వు పట్నంలో ఏమిచేస్తుంటావు?"

"స్కూల్లో చదువు చెబుతుంటాను!"

"అలాగా...నీ పేరేమిటి?"

"అబ్దుల్"

"ఎంతవరకు చదువుకొన్నావు?"

"ఎనిమిదవ తరగతివరకు"

"ఎనిమిదివరకా? ఐతే, ఇంగ్లీషు కూడా చదివి వుండాలి?"

"చదివాను"

రంపపు పనివాళ్ళు ఒకరి ముఖాలు ఒకరు సాలోచనగా చూసుకొన్నారు. మౌనంగా కండ్లతోనే ఏదో నిర్ణయాన్ని చేసుకొన్నారు. కొన్ని క్షణాల అనంతరం, పొడుగాటి వ్యక్తి అతని పేరు వలీజు – ఇలా అన్నాడు. "చూపించు కాదర్! ఇందులో నష్టం ఏముంది? ఏంకర్మదాద్, నీ అభిప్రాయం ఏమిటి చూపిద్దామా?"

నల్లని అడవిగొల్ల పేరు కర్మదాద్–అతనిలా అన్నాడు– "సరే, చూపించు అసలు విషయం ఏమిటో తెలిసిపోతుంది– అయినా నూరేను కూడా అడుగు!"

సన్నని పొడుగాటి వ్రేళ్ళుకలిగి, లాకినిక్కరు ధరించి వతనిపేరు నూరే. అతను మునికాళ్ళమీద గొంతుకూర్చుని అబ్దుల్ వంక తదేకంగా చూస్తున్నాడు. అతను కొంత సంశయాన్నీ, విస్వాశాన్నీ ప్రకటించేస్వరంలో అర్ధాంగీకారాన్ని తెలియచేస్తూ "సరే, చూపించు!" అన్నాడు.

నూరే, కర్మదాద్, వలీజు వీళ్ళు ముగ్గురూ ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత బలిష్ఠుడైన పొట్టికాదర్ బట్ట తన నల్లని మాసిన చినిగిన చొక్కా జేబులోనుంచి ఒక కాగితాన్ని బయటకు తీశాడు ఆ కాగితం పూర్వదశలో తెల్లగానే వుండ వచ్చును, కాని నిరంతరం చమటతో తడిసి మట్టి కొట్టుకోవడం వల్ల, నల్లబడి, చీకి, చినుగు పట్టింది.

కాదర్ బట్ట చాలా జాగ్రత్తగా కాగితాన్ని మడతలు విప్పి అబ్దుల్ చేతికి ఇస్తూ "చదువు" అన్నాడు.

అబ్దుల్ ఆ మాసిన కాగితాన్ని తీసుకొన్నాడు. అది రంపపుపొట్టుతో కలిసిన చమటవాసన కొడుతున్నది. కాగితాన్ని మడతలువిప్పి పైనించి క్రిందకు ఒకమాటు చదివిన తరు

వాత అది సంస్థానపు ముఖ్యమంత్రిగారు జ్ఞానచంద్ సేఠ్కే డాయకు (కంట్రాక్టరుకు) వ్రాసిన జాబని తేలింది. దానిలో ఇతర విషయాలతోపాటు చెట్లను కొట్టేవారికి, మొండెల దగ్గిర వుండేవారికి, రంపపు పనివారికి రోజుకూలి అర్ధరూపాయి చొప్పున ఇవ్వవలసినదని కూడా వుంది.

కాదర్ పెద్దగా అరుస్తూ గుండెలను బాదుకొంటూ "గాడిదకొడుకు ? ఇక్కడికివచ్చి ప్రాణాలతో వెళ్ళాడు. ఈసారి వస్తేనా !" అన్నాడు.

నూరే పొడుగాటి చేతివ్రేళ్ళు అమిత నిస్పృహతో గడ్డాన్ని తడువుకోసాగాయి.

"అసలు విషయం ఏమిటి ?" అబ్దుల్ అడిగాడు.

పొడుగ్గావున్న వలీజు కోపంగా అరిచాడు "విషయం ఏమిటా ? ఈ కాగితంలో రోజుకూలి అర్ధరూపాయి ఇవ్వమని వుంటే లాలాజ్ఞాన షా సేఠ్కేదారు ఆరుఅణాలే ఇస్తున్నాడు !" వలీజు కోపాన్నిపట్టలేక కాగితాన్ని పటపట లాడించాడు.

"అయ్యో ! అయ్యో ! ఆ లంజకొడుకు జ్ఞానషా, వాడి మనుషులూ, అందరూ రానూ వచ్చారు-వీపులు చెడ గొట్టించుకోకుండా పోనూ పోయారు!" కాదర్ బట్ అరిచాడు.

"మీకు ఈ కాగితం ఎవరిచ్చారు?" అబ్దుల్ అడిగాడు.

నూరే గర్జించాడు "...అరె ... మాకెవరిస్తారు ? లాలాగుమాస్తా ధర్మచంద్ లేడూ ? వాడి జేబుల్లోనుంచి క్రిందపడితే, మాకు దొరికింది!" అంటూ నూరే అలవిమాలిన కోపంతో కాగితాన్ని గాలిలో ఆడించాడు.

"అదేమిటోయ్! కాగితం చినిగిపోతుంది!" అంటూ నూరే చేతిలోనుంచి కాగితాన్ని తీసుకుని జాగ్రత్తగా మడత పెట్టాడు కాదర్ బట్.

కర్మదాద్ అన్నాడు "ఇప్పుడీ కాగితం ఎందుకు పనికి వచ్చేట్టు? లాలా మూడునెల్ల కూలీ ఇచ్చినట్టు రసీదు పట్టుకు పోయాడాయె!"

కాదర్ "అరె, ఇంకా మూడునెల్లపని వుందిగా! పీడీబాబుకు బాకా? నిలబెట్టి వసూలుచేస్తాం! ఇదేం, సర్కారుకాగితం!" అంటూ తృప్తిగా శ్వాసపీల్చి కాగితాన్ని తిరిగి జేబులో పెట్టుకొన్నాడు.

అబ్దుల్ అడిగాడు "మీరు రసీదును చూశారా? ఒకవేళ అతను, అందులో ఎనిమిదణాల లెక్కనే కూలి ముట్టినట్టు రాయించివుంటేనో?"

"అంత మోసంచేస్తే...ఇకనేముంది! ఎంత రాశాడో చూడడానికి మేము నీలాగా చదువుకొనలేదు. వాడు వెయ్యమన్నచోట కళ్ళుమూసుకొని వేలుముద్రలు వేసేశాము!"

కాదర్ బట్ గుండెలను బాదుకొంటూ "ఎందుకురా ఏడుస్తావు? పోతేపోయింది! ఈసారివాడిని రానియ్యి, సరి చేస్తాను!" అన్నాడు.

కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

కర్మదాద్ అన్నాడు "కొద్దిగా మొద్దులు వుండిపోయాయి. లెండి, వాటినికూడా క్రిందికి – వల్లానికి దొర్లించేద్దాం!"

"ఇప్పుడే నడుములు విరుచుకు చావడమెందుకురా? రేపుప్రొద్దున చూడొచ్చులే!" అన్నాడు నూరే.

కాదర్ అన్నాడు "రేపటివరకూ ఎందుకు ? ఇప్పుడే చేసేస్తే పనిపూర్తి అయిపోతుంది. ఈ కాసిని ముద్దల్ని ద్వోర్లించటం ఏమంత బ్రహ్మాండం ! ఎటూ ఇంకా అన్నం తయారుకాలేదాయె !" అని ఆపి గుడిసెలో వున్న కూతుర్ని కేక వేశాడు "బానో ! బానో !"

ఆ అమ్మాయి గుడిసెముందు నిలబడి కాదర్ కేకకు సమాధానంగా "ఏం అయ్యా !" అన్నది. అబ్దుల్ తల ఎత్తి ఆమెవంక చూశాడు.

"టీ !"

"సరే అయ్యా ! ఇప్పుడే తెస్తున్నాను !"

కాదర్ సంతోషంగా చేతులునలుపుకొంటూ మెరిసే కనుపాపల్ని గుండ్రంగా త్రిప్పుతూ "మా అమ్మాయి ఇంటి నుంచి మంచి తేయాకుపట్టుకువచ్చింది. తేయాకు, సోడా వుప్పూ బెల్లం పట్టుకు వచ్చింది – ఓ...హో...మంచి టీ తాగి ఎన్నాళ్ళయింది !" అన్నాడు.

కొద్దిసేపట్లో బానో అందరికీ వరుసగా మట్టి పాత్రల్లో టీ తెచ్చి ఇచ్చింది. మొదట అతిథి కిచ్చింది. తరువాత తండ్రికీ ఆ తరువాత అతని మిత్రులకూ ఇచ్చింది. అబ్దుల్ ఒక్కొక్క గుక్క నోట్లో పోసుకొని కాశ్మీర్ టీ యొక్క అద్భుత రుచిని అనుభూతికి తెచ్చుకొన్నాడు. కాశ్మీరు టీలో సోడావుప్పూ, బెల్లం కలుపుతారు. అది కాఫీలా వేడిగా వుంటుంది. గులాబీలా ఎర్రగా వుంటుంది. విశిష్టమైన రుచి కలిగివుంటుంది. కాదర్ తన్మయుడై మట్టిపాత్రను పెదవులకు ఆనించుకొని టీ త్రాగుతున్నాడు. ప్రతిగుక్కకూ ఆనందంతో తృప్తిగా నిశ్వసిస్తున్నాడు.

టీ త్రాగిన తరువాత అందరూ పల్లానికి బయలు దేరారు. అబ్దుల్ కూడా బయలుదేరాడు. వెళుతూ వెళుతూ గుడిసెలో పొయ్యిముందు కూర్చుని జొన్నరొట్టెలను కాలు స్తున్న జానోవంక చూశాడు. ఆమె కూడా ముందుకు వంగి పొయ్యి ఊదుతున్నదల్లా, ఒక్క త్రుటికాలం కనుకొలుకు ల్లోంచి, అబ్దుల్ వైపు చూసింది. ఆమె ఎర్రని గులాబీ రంగు బుగ్గలుపొయ్యిలో మండుతున్న సెగకు మరింతఎరుపెక్కినిప్పులు చెరుగుతున్నట్టు కనుపిస్తున్నాయి. ఆ బుగ్గలమీది చిరుస్వేద బిందువులు మరీ మెరుస్తున్నాయి.

పల్లపు ప్రదేశం చాలా విశాలమైనది. రంపపు పని వాళ్ళు నిలబడివున్న కొండపైనుంచి, కాగాన్ నది వరకూ ఒకటే పల్లం. ఈ పల్లపు ప్రదేశంలో అటునుంచి ఇటు చివర వరకు అనేక రకాలైన చెట్ల మొద్దులూ, దుంగలూ మెండె లుగా పేర్చి వున్నాయి. ఒక్కొక్క మెండెకు రెండువేపులా పెద్దపెద్ద మానుల్ని నరికి ఊతానికి పడవేశారు. ఈ వూతాల వల్ల మొద్దులూ దుంగలూ మెండెలను దాటి అటూ ఇటూ దొర్లకుండా వుంటాయి. మొద్దుల్ని మెండెలపైనుంచి దొర్లించే ప్పుడు ఈ జాగ్రత్త మరీ అవసరం!

"ఓ...హో...హో...!" అంటూ కాదర్ బట్ ఒక మొద్దును మెండెపయినుంచి క్రిందకు దొర్లించాడు. మొద్దు తీవ్ర వేగంతో ఒక మెండె మీదనుంచి మరొక మెండెమీదకు దొర్లుకొంటూ క్రిందకు పోయింది. అలా దొర్లేటపుడు, అడవి లోని మానులు విరిగి పడ్డట్టూ, వందల కొలది మణుగుల బరువుకల రాతి బండ పయినుంచి క్రిందకు పడినట్టు ధ్వని కలుగుతోంది.

మొద్దు కొద్ది క్షణాలలోనే మెండెలను దాటుకొంటూ పోయి కాగాన్ నదీజలాల్లో 'ధఢేలు' మని పడిపోయింది.

మొద్దు పడగానే నదీ జలాలు పైకి ఎగిరినాయి. అలలు దూరాలవరకూ వి స్తరించాయి.

"ఓ...హో...హో...!" అంటూ వాళ్ళు మొద్దులను క్రిందకు దొర్లించ సాగారు. అబ్దుల్ కూడా వాళ్ళల్లో కలిశాడు. కొద్దిసేపటి తరువాత అంధకారం దట్టంగా ఆవరించింది కన్ను పొడుచుకున్నా ఏమీ కనుపించడం లేదు. మెండెలూ. మొద్దులూ, పనివాళ్ళూ–ఏమీ కనుపించడం లేదు–కేవలం బ్రహ్మాండమైన శబ్దాన్ని చేసుకొంటూ, మొద్దులు మెట్లమీదనుంచీ క్రిందకు దొర్లి చివరకు 'ధఢేలు' మనే శబ్దంతోపాటు నదీజలాల్లో పడే ధ్వనిమాత్రం వినిపిస్తోంది. కొద్దిసేపటికి మొద్దులన్నీ పూర్తిగా దొర్లించబడినాయి. అందరూ గుడిసె వైపుకు బయలుదేరారు.

జొన్నరొట్టె – పుల్లిపాయ పచ్చడి–చల్లని నీళ్ళూ–అందరూ కడుపులనిండా పట్టించి తృప్తిగా త్రేన్చారు. నూరే, కర్మదాద్–ఇద్దరూ అడవి మధ్య ఖాళీస్థలం చుట్టూ, చితుకులూ చెత్తా పోగుచేసి మంట పెట్టారు. ఇందువల్ల అడవి మృగాలు ఏవీ రావు. తరువాత అందరూ కలిసి, పిచ్చాపాటి మాటాడుతూ రంపపు పొట్టుమీద కూర్చున్నారు. జావో అందరికీ భోజనాలు పెట్టి తనుభోజనానికి కూర్చున్నది.

కాదర్ పెద్దగా ఆవలించి "నాకు నిద్రవస్తున్నది. నేను వెళ్ళి గుడిసెలో పడుకుంటాను!" అంటూనే అతను లోపలకు వెళ్ళిపోయాడు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

కర్మదాద్ అడిగాడు "అబ్దుల్, మీరు అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ ఎంతమంది?"

"ఇద్దరు అన్నదమ్ములం. ఒక చెల్లెలు." అబ్దుల్ చెప్పాడు.

నూరే అడిగాడు "మరి నీకు పెండ్లి అయిందా?"

"ఇంకా లేదు!"

"అరే...ఇంతపెద్ద వాడవు అయ్యావు. ఇంకా పెండ్లి చేసుకోలేదా? మా వూళ్ళల్లో కుర్రాళ్ళకు చిన్నప్పుడే పెళ్ళిళ్ళు చేసేస్తాం! ఇంకా కావాలంటే నూరేను అడుగు!" వలీజు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అన్నాడు.

నూరే నిట్టూరుస్తూ "అరె, నేస్తం. నన్నేం అడుగు తారోయ్! మూడునెల్లనుంచీ ఈ అడవిలోపడి చస్తున్నాను. కన్నుమూస్తే పెళ్ళాం కనుపిస్తున్నది!" అన్నాడు.

మళ్ళీ కొన్ని క్షణాలు నిశ్శబ్దం!

"నేనుకూడా వెళ్ళి లోపల పడుకొంటాను. మరి నీవో కర్మదాద్?" వలీజు అన్నాడు.

"నెలపొడిచే వరకూ నేను ఇక్కడే కూర్చుంటాను!" కర్మదాద్ అన్నాడు.

"నేనూను" నూరే అన్నాడు.

"నేనుకూడా వుండనా?" అబ్దుల్ అడిగాడు.

"అలాగేవుండు. నీవుపోయి పడవలసిన పాటేముంది?"

నూరే అర్ధనిమీలిత నేత్రాలతో, మెల్లగా, తన్మయంగా అడవిప్రజల ప్రేమగీతాన్ని ఆలాపించసాగాడు.

ఉడుత ఒక్కటి - పాము ఒక్కటి

అడవి మల్లెపువ్వు ఒక్కటి

కట్టె కొట్టేవాడు ఒక్కడు – వాడి హృదయపు
రాణి ఒక్కతె
ప్రేమనిండిన రాత్రి ఒక్కటి – మబ్బుచాటున
చంద్రుడొక్కడు
ఉడుత వెళ్ళి కట్టె కొట్టే – వాడి గోళ్ళను కొరికివేసెను
పాము వెళ్ళి రాణి ఫాలము – కరచివేసెను
అడవి మల్లెకంటి పావల ముడిచివేసెను ॥ఉ॥
కట్టెకొట్టేవాడు పిచ్చిఎక్కి పరుగుతీసెను
అయ్యో! అయ్యో! అయ్యో!
కట్టె కొట్టేవాడు పిచ్చిఎక్కి బరుగుతీసెను
అయ్యో! అయ్యో! అయ్యో!
పాము పడిగా విప్పివేసెను
ఉడుత గోతిని త్రవ్వివేసెను!
కన్ను మూసిన అడవిమల్లె గోతిలోపల
మాయమయ్యెను!
చంద్రుడు అస్తమించాడు ॥ఉ॥

కొంతసేపటికి నూరేస్వరం పూర్తిగా లుప్తమైపోయింది. అతని గురక మాత్రమే వినిపించసాగింది. నూరే ప్రక్కనే కర్మదాద్ కూడా వొరిగి గురక పెడుతున్నాడు. వాళ్ళిద్దరూ చంద్రోదయం కోసరం ఎదురుచూస్తూ చంద్రుడుదయించక ముందే పడి నిద్రపోయారు. పగలంతా చాకిరీచేసి, అలసి, దూరాన పల్లెల్లో వున్న భార్యాబిడ్డల్ని తలచుకొంటూ నిద్రపోయారు. తర్వాత చంద్రోదయమైంది. చల్లని, తెల్లని వెన్నెల గుడిసెమీద, పందిరిమీద రంపపుపొట్టుమీద, మొండెల మీద మెరుస్తున్నది. పిండారబోసినట్టున్న ఆ వెన్నెట్లో కానో

గుడిసెముందు పడుకొనివుంది. ఆమె హృదయం తీవ్రంగా స్పందిస్తున్నది. అబ్దుల్ మెల్లగా తన స్థానంనుండి లేచాడు. బానోను సమీపించాడు. కొట్టుకొంటున్న ఆమెనత్తుంమీద చెయ్యి వేశాడు.

బానో కండ్లు తెరిచింది కానీ ఏమీ మాట్లాడలేదు. వ్యతిరేకించలేదు.

అబ్దుల్ బానోని పైకి ఎత్తి విశాలమైన తన వక్షానికి అదుముకొన్నాడు. రెండుచేతులతో నూ ఎత్తుకొని రంపపు పొట్టుమీదకు పట్టుకుపోయి ఒక్కసారిగా క్రిందికి వదిలా డా మెను. తరువాత తనూ సరసను పడుకొన్నాడు. రెండుచేతుల తోటీ ఆమె నడుముల్ని పట్టుకొని దగ్గిరకు లాక్కుంటూ పెదాలను గట్టిగా ముద్దుపెట్టుకొన్నాడు. అయినా బానో ఏమీ మాట్లాడలేదు. మౌనంగా రంపపుపొట్టును గుప్పెడ లోకి తీసుకొంటున్నది విడిచిపెడుతున్నది.

అబ్దుల్ తన బలమైన చేతివేళ్ళతో బానోగడ్డాన్ని పైకి ఎత్తి ఆమెకండ్లలోకి చూశాడు. ఆ కండ్ల లో చంద్రుడు ప్రతిఫలిస్తున్నాడు. మనోహరమైన ఆమె మెడ వంపు, రంపపు పదునులూ వెన్నెట్లో తళతళా మెరుస్తున్నది. ఆమె మెడ చుట్టూ తన చేతులను పెనవేసి "మీ నాన్న నన్ను తేనె పట్టడానికి వచ్చిన ఎలుగొడ్డన్నాడు. నిజంగానే నేను తేనె కోసరం వచ్చాను!" అంటూ బానో పెదాలను ముద్దుపెట్టు కొన్నాడు అబ్దుల్.

అబ్దుల్ తీవ్రమైన ఉద్రేకంలో తనబలమైన బాహువు ల్లోకి బానోని పొదుముకోసాడు. అతని ఆలింగనపాశంలో ఊపిరాడక వివశంగా అతని బుజానికి తనగోళ్ళను గుచ్చి

సింది భానో! ఇద్దరూ రంపపుపొట్టులోకి చొచ్చుకుపోయారు. అబ్దుల్‌లోని విరహాగ్ని పవిత్రమైన భానో ఆత్మజలంలో మునిచి చల్లార్చబడ్డది. ఒక విదిలింపుతో భానో అబ్దుల్ పట్టు నుండి విడిపడ్డది. లేచి కూర్చుని, తలకు అంటిన పొట్టును దులుపుకొన్నది. పూసుకొని పెదాలకు వున్న పొట్టును రాల్చు సుకొన్నది. ఇలా అన్నది "అబ్బ...ఒకటే పొట్టు!"

అబ్దుల్ నవ్వాడు.

"ఇస్...!" భానో తన సన్నని పెదాలమీద వేలు వేసుకొని ఇలా అన్నది "నవ్వకు! మా అయ్య లేచాడా?"

"లేస్తే నన్ను చంపేస్తాడా?"

"అనుమానం ఏముంది!"

"కాని, వీళ్ళు లేవరు. బాగాపనులుచేసి అలిసి నిద్ర పోయారు. తెల్లవారేవరకూ మెలుకువ రాదు."

భానో సంతోషంగా నవ్వింది.

"బాగుంది...అది సరే...నీ పేరేమిటి?

అబ్దుల్ చిన్నగా నవ్వాడు.

"నా పేరు అబ్దుల్—నీ పేరు?"

"భానో!

భానో అడిగింది. "నీవేమి పనిచేస్తావు?"

"పుంఛ పట్నంలో, స్కూల్లో చదువు చెప్తా వుంటాను!"

"చదువు చెబుతావా?" అని రెండునిమిషాలు ఆగి అబ్దుల్ ముఖంలోకి చూస్తూ "నా పెండ్లి పట్నంలోనే నిశ్చయం అయింది. అతను పోలీసులో వుద్యోగిట! అతను చాలా దుర్మార్గుడనీ నీచుడనీ విన్నాను!" అన్నది భానో.

"అతని పేరు ఏమిటి ?"

"రహమత్ ఖాన్" బానో మెల్లగా అన్నది "మా అయ్య అతనుకు సంబంధం నిశ్చయంలో ఏడువందల యాభై రూపాయిలు ఇచ్చాడు. పెండ్లిలో మరొక ఐదువందలు. ఇప్పుడు కాదు–పెండ్లి జరిగేప్పుడు !"

"ఎప్పుడు జరుగుతుంది ?"

"వచ్చే వైశాఖంలో అంటున్నా డతను. కాని నాకు ఇష్టంలేదు"

"ఎందుకనీ?"

"మనిషి బాగుండడు ! చాలా నీచుడుకూడాట !"

"మరి నేను ఎలావున్నాను !"

బానో నవ్వింది. "వూ..హూ.. చెప్పను !"

చిన్నగా నవ్వి, రంపపుపొట్టును రెండు చేతులలోకీ తీసుకొని అబ్దుల్ ముఖానికి విసరింది బానో; కాని అంతకు క్రితమే కండ్లుమూసేసుకొన్నాడు అబ్దుల్.

ముఖంమీద పొట్టును తుడిచి వేసుకొంటూ "నేను నిన్ను పెండ్లి చేసుకొంటాను. కాని నా దగ్గిర డబ్బులేదు. నిశ్చయానికి ఏడువందలయాభై, పెండ్లికి ఐదువందలూ ఇవ్వ లేను !" అన్నాడు అబ్దుల్.

ఏం, మీరు బీదవాళ్ళా ?"

"అవును !"

"మరి బీదవాడవయితే...ఎలా చదువుకున్నావు?"

"కష్టపడి, స్వయంగా చదువుకొన్నాను !"

"ఎనిమిది వరకు!"

అబ్దుల్ అవును అన్నట్టు తలవూపాడు.

"స్కూల్లో చదువు చెబుతూనే మరి రెండు క్లాసులు కూడా చదివాను. ఇప్పుడు ఊరికి వెళ్ళి తిరిగి పట్నం వచ్చిన తరువాత, పదవ తరగతి పరీక్ష రాయడానికి రావల్పిండి వెళ్తాను !" అన్నాడు అబ్దుల్.

"మరి అది అయ్యాక ఏం వుద్యోగం చేస్తావు?"

"ఏమో ! హెడ్మాష్టర్ని కావచ్చు ! లేకపోతే తాసీల్దారునే కావచ్చు !"

"తహసీల్దార్ వా?" ఆశ్చర్యంతో బానో కండ్లు పెద్ద వయినాయి. ఆమె అబ్దుల్కు కొంచెం దూరంగా జరిగి నిలబడ్డది.

అబ్దుల్ బానో చెయ్యి పుచ్చుకొని దగ్గరకు తీసుకొని ఆమె నడుము చుట్టూ తనచేతులను వేయబోయాడు. కాని బానో దగ్గరకు రాలేదు. దూరంగా అందకుండా కూర్చున్నది.

అబ్దుల్ అన్నాడు. "నా దగ్గర డబ్బులేదు. అయినా నేను నిన్ను పెండ్లి చేసుకొంటాను. తప్పకుండా పెండ్లి చేసుకొంటాను !"

"అదెట్లా? మా అయ్య ఇవ్వడు కదా? ఆయ్య ఏడు వందల యాభై రూపాయలకు కొత్తపొల మొకదాన్ని కొన్నాడు. దానికి డబ్బు కట్టాలి. అందుకని డబ్బులేకుండా పెండ్లికి ఒప్పుకోడు" అని రెండు నిముషాలు ఆగి "మనం లేచి పోదాం పద ! అన్నది బానో.

"ఎక్కడికి పోదాం ?" అబ్దుల్ అన్నాడు. "నేను పదవ క్లాసు పరీక్షరాయడానికి రావల్పిండి వెళ్ళాలిగా !"

"అరె...చదివిన వరకూ చాల్లే...తుంగలో తొక్కనీ ఏ పదో క్లాసుని!" బానో అన్నది.

"కాదు ! అలాకాదు !"

బానో మెదలకుండా ఊరుకున్నది.

"నేను తాసిల్దారిని అయినప్పుడు...!" మధ్యలోనే ఆపాడు అబ్దుల్.

"మరి ఎప్పుడు అవుతావు ?"

"రెండుమూడు ఏండ్లల్లో !"

బానో విదిలించుకున్నది.

"వచ్చే వైశాఖంలో నా పెండ్లి అవుతూంటే తరువాత ఎందుకూ ?"

"అరె...ఒక్క రెండు సంవత్సరాలు నెట్టేయలేవా? కొంతమంది ప్రేమించుకొన్నారంటే జీవితపర్యంతం అలాగే వుండిపోతారు !" అన్నాడు అబ్దుల్.

అబ్దుల్‌ని గట్టిగా కౌగలించుకుని వణకుతున్న స్వరంలో యిలా అన్నది బానో.

"ఎక్కడికయినా పారిపోదాం పద ! ఆ పోలీసువాడిని పెండ్లి చేసుకోవడం అంటే నాకు చాలా భయంవేస్తున్నది. ఇంతక్కుకితం అతనికి యిద్దరు పెండ్లాలు చచ్చిపోయారుట !"

"నీవు చనిపోవులే ! భయపడకు !" అబ్దుల్ బానోని గట్టిగా అదుముకొంటూ అన్నాడు "నేను పూరునించీ తిరిగి పట్నం వెళ్ళేటప్పుడు నిన్ను వెంటతీసుకుపోతాను !"

విషాదంగా, దిగులుగా వున్న బానో ముఖం వికసించింది. అబ్దుల్ బిరుసు గడ్డంమీద తన మృదువైన చేతిని రాస్తూ కూనిరాగం తీయసాగింది.

కట్టె కొట్టేవాడు వొక్కడు
వాడి హృదయపురాణి వొక్కతె

ప్రేమ నిండిన రాత్రి వొక్కటి!

తరువాత ఖానో చాలా విశ్వాసంగా తృప్తిగా అబ్దుల్ గుండెలమీద చేతులు వేసుకు పడుకున్నది. అలా ఎంతోసేపు గడిచింది. నెల పూర్తిగా పడమటకు కృంగిపోయింది. అబ్దుల్ తన రెండు చేతులలోకీ ఖానోను తీసుకొని, వెళ్ళి గుడిశ ముందు పడుకోబెట్టి తిరిగివచ్చి పొట్టుమీద కూర్చున్నాడు. అతనిబుర్ర తీవ్రమైన ఆలోచనలో పడ్డది. ఇప్పుడు తనేం చేసేట్టు?"

అబ్దుల్ ప్రక్కనే నూరే, కర్మదాద్‌లు గురకలుపెట్టి నిద్రపోతున్నారు. ఖాళీస్థలానికి నలువైపుల్నా చితుకులమంటలు చిటపట లాడుతున్నాయి. దూరంగా తోడేళ్ళూ, గుంట నక్కలూ కలసి అరిచేఅరుపులు కర్ణకఠోరంగా వినిపిస్తున్నాయ్. చంద్రబింబం ఎర్రపడ్డది. గాలివీవెనలు కుంకుమ పువ్వు సువాసనతో బరువెక్కినాయి. గంటక్రితం ఆకాశంలో కనుపించిన సప్తఋషిమండలం ఇప్పుడు కనుపించడంలేదు. కాగాన్‌నది, గాలిలో తన మృదువైన స్వరంతో గుసగుసలాడుతున్నది. అబ్దుల్ అక్కడే పడుకుని నిద్రపోయాడు.

———

# రెండవ అధ్యాయం

అబ్దుల్ అలా 'రంగడ్' అడవిలో దిగబడిన రాత్రి టీకరీశాహామురాద్' గ్రామపు రైతులు తమ జొన్నపంటల్ని కోసి కళ్ళాల్లో కుప్పలు వేశారు. వాటికాపలా కోసరం రైతులు ఎవరి కళ్ళాల్లో వాళ్ళు మేల్కొని కూర్చున్నారు. 'టీకరీశాహామురాద్' ప్రాంతపు భూముల్లో సంవత్సరానికి వొకేవొక పంట పండుతుంది. అదైనా జొన్నపంట మాత్రమే పండుతుంది. కనుక అక్కడిరైతులు వొక్కొక్క జొన్నగింజను తమ ప్రాణాన్నొడ్డి కాపాడుకుంటారు వారికా జొన్నగింజలే బంగారపు కణికలతో సమానం! పండిన పంట యావత్తూ ఆ పళంగా రైతులకు దక్కినవాళ్ళు సంవత్సరం పొడుగునా రెండుపూటలా గంజినీళ్ళకు నోచుకోరు! అనేక రోజులు కాగాన్‌నది నీలి నీళ్ళతో కడుపు నింపుకుని దేవుడిని తలుచుకొంటూ కడుపులో కాళ్ళుపెట్టుకు పడుకోవడం జరుగుతుంది. ఇంత విశ్వాసంగా, తిండిలేకపోయినా తనను తల్చుకొంటూ వుండే రైతులకు మరి ఆ భగవంతుడు చచ్చిన తరువాత పరలోకంలో స్వర్గాన్ని ఇస్తాడో నరకమే యిస్తాడో చెప్పలేము; ఈ లోకంలో మాత్రం వాళ్ళకు పస్తులనూ కాగాన్‌నది నీళ్ళనూ పుష్కలంగా యిస్తున్నాడు!

అక్కడి రైతులు రెండుపూటలా గంజి నీళ్ళకుకూడా కొరవపడడానికి వొక కారణం వున్నది. 'తిండి' మానవుడు

పరిశ్రమించి సంపాయించుకునే వస్తువు. దీనిలో శాసకులకు ప్రధానమైన భాగాన్ని చెల్లించాలి! పంటల్ని మిడతలు, చెట్టు కొల్లే పురుగులు బ్రహ్మాండమైన వృక్షాల్ని తినివేసినట్టు శాసకులుకూడా రైతుల శ్రమఫలితాన్ని తినివేస్తారు! ఈ ఆచారం వేలసంవత్సరాలనుంచీ నిరాఘాటంగా సాగిస్తున్నది. కాని; పంటలు పండించడానికి రైతులు ఎంత కష్టపడతారో, ఎన్ని బాధల తరువాత పంటలు పండుతయ్యో, మిడతలకు ఏం తెల్సును!

'టీకరీశాహాకోమురాద్' గ్రామం రైతులు మంచుకురిసే రోజులు పూర్తిగా గడిచిపోకముందే తమ ఎద్దుల్ని తీసుకొని చేలల్లో పనులకువంగుతారు. మంచు ధారాపాతంగా కురుస్తూ వుంటుంది. ఎద్దులూ, మనుషులూ చలికి కొంగర్లు ఎత్తుతూ వుంటారు. కాశ్మీరు భూలయమంతటిలోనూ మంచు స్వైర విహారం చేస్తూవుంటుంది చేలల్లోనూ, గట్లమీాదా మంచు బండలు పరచుకొని వుంటుంది. అలాంటిస్థితిలో "శాహాకో మురాద్" రైతులు సతివతమై పొలాలను దున్ని, అనేక రోజుల అనంతరం కాశ్మీర్‌లో సూర్యుడు తొలిగా కనుపించిన క్షణాన మీరాశా దగ్గరనుంచి అప్పుతెచ్చిన గింజలను తమ చేలల్లో చల్లుకొంటూరు!

కొన్ని నెల్ల అనంతరం, ఈ చిన్ని గింజలు మానవపరిశ్రమలో తడిసి, పచ్చని మొక్కలు అవుతై; బంగారు ఆకుల్ని తొడుక్కుని! ఈ మొక్కలతోపాటు రైతు హృదయంలో ఆశలు మొలకలెత్తుతై. తన పాతయింటిని కప్పించుకోవాలనుకుంటాడు. భార్యా చెవులకు లోలాకులను కొనాలనుకుంటాడు. ఇతని ఆశల ప్రమాణంలోనే మొక్కలుకూడా

పెరుగుతై. రైతు తన్మయంగా తన ఎత్తుతో మొక్కల్ని కొట్టుకొంటాడు. అతని ఛాతీవరకూ వస్తయ్యి ఆ మొక్కలు- ఆనందంతో అతని కండ్లు మెరిసిపోతాయి.

కొన్ని రోజుల తరువాత చేను కాపుకువస్తుంది. మొక్కల్ని చీల్చుకుని పచ్చని జొన్న కండెలు బయటికి వస్తూ వుంటాయి. కండెకు చుట్టూవుండే పట్టులాంటి పోగులు గాలికి వూగుతూవుంటై. వాటిని చూసి రైతు ఆనందంలో పరవశుడై తన గత జీవితాన్నంతా నెమరువేసుకొంటాడు. తను మొదటగా తన ప్రేమికను (తన భార్యను) నిలువెత్తున పెరిగిన జొన్నచేలో కల్సుకొన్నాడు. ఆ రోజు పౌర్ణమి! అతని కండ్ల ముందు నాటి దృశ్యమంతా ఒకమాటు తిరిగి గడిచిపోయింది. ఒకనాటి మధ్యాహ్నం పొట్టలు పిచ్చిన నిండు జొన్నచేలో ప్రేయసిని ప్రథమంగా ముద్దుపెట్టుకున్నాడు. తన తొలిపంట లోని బంగారు కండెనొకదాన్ని ప్రేయసికి బహూకరించాడు. ఈ విధంగా జొన్నపంటతోపాటు అతనికి తన. గతజీవితంలో అంతా స్ఫురణకు వస్తుంది.

అనేక కష్టాల, శ్రమల అనంతరం జొన్నగింజలు కనుపిస్తున్నాయి. ఇన్ని కష్టాల తరువాత లభించిన ఆ జొన్నగింజలు రైతుకు ఎంతో ఆత్మీయమైనవీ, స్వంతమైనవీనూ! రైతుకు తన యింటిమీదా, భార్యమీదా, కొడుకుమీదా. చేను దున్నే ఎద్దులమీదా, ఎలాంటిప్రేమా, అభిమానమూ. స్వత్వతవున్నాయో అలాంటిప్రేమా అధికారమూ స్వత్వతే జొన్నగింజలమీదకూడా వునాయిన్న. ఒక్కమాటలో చెప్పాలంటే; తన చేలో పండిన గింజలు యావత్తూ అతనివి, అతని స్వంతం!

కాని, చిత్రం! రైతుల శ్రమమీద ఆధారపడ్డ ఈ జొన్నగింజలు పూర్తిగా రైతులవి ఎన్నడూ కావడంలేదు. కళ్ళాల్లో ధాన్యం నూర్చి కుప్పల్ని వేసిన తరువాత పూర్తి నంబర్ దార్ ఇలహూదీన్ వస్తాడు. ఈ ధాన్యాన్ని నాలుగు భాగాలు చేయమంటాడు. భూమి తనదిట కనుక ఒకభాగం తనకు ఇవ్వమంటాడు. మరొకభాగం సర్కారుకు ఇవ్వమంటాడు. మూడవభాగం మీరాసాహెబు ఇవ్వమంటాడు; అతను అప్పులు ఇస్తుంటాడు. విత్తనాలు అతనివి, తాము కట్టుకొన్నగుడ్డలు అతనివి, ఉప్పు అతనిది! ఇక తనకు మిగిలేది చివరి నాల్గవభాగం దీనిలో చాకలి, మంగలి, కుమ్మరి, సాలె, అందరికీ ఇచ్చుకోవాలి! అన్నిఖర్చుల్నీ పూడ్చుకోవాలి! ఇక రైతుకు మిగిలేది ఏమిటి? అతనికడ్డముందు శూన్యం విస్తృతంగా పరుచుకొంటుంది. మంచులా అతని గుండెలు చల్లబడిపోతాయి, అతని ఆశలు ఘనీభవిస్తాయి, ఈ విస్తృత శూన్యంలో విస్తరించిన నిరాశ అనే మంచులో భార్యా లోలకులు జారిపోతాయి. చెప్పులులేక కొడుకు కాళ్ళనుండి రక్తం స్రవిస్తూ వుంటుంది. రైతులు ఇన్నినెల్లగా పదిలంగా హృదయంలో దాచుకొంటున్న ఆశాలత ఒక్కసారిగా వొడిపోతుంది.

రైతు చేసేదిలేక వివశంగా గుప్పెడలు బిగబట్టి వూరుకుంటాడు.

# 2

'టికరీ శాహాముదాద్'లకు అది చాలా గడ్డురాత్రి. రైతులందరూ పంటల్ని కోసి కళ్ళాల్లో వేశారు. కాపలాకు ఎవరి కళ్ళంముందు వాళ్ళు కూర్చున్నారు; పడుకున్నారు! తమ కష్టార్జితమైన ఆ పంటల్లో పోవలసిన భాగాలను తలచుకొని వాళ్ళ గుప్పెడలు వివశంగా బిగుసుకుంటున్నాయి. విడిపడుతున్నాయి! ఈ రాత్రి చాలా కష్టంగా గడుస్తుంది! రేపు ఉదయమే నంబర్‌దార్, జాగీర్‌దార్, మహారాజుగారి నౌకర్లు కోమటి మీరాషా అందరూ వరుసనే వస్తారు. తమ ధాన్యాల్ని దోచుకొని, ధ్వంసంచేసి వెడతారు! వేలసంవత్సరాలనుంచీ ఇదేక్రమం జరుగుతున్నది. రైతు పండించడం, జాగీర్‌దార్, జమీందార్, నంబర్‌దార్లూ ఆ పంటల్ని దోచుకోవడం! అయినా రైతులు యింకా ఎలాగైనా ఆ అక్రమాన్నుంచి తప్పించుకోవాలని ఆలోచిస్తున్నారు; వివశంగా బాధపడుతున్నారు. ఏం? జొన్నగింజలోని జీవనశక్తి రైతును ఈఅక్రమాన్ని అతిక్రమించమని ప్రేరేపిస్తున్నదా? జొన్నగింజలు తమ వేల నోళ్ళను తెరుచుకొని రైతులతో అంటున్నాయి–"ఈ ధాన్యం నీది! ఈ గింజలు నీవి! ఈ ధాన్యం నీది! ఈ గింజలు నీవి!" ఆ రాత్రంతా రైతులకు, ఈ మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తూ వుంటాయి; కాగాన్ నదీజలాల వురవళ్ళలా! మేఘగర్జనల్లా! విద్యుత్‌స్పర్శలా! పైమాటలు రైతుల మేధస్సును వున్మత్తం చేస్తాయి. రైతులు పడుకునే వున్మత్తులై తమ గుప్పెడలను, గోళ్ళు అరచేతుల్లో గుచ్చుకొని రక్తం స్రవించేట్టు బిగించుకుంటారు! బాధతో కన్నీళ్ళు కారుస్తారు!

ఈ అన్యాయంనుంచీ, అక్రమాలనుంచీ ముక్తిపొందే మార్గం లేదా ? ఎందుకు వుండదు... తప్పకుండా వుంటుంది! తప్పకుండా వుంటుంది!

అయితే ఆ మార్గం అనేక రకాలుగా వున్నది. 'చీనార్ గ్రామపు మతగురువు భగవంతుడిని కొలిస్తే ఈ కష్టాలు పోతాయి అన్నాడు. మాలవీగారు తృప్తి, శాంతం ఈరెండూ వుంటే ఈ కష్టాలు పోతాయి అన్నాడు. నంబర్‌దార్ ఇల మ్‌దీన్ పనులు లేకుండావుండే చలికాలంలో, పంజాబు, ఇతరప్రాంతాలకు వలసవెళ్ళి కూలీనాలీ చేసుకొంటూ వుంటే ఆ కష్టాలు పోతాయి అన్నాడు. రైతులు ఈమొత్తం మార్గాలన్నీ పరీక్షించారు. దేవుడిని కొలిచారు తృప్తిని అలవరచుకొన్నారు. పరదేశాలువెళ్ళి కూలిచేశారు. అయినా తమ గింజలు తమకు దక్కడంలేదు. ఈ అన్యాయం తప్పడంలేదు. ఆకలి కడుపుతో శాంతాన్నీ తృప్తినీ కలిగివుండడం కష్టం! పోతే, పనులు వుండని చలికాలంలో పంజాబూ యితర ప్రాంతాలకుపోయి, కూలీనాలీ చేసుకుని వేసంగుల్లో యింటికి తిరిగి రావడంకూడా చేశారు. అందువల్ల బాధలూ, దోపిడీ తప్పకపోగా, రైతులు రకరకాలైన జబ్బులకు నిలయమైపోయారు. వాళ్ళ శరీరాల్లోనుంచి ఎవరో రక్తాన్ని తాగేసుకొన్నట్లుగా క్షీణించిపోయారు. ప్రతిచలికాలంలో యిలాగే గ్రామంనుంచి ఎంతోమంది యువకులూ, నడివయస్కులూ పంజాబుకూ యితరప్రదేశాలకూ వెళ్ళసాగారు. కొద్ది సంవత్సరాలకే గ్రామపు నవయువకులు హాస్తిపంజరాల మాత్రంగా నిలిచిపోయారు. ఒకొక్క దురదృష్టవంతుడు తిరిగి స్వగ్రా

మానికి రావడంకూడా జరుగదు. ఎన్నోరోజుల తరువాత గాలి వార్త తెలుస్తుంది. ఫలానావాడు చచ్చాడని...!

వెన్నెల మసగ్గావుంది. టికరీషాహామురాద్ రైతులు చెక్కలమీద, కళ్ళాలకు వీపులుపెట్టి కూర్చుని, ఏకగ్రీవంగా ఆలోచిస్తున్నారు రేపు వుదయానికల్లా సంవత్సరంనుంచీ ఆ చుపడ్డ శ్రమంతా హరింపబడుతుంది శ్రమా, శ్రమఫలిత మైన ధాన్యం! ఈ రెండూ దోచుకోనబడతాయి. ఈ అన్యాయం ఆగదా? తమ ధాన్యం తమకు దక్కదా? తమ ఆశలకూ, కోర్కెలకూ రూపాన్నిదిద్దే ఈ జొన్నగింజలను కాపాడుకోలేరా? వాటిని కాపాడుకోవడానికి యింతవరకు అనేక వుపాయాలను అమలులోకి తెచ్చారు. ఏ ఉపాయమూ ఫలించలేదు. చివరకు విసిగి విధిలేక, ఎవ్వడికీ ఏవిధమైన భాగాన్నీ ఈయకూడదని నిర్ణయించుకొన్నారు. ఎవ్వడికి ఒక్కగింజ కూడా ఇవ్వరు! జమీందారుకు, జాగీర్దారుకు, నంబర్‌దార్‌కు కోమటి మార్వాడుకు – ఎవ్వరికీ ఒక్క గింజకూడా యివ్వరు. శాహామురాద్ రైతులు ఇంతనిష్టురమైన తీర్మానంచేసుకోవడం, ఎవ్వరయినా ప్రోద్బలం చేయడంవల్ల గానీ, లేక సంఘాలూ సభలూ బలవంతం చేయడం వల్లగానీ, కాదు. వాళ్ళకు ఒక జండాలేదు. ఒకరాజకీయ నినాదంలేదు. ఒక సంఘంలేదు. కాని చిత్రంగా అందరూ ఒకే అభిప్రాయానికి వచ్చారు. వాళ్ళ పంటల్లో ఎవ్వరికీ భాగం యివ్వరు! ఇలాంటి నిర్ణయానికి వాళ్ళందరూ రావడానికి ఒక ముఖ్యమైనకారణం వున్నది. ఈ సంవత్సరం పంటలు చాలా తక్కువ పండినాయి. వచ్చే చలికాలం శాహామురాద్‌లోని ప్రతి యింట్లోనూ పస్తులు తప్పవు. తరువాత చావులు తప్పవు! కనుక ఈ నిశ్చయానికి

వచ్చారు. ఇలా ధాన్యాన్ని దొంగ భాగస్వాములకు పంచ కూడదనే నిశ్చయం ఒక్క పీళ్ళేకాదు చేసుకొన్నది; ఆ సంవత్సరం 'రాహో' బటర్‌దారా మొదలైన గ్రామాలన్నింటిలో పంటలు చాలా తక్కువ పండినాయి. అక్కడిరైతులు కూడా ఇదే నిర్ణయాన్ని చేసుకొన్నారు. ఈ నిర్ణయం భక్తికి సంబంధించినదికాదు. తృప్తిని అలవరచుకోవడానికి సంబంధించినది కాదు. దేశాన్ని విడిచి పారిపోవడానికి సంబంధించినదికాదు. ఇది నిలవేసి అధికారంతో తన ధాన్యాన్ని తాను అనుభవించేది! ఈ నిర్ణయం తెలియని ప్రదేశాలనుండి తెలియని కోనలనుండి, తెలియని భాషలద్వారా, తెలియని ధ్వనుల ద్వారా వూరువూరూ వెతుక్కుంటూ రైతులకు అందించింది ఆ నిర్ణయం రైతుల చెవుల్లో, ఆత్మల్లో, ప్రాణాల్లో ప్రతిధ్వనించింది. "ఈ భూమినీది! ఈ గింజలునీవి! ఈ ధాన్యంనీది! ఇవ్వకు! ఎవ్వరికీ యివ్వకు!" ఈ నిర్ణయంతో రైతుల కండ్లల్లో కాంతి. ముఖాల్లో పట్టుదలా పెరిగాయి.

అబ్దుల్ తండ్రి నూరాజు లాహో (సాలె) తన కళ్ళానికి వీపుపెట్టి వూరికి అభిముఖంగా కూర్చున్నాడు. అతనికి ప్రక్కనే అబ్దుల్ చెల్లెలు రజ్జీ చాలా అస్థిమితంగానూ ఉదాసీనంగానూ కూర్చునివున్నది. ఎంతోసేపటినుంచీ తమ కళ్ళానికి ఎదురుగావున్న ఫజల్ కళ్ళంలోకి పోవాలని ఆమె ప్రయత్నిస్తున్నది. ఫజల్ ఆమె ప్రియుడు. అతను తన కళ్ళంలో కూర్చుని రజ్జీకోసరం చాలాసేపటిగా 'చన్నా' గీతాన్ని ఆలాపిస్తున్నాడు. ఆ గీతాన్ని వింటూకూడా తండ్రి మేల్కొనివున్న కారణంగా ప్రియుడిదగ్గిరకు పోలేకపోతున్నది. రజ్జీ! అందుకే ఈ అస్థిమితం, ఈ ఆరాటం! రజ్జీ అందగత్తె! ఆమెను చూస్తూ

వుంటే సహజంగానే పురుషహృదయాల్లో ప్రేమగీతాలు పొంగుతాయి. ఆమెను చూస్తూవుంటే - వికసించిన గులాబి పూలు, సరోవరపు నిర్మలమైన నీలిజలాలు, ఉదయపు నీ రెండలో చెట్ల ఆకుల్లోనుంచి మెరుస్తూ జారే మెత్తని మంచు బిందువును, సముద్రపు అలల తెల్లని నురుగుమీద చంచలంగా ఆడుకునే పావురాలు జ్ఞాపకానికి వస్తాయి! ఒక్కొక్కప్పుడు తన సౌందర్యంమీద తనకే ఆశ్చర్యం వేస్తుంది రజ్జీకి!

నూరా జులాహా సామాన్యకుటుంబీకుడు. ఇంట్లోవున్న అందరూ తలాఒకపనీ చేస్తేగాని సంసారం గడవదు. ఈ కారణంవల్ల రజ్జీకి దాదాపుగా మొగవాళ్ళతో సమానంగా పొలంపనులూ, ఇంటిపనులూ చేయవలసి వస్తూవుంటుంది. ఎప్పుడూను; చేనుకువెళ్ళి దున్నడం, విత్తులు చల్లడం, కోతలు, మొదలైనవాటిల్లో తండ్రికి సాయం చేస్తుంది. ఇంటిదగ్గిర కూర్చుని దుప్పట్లూ, శాలువాలు, చిన్నచిన్న సంచీలూ నేస్తుంది. ఇలాంటి మొద్దుపనులకు అడ్డంవచ్చే తన సౌందర్యానికి, వయ్యారానికీ-విసుక్కుంటూ ఉంటుంది!

నూరా జులాహాకు రజ్జీకన్న పెద్దవాళ్ళు ఇద్దరు కొడుకులు వున్నారు. పెద్దకొడుకు పేరు గులాంమొహమ్మద్. అతను చాలా సంవత్సరాలక్రితం దేశాంతరం వెళ్ళిపోయాడు. ఎక్కడ వుంటున్నాడో ఎవరికీ తెలియదు. రెండవకొడుకు అబ్దుల్. 'పూంఛ' పట్నంలో చదువుల బడి చెబుతున్నాడు. నూరాజులాహాకు, దినదినమూ ప్రవర్ధమానమౌతున్న తన కూతురి సౌందర్యాన్నీ యవ్వనాన్నీ చూస్తూవుంటే ఏదో చెప్పరాని భయమూ, అదటూ కలుగుతూ వుంటుంది. వివాహం చెయ్యాలి. ఎలా? వరుడిని ఎక్కడ చూచేట్టు?

మరో బాధకూడా వుంది. నూరా వృద్ధుడైనాడు. అతని చేతికి అండగా వుండేది రజ్జీ ఒక్కతే. పెండ్లి అయి రజ్జీ అత్తవారింటికి వెళ్ళిపోతే ఇక ఈ వృద్ధాప్యంలో తన కెవరు అండ ? ఇన్ని భయాలూ అడుటులూ వున్నప్పటికీ రజ్జీకి పెండ్లి తప్పదు. ఈసారి అబ్దుల్ పట్నంనుంచి వచ్చాక తప్పక రజ్జీకి పెండ్లి జరపాలి.

నూరాజులాహా పై విధంగా ఆలోచిస్తూ తన కళ్ళం ముందు కూర్చున్నాడు. మానసికమైన బాధలవల్ల నూరాజులాహాకు ఎంతకీ నిద్రపట్టడంలేదు. అతని వృద్ధనేత్రాలకు వూరివారి కళ్ళాలన్నీ, వెన్నెల్లో మసగ్గా కనుపిస్తున్నాయి. నూరాజులాహా కళ్ళం తరువాత మొదటగా తగిలేది ఫజల్ కళ్ళం ! ఫజలుకు భూవసతి చాలా కొద్ది; ఆ వున్న కొద్దిపాటి భూమి కూడా ఏమంత మంచిది కాదు. కంకరా ఇసుకతో నిండి వుంటుంది. దాంతో పొట్టజరక్క నూనె గానుగను ఒకదాన్ని పెట్టాడు. కాని, నూనెగానుగమీద ఏం ఆదాయం వస్తుంది ? రజ్జీ ఫజల్ని ప్రేమిస్తున్నదని నూరాజులాహాకు తెలుసును. కాని. ఫజల్ తన తనపొట్టే పోషించుకోలేక పోతున్నాడు. ఇలాంటి స్థితిలో పెండ్లి చేసుకొని పెండ్లానికి ఎక్కడినుండి తెచ్చి పెడతాడు ? నూరాజులాహా కులానికి జులాహా (సాలె) అయినా అతనితో సంబంధం కుదుర్చుకోవడానికి ఎంతోమంది ఉత్తమ వంశీయులు సిద్ధంగా వున్నారు. నూరాజులాహా నేసిన దుప్పట్లూ కంబళ్ళూ చుట్టుపట్ల అనేక గ్రామాలకు పోతూ వుంటాయి. వాటితోపాటు అతని కూతురు రజ్జీ సౌందర్య చర్చకూడా పోతూవుంటుంది. రజ్జీ సౌందర్యాన్ని గురించి వినివున్న ఎంతోమంది, పఠాన్లూ, శేఖులూ, మహమ్మ

దులూ ఈ క్షణాన పెండ్లికి సిద్ధంగా వున్నారు. నూరాజు లాహాతనలో తనే చిన్నగా నవ్వుకున్నాడు. పాపం ఫజల్ ఇంకా 'చనాృ' పాడుతూనే వున్నాడు. ప్రేయసిని ఆహ్వా నిస్తూనే వున్నాడు! ఈ ఆహ్వానం ఎంత ఆకర్షణీయమైనది; చంద్రుడు భూమిమ్మీదకు దిగివచ్చి వెన్నెల అనే దివిటితో తన ప్రేయసిని వెతుక్కుంటున్నాడు! నూరాజు తన యవ్వ నపు దినాలు జ్ఞాపకానికి వచ్చినాయి: తలెత్తి రజ్జీ కండ్లలోకి ఒకమాటు చూసి క్రమంగా నిద్రపోయాడు.

# 3

రజ్జీ కాసేపు అలాగే కూర్చుని, తండ్రిమీద రెండు మడతల దుప్పటి కప్పింది. కాసేపటివరకూ క్రిందిపెదిమను పై పండ్లతో నొక్కిపట్టుకున్నది. ఒంటికాలిమీద సర్వి చెట్టులా నిలబడ్డది. తండ్రి నిద్రపోయాడని స్థిరంగా తెల్సాక, ఒంటికాలిమీద నిలబడ్డ రజ్జీ చటుక్కున ప్రక్కకు తిరిగి 'చనాృ' గీతం వినిపిస్తున్న వైపుకు పరుగెత్తింది. అంతవరకూ నూరే దొంగనిద్రను నటించాడు. వెళుతున్న కూతురివంక ఒకకన్ను తెరచి, ఒకకన్ను మూసి ఓరగా చూశాడు నూరే! చిన్నగా నవ్వుకొన్నాడు. సరిగా అదేసమయాన వెళుతున్న రజ్జీ వెనక్కు తిరిగి తండ్రివంకకు చూసింది. తండ్రి వెంటనే గొంగళి ముసుకు కప్పేసుకున్నాడు. రజ్జీ మరొక రెండు క్షణాలు ఒంటికాలిమీద నిల్చున్నది... ఒక్కపరుగులో ఫజల్ కళ్ళంలోకి వెళ్ళి పడ్డది. 'చనాృ' పాడుతున్న ఫజల్ దగ్గి రకు ఏమాత్రం శబ్దం కలగకుండా మెల్లగా జరిగివెళ్ళింది రజ్జీ! ఫజల్‌కు బాగాదగ్గిరకు పోయాక తన శ్వాసనుకూడా

బిగపట్టుకొని. తన రెండుచేతులతోటీ అతనికండ్లను మూసి వేసింది.

'చన్నా' పాడుతున్న ఫజల్ గొంతు మధ్యలోనే ఆగి పోయింది. బలిష్టమైన అతనిచేతులు అతనికండ్లమీదకు పోయినాయి. అతని వ్రేళ్ళు ప్రేయసి వ్రేళ్ళను గుర్తించి నాయి. ఉభయుల వ్రేళ్ళూ స్పృశించుకొన్నాయి. 'చన్నా' సంగీతం తీవ్రంగా స్పందించే వారి ఇద్దరిహృదయాల్లో లుప్తం అయింది.

ఒక్కక్షణం ఫజల్ మెదలకండా వూరుకున్నాడు. మరుక్షణంలో విపరీతమైన వేగంతో చటన రజ్జీ చేతులను తన ముఖంమీదనుంచి లాగివేసి, వెనక్కుతిరిగి, రజ్జీని బల మైన తన రెండుచేతులతోనే లాక్కొని గుండెలకు అదుము కున్నాడు.

"అయ్యో! నేను చచ్చాను!" రజ్జీ అరిచింది.

ఫజల్ మరికొంచం తీవ్రంగా రజ్జీని తనగుండెలకు అదుముకున్నాడు.

"పో అవతలికి, ఏమిటి నువ్వు చేసేపని నాకు వూపిరాడడంలేదు!" అన్నది రజ్జీ

ఫజల్ మరికొంచం గట్టిగా రజ్జీని గుండెలకు అదుము కొన్నాడు. రజ్జీకి నిజంగా వూపిరి ఆడడంలేదు. ఆమె ముఖ మంతా కందగడ్డలా ఎరుపెక్కింది. వుండివుండి ఫజల్ ఒక్క సారిగా రజ్జీని విడిచిపెట్టాడు. అంతవరకూ పెనుగులాడుతున్న రజ్జీ విసురుగా వెళ్ళి క్రిందపడ్డది; తుఫాన్‌గాలికి చెట్టునుంచి విడివడ్డతీగెలా! ఫజల్ నవ్వాడు.

ఫజల్ అన్నాడు "నువ్వు నాకు చాలా అందంగా కనుపిస్తావు. నీ అందాన్నంతా తాగెయ్యాలనిపిస్తుంది; నూనెలా!"

రజ్జీ అన్నది "అవును, నూనె అమ్ముకునేవాడివికదూ; ఆడదాన్ని గానుగలో వేసి నూనె తియ్యాలనుకుంటావు!" కోపం వచ్చినట్టుగా మూతిముడిచింది.

ఫజల్ కొంచంగా గాభరాపడ్డాడు. "కోపంవచ్చిందా? ఎక్కడైనా దెబ్బతగిలిందా? నేను అంత విసుకుగాకొట్టానా?" ఫజల్ బ్రతిమలాడసాగాడు.

"నేను నీ కోసరం ఏం తెచ్చానో చూడు!" ఫజల్ అన్నాడు.

రజ్జీ అతనివైపు చూడలేదు.

"ఇటు చూడు అసలైన 'మిసరీ' కండెను తెచ్చాను! ఇప్పుడే దీన్ని కాల్చి నీకు పెడతాను!"

రజ్జీ ఒక్క విసురున ఎగబడి ఫజల్ చేతిలోని ముక్క జొన్నకండెను లాక్కొని, అన్నది" నీ చేలో 'మిసరీ' కండెల పంటలేదుగా? ఇది నీకు ఎక్కడిది? దొంగిలించావా?"

ఫజల్ నవ్వి అన్నాడు "లేదు రజ్జీ! దొంగతనం చేయలేదు. వాడు లేడూ, ఆ ఇలమ్ దీన్ వాడికి ఒక పావు సేరు నూనె ఇచ్చి దీన్ని తెచ్చాను!...నీ కోసరం! నువ్వే ఒకసారి 'మిసరీ' కండెలు తినాలని మనసుగావుంది అన్నావు జ్ఞాపకం వుందా?"

రజ్జీ కండెను వలిచింది. ఒకమాటు క్రీగంట ఫజల్ వంకచూసి మౌనంగా చలిమంట దగ్గరకు వెళ్ళింది కండెను

కాల్చడానికి! చలిమంటకు పక్కల్నవున్న నివ్వరవ్వాలమీద కండెను వుంచి. తనకై తానుగా వచ్చి ఫజల్ గుండెలకు అతుక్కుపోయింది రజ్జీ!

"ఏమిటది? అలా రాస్తావు! నాకు చక్కలగిలి పుడుతున్నది!" అన్నాడు ఫజల్.

"అయితే నవ్వు!" రజ్జీ నవ్వింది.

రెండుక్షణాలు ఇద్దరూ నవ్వారు.

ఫజల్ నవ్వు అకస్మాత్తుగా ఆగిపోయింది. ఇలా అన్నారు. "అటు చూడు!"

ఫజల్ చూపినవైపుకు రజ్జీ చూసింది, అటు నంబర్దార్ ఇలమ్‌దీన్‌వి మూడుకళ్ళాలు వున్నాయి వరసన! అక్కడ అంతవరకూ మండుతున్న చలిమంటలు ఒక్కసారిగా ఆరిపోయినాయి. ఎవరో పొడుగాంటి వ్యక్తి లాంతరు నొకదాన్ని అటూఇటూ వూపుతున్నాడు తీవ్రంగా!

రజ్జీ భయపడ్డది "ఏమిటీ?"

"ఏమిటో తెలియదు. కాని ఇలమ్‌దీన్ కళ్ళాల్లో ఎన్నడూ మంచివిషయం జరగదు!" అన్నాడు ఫజల్.

"అయితే, నేను నాన్నను లేపనా?"

ఫజల్ ఆమెను చేత్తోనే వారిస్తూ "వద్దు, అసలు ఏమౌతుందో చూద్దాం!" అన్నాడు.

ఇలమదీన్ కళ్ళాల్లో చలిమంటలు పూర్తిగా ఆర్పివేయబడినాయి. చీకట్లో కుప్పల చాటున ఐదుగురు పోలీసులతో ఇలమ్‌దీన్ నిలబడి వున్నాడు. వూరికి దక్షిణంగా వున్న అడవిలో ఐదుసార్లు కాగడా వెలుగులు కనుపించాయి, ఆరిపోయాయి; సంజ్ఞచేస్తున్నట్టు!

ఇలమదీన్ సంతోషంగా నవ్వుతూ "అల్లాదాద్! రాజా సాహెబ్‌గారు, పోలీసు అధికారి శాహన్‌సింగ్.. ఇతర పోలీసులూ వచ్చి అడవిలో సిద్ధంగా వున్నట్టున్నది!" అన్నాడు.

అల్లాదాద్ ఏమీ సమాధానం చెప్పలేదు. నిశ్శబ్దంగా తన చేతిలోని లాంతరును పైకి ఎత్తి వత్తి కొంచెం పెద్దది చేసి అడవిలోని సిపాయీలకు సౌంజ్ఞచేస్తూ ఇటూ అటూ వూగించాడు లాంతరును! ఇలమ్‌దీన్ ఇలా అన్నాడు "జాగ్రత్త ఈ ఊరి వాళ్ళ కంటపడేను!"

అల్లాదాద్ కళ్ళాలకు బాగా వెనక్కు పోయి లాంతర వూపసాగాడు.

కొద్దిసేపటి వరకూ ఏ విధమైన ప్రత్యేకత లేకుండా పరిసరం అంతా నిశ్శబ్దంగా వున్నది. రెండు క్షణాల తరువాత అడవిలోనుండి మళ్ళా దివిటీ వెలుగు కనుపించింది.

"వాళ్ళే! తప్పకుండా వాళ్ళే!" ఇలమ్‌దీన్ ఆనందంతో వుప్పొంగి పోతూ అన్నాడు తనకు ప్రక్కనే వున్న లాలా మీరాపా బుజంమీద చేతిని వేసి కదుపుతూ "లాలా! నీ ప్రాణాలూ దక్కినాయి! నీ భాగమూ నీకు దక్కింది! రాజా సాహెబ్‌గారు వచ్చేశారు. రాకపోయినట్టయితే రేపు ఏమయ్యేదో?" అన్నాడు.

అడవిలో తిరిగి దివిటీ కదిలింది; ఆఖరు సారిగా.

అల్లాదాద్‌కూడా చివరిసారిగ తన చేతిలోని లాంతర్ని ఊగించాడు.

మరుక్షణమే నాలుగు వైపులా అంధకారం వ్యాపించింది.

ఇలమ్‌దీన్ సంతోషంతో ఎగరసాగాడు.

భయంతో లాలా మీరాషా శరీరమంతా వణికి పోతున్నది. అంత చలిలోనూ అతని పొడుగాటి ముక్కుమీదుగా చమట ధారలు కారుతున్నది. త్వర త్వరగా శ్వాస పీలుస్తూ వుండడం వల్ల ముక్కు తుమ్మెలు పయికీ క్రిందకూ ఎగురుతున్నాయి. అతని ఈస్థితిని చూసి ఇలమ్‌దీన్ ఇలా అన్నాడు. "లాలా! ఎందు కలా భయపడి చస్తావు? ఫో...ఇంటికిపోయి హాయిగా పడుకుని నిద్రపో!"

లాలా మీరాషా వణుకుతూ ఇంటికి బయలు దేరాడు.

అల్లాదాద్ ఇలా అన్నాడు "ఎటునించి వెళతావు?"

మీరాషా అన్నాడు "పడమటగా వెళతాను. అటు ఏమీ కళ్ళాలులేవు!"

"ఒక వేళ దారిలో సిపాయీలు కనుపిస్తే అన్నీ ఏర్పాటులూ జరిగినాయి అంతా సిద్ధం అని చెప్పు- తెలిసిందా?" అల్లాదాద్ అన్నాడు.

మీరాషా సరే నన్నట్లు తలవూపి బయలు దేరాడు ఇంటికి. పెద్దపెద్ద అడుగులు వేసుకొంటూ. అతను చేలను దాటి పడమటగా క్రిందకు, ఊరివైపుకు బయలు దేరాడు. వల్లానికి దిగేటప్పుడు తొందరలో కాలుజారింది. రాళ్ళగుట్ట మీదకుపడి అక్కడినుంచి దొర్లుతూ క్రింది కాలిబాటమీదకు వచ్చి పడ్డాడు. అక్కడే రహమాన్‌కళ్ళం! రహమాన్ వులిక్కిపడి "ఎవరది?" అన్నాడు.

దూరంగా నిలబడి దీన్నంతా గమనిస్తున్న ఇలమ్‌దీన్‌కు గుండెలు ఆగినంత పనైంది. అతను అల్లాదాద్ చెయ్యి గట్టిగా

పట్టుకొని, మెల్లగా అన్నాడు "ఈ లాలాగాడు, గాడిద కొడుకు, కుదిరే కుదిరేదాన్ని చెడగొట్టాడు !"

అల్లాదాద్ అన్నాడు "ఊరుకో ! మెదలకుండా చూస్తూవుండు !"

రహమాన్ మళ్ళీ అరిచాడు "ఎవరది?"

కాని, మీరాసాకూడా తెలివిగా తప్పుకొన్నాడు. తను పడ్డచోట అలాగే వుండిపోయాడు. వెన్నెల చాలా అస్పష్టంగా వుంది. ఆ మసక వెన్నెట్లో తనూ ఒక రాయిలా కనుపించాలని కొండరాళ్ళమధ్య కిక్కురు మనకండా పడు కున్నాడు మీరాసా !

రహమాన్ కొడుకు బర్కత్ తండ్రితో మెల్లగా ఇలా అన్నాడు. "ఏదో మృగంలా వుంది పారిపోయింది."

రహమాన్ సంతోషంగా అన్నాడు "పోనీ అడివి పందేమో !" తండ్రీకొడుకులు ఇద్దరూ కళ్ళాలకు వీపులుపెట్టి వూరికి అభిముఖంగా కూర్చున్నారు. మేలు ఏమిటంటే, మీరాసావైపు వీపులుపెట్టి కూర్చున్నారు వాళ్ళు !

మీరాసా కొద్దిక్షణాల వరకూ అలాగే చచ్చినట్టు పడివున్నాడు. తరువాత నాలుగు కాళ్ళతో పశువులా గెంతు తూ పల్లంలోకి పోయి, మసక వెన్నెల్లో మాయం అయ్యాడు.

రహమాన్ కండ్లు మూతలు పడుతున్నాయి. అతను కండ్లు నలుముకుంటూ ఇలా అన్నాడు "ఈ రాత్రి ఎలా గయినా గడిచిపోతే బాగుండు. మహా నిద్రవచ్చేస్తున్నది !"

బరకత్ అన్నాడు "నిద్రపో అయ్యా !

రహమాన్ కండ్లు నులుముకుంటూనే యిలాఅన్నాడు. "అరే...వూరి పంచాయతీ, ఏమిట్రా ఈ గొడవ తెచ్చి

పెట్టింది! రాజా సాహెబ్‌కు ఇవ్వాక-నంబర్‌దారుకు ఇవ్వాక-జాగీర్దార్‌కు ఇవ్వాకపోతే ఎలాగరా గడుస్తుంది? ఏం తీర్పురా పంచాయతీ తీర్పు? నెత్తికి తెచ్చిపెట్టింది!" అన్నాడు.

బర్‌కత్ మెదలకండా ఊరుకున్నాడు.

రహమాన్ మళ్ళీ అన్నాడు. "అరేయి, వూరిని అనుసరించి నడవకపోతే జరగదని గాని, యథార్థం చెప్పమంటే ఎవరివంతులు వాళ్ళకు ఇచ్చివేయడమే ఉచితం! అప్పటికీ ఇంకా మిగులుతుంది."

బర్‌కత్ అన్నాడు "అయ్యా! నీకు కొంచెంఎక్కువ భూమి వున్నది. అందువలన అలా మాటాడుతున్నావు. లేకపోతే నీవుకూడా వూరి అందరి రైతులలాగే ఇవ్వ కూడదనే వాడివి!"

"అవును నీవు చెప్పేది నిజమే! అయినప్పటికీ పెద్దల భాగాలను దిగమింగ కూడదు. ఏలిక అంటే దేవుడితో సమానం: మొదట దేవుడికి చెల్లించే తరువాత మన భాగాన్ని మనం చూసుకోవాలి! మిగలడం మిగలక పోవడం మన అదృష్టాన్ని బట్టి వుంటుంది. అరేయి, ముఖంమీద రాసిపెట్టింది పాకులాడితే దక్కదురా!" అన్నాడు రహమాన్.

బర్‌కత్ అన్నాడు. "నీవు చెప్పేదీ నిజమేనయ్యా!"

"అది సరేగానీ, నీలాంటి మూర్ఖుడు మరెవ్వడూ వుండడు. నిక్షేపంలాంటి పిల్ల చేతుల్లోనుంచి జారిపోతూ వుంటే, చూస్తూవూరుకుంటావు: దరిద్రుడా!"

"నువ్వు అనేది ఎవరి విషయం? రజ్జీ విషయమా?" బర్‌కత్ కొంచంగా సిగ్గుపడ్డాడు.

"అవును...మరింకెవరి విషయం అనుకొన్నావు?".

"అది ఒప్పు కోదయ్యా! అది ఫజల్‌ని ప్రేమిస్తున్నది.

"ఛీ...నోరు ముయ్...ఆడది స్వయంగా ఎవ్వడినీ స్వయంగా ప్రేమించదు. ఎవడు నాలుక తగిలించగలడో, వాడిని ప్రేమిస్తుంది! అరే డబ్బూ బలం, కీర్తి ఇలాంటివి వుంటే చాలు ఆడదానికి...నీ దగ్గిర అన్నీ వున్నాయి. ఏం ప్రయోజనం? అంగట్లో అన్నీ వున్నాయి. అల్లుడి నోటిలో శనివుంది!"

"కాదు నాన్నా! నాకంటే అది చాలా లావు. ఒక రోజున నీళ్ళకుపోయి వస్తూవుంటే నేను చెయ్యి పుచ్చుకొన్నాను. ఒక్క వూపులో చేతిని విడిపించుకొని వసుగెత్తింది. ఎంత బలం అనుకొన్నావు? మహా పొగరుమోతుది కూడాను!"

"ఛీ...అవతలికి ఫో!" రహమాన్ బర్కత్‌ని ఒక్క గుద్దుగుద్దాడు. బర్కత్ క్రింద పడ్డాడు. "ఏ వేళ పుట్టానో, నిద్రముఖపు వాడివి. రజ్జీని నీవు వప్పించ గలిగినట్లయితే నూరేజులాహా భూమంతా మనకయ్యేది కాదూ!"

"అదెలాగయ్యా?"

"అదెలాగ అయ్యా! రహమాన్ కొడుకును హేళన చేస్తూ అన్నాడు "ఒరిగుడ్డివాడా! రజ్జీని లోబరచు కొన్నట్లయితే, నువ్వు ఈపాటికి నూరేకు అల్లుడివి అయ్యేవాడివి. నూరే పెద్దకొడుకు గులాం మహమ్మద్‌ఖాన్ ఎక్కడికో పారిపోయాడు. రెండవ కొడుకు అబ్దుల్ పట్నంలో చదువు చెబుతున్నాడు. వాడు ఇక్కడ పొలం పుట్రా చూడటానికి రాడు. ఇంకొక నాలుగు ఏండ్లుపోతే ఈ ముసలివాడు ఎటూ

చెల్లుకుంటాడా. ఇక చెప్పు వాడి భూమికి హక్కుదార్లు ఎవ రౌతారో?"

బర్కత్ తన గుండ్రని కండ్లను ఆశ్చర్యంతో త్రిప్పి.

"అదా విషయం! ఐతే నేను ఇక ప్రయత్నం చేయనా అయ్యా?"

"పోరా వందీ, నీవేం ప్రయత్నం చేస్తావు? అది ఏనాడో ఫజులుకు దక్కిపోయింది!" ఇంక నీకు నేను ఏం చెప్పను? నేనే గనక నీ వయసులో వుంటే గుర్రాన్ని ఎలా లొంగదీయాలో చూపించేవాడిని! ఇప్పటికీ యువకులకంటే నేనేం తీసిపోను! కాని, పిల్లా జెల్లా కలవాడిని. గడ్డంకూడా ముగ్గుబుట్ట అయింది...అరెరె...అదేమిటి? ఎవరువాళ్ళు?... అరె...!" రహమాన్ మరేమీ మాటాడలేకపోయాడు.

ఎదురుగా భూతాకారంలో కొంతమంది సిపాయీలు నిలబడి వున్నారు. ఒకరు రహమాన్ నోటిని గట్టిగా మూసి నోటిలో గుడ్డలు కుక్కారు. ఒకడు కొడుకుని పట్టుకున్నాడు. క్షణ కాలంలో ఇద్దరూ తాళ్ళతో కట్టివేయబడ్డారు.

"ఇక ముందుకు నడవండి!" ఠాకుర్ కాహన్‌సింగ్ తన సిపాయీలతో అన్నాడు!" నిశ్శబ్దంగా నడవాలి! ఇదిగో: లాలా, నీవు ముందుగా దారిచూపుతూ నడు!"

లాలా మీరాషా అందరికంటె ముందు నడుస్తున్నాడు. కాహన్‌సింగ్ వెంట రాజా కర్మ ఆలీగారి ముప్పై మంది సిపాయీలు వున్నారు. అప్పటివరకూ అందరి చేతుల లోనూ దివిటీలున్నాయి. కాని వూరి దగ్గరకు వచ్చాక రైతులు చూస్తారనేవుద్దేశ్యంతో, చూసి జాగ్రత్తపడతారేమో ననే వుద్దేశ్యంతో, దివిటీలను ఆర్పివేశారు.

కొద్దిసేపటి క్రితం బయలుదేరిన లాలా మీరాషా ఇంటి దరిదాపుకు చేరుతూవుండగా కాహాన్‌సింగ్ సిపాయీలతో ఎదురయ్యాడు. అందులో ఒకసిపాయి అతనిని చంపి వేయడానికి లాఠీ ఎత్తనే ఎత్తాడు. ఇంతలో కాహాన్‌సింగ్ గుర్తించాడు అతనిని. చావు తప్పిందిగాని, చావుకు మించిన ప్రమాదం మరొకటివచ్చి పడ్డది. కాహాన్ సింగ్, రైతులు ఎక్కడెక్కడ వున్నారో వచ్చిచూపమన్నాడు అతనిని. కాదన డానికి వీలులేదు జాగీర్దార్‌గారికి వన్నుల వసూలలో అతను ఈమాత్రం సాయపడకపోతే రేపు చెడ్డరోజులలో అతనిని ఎవరుచూస్తారు? అలాగని జాగీర్దార్ కర్మ ఆలీకి సాయం చేద్దామా అంటే, రేపు వసూలు అయిపోయి. సిపాయీలు వెళ్ళిపోయాక, ఇలా సాయపడ్డందుకు, వూరిరైతులు ఎముకలు వెర్చిపెడతారు! అయినప్పటికీ, రాజా సాహెబ్‌గారికి సాయపడడమే అతనికి క్షేమదాయకం! ఎందువల్లంటే. ఏదో ఒక మాటతో రైతులను మభ్యపెట్టి తిరిగి మంచివాళ్ళను చేసుకొనవచ్చును. రాజాగారిని అలా చేసుకొనలేము. రాజాగార్ని మంచి చేసుకొనలేక పోతే తనకు చక్రవడ్డీలు ఎక్కడనుంచి ముడతాయి? అందువలననే కాహాన్‌సింగ్‌నూ,సిపాయీలనూ, నంబర్‌దార్ ఇలమ్‌దీన్ కళ్ళంవరకూ తెచ్చి, దిగవిడచి మరీ శెలవు పుచ్చుకున్నాడు లాలామీరాషా!

ఇదే సమయాన ప్రజలకుకూడా కొంత అనుమానం వేసింది. అతను ఇలమ్‌దీన్ కళ్ళంలోనుంచి దక్షిణపువైపుకు చేయబడిన లాంతరు సౌంజ్ఞలను చూశాడు. అతను గట్టిగా రజ్జీ చేతిని పుచ్చుకుని యిలా అన్నాడు. "తప్పకుండా ఏదో కుంభకోణం వుంది రజ్జీ!"

"ఐతే పద పూరివాళ్ళను లేపుదాం!"

"ఊరకా లేపడంవల్ల ప్రయోజనం వుండదు. అసలు ఏమవాతుందో చూడనీ, నీవు యిక్కడేవుండు, నేను దక్షిణపు పల్లానికిపోయి అసలు విషయం ఏమిటో చూసివస్తాను!"

రజ్జీ అన్నది "నేను నిన్ను వొంటరిగా పోనీయను!"

ఒక్కక్షణం ఆగి ఫజల్ ప్రేయసి చేతిని తనచేతిలోకి తీసుకొని "సరే, పద!" అన్నాడు.

నూరే కళ్ళందగ్గిరకు వెళ్ళి అతన్ని లేపారు. ఇంకా దక్షిణం గాపోతే బాలక్‌రామ్ బ్రాహ్మణుని కళ్ళం. అతనిని కూడా లేపి, అక్కడినుండి దక్షిణపు పల్లంలోకి దిగారు. పల్లాన్ని ఆనుకునే పూరివైపుకు పోయేమార్గం వుంది. అక్కడ చెట్ల గుబుర్లు నిండివున్నాయి.

రజ్జీ కాలికి తగిలి ఒకరాయి క్రిందికి దొర్లింది. గోల చేసుకొంటూ చెట్ల గుబుర్లవైపుకు పోయింది. అటు చెట్ల గుబుర్లలోనించి గుర్రపు సకిలింపు ఒకటి వినిపించింది. సిపాయిలు చెట్ల గుబుర్లగుండా పూరివైపునుంచీ కళ్ళాల దగ్గిరకు వస్తున్నారని తెలుసుకొన్నారు రజ్జీఫజల్! వాళ్ళు యిద్దరూ వెంటనే బాలక్‌రామ్ బ్రాహ్మడి చేలో మెట్లచాటున దాక్కున్నారు. రాయి దొర్లిన శబ్దాన్ని వినడంవల్ల సిపాయిల్లో ఒకడు వెంటనే తుపాకి పైకి ఎత్తాడు. కాని ఒడ్డూ పొడుగూ కలిగి బలిష్టుడైన వ్యక్తి ఒకడు వారించి సిపాయిని ఆపాడు. అతనిపేరు జమాదార్ కాహన్‌సింగ్.

"ఆ ముందువెళుతున్న సన్నని పొడుగాటివ్యక్తి ఎవరు అని రజ్జీ అడిగింది.

ఫజల్ అమ్మాబూతులుతిట్టి "మనవూరికి షావుకారులా వుంది.....రజ్జీ, మనం చేసిన యింత ప్రయత్నం నాశనం అయి పోయింది!" అన్నాడు.

"మరి ఆ గుర్రంమీద ఎవరు?" రజ్జీ భయభీత అయింది.

"ఎవరో తెలియడంలేదు. ఇంత దూరానికి పోలిక గుర్తు రావడంలేదు. మొత్తానికి ఈ ప్రాంతమువాడు కాడు. సరే వెనక్కి నడు, వెళ్ళి కళ్ళాల్లో ఈ విషయాన్ని చెబుదాం. ఊరివాళ్ళందరినీ జాగ్రత్త పరుద్దాం!"

కాని, రజ్జీ ఫజల్ ఇద్దరూ రొప్పుతూ పరుగెత్తుకుంటూ తమ కళ్ళాల దగ్గిరకు వచ్చేసరికి సిపాయీలు ఇలమ్‌దీన్ కళ్ళంలోకి చేరిపోయారు. అప్పటివరకూ అంధకార మయంగా ఉన్న అతని కళ్ళం ఒక్కమాటుగా దివిటీలతో వెలిగిపోయి వుంది. దాదాపుగా నలభైమంది సిపాయీలు కాగడాలు పుచ్చుకొని చుట్టుపట్లవున్న కళ్ళాల్లోని రైతులకు తుపాకులు చూపించి భయపెట్టి తాళ్ళతో కట్టివేస్తున్నారు. ఫజల్ పెద్దగా అరిచి మిగిలిన రైతుల్ని జాగ్రత్తపరుద్దాం అనుకొన్నాడు. కాని సమయం మించిపోయింది. ఫజల్ కళ్ళానికి చుట్టూ సిపాయీలు ముట్టడివేశారు. కొద్దిదూరంలో శాలిక్‌రామ్, నూరా, దిల్‌దార్, ఐబీబత్తు. వీరందరూ కలసి సిపాయీలను తమవద్దకు రాకుండా రాళ్ళతో అడ్డగిస్తున్నారు. సిపాయీల మీదకు రాళ్ళు విసురుతున్నారు. ఫజల్‌కూడా మెల్లగా జరిగి వాళ్ళల్లో కలిశాడు. ఒక పెద్దరాయిని గురిచూసి విసరబోతున్న సమయంలో కాహాన్‌సింగ్ యిలా అన్నాడు "ఇక ఎవరైనా రాయి విసిరినట్టున్నదా, వాడు సరాసరి స్వర్గానికి

టిక్కెట్టు పుచ్చుకొంటాడు...తుపాకి...!" ఫజల్ చేతిలోని రాయి క్రింద పడ్డది.

రజ్జీ ఫజల్‌ని చేయి పుచ్చుకు వెనక్కు లాగింది. సిపాయీలు మరీ దగ్గరకు వచ్చారు. వాళ్ళల్లో ఒక నడివయస్కుడైన చామనచాయవ్యక్తి, గుర్రంమీద కూర్చుని అందరికన్నా ముందుకు వచ్చాడు. అతని బుగ్గలు వుబికి వున్నాయి. ముక్కుతమ్మెలు వెడల్పుగా వున్నాయి. కండ్లునీలంగా వున్నాయి. దట్టమైన కనుబొమ్మలు ఇరుకైన ముఖాన్ని ధనుషాకారంలో కప్పివేసినాయి. అతను జోధపురి కోటునొకదాన్నీ, దానిమీద కు కాకిరంగు పొడుగులాగు నొకదాన్నీ ధరించాడు. నడుముకు వెడల్పయిన చర్మపుబెల్టూ, దానికి రివాల్వారు ఒకటీ వున్నాయి !" ఈయనే ఆ ప్రాంతపు జాగీర్దార్ కర్మాఆలీ!

జమాదార్ శాహన్‌సింగ్ గర్జించాడు "రాజుగార్కి సలాం చెయ్యరేరా? గాడిదకొడుకుల్లారా!"

అంతవరకూ ఫజల్ చేతులు బిగుతుగావున్నాయి. కాని రాజాగారు వచ్చారనే వార్త వినేసరికి, అతని సర్వాంగాలూ సడలినాయి! అచేతనంగా ముందుకు వంగాడు; నేలమీద పడి నమస్కరించడానికి! సరిగా ఇదేవిధంగా అతని తండ్రి, అతని తండ్రికీ తండ్రి అతని తండ్రికితండ్రి... తరతరాలనుంచీ రాజుకు మోకరిల్లుతూ వచ్చారు! సర్వాంగాలనూ భూమికి ఆనించి సాష్టాంగపడ్డారు! ఫజల్ యువకుడు! అతనిలో బలంవుంది. సాహసం వుంది. అయినా చిత్రం. అతనూ సాష్టాంగపడ్డాడు!

జమాదార్ ఠాకుర్ కాహాన్‌సింగ్ ఫజల్‌ని మోచేత్తో ఒక్కపోటు పొడిచి "నువ్వే కదరా-సిపాయీలమీద రాళ్ళు వేస్తున్నావు ?" అన్నాడు.

ఫజల్ క్రోధం హద్దుల్ని దాటింది కాహాన్‌సింగ్ ముఖం మీద విసురుగా ఒక్క గుద్దుగుద్దాడు. కాహాన్‌సింగ్ ఎగిరి మూడుగజాలు వెనక్కు పడ్డాడు.

ఇది చూసి కాహాన్‌సింగ్‌కు ప్రక్కగావున్న అల్లాదార్ తన తుపాకీమీదకు చేయి పోనిచ్చాడు. వెంటనే రజ్జీ తండ్రి చాటున నిలబడ్డది. ఎగిరి ముందుకువచ్చి ఫజల్ గుండెలకు గుండెలను ఆనించి అడ్డంగా నిలబడ్డది. దివిటీల వెలుగులో రజ్జీ ముఖం ఎర్రగా దానిమ్మపువ్వులా మెరుస్తున్నది.

"అరె... ఇది ఎవరూ ?" రాజా కర్మఅలీ పెదాలు చిరునవ్వునవ్వడానికి విస్తృతమయినాయి. గుర్రందిగి రజ్జీకి ఎదురుగా వచ్చి నిలబడ్డాడు.

సిపాయీలందరూ వెనక్కు తగ్గారు.

"నీ పేరేమిటి ?"

రజ్జీ మాట్లాడలేదు.

ఫజల్ రజ్జీని తన ముందునుంచి లాగి వెనక్కు దాచిపెట్టుకున్నాడు, నూరే ముందుకువచ్చి వణుకుతూన్న చేతులతో నమస్కరించి ఇలా అన్నాడు. "ప్రభూ ! ఇది నాకూతురు. దీనిపేరు రజ్జీ !"

"కొంచం దాన్ని ఇటు నా ముందుకు తెచ్చి నిలబెట్టు!"

ఫజల్ కదలలేదు. అలాగే అడ్డం నిలబడ్డాడు.

సిపాయీలు అతన్ని పట్టుకుని దూరంగా లాక్కు పోయారు. అతడు వాళ్ళతో పెనుగులాడుతున్నాడు. కాని వాళ్ళు లెక్కకు మిక్కిలిగా వున్నారు. అతను ఒక్కడు! ఒకరిద్దరికి దవుడలు వాయగొట్టి ఫజల్ వాళ్ళపట్టులో దొరికి పోయాడు. సిపాయీలు అతన్ని కదలకుండా పట్టుకుని నిలబడ్డారు.

రజ్జీ రాజాకర్మ ఆలీకి ఎదురుగా నిలబెట్టబడ్డది. ఆమె కండ్లు చింతనిప్పుల్లా వున్నాయి.

"ఆహా...ఆహా...ఇది అచ్చం గులాబిపువ్వు... ఈ మారుమూల కుగ్రామంలో వాడిపోతున్నది!" రాజా కర్మ ఆలీ చిన్నగా నవ్వాడు.

జమాదార్ ఠాకూర్ కాహన్‌సింగ్ వంగి నమస్క రిస్తూ "ప్రభువుగార్కి ... కానుక!" అని ఆగాడు.

"కాదు ... కాదు..." నూరా అరిచాడు ప్రభూ! నా కూతురు...!"

"కాదు. కాదు" బాలక్‌రామ్ బ్రాహ్మడు అరిచాడు. "ఇది ఇంకా పెండ్లి కాని పిల్ల...పీల్లేదు...ఇది ఈ వూరికి బిడ్డ...దీని గౌరవం ఈ వూరి గౌరవం! దీని అగౌరవం ఈ వూరికే అగౌరవం!"

నూరా దుఃఖసముద్రంలో మునిగిపోయాడు "గాడిద కొడుకుల్లారా! నా గొంతులో ప్రాణంవుండగా నా కూతురుని అవమానం పాలుకానివ్వను!"

రాజా కర్మ ఆలీ సిపాయీలకు సౌంజ్ఞ చేశాడు. సిపా యీలు రజ్జీని పట్టుకొన్నారు. రజ్జీ పెద్దగా అరిచింది సిపాయీ లను గుద్దింది. వాళ్ళమీసాలూ, గడ్డాలూ పీకింది. కాని,

చివరకు లొంగిపోయింది. పట్టుపడ్డది. సిపాయీలు ఆమెను బుజాలమీద వేసుకున్నారు.

రాజా కర్మ ఆలీ నవ్వి "ఈ సుందరమైన పుష్పం మన రాజోద్యానపుకాంతిని ఇనుమడింపచేస్తుంది! శాబాస్! పద, డేరాకు వెళ్దాం పద!" అన్నాడు.

నూరా రాజా కర్మఆలీ కాళ్ళను గట్టిగా వాటేసుకుని అన్నాడు "ప్రభూ అయ్యా, బాబూ! ఇది మీ ప్రజ, మీకు కూతురుతో సమానం! దీని శీలాన్ని కాపాడండి, చెడగొట్టకండి! ఇటు చూడండి... నా నెరసినగడ్డాన్ని చూడండి! నా వృద్ధాప్యాన్ని చూడండి! నన్ను ప్రాణాలతో చంపకండి... మీరు దాన్ని ముట్టుకొంటే ఖురాన్‌కు అపచారంచేసినట్టే... మీ గురువులు శాహా మురాద్‌గార్కి అపచారం చేసినట్టే...!"

రాజా కర్మఆలీ తనకాళ్ళను విడిపించుకోవడానికి అనేక విధాల ప్రయత్నించాడు కాని, నూరా కాళ్ళను విడవలేదు. కాళ్ళను అలాగే కరచిపట్టుకొని అనేకరకాలుగా ప్రార్థిస్తున్నాడు. అరుస్తున్నాడు. చివరకు నూరా ఖురాన్‌మీద పట్టుపెట్టేసరికి రాజా కర్మఆలీకి, విపరీతం అయిన కోపం వచ్చింది. తన రివాల్వార్ను తీసి నూరా గుండెల్లోకి గురిచూసి కాల్చాడు...!

ఫజల్ పెద్దగా గొంతు పగిలేట్టుఅరిచాడు. "హత్య... హత్య... హత్య... పోలీస్... పోలీస్... పోలీస్..."

అల్లాదాద్, ఇతర పోలీసులూ అదరిపడ్డారు. ఒక సిపాయీ ఫజల్ నెత్తిన తుపాకీ మడమతో మోదాడు. ఫజల్ స్పృహతప్పి నూరే శవం ప్రక్కనే పడ్డాడు.

రాజా కర్మఆలీ రివాల్వార్‌ని బెల్టులో పెట్టుకుంటూ— ఇలా అనుకున్నాడు.

"ఒట్టి మూర్ఖుడు. అడవిమనిషి...ఇలాంటి విషయాల్లో ఖురాన్‌ని ఇరికిస్తాడా ?"

ఠాకూర్ కాహన్‌సింగ్ ఇలా అన్నాడు "ప్రభూ ! సమయం చాలా గడిచిపోయింది. డేరాకు దయచేసి విశ్రాంతి తీసుకోనండి మిగిలిన విషయాలన్నింటినీ రేపు వుదయం చూసుకోనవచ్చును !"

- ఫజల్ చలిమంటకు దగ్గరగా స్పృహతప్పి పడి వున్నాడు. చలిమంట ఆరిపోయింది. మొక్కజొన్నకండె కాలిబొగ్గయిపోయింది అక్కడి ప్రజలకు ఆ రాత్రి చాలా విషాదకరమైనది, స్త్రీల మానాన్ని హరించింది ఆ రాత్రి ! రక్తబలుల్ని గోన్నది ఆ రాత్రి ! నోటిముందు ధాన్యాన్ని కాజేసింది ఆ రాత్రి ! కాని; అక్కడికి ప్రక్కనే మరొక దేశం వుంది. ఆ దేశప్రజలకు అదేరాత్రి ఎంతో ఆహ్లాదకరమైనదీ, సుఖదాయకమైనదీ అయివుండినది !...ఎందుకు వుండదు? ఆ దేశంమీద సర్వహక్కులూ అక్కడి ప్రజలవి ! భూములు ప్రజలవి...పంటలు ప్రజలవి...ఫాక్టరీలు ప్రజలవి. ఇంతెందుకు? గడ్డిపోచనుండి, బ్రహ్మాండమైన టాంకులవరకూ అన్నీ ప్రజలవి. అంత చిత్రమైన దేశం ఎంతోదూరంలో కూడా లేదు. ప్రక్కనే ! పొరుగింటిలా వున్నది !

ఫజల్ ఇంకా నిస్పృహలో క్రిందపడేవున్నాడు. రాత్రి అతి నిశ్శబ్దంగా మసగ్గా వున్నది; చలికి వణికే ముసలిదానిలా! నక్షత్రాలు రొప్పుతున్నై. నాలుగువైపులా గంభీరమైన నిశ్శబ్దం ఆవరించింది.

# 4

అంధకారమయంగా వుండి నిస్థబ్ధతలో మునిగిన ఆ నడిరాత్రి లాలా మీరాషా సిపాయీలను నంబర్దార్ ఇలమ్‌దీన్ కళ్ళంలో దిగవిడిచి స్వగృహంవైపుకు మళ్ళాడు. అతనిహృదయం భయంతో అతి తీవ్రంగా స్పందిస్తున్నది. మానసికంగానూ, శారీరకంగానూ అతను చాలా భయస్తుడు. ఈ భయానికి కారణం రాజా సాహెబ్‌గార్కి సహాయపడటం ఇష్టంలేక కాదు. యథార్థాన్ని మాట్లాడితే అతనికి రాజా సహెబ్‌గార్కి, వారి సిపాయీలకూ, ఠాకూర్ కాహన్‌సింగ్‌కూ సాయపడడం అంటే ఎంతో ఇష్టం! కాదా మరి! సముద్రంలా విస్తృతంగావున్న ఈ మూర్ఖ నిరక్షరాశ్య రైతుల్లో అతనికి సాయపడేది ఈ జాగీర్దార్, కాహన్‌సింగ్, సిపాయీలేగదా! వాళ్ళు స్థాపించిన న్యాయస్థానాలనుండే రైతులదగ్గిర చక్రవడ్డీలను వసూలు చేయకలుగుతున్నాడు. తను ఇవ్వలేకపోతే ఇళ్ళూ, వాకిళ్ళూ, పొలమూ, బొట్రల్ని వేలాం వేయిస్తున్నాడు. అలాంటప్పుడు ఈ జమీందారులూ జాగీర్దార్లే లేకపోతే, ఈ కాహన్‌సింగ్ లేకపోతే, లాలా ఒక్కక్షణమైనా అక్కడ బ్రతకగలడా? మరలాంటప్పుడు ఎందుకు సాయపడడు?

"కానీ. బాధ ఏమటంటే, నేను రాత్రింబగళ్ళూ ఈ మూర్ఖరైతులతోనే వ్యాపారం చెయ్యాలి! వీళ్ళతోనేమసలాలి! లేవాలి! కూర్చోవాలి!" మీరాషా తనలో తనే మాట్లాడుకుంటూ; ఏ రైతుకంటా పడకుండా, దక్షిణపుపల్లాన్ని దాటి వూరివైపుకు వెళుతున్నాడు. మధ్యలో ఒక చిన్నకాలువ తగిలింది. దాన్ని దాటటానికి కాలిచెప్పుల్ని విప్పి చంకల్లోకి

ఇరికించాడు! కాలవలో దిగాడు. నీళ్ళు చాలా చల్లగా వున్నాయి. సూదుల్లా గుచ్చుకొంటున్నాయి. కాలువనీళ్ళల్లో జాగ్రత్తగా అడుగుల్ని వేసుకొంటూ మీరాషా తన జీవితాన్ని ఒకమాటు పర్యాలోచించుకొన్నాడు ఛ...ఛ.. ఏమి జీవితమిది? ముందుగొయ్యి, వెనుక నుయ్యి! అటు జాగీర్దార్‌గారికి సాయం చెయ్యక పోయామా వ్యాపారం సాగదు! అట్లాగని సాయంచేస్తే, అది రైతులకు తెలిస్తే ఎముకలు సున్నం అవుతయ్యి! ఛీ...ఛీ...ఇలాంటి వృత్తి వద్దురా భగవంతుడా!

లాలా కాలువ దాటి వడ్డుకు వచ్చాడు. తిరిగి కాళ్ళకు చెప్పులను వేసుకొన్నాడు. అతనికి తనజీవితపు ప్రథమదశలన్నీ జ్ఞప్తికి వచ్చినవి. తను చకవాల్ ప్రాంతపు 'భోన్' అనే గ్రామంనుండి ప్రథమంగా కాష్మీరుకు వచ్చినప్పటి స్థితి కండ్లకు కట్టినట్టు స్పష్టంగా కనుపించింది మొదటగా అతను గాడిదల మీాద వుప్పుమూటల్ని వేసుకుని కాష్మీర్ ప్రాంతానికి అమ్మడానికి వచ్చాడు. ఇక్కడ వుప్పు మంచిధరల్లో అమ్మేది! గాడిదల మోతకూలి విడిగా గిట్టేది! దారిలో ఎక్కడ ప్రొద్దు కృంగితే అక్కడ డేరా వేశేవాడు, గాడిదలప్రక్కనే తనూ ఒక గాడిదలా పడివుండి, తెల్లవారంగానే తిరిగి ప్రయాణాన్ని సాగించేవాడు. ఎంత నిర్భయమైన, చింతారహితమైన జీవితం అది! వారానికో, పదిరోజులకో ఒకమాటు స్నానం చేస్తూ వుండేవాడు. ఇక బట్టలు మార్చటం, చినిగితేనే! క్రొత్తబట్టలు వేసుకొన్నాడంటే చినిగితేనే విప్పడం! మొదట చొక్కా చినిగితే, ఒక్కచొక్కాయే కుట్టించుకొనేవాడు; పైజామా మాసి మట్టికారుతూ వుండేది. తిరిగి కొన్నాళ్ళకి పైజామా

చినిగితే, పైజామా కుట్టించుకొనేవాడు; అప్పటికి చొక్కా మట్టికారుతూ వుండేది: ఇలా క్రొత్తచొక్కా పాతపైజామా, పాతపైజామా క్రొత్తచొక్కాల్తో ఎప్పుడూ గాడిదలను తోలు కొంటూ వెళ్ళేవాడు. గుడ్డల్లోనూ, తలలోనూ చీడపేలు కారుతూ వుండేవి. అతని తలలో పేలు బహువిపరీతంగా వుండేవి. ఆ కారణంగా వాటిని చంపాలనే వ్యూహకూడా అతనికి ఎన్నడూ కలుగలేదు! పేలను తీసివేసుకొంటూ 'చన్నా' గీతాల్ని పాడుకుంటూ గాడిదల్ని తోలుతూ వుండేవాడు.

లాలా మీరాషా తన గడచిన నవయువ్వనపు నిదురుద్దేశ్య దరిద్రక్షణాలను జ్ఞాపకం చేసుకొని తనలో తనే నవ్వుకొన్నాడు'. ఇప్పుడతను చాలా అభివృద్ధికి వచ్చాడు. ఆచీడ పేలుపడ్డ మట్టికారే గుడ్డలస్థానంలో తెల్లని చారలచొక్కా, చారల పైజామా వేసుకొంటున్నాడు. ఈ ప్రాంతంలో అందరికంటే పెద్దసాహుకారు అతనే! టికరీశాహామురాద్, రంగపుర్, ఝుంగడ్ బరియాని మొదలైన గ్రామాల్లోని రైతులు ఎంతో మందిఅతనికి ఋణస్థులు! ఈమొత్తం ప్రాంతంలో అతనికి అనేక చోట్ల భూములు వున్నాయి. అతని స్వగృహం, టికరీషాహామురాద్‌లో, దక్షిణదిశగా విస్తృతమైనవలయంలో కట్టించబడ్డది. ఊరంతటిలోకీ ప్రత్యేకం అది! ఎత్తైన ప్రదేశంలో కట్టించడంవల్లనూ, ఇంటి కప్పుమీద విలువైన తెల్లని రేకులు పరచడంవల్లనూ ఎంత దూరానికయినా మెరుస్తూ ప్రత్యేకంగా కనిపిస్తూవుంటుం దా గృహం! మొదట అతను ఈ ప్రాంతానికి ఉప్పు అమ్మడానికి వచ్చాడు. ఈ ప్రాంతంలో పుగాకు ఎక్కువగా ఖర్చు అగునని ఎవరో అన్నారు అతని తోటి. అప్పటినుంచీ ఉప్పుతోపాటు పుగాకుకూడా తీసుకురా

సాగాడు. వాటిలో బాగా లాభం కనుపించింది. ఉప్పు తగ్గించాడు క్రమేణా బట్టలూ గాజులూ, బెల్లం ఇలాంటివికూడా తీసుకురా సాగాడు. తరువాత నంబర్ దార్ ఇలమ్‌దీన్ కొట్టు పెట్టుకోమని ఇప్పుడున్న స్వగృహస్థలాన్ని దానంచేశాడు. మొదట చిన్న పూరిగుడిశ. ఇప్పుడు గట్టికొంప వేసుకొన్నాడు. ఈ మధ్యలోనే పోకోహోరా గ్రామంనుండి గోమతిని తెచ్చుకుని వివాహం ఆడాడు. ఇప్పుడు గోమతికి నలుగురు పిల్లలు. వ్యాపారం, స్వంతయిల్లు, భార్యాపిల్లలు అన్నీ కలిగాయి అతనికి. ప్రతిగ్రామపు రైతులూ కొద్దోగొప్పో అతనికి ఋణపడే వున్నారు. అలాగే ప్రతిగ్రామంలోనూ అతనికి కొద్దోగొప్పో భూమి వున్నది. ఋణపడివున్న రైతులు ఆ భూమిని అతనికి వుచితంగానే సేద్యంచేసి ఫలితాన్ని ఇస్తూంటారు. ఈ విధంగా అభివృద్ధికి వచ్చిన అతను ఇప్పుడా వెనకటి గాడిదలనుతోలే మీరూ కాదు 'లాలా మీరారామ్' అయ్యాడు. తెల్లని వస్త్రాలను ధరించే నాగరికుడు. శాహమురాద్‌లోని సర్వోన్నత ధనికుడు అన్నిటినీ మించి జాగీర్దార్ రాజా కర్మఆలీగారి విశ్వాసపాత్రుల్లో ఒకడు! వారి దర్బార్‌లో ఒక సభాసదుడు. ఇన్ని కావడానికి అతను ఎన్ని అక్రమాలను చేశాడో చెప్పలేము. తడిగుడ్డలతో గొంతులు కోయడం అతని ఆచారం ముఖం చూపులకు సన్నగా కోలగా సర్పాకృతిలో వుంటుంది. నెత్తిమీద పెద్ద తలగుడ్డ పడగవిప్పిన పామును జ్ఞప్తికి తెస్తుంది. కాని మాటలు మహోతియ్యగా మాట్లాడుతాడు. అతిమంచిని ప్రదర్శిస్తూ వుంటాడు. మనిషిని ఒక్కసారి చంపడం అతని నియమానికి పూర్తిగా విరుద్ధం. ఋణగ్రస్థుడు బ్రతికివుండడానికి కావలసిన

ఆహారాన్ని వేస్తూవుంటాడు. నిదానంగా ఆహారాన్ని తగ్గిస్తూ వుంటాడు. ఉచ్చును బిగిస్తూ వుంటాడు. వడ్డీలను కలుపుతూ వుంటాడు. పంటలో భాగాన్ని అధికంచేస్తూ వుంటాడు. చివరకు ఒకరోజున ఆ ఋణగ్రస్తుడు స్వయంగా లాలాను ప్రార్థిస్తాడు "లాలా నా భూమిని నీవు తీసుకో! లేకపోతే విషంతిని చస్తాను" అంటాడు.

లాలా మిూరాషా ఈ మాటకోసరమే ఎన్నో సంవత్సరాలుగా ఎదురు చూస్తూంటాడు. నవ్వుతూ యిలా అంటాడు: "అరె! భూమి నీది! దాన్ని నేనేం చేసుకొంటానోయ్! నా భాగం నాకు యిచ్చేస్తేచాలు! భూమిని నేనేం చేసుకొంటాను. అసలు ఇప్పుడు భూములే మారిపోయినాయి. పంటలే కావడం లేదు! అదికాక ఈ భూములకు ఏం వచ్చిందో భావిలోపడ్డ చేంతాడులా ధరలు ఒకే తీరాన తగ్గిపోతూ వున్నాయి! ఈ ఏడు సంవత్సరాల్లో నువ్వు ఒక్క విత్తులే రెండువందల యాభై రూపాయలని పట్టుకుపోయావు - యాభైరూపాయలకు కేగు పండ్లు, దేవుడు మేలుచేస్తే మూడువందలకు బట్టలు, ఒక యాభైకి చావులో సైన్లూ వగైరాలు తీసుకొన్నావు. కాదు కూడదంటే లెక్క కట్టేస్తాను. నీ యిష్టం చెప్పు!"

పాపమూ ఋణస్థుడు ఒక్కసారిగా హడలిపోయి "లాలా లెఖ్క చూడడం ఎందుకు? నా భూమిని తీసుకో! నీ మాట నాకు నమ్మకమే! చెప్పు ఎక్కడ వేలుముద్ర వెయ్యాలో, వేసేస్తాను!" అంటాడు.

లాలా "మాట" కూడా చాలాచిత్రమైనది. ఈ 'మాట' రైతులు ఇట్టే నమ్మేస్తారు. అసలు రైతుల జీవితమే ఈ 'మాట' మీద ఆధారపడి వున్నది. ఏది చెబుతామో అది చెయ్యాలి.

ఏది అంటామో దాన్ని నిర్వహించాలి! నిరక్షర, దరిద్ర రైతు జీవితాల్లో ఈ విశ్వాసం మాట నిక్కచ్చితనం ఒక ప్రత్యేకత! అందరి మాటల్లా లాలా మిరాషా 'మాట'ను కూడా విశ్వసించడంవల్లనే రైతులు నాశనమై పోతున్నారు. అది రైతుల పొరపాటనడానికి కూడా వీలులేదు. 'మాట' నిజంగా చాలా విలువైనది. భగవత్ స్వరూపం! మాట దేవతా స్వరూపం! మాట దయా స్వరూపం! మాట సౌందర్యం! మాట తపశ్శక్తి! మాటే మానవత్వం! మాట అమర ప్రేమలోని ప్రథమ చుంబనం! మాట సూర్యుడిలోని స్వర్గం! సరోవరంలోని నీల మణి పుష్పం! ఆత్మలో విశ్వాసం! త్యాగంలోని బలిదానం, దేవతల్లోని పవిత్రత: మాట జీవనం; మాట ప్రేమ; మాటల తోడు; హామ్‌లేట్ వేడినిశ్వాస; బేథూవెన్ సంగీతం; శకుంతల కాటుకదృష్టి; మాట బలం; మాట క్రియ; మాట సముద్రపు అల; మాట శాంతి; మాటఇతిహాసపు క్రాంతి.

కాని! 'మాట' పరిశాంతే కాదు, యుద్ధం కూడాను! మంచేకాదు, చెడ్డకూడాను! 'మాట' శ్వాసఘాతం, మాటలు శత్రుత్వం'మాట' తీరని పగ! మాట న్యాయస్థానం; మాట అసత్యం;మాటఅంధకారం, మృత్యువు'మాట'పెట్టుబడిదారుల వికటాట్టహాసం, అనాథ పిల్లల ఏడుపు, చరిత్రలో ఎదురు తిరిగిన వీరసైనికుడు. 'మాట' దుఃఖాంతపు కథలోని శవం, విరహగీతంలోని తుదివస్త్రం, కవిత్వపు సమాధి. 'మాట' పరిశ్రమేకాదు దోపిడీకూడాను! 'మాట' రైతేకాదు. 'మాట' మిరాషా కూడాను!

కాని, అతి ప్రాచీనమైన దాస్యశృంఖలాలలో బంధింపబడిన రైతు మాటకు చాలా విలువ యిస్తాడు. పూజ్య

మైనదిగా భావిస్తాడు. ఈ భావనసే, ఈ విలువనే మిరాశా అనుచితంగా వాడుకుంటాడు. ఈ మాట విశ్వాసంతో రైతుల చేత తన ఖాతాపుస్తకాల్లో వేలుముద్రలు వేయించుకొంటాడు. రైతులు కండ్లుమూసుకొని వేసేస్తారు. మరి వెయ్యకపోతే మాటను తిరస్కరించినవారవుతారు! ఇక మిరాశా ఇష్టం! ఆ వేలుముద్రక్రింద ఇష్టంవచ్చినట్టు దొంగలెఖ్ఖలు రాస్తాడు. రైతులు కిక్కురుమనకుండా తమ పొలాలనూ, ఎద్దులనూ, మేకలనూ, బండ్లనూ, నాగండ్లనూ—అప్పుక్రింద కట్టేస్తారు! మరి కట్టకపోతే మాటతప్పిన వారవుతారు! మాట ధర్మం, కనుక ధర్మాన్ని తప్పిన వారవుతారు. ఇహలోకంలో నాశనం అయితే అయ్యారు; పరలోకం నిలిచింది! బండ్లూ ఎద్దులూ పొలాలూ – బొట్రలూ పోతేపోతాయి. మిరాశా అప్పు తీర్చిన వారయినారు. మర్యాద దక్కింది; అంతేచాలు!

ఇంటి దగ్గిర గట్టును ఎక్కుతూ లాలామిరాశా ఇలా ఆలోచించాడు "ఈ మర్యాదకూడా చాలా విచిత్రమైనది! ఈ మర్యాదను దక్కించుకోవడానికి రైతు తన సర్వస్వాన్నీ హోమంచేస్తాడు. ఎద్దులూ బండ్లూ—పెళ్ళాం బిడ్డలూ సర్వాన్నీ త్యజిస్తాడు. ఈ మర్యాదకోసరం!" లాలామిరాశాకు అతని భార్య ప్రవర్తన జ్ఞాపకానికి వచ్చింది. గోమతి నలుగురు బిడ్డల తల్లి అయింది. అయినా ఎప్పుడూ సింగారించుకొని కూర్చుంటుంది. ఎప్పుడూ లాలామీద దాష్టీకం చేస్తూ వుంటుంది. మొదటిలో గోమతి ఇంత బరి తెగించలేదు. ఇంటిలోనించి బయటికి వచ్చేదికాదు. బహు సిగ్గుపడే స్వభావంకలది. ఎంత మమతతో అతని వంక చూసేది! ఆ రోజులు ఎంత మంచివి! మిరాశా గట్టిగా నిట్టూర్చాడు. ఒకపూటు

ఆవులించి తిరిగి ఆలోచించసాగాడు. అతనికి, తాహసీల్‌దార్ రంగపుర్ తగాదాలో భూమి తన కయ్యేట్లుగా ఇచ్చిన తీర్పు జ్ఞాపకానికి వచ్చింది. తహసీల్‌దారు రంగపుర్ తగాదాను విచారించడానికి వచ్చి అతని ఇంటిలోనే బసచేశాడు. ఆ తరు వాత ఏ పెద్ద ఆఫీసరు వచ్చినా, అతని ఇంటిలోనే బసచేస్తూ వుండేవారు. రాను రాను గోమతిలో విచిత్రమైన మార్పులు జరుగుతూ వచ్చినాయి. దాని సిగ్గంతా ఎక్కడ మాయ మైందో? ఎప్పుడూ నిర్లజ్జగా ఆఫీసర్లతో నవ్వుతూ మాట్లాడు తుంటుంది. అతన్ని ఎప్పుడూ హేళన చేస్తూవుంటుంది. థానే దార్ హాశమత్ అల్లాబేగ్ ప్రతి పదిహేను రోజులకూ, ఏదో ఒక విషయంగా, తప్పనిసరిగా టికరీశాహామురాద్‌కు వస్తూ వుంటాడు. వచ్చినప్పుడల్లా అతను నవ్వుతూ లాలాతో ఇలా అంటాడు "లాలా, మీవూరి వాళ్ళు మహా చెడ్డవాళ్ళు, నన్ను ఎప్పుడూ నెలకు రెండుసార్లయినా, ఇక్కడికి రప్పించి, నీకు అతిథిగా వుండేట్టు చేస్తారు!" హాశమత్ అల్లాబేగ్ ప్రతి నెలా రెండు సార్లు దాదాపు 20 క్రోసుల దూరాన్నించి వస్తూవుంటాడు; ఈమాట అనటానికే అన్నట్టు!

అతను చేతులు జోడించి నమస్కరిస్తూ "సర్కార్! మీదే ఈ ఇల్లు! మీకు అభ్యంతరం ఏముంది!" అంటాడు.

గోమతి పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతూ అంటుంది. "సరే, వూళ్ళోకి వెళ్ళి ఆసామీ దగ్గర నైనా ఒక కోడిని పట్టాలి! థానేదార్ సాహెబ్ వచ్చాడుగా, వీరికి చక్కగా ఆతిథ్యం ఇవ్వాలి! వూం వెళ్ళు ఏమిటలా నిలబడి నాముఖం లోకి చూస్తావు; గుడ్లగూబలా!

తరువాత మీరాషా గోమతి ధరించిన సన్నని వల్లె మీది జల్తారు అంచును చూస్తూ అక్కడినుండి వెళ్ళిపోతాడు. వెళ్ళుతూన్న అతనికి థానేదారూ గోమతీ కలిసి నవ్వేనవ్వులు వినపిస్తాయి. లాలామీరాషా మనస్సు ఎందుకో చివుక్కుమనేది!" ఆ నవ్వులు అలా కలవకుండా వుంటే ఎంత బాగుండేది!" అనుకునేవాడు మనస్సులో: మళ్ళీ తనకు తనే సమాధానం చెప్పుకునేవాడు. "ఈ లోకంలో అన్నీ ఎవరికిమాత్రం దొరుకుతాయూ? ఏవో కొన్నింటిని...అయినా!"

ఆ అర్థరాత్రి లాలామీరాషా ఇలా తన జీవితపు గతాన్ని తలచుకొంటూ స్వగృహాన్ని చేరుకొన్నాడు. ఇంటికి ముందున్న గేటును తోసుకొని మెల్లాలో కాలుపెట్టేసరికి ఎదురుగా చెట్టుకు కట్టబడ్డ థానేదార్‌గారి గుర్రం సకిలించింది. లాలామీరాషా ఇలా అనుకొన్నాడు. 'అయితే హాశమత్ వచ్చాడన్నమాట!' అతని నుదురు ముడతలు పడ్డది. ప్రాంగణాన్ని వదిలి వరండామెట్లను ఎక్కుతూ మెట్టులేనిచోట కాలు వేసి క్రిందపడే పర్యతం అయి తప్పించుకొన్నాడు!

ఎవరో పెద్దగా కేకవేశారు. "ఎవరది?"

మీరాషా గర్జించాడు "నువ్వెవరు"

"అరె...కనపడటంలేదుటోయ్! నేను థానేదార్ సాహెబ్‌గారి సిపాయీని!– నువ్వెవరు?"

"నేను లాలాని!"

"అరె...ఓ...హో...హో...నువ్వు లాలావా! ఆ సిపాయి నవ్వసాగాడు. "క్షమించండి, లాలాగారూ! నేను ఇంతకు క్రితం మిమ్మల్ని ఎన్నడూ చూడలేదు. అందువల్ల గుర్తించలేదు! మీ పేరును మాత్రం చాలాసార్లు విన్నాను

లెండి! ఐతే మీరు లాలామీరాషా అన్నమాట? లాలా మీరాషా! ఒరేయి, మిత్రులారా!" అతను ఇతర సిపాయీలను పిలచి "కొంచెం చూడండిరా! ఈయనగారు లాలా మీరాషాట! లాలామీరాషా! ఓ... హో... హో....."

చీకటిలో చాలా ఆకారాలు లాలాను చుట్టుముట్టినాయి ఆ సిపాయీల నులువెచ్చని శ్వాసలు ముఖానికి తగిలినాయి. వాళ్ళమాటలు, నవ్వులూ ఆ నవ్వులలోని పరిహాసం ములుకుల్లా గుచ్చుకున్నాయి గుండెల్లో! సిపాయీలందరూ అతనికి చుట్టూ వలయాకారంలో నిలబడి నవ్వుతున్నారు. అతన్ని లోనికి పోనివ్వడం లేదు.

లాలా అన్నాడు "నన్ను లోపలకు పోనివ్వండి!"

"ఇప్పుడు మీరు లోపలకుపోయి చేసేది ఏమున్నదండి లాలాగారూ! అమ్మగారు ఎప్పుడో నిద్రపోయి వుంటారు!"

"సరే, అయితే కళ్ళాల్లో రైతుల పరిస్థితి ఏమిటి? ఏవరో తుపాకి పేల్చిన శబ్దం వినపడ్డది! ఏమిటది?" ఒకడు అడిగాడు.

"నేనూ మీలాగానే విన్నాను. ఎందుకుపేలిందో నాకు తెలియదు. తొందరగా వచ్చేశాను!" లాలా అన్నాడు.

"రాజాకర్మఆలీగారు మమ్మల్ని సాయానికి పిలిపించారు. రేపు ఉదయంలోపు రైతులు ఏదైనా గందరగోళం చేయవచ్చు! - ఈసారి కొంచం చేతులకు పని తగులుతుంది. ఒక్కడితలైనా పగులగొట్టి నెలలు గడిచిపోయినాయి. భలే మజాగా వుంటుంది! ఇంతవరకూ వూరికే కూచ్చుని దండుగ తిండి తింటున్నాము!" మరొకడు అన్నాడు.

ఇంతలో ఒకసిపాయి ఇలా అన్నాడు. "అరె పాపం లాలాగార్ని లోపలికి పోనివ్వరా! అర్ధరాత్రి దాటింది. అలసి సొలసి వచ్చారు!"

అదేసమయంలో లోపలనుంచి వరండాలోకి వచ్చాడు హాశమత్.

"నమస్కారమండీ లాలాగారూ!"

లాలా రెండుచేతులూ కలిపి నమస్కరించాడు.

"అమ్మగారు నువ్వు రాలేదని చాలా హడలిపోతున్నది. నేను ఇప్పటివరకూ కూర్చుని ధైర్యవచనాల్ని చెబుతున్నాను. పో. పో. లోపలికి వెళ్ళు. నిన్ను చూస్తేనన్నా ఆమెకు కొంచం ధైర్యం చిక్కుతుందేమో !"

మీరాసా లోపలికి పోయేసరికి నలుగురు పిల్లలూ క్రిందపడి నిద్రపోతున్నారు. అమ్మగారు నఖశిఖ పర్యంతం అలంకరించుకుని మంచంలో పడుకుని వున్నది. సారాయివాసన గుప్పున కొడుతున్నది గదిలో !

లాలామీరాసా దగ్గిరకు రావడంచూసి గోమతి అన్నది.

"నాతల విపరీతంగా నెప్పిపుడుతున్నది!" గోమతి మరేమీ మాట్లాడకుండా గోడకు ముఖంపెట్టి, లాలావైపు వీపు వచ్చేట్టుగా తిరిగి పడుకున్నది.

లాలామీరాసా మరొకఅడుగు ముందుకు వేశాడు. అతని కాలికి ఏదో తగిలినట్టయింది. తీసిచూస్తే అది హాశమత్ రివాల్వర్ ! అతను చాలాసేపటివరకూ రివాల్వర్‌ని పట్టుకు నిలబడి వున్నాడు. తరువాత మెల్లగా తిరిగి వరండాలోకి వెళ్ళాడు. వరండాలో హాశమత్ ఇంకా నిద్రపోలేదు. అత్యంత

నమ్రమైన స్వరంలో లాలా ఇలాఅన్నాడు. "మీ రివాల్వర్ ఇదిగో!"

## 5

లాలా మంచంలో పడుకున్నాడు. ఎంతప్రయత్నించినా నిద్రపట్టడంలేదు. అనేకరకాలుగా ఆలోచనలు పోతున్నాయి. ఇది రివాల్వర్! చాలా వుపయోగకరమైన వస్తువు, జీవితంమీద విసుకుపుడితేనా కణతకు గురిపెట్టుకోవచ్చు! గోమతి గుండెలను చీల్చి దాన్ని ఈ కుత్సిత జీవితాన్నుంచి విముక్తం చేయవచ్చు. హాశమత్ నవ్వును శాశ్వతంగా నాకు వినిపించకుండా చేసుకోనవచ్చును! కాని ఈ రివాల్వర్ ఇవ్వాళ ఇన్నింటిలోనూ ఏ ఒక్కపనీ ఎందుకు చేయలేదు? అంతేకాదు. లోకంలో అనేకం సంభవం అవుతున్నాయి. ఉదాహరణకు నా భార్య వున్నది. ఇక్కడికి థానేదారు నెలకు రెండుసార్లు వస్తున్నాడు. ఇలాంటివే అనేకం జరగడానికి వీలున్నది. కాని, రివాల్వర్‌తో ఒక్కపనీ జరగదేం?—అర్థంలేనివన్నీ పూరకా అనవసరంగా పెరుగుతూ వుంటాయి. డబ్బూ, ధనమూ, భూమీ, యిట్లూ, మేకలూ, గొర్రెలూ, గుర్రాలూ అన్నీ పెరుగుతున్నాయి. కాని, తనహృదయంలో ఏదో వస్తువు అతిత్వరగా తరిగిపోతున్నది. ఆ వస్తువు తనహృదయంలోనుంచి పూర్ణంగా లుప్తమైన క్షణాన తన ప్రాణవాయువులే గాలిలో కలసిపోవచ్చు! తను పోయాక గోమతివుంటుంది. హాశమత్ వుంటాడు. వాళ్ళు ఇద్దరూ కలిసి నవ్వే నవ్వు వుంటుంది!

లాలా మీరాసాకు కణతలు నెప్పిపెట్ట సాగినాయి. చెవులు గింగురు మనసాగినవి. అతనిబుర్ర అంతకంతకూ విస్తృత

తమై భూవలయమంతటినీ వరుచుకొన్నట్లవుతున్నది. అతనికి తిరిగి తన వెనకటి జీవితం జ్ఞాపకానికి రాసాగింది. తనా వెనకటి 'గాడిదలను తోలే మీారు!" ఏ! గాడిదలను తోలు కొంటూ చెవులమీాద చెయ్యి వేసుకొని 'చనా్న' గీతాల్ని ఆలాపిస్తూ ఒక అడవినుండి మరొక అడవికి తిరుగుతున్నాడు. తనగుడ్డలు మాసివున్నాయి. తనతల్లో పేలుపడి తన పెదవుల మీాద పర్శ్రిశము అనే గంగాజలంతో శుద్ధిచేయబడిన నిమ్మ పట, పవిత్ర చిరునవ్వు వున్నది...!

లాలా విపరీతంగాగాభరాపడ్డాడు "కాదు...కాదు... మీారూ చచ్చిపోయాడు. ఇప్పుడు నేను మీారాషాని! ఇక నేను ఎన్నటికీ చకవాల్ ప్రాంతానికి ఆ కుగ్రామానికి పోను! నేను ఇక్కడే వుంటాను... ఈ ప్రాంతపు భూములన్నిటినీ వేలాం వేయిస్తాను... జాగీర్దారునుకూడా ఋణగ్రస్తుడిని చేస్తాను... అప్పుడు నేనే స్వయంగా జాగీర్దార్ నవుతాను... ఈ హాశమత్ గాడిని చెప్పుతీసుకు కొడతాను!

బయట సిపాయిలూ ఏదోవిషయంమీాద పెద్దపెద్దగా నవ్వుతున్నారు. లాలామీారాషా తను పడుకున్న గది కిటికీ తలుపుల్ని విసురుగా మూసివేసుకొన్నాడు. గోమతి పట్టలేని కోపంతో పెద్దగా అరిచింది. "కనపడలేదా? నేను తలనెప్పిగా వుండి ఇక్కడ పడుకుంటే అలాగోల చేస్తావేం! మర్యాదగా పడుకుంటావా పడుకో, లేదా వెళ్ళి వరండాలో పడుకో!" అన్నది.

లాలా కోపంతో మండిపడుతూ పక్కనెత్తుకొని వరండాలోకి వచ్చాడు. అతన్ని చూడగానే సిపాయిలు మరీ పెద్దగా నవ్వసాగారు.

శౌనక్ అన్నాడు "మిత్రమా, అమ్మగారితో పోట్లాటి నట్టు వున్నాడు!"

గులామ్‌సాబర్ అన్నాడు "అరేయి, పాపం లాలా ఒక ఆవులాంటివాడు౹రా !"

శౌకత్ అన్నాడు "మరి కాకపోతే ఏమనుకున్నావు ? మరొకడైతే ఈ సరికి చెప్పుదెబ్బలు తిని ఈ జాగీర్నించే వెళ్ళి పోయేవాడు. ఇంతవరకూ ఇక్కడ నిలిచాడంటే అది అమ్మగారి ప్రభావమే! నిజంగా ఎంత తెలివికల దనుకున్నావు? ఆకారమో! ఓహో...ఆకారానికి... తగిన మధురవాక్కు టిమ! ఆమెను ఒకసారిచూసి, ఒక్కక్షణం మాటాడితేచాలు మనిషి ఇట్టేవశ్యుడైపోతాడు! ఏంయ్ లాలా! ఇలాంటిభార్య దొరికినందుకు సంతోషించవయ్యా! ఈమొకసక, ఆఫీసర్లందరికీ ఎలా ఆతిథ్యాన్ని ఇవ్వాలో తెల్సుకొని సక్రమంగా ఆతిథ్యాన్ని ఇస్తున్నది: మరొకఆమె అయితే ఈసరికి దివాలా తీసేవాడివి!"

శౌకత్ రామపుర్ గ్రామపు పఠాను అక్కడ ఒకడిని ఖూనీచేసి పరారీఅయి జాగీర్దార్‌గారి కొలువులో సిపాయీగా చేరాడు. అతను చాలా మాటకారి...అతనిలో చాలా ప్రత్యేక తలు వున్నాయి. అందువల్లే జాగీర్దార్‌గారు వాడిని ఇంగ్లీషు ప్రభుత్వానికి వప్పచెప్పకుండా తనదగ్గిర వుంచుకొన్నాడు. ఎవరి నైనా చంపడమన్నా, ఖూనీ చేయడమన్నా శౌకత్‌కు మహా సరదా! మానవశరీరాన్ని చీల్చి పేగుల్ని బయటికి లాగడం లోనూ, లేక శరీరంనుండి తలల్ని వేరుచేయడంలోనూ అతనికి ప్రత్యేకమైన నేర్పువున్నది. మనిషిప్రాణాన్ని హరించడం అంటే అతనికి చిటికలు వేసినంత చులకన. నవ్వుతూ హరిస్తాడు. తరు వాత ఏమీ ఎరగనట్టు మంచంలో పడుకుని గురకలు పెట్టే

స్తాడు. ఈ శౌకత్ అంటే లాలామీరాషాకు చెడ్డ భయం. కాని ఏం చేయగలడు? శౌకత్ థానేదార్ అల్లాబేగ్‌కు ఆత్మగత సిపాయీలల్లో ఒకడు. అల్లాబేగ్ ఎక్కడవుంటే శౌకత్ కూడా తప్పనిసరిగా అక్కడ వుండితీరాలి!

వూరు చాలా పల్లంలో వుంది. మీరాషా నివాసం ఎత్తైన ప్రదేశంలో కావడంవల్ల అక్కడినుండి చూస్తే వూరంతా దివిటీలతో నిండినట్లు కనుపిస్తున్నది. దివిటీలు వెలుగుతున్నాయి ఆరిపోతున్నాయి. వూరివైపునించి ఒకటే రొద వినవస్తున్నది. ఏడుపులు అరుపులు—కేకలు! సిపాయీల గర్జనలు! కాసేపు అన్నీ స్తంభించి నిశ్శబ్దం అవుతుంది. కాసేపు స్వరంపెరిగి చెవులు దిబ్బెడలు పడతాయి. దివిటీలు నాలుగువైపులా తిరుగుతున్నాయి; ఇళ్ళమధ్యా కళ్ళల్లోనూ, గొందుల్లోనూ! ఒక కళ్ళంనుంచీ, మరొక కళ్ళానికి, ఒక ఇంటినించి మరొక ఇంటికి: ఈక్రమం కొంతసేపటి వరకూ నడిచింది చివరకు ఆఖరుసారిగా దక్షిణపు పల్లంలోనికి ఒక్కసారి దివిటీలన్నీ వెలిగి ఆరిపోయినాయి.

శౌకత్ నవ్వి ఇలా అన్నాడు "అది ఫతేహ్‌దీన్ కళ్ళాం అయివుంటుంది. ఇక పడుకుందాం పదండి. ఇవ్వాలిటి పని పూర్తిఅయింది. మిగిలింది రేపు చూసుకొనవచ్చును!"

# 6

ఫజుల్‌కు స్పృహ తెలిసేసరికి తను ఇలమ్‌దీన్ కళ్ళాంలో తాళ్ళతో కట్టివేయబడి వున్నాడు. తనతోపాటు వూరి రైతులు ఒకముప్ఫై నలభైమందికూడా తాళ్ళతో కట్టివేయబడి వున్నారు అక్కడే! తెల్లవారింది. అయినా టికరీగాస్త్రి మవు

నాలుగువైపులా కోట మంచుపట్టి వున్నది. తాళ్ళతో కట్టివేయబడ్డ రైతులు చలికి వళ్ళు కొంగర్లుపోయి, పోట్లు పుట్టడంవల్ల విలవిల్లాడుతున్నారు. చలి కరిగినమంచు ప్రవాహంలా ముక్కుల గుండా, చెవులగుండా శరీరాల్లోకి పోయి రక్తాన్ని ఘనీభవింపచేస్తున్నది. శ్వాసనుస్థంభింపచేస్తున్నది. మాంసాన్ని స్పర్శాజ్ఞాన రహితం చేస్తున్నది. రైతులకు మృత్యుసదృశ్యమైన ఆ చలి నుండి రక్షింపబడడానికి ఒకే ఒక్క సాధనం వున్నికంబళి! రైతుల వద్దనుండి వున్నికంబళ్ళను లాక్కున్నారు సిపాయీలు. రైతులు చలికి తాళలేక అరుస్తున్నారు. కేకలు పెడుతున్నారు. ఫజల్ కండ్లుతెరచి ఈ పరిస్థితిని చూశాడు. ఇలా అనుకొన్నాడు "ఇంకా సూర్యోదయం కావడానికి చాలా ఆలస్యం వున్నది. ఎక్కడి నించయినా చలికాచుకోను నిప్పు దొరికిందా సరవాలేదు. లేకపోతే ఈచలికిచెవులూ, ముక్కులూ, చేతుల వ్రేళ్ళూ కరిగి వూడి క్రిందనడినా పడవచ్చును. అయినా తను మిగిలిన రైతుల్లాగా భయపడి కేకలువేయడు. నిప్పు ఇవ్వమని ప్రాధేయపడడు!" ఫజల్ గట్టిగా ఒకమాటు పండ్లు కొరుక్కున్నాడు. తనకు వేసిన కట్లను తెంపుకోవడానికి వూపిరి బిగబట్టాడు. బుజంమీది కండలు వుబికినయ్. కట్ల తాళ్ళు మాంసంలోకిచొచ్చుకొని పోయినాయి. ఛాతీవూర్తిగా విస్ఫృతమైంది. మెడమీదినరాలు చాంతాళ్ళలాబికినయి ఒక్క వూపు...! మరొక్క వూపు...! మరొక్కవూపు...! ఫజల్ శరీరమంతా చమటతో తడిసిపోయింది-కాని కట్లు తెగలేదు. అవి గట్టిగా కట్టబడినయి. అతని వుబికిన కండలు తిరిగీ తగ్గిపోయినాయి. విస్తృతమైన ఛాతీ తిరిగీ కుంచించుకొన్నది, చాంతాళ్ళలా వుబికిన నరాలు తిరిగి యథాస్థితికి చేరినవి. ఇప్పటి

వరకూ ఫజల్ క్రిందిపెదిమ పై పండ్లతో నొక్కి పెట్టబడే వున్నది. క్రమేణా పండ్ల బిగుతు తగ్గింది. క్రింది పెదిమ ముక్తి నొందింది. అతని తల ఒక ప్రక్కకు వ్రాలిపోయింది!

అల్లాదాద్ పెద్దగా నవ్వి అన్నాడు. "ఫజల్! నిన్ను తాళ్ళతో నేనోయ్ కట్టివేసింది!"

కండ్లు మూసుకొని పడివున్న ఫజల్ ఒక కంటిని తెరచి అల్లాదాద్ వంక చూశాడు. అల్లాదాద్ ఆరు అడుగుల స్నర ఎత్తు గలిగి దానికి తగిన లావూ పుష్టి కల బలిష్టుడైన వ్యక్తి! మహా బలిష్టుడు! మహా సాహసికుడు! మహా నిర్ద యుడు! మహా క్రూరుడు! ఫజల్ తనలో తనే అనుకొన్నాడు "శరీరం లావుగానే వుంది. ఈ కట్లువిప్పితే ఒక్కసారి కలియ పడి చూస్తాను. ఎంత బలంవుందో! ఒక్కసారి కట్లువిప్పితే ఎంత బలంవుందో చూస్తాను...ఎంత బలంవుందో...!" ఫజల్ తిరిగి కండ్లు మూసుకొన్నాడు.

రహమాన్ బాలక్‌రామ్ బరకత్....అందరూ అరుస్తు న్నారు! కేకలు పెడుతున్నారు! ఏడుపుస్వరంలో "శెగ కాచు కోను నిప్పయినా ఇవ్వు, లేకపోతే మాకంబళ్లైనా మాకివ్వు!" అంటున్నారు.

"అదీకాకపోతే మా కట్లు విప్పమంటావా?" అల్లా దాద్ పెద్దగా నవ్వాడు. అతనితో పాటు ప్రక్కన వున్న సిపాయీలుకూడా నవ్వారు.

దూరంగా కళ్ళానికి రెండవవైపునుండి నంబర్‌దార్ ఇలమ్‌దీన్ ఒక గొంగళీని చేతిలో పట్టుకుని వస్తున్నాడు. చలికి వణుకుతూ, మెడను విషాదంగా ఒక ప్రక్కకు వగగవేసుకుని, వస్తున్న అతని కండ్లలో ఒక్క క్షణకాలంపాటు రైతుల ఈ

దురవస్తకు కృత్రిమమైన హాస్యం గోచరించి వెంటనే అదృశ్యం అయింది. ఇలమదీన్ తలవూగిస్తూ శోకపూరిత స్వరంలో ఇలా అన్నాడు! "అల్లాదాద్‌గారు! వీళ్ళు మావూరి రైతులు. మరీ బాధ పెట్టకండి. కొంచం దయచూపండి. నామాట విని ఆ కట్లు విప్పేశేయండి!"

"ఎలా విప్పమంటావు? వీళ్ళు జాగీర్దార్‌గారి వంతునే ఎగెయ్యాలని చూస్తున్నారు!" అల్లాదాద్ అన్నాడు.

ఇలమ్‌దీన్ కృత్రిమమైన అమాయకత్వాన్ని ప్రదర్శిస్తూ "ఎవరన్నారండి మీతో అలాగని? ఇలాంటి అపవాదుని ఎవరో గిట్టనివాళ్ళు వేసివుంటారు! మేము జాగీర్దార్‌గార్కి ఎప్పుడూ భృత్యులమే! మా తాత తండ్రుల దగ్గరనుండి జాగీర్‌దార్‌గార్కి పాలు చెల్లిస్తున్నాం; ఏనాడైనా ఎదురుతిరిగి ఎరుగుదుమటండీ? జాగీర్దార్‌గారి మేళ్ళు మర్చిపోగలమా? ఏం రహమాన్...అవునా...కాదా?"

రహమాన్ తలఎత్తకుండానే ఏడుపుస్వరంలో మెల్లగా సమాధానాన్ని ఇచ్చాడు. "కొంచం నిప్పుతెచ్చిపెట్టు శగ కాచుకోను! లేకపోతే చలికి చచ్చిపోతాను!"

ఇలమ్‌దీన్ అన్నాడు. "అరె...నిప్పుకేం భాగ్యమోయ్. ఇప్పుడే వస్తుంది! మొదట నా మాటకు సమాధానాన్ని ఇవ్వు; మనం ఎన్నడైనా జాగీర్దార్‌గారి పాలు ఎగేశామా? కనీసం ఎగెయ్య చూశామా?"

రహమాన్ కొద్దిక్షణాలపాటు, మెదలకుండా వూరుకుని యిలా అన్నాడు. "ఇలా జాగీర్‌దార్‌గారికి పాలు ఇవ్వకుండా వుండడం మంచిదికాదు అని. నేను మొదటినుంచీ చెబుతూనే వున్నాను. దీని పరిణామంకూడా బాగా వుండదని చెప్పాను.

కాని, వాళ్ళు ఒప్పుకోలేదు! నానరకూ నేను ఎప్పుడూ జాగీర్దార్‌గార్కి పాలు ఇవ్వడానికి సిద్ధం! కాని. నా...!"

ఇలమ్‌దీన్ మధ్యలోనే అందుకొని పెద్దగా అన్నాడు "విను...విను...నేను చెప్పడంలా?ర హమాన్‌ని నేను బాగా ఎరుగుదును! అతని కొడుకునికూడా ఎరుగుదును...నేను చెప్పడంలా? అరె...వీళ్ళు యిద్దరూ, నిజంగా ఏం చెప్పనూ? ఇలమ్‌దీన్ అల్లాదాద్‌వంక ఓరగంట చూసి "తాళ్ళువిప్పండి! ఇదిగో అల్లాదాద్‌గారూ! మీ కేమీ మాటరాదు విప్పండి... వీళ్ళు సొంతం మన అన్నదమ్ముల్లాంటివాళ్ళు!" అన్నాడు.

అల్లాదాద్ అతని సిపాయీలు రహమాన్‌వీ బరకత్‌వీ కట్లు విప్పేశారు. ఇలమ్‌దీన్ వాళ్ళను త్వరగా తన కళ్ళంలోకి తీసుకుపోయి శగకాచుకోవడానికి నిప్పు ముట్టించి యిచ్చి, కంబళ్ళను కప్పాడు.

దూరంగా కట్టివేయబడిన మిగిలినరైతుల అశ్రుపూరిత నయనాల్లో చలిమంట తాలూకు జ్వాలలు ప్రతిఫలిస్తున్నాయి. మంచుతో మిళితమై కరిగిపోతున్న కపోలాలమీదకూడా ప్రతిఫలిస్తున్నాయి. వాళ్ళు చలికి అటూ ఇటూ దొర్లినప్పుడల్లా మంచు నలువైపులనా సుద్దలా అంటుకొని ప్రతిమనిషీ ఒక్కొ మంచుసుద్దలా కనుపిస్తున్నాడు. వీళ్ళకు మృత్యువు అతి సమీపంలో నున్నది. వీళ్ళవైపుకు వీపుపెట్టి చలిమంట దగ్గిర శగ కాచుకుంటున్నారు రహమాన్ బరకత్‌లు!

తరువాత ఇలమ్‌దీన్ బాలక్‌రాం బ్రాహ్మణి దగ్గిరకు వచ్చి అత్యంత నమ్రస్వరంలో ఇలా అన్నాడు: "మరి బాలక్‌రాం! నీవేమంటావు? అరె...అదికాదయ్యా, నీవు కథా పురాణాలు చెప్పుకొనే బ్రాహ్మడివికదా...నీకు ఎందుకీ రభస

చెప్పు ?...మనవ్రాళ్లో నీవు ఒక్కడివే బ్రాహ్మడివి మిగి లావు...నీ కూతురు పెద్దమనిషికూడా అయింది...నీకెందుకు చెప్పు ఈ గొడవ ?"

బాలక్ రాం నగంసవ్చి ఏడుస్తూ ఇలా అన్నాడు "నా కట్లుకూడా విప్పించు !"

ముసలి గులాంనబీ ఛీత్కరించాడు. "అల్లాదాద్ ! నాకట్లుకూడా విప్పించవోయ్ ! పిల్లా పాపా కలవాడిని...భగ వంతుడు నీకు మేలుచేస్తాడు !"

ఈ విధంగా కొద్దిసేపట్లోనే పది పదిహేనుమంది రైతులు తమ కట్లను విప్పించుకొన్నారు. ఇలమ్దీన్ కళ్ళం లోకి పోయి చలి కాచుకోసాగారు. ఇలమ్దీన్ వారందరికీ మొక్కజొన్న కండెలను ఏరిఏరి యిస్తున్నాడు; మొక్కజొన్న కండెలతోపాటు వుపదేశాలను కూడా ఇస్తున్నాడు ! "అరె... ఇలా ఎదురుతిరిగినందువల్ల ప్రయోజనం బొత్తిగా లేదోయ్ ! సర్కారు చాలా బలంకలది...మనమో నిర్బలులం. మహా రాజుగారు జాగీర్దారుగార్ని వన్నులు డసూలు చేసుకురమ్మని పంపించారు. వీరితోపాటు ఒక పటాలంకూడా వచ్చివున్నది. పైగా ప్రక్కనవున్న పోలీసు కచేరీలనుంచి కూడ సైనికసహా కారం వస్తుంది అలాంటప్పుడు మనం ఎదురుతిరిగిమాత్రం ఏంచెయ్యగలం ? ఇలాంటి సందర్భంలో బుద్ధిమంతుడు చేసే పని...సర్కారువారిభాగాన్ని వెంటనే ఇచ్చేశెయ్యడమే!"

సర్కారుభాగాన్ని చెల్లించడానికి చాలామంది రైతులు ఒప్పుకొన్నారు ! కాని కొంతమంది మాత్రం ఒప్పుకోలేదు. కొంతసేపటికివాళ్ళల్లో ఆకొంతమందికూడానీళ్ళుకారిపోయారు. బాగా ప్రొద్దు ఎక్కింది. దాదాపుగా పదిగంటలు కావచ్చింది.

హాశమత్ అల్లాబేగ్ ఒక పదిమంది సిపాయీలతో శౌకత్‌ను వెంటపెట్టుకుని కళ్ళాల దగ్గిరకు వచ్చాడు. వారివెంట లాలా మీరాషా కూడా వున్నాడు; చేతులకు సంకెళ్ళు వున్నాయి! రైతులందరూ లాలాను సంకెళ్ళలో చూసి ఆశ్చర్యంతో చూస్తూ వుండిపోయారు. ఇలమ్‌దీన్ కూడా ఒక్కక్షణం ఆశ్చర్యంతో నిర్వాకుక్కపడిపోయాడు. కాని మరుక్షణంలోనే అతనిచూపులు లాలా చూపుల్తో కలిసినాయి. ఇలమ్‌దీన్ ముఖంలో సన్నని హాస్యం జ్యోతకం అయింది. అతను మనస్సులోనే లాలా తెలివికి సంతసించాడు.

శౌకత్ నవ్వుతూ ఇలా అన్నాడు. "ఈ లాలాగాడి బుద్ధికూడా భ్రష్టం అయింది. రైతు లందరిలాగానే వీడుకూడా సర్కారుకు భాగం ఈయనంటున్నాడు. వూరంతా ఎట్లో నేనూ అట్లే, వాళ్ళు ఇవ్వకపోతే నేనూ ఈయను – అంటున్నాడు!" అంటూ శౌకత్ లాలామీద ఒక చిన్న దెబ్బ వేశాడు. లాలా దెబ్బ తగలడం ఆలస్యం నేలకు వరిగాడు. ఆ దెబ్బకోసరమే అంతవరకూ నిలబడ్డవాడిలా! పడ్డ లాలాను ఇలమ్‌దీన్ పట్టుకుపైకిలేపి శౌకత్‌ను వుద్దేశించి "అరె... రె...! ఏమిటి మీరుచేసేపని? లాలాగారంటే ఈ ప్రాంతానికి విలువ! వారిమీద చెయ్యిపడితే ఈ ప్రాంతానికే అప్రతిష్ట! కొంచం జాగ్రత్తగా... కనిపెట్టండి...!"

శౌకత్ అన్నాడు "నాదేముంది; నేనొక సాధారణ సిపాయీని! థానేదార్‌గారు ఇతనికి సంకెళ్ళువేసి వుంచమని హుకుం ఇచ్చారు!"

హాశమత్ అల్లాబేగ్ లాలాను మెల్లగా నాలుగైదు దెబ్బలు యిలావేసి అన్నారు. "నేను వీడిప్రాణాలు నిలువునా

తీసేస్తాను! పీడు సర్కారు భాగాన్ని ఇవ్వననేటంత వాడయ్యాడా? ఎవరైనాసరే సర్కారు భాగాన్ని ఎగగొట్టచూస్తే వాడి ప్రాణాల్ని నిలువునా తీసివేస్తాను. లాలా అయినాసరే, లాలా బాబయినాసరే! చెప్పరా, అరేయి,లాలా! ఎగగొడతావా?"

శౌకత్ లాలాను మరొక దెబ్బ వేశాడు.

ఫతహుదీన్ ఒక రైతు. అతనూ కట్లల్లోనే వున్నాడు. అతని కోమలమైన రైతుహృదయం లాలా తింటున్న దెబ్బలను చూడలేకపోయింది. ఎంతవడ్డీ తీసుకొన్నా, లాలా అతనికి ఎన్నో ఆపదసమయాల్లో ఆదుకొన్నాడు. అతని హృదయంలో కృతజ్ఞత పొంగులు వారింది. చుట్టుపట్లవున్న రైతులవంక ఒక మాటు చూసి థానేదార్‌తో ఇలా అన్నాడు. "లాలాగార్ని కొట్టకండి! కావాలంటే, మేమంతా కాదనకుండా సర్కారు డబ్బును చెల్లిస్తాము!"

మిగిలిన రైతులుకూడా ఔనన్నట్టు తల వూపారు.

"అది...ఇప్పుడు మీరు తెలివికి వచ్చారు. ఈ బుద్ధి మొదలే వుంటే?" అంటూ ముందుకువచ్చి స్వయంగా కట్లు విప్పసాగాడు ఇలమ్‌దీన్.

హశమత్ అల్లాబేగ్ ఇలా అన్నాడు: "ఏయ్ లాలా! ఇవ్వాళ ఈ రైతులు నీ ప్రాణాన్ని రక్షించారు! ఈ రైతులే లేకపోతే నిజంగా నా చేతుల్లో చచ్చేవాడివి!"

శౌకత్ అల్లాబేగ్ ఇలా అన్నాడు: "ప్రభూ! ఎందుకండీ అంత శ్రమ! మీ సేవకుని నేను సిద్ధం; నే నున్నవరకూ ఎవరి ప్రాణాన్నయినా సరే, మీరు శ్రమపడి తీయవలసినపని లేదు. నేను తీసేస్తాను!" అని లాలావంక చూసి ఒకమాటు కన్నుకొట్టి, ఇంకా తమ మొండిపట్టును విడవక మంచులో పడి

వున్న ఫజల్ మొదలైన రైతులదగ్గరకు పోయాడు శౌకత్. శౌకత్ ఒక రైతు పక్కటెముకల్లో బూటుకాలితో తన్ని "ఏయ్! ఏమిటి నీ ఉద్దేశ్యం? ఇస్తావా? ఇవ్వవా?" అన్నాడు.

"వుద్దేశ్యం ఏమిటి? ఇవ్వం! అంతే!"

"మరి నీ వుద్దేశ్యం ఏమిటి?" శౌకత్ మరొక రైతు దగ్గరకువెళ్ళి అడిగాడు. అతనిది నల్లని గడ్డం. పేరు సుల్తాన్. సుల్తాన్ అన్నాడు: "ఇదిగో అబ్బాయి ఎవ్వడైనా చావు తప్పదు. ఈ ప్రతిసంవత్సరం చావడం నావల్లకాదు. మీ ఇష్టం ఎప్పుడయినా చేసుకోండి. నేనుమాత్రం రాను!"

శౌకత్ తన బరువైన నాడా బూట్లలో సుల్తాన్ ముఖంమీద రెండుమూడుసార్లు తన్నాడు. సుల్తానుకు పెదాలు పగిలినాయి. నోట్లోనుంచి రక్తం కారసాగింది. శౌకత్ థానేదార్ వైపు తిరిగి ఇలా అన్నాడు "చెప్పండి, మీ ఇష్టం, మీరు గనక 'ఊ' అన్నారా ఒకరిద్దరి తలకాయలను మొక్కజొన్నకండెల్లా ఎగరకొట్టేస్తాను. ఊ... చెప్పండి!" అంటూ సుల్తాన్ తలవైపు సౌంజ్ఞచేశాడు అతను!

హాశమత్ ఇల్లా అన్నాడు "వద్దోయ్ శౌకత్! అంత పనెందుకూ?" వీళ్ళసలు చాలా మంచివాళ్ళోయ్! వప్పుకొంటారు!"

లాలా మీరాసాహెబ్ ముందుకు వచ్చాడు. సుల్తాన్ ఫజల్ మొదలైనవాళ్ళ దగ్గరకు వెళ్ళి. చేతులు జోడించి నమస్కరిస్తూ "ఇచ్చేశయ్యండి! సర్కారుభాగాన్ని యిచ్చేసెయ్యండి!" మీరు యివ్వకపోతే దేవుడిమీద ఒట్టే! కాకపోయినా ఇప్పుడు మీరు మొండిపట్టుపట్టి లాభంలేదు. ఈ

సిపాయీలు మీకు ఇవ్వకపోయినా మీ ధాన్యాన్ని తోలుకు పోతారు... ఉపరి తన్నులు !" అన్నాడు.

ఇంతలో ఠాకూర్ కామాన్‌సింగ్ వచ్చి అందుకున్నాడు. "ఎక్కడికి తోలుకుపోతాము ? ఎక్కడికి తోలుకుపోతాము ! పోగుచేసి యిక్కడే తగులబెడతాము !"

బాగా ప్రొద్దెక్కింది. తెల్లని మంచుతెరగుండా ఎర్ర సూర్యబింబం స్పష్టంగా కనుపిస్తున్నది. టికరీకామాముదాద్‌లో జరుగుతున్న ఈ అకృత్యాన్ని చూడటానికా అన్నట్టు పైకి అధిగమిస్తున్నాడు సూర్యుడు ! వెచ్చని సూర్యకిరణాలు శరీరానికి తాకగానే సుల్తాన్ ఆనందంతో వుప్పొంగిపోయాడు. తన పట్టుదలను దృఢతరం చేసుకొంటూ ఇలా అన్నాడు: "కావాలంటే ప్రాణాలు తియ్యి. అంతేగాని ప్రాణంవుండగా మాత్రం భాగాన్ని పంచం ! ధాన్యాన్ని తగలబెడతానంటావా తగలబెట్టు ! కాని, ప్రాణంవుండగా...ఒక్కగింజను కూడా బయటికి పోనియ్యాం !"

లాలా మీరాషా అన్నాడు:" అరె. నీవు ఎవ్వరికీ ఇవ్వనవుసరంలేదయ్యా ! నీ తరఫున నేను యిస్తాను...అసలు నీ ధాన్యాన్ని కదిలించనే అవుసరంలేదు. ఊ...ఇష్టమేనా ? ఊ...ఇష్టమేనా?" రైతులందరి వంకా ఒకమాటు చూసి ఊ- ఇష్టమేనా ?" అన్నాడు.

చలికి వణుకుతున్న రైతులందరూ ఒక్కమాటుగా నిరుత్తరులైపోయారు. లాలా పన్నిన ఈ పన్నుగడకు రైతులు ఒకరకంగా లొంగిపోయారు. వాళ్ళపోరాటం, ధాన్యాన్ని నిలబెట్టుకోవాలనే వాళ్ళ ఆరాటం సర్వం లొంగిపోయినాయి !

ఫజల్ మెల్లిగా హీనస్వరంలో యిలా అన్నాడు:
"లాలా, కొంచెం యిటురా!"

లాలా అతని దగ్గిరకు వెళ్ళాడు.

"మరి కొంచం దగ్గిరకు!"

లాలా ఫజల్‌కు బాగా దగ్గిరకు వెళ్ళి క్రింద కూర్చుని అతని ముఖంలోకి వంగి "ఏమిటో చెప్పు!" అన్నాడు.

ఫజల్ ఒకమాటు కండ్లు రెండూ తెరచి లాలా వంక చూశాడు. అతని కండ్లలో ద్వేషం అసహ్యం గూడుకట్టుకు కనుపించినాయి. నిదానంగా కండ్లు మూసుకొన్నాడు. నోటి నిండా వుమ్మిని కూర్చుకున్నాడు. బలంకొద్దీ లాలా ముఖాన వుమ్మేశాడు!

శౌకత్ బూడ్లోనుంచి చాకును బయటికి తీశాడు. కాని ఠాకూర్ కాహాన్‌సింగ్ అతని చెయ్యిపట్టుకుని ఆపి "వద్దు... దీని అవసరం రాదు! ఇతనికి మరొక శిక్షను యిద్దాం!" అన్నాడు.

"ఏమిటది?"

"జాగీర్దార్‌గారు ఇప్పుడే నిద్రలేస్తారు. వారు కాగాన్ నదిని దాటి మరొకగ్రామానికి వెళతారు. కాగాన్‌నదికి వంతెన లేదని నీకు తెల్సుగా? మరి దానికి మొద్దులూ కావాలి... మనుషులూ కావాలి...!"

కాహాన్‌సింగ్ పెద్దగా నవ్వాడు!

శౌకత్ అన్నాడు "అవును బాగున్నది! దానికి మొద్దులూ కావాలి! మనుషులూ కావాలి...!"

నంబర్‌దార్ ఇలమ్‌దీన్‌కు కూడా ఈ మాట వినేసరికి గుండెలు అలిసినట్టయింది. నమస్కరిస్తూ "ప్రభూ! ఆ శిక్ష

మాత్రం వేయకండి! అది చాలా పెద్దశిక్షండి! ఇటు ఐదారు సంవత్సరాలుగా మా వూరి రైతులకు ఆ శిక్షను వేయడం మానేశారు!" అన్నాడు.

"ఐతే గడచిన ఐదేండ్లలో ఎన్నడైనా పన్నులు ఇయ్యమన్నారా?" ఠాకూర్ శాహన్‌సింగ్ అడిగాడు.

"లేదండి...లేదు. ఎన్నడూ అలా జరగలేదు!" అని ప్రక్కకు తిరిగి "ఏం రహమాన్ ఎన్నడైనా అలా జరిగిందా?" అన్నాడు ఇలమ్‌దీన్.

రహమాన్ నమస్కరిస్తూ "లేదండీ! ఎన్నడూ అలా జరగలేదు. ఇప్పుడు కూడా నేను వద్దంటూనే వున్నాను! సర్కారుకు భాగం ఇవ్వకపోతే మనం ఎట్లా...!"

ఇలమ్‌దీన్ వెంటనే అందుకున్నాడు. "చూశారా సర్కార్! నేను చెప్పడంలా! మేమంతా పన్ను చెల్లించే పక్షంలో నేనండీ! కొంతమంది మాత్రం ఎవరిమాటల్లో పడి పోయారో, వ్యతిరేకిస్తున్నారు! అయినా సర్కార్! వాళ్ళను క్షమించేశెయ్యండి!"

ఠాకూరు శాహన్‌సింగ్ అన్నాడు. "ఇప్పుడెటూ వంతెన కట్టక తప్పదు! లేకపోతే జాగీర్దార్‌గారు నీళ్ళల్లోనుంచి వెళతారా?" అని స్వరాన్ని కొంచెం తీవ్రంచేసి "సరే, ధాన్యాన్ని వసూలు చెయ్యండి! ఇలమ్‌దీన్‌కూ అతని భాగాన్ని ఇవ్వండి. మీరాసాకు కూడా అతని భాగాన్ని ఇవ్వండి!" అన్నాడు హాశమత్, సిపాయీలను ఉద్దేశించి.

లాలా తలవంచుకుని అపరాధుల స్వరంలో "నాకు భాగంవద్దు!" అన్నాడు.

"ఏమన్నావు? నీకు భాగం వద్దా? అరేయి, అయితే లాలాకు సంకెళ్ళు వెయ్యాండిరా!" ఠాకూర్ శాహాన్‌సింగ్ గర్జించాడు.

"పోనివ్వండి... పోనివ్వండి... ఏమిటి లాలా? నీవు మరీ చిన్నపిల్లల్లా మాట్లాడతావు! అరె, నా దగ్గిర ధాన్యాంవుంటే రేపు మేమే విత్తులకో, తిండిగింజలకో పట్టుకుపోమా? మరి నీ దగ్గిర లేకపోతే మేము ఏమైపోవాలి? విత్తులు ఎక్కడనుండి తెచ్చుకొంటాము? ఏం రహమాన్!" అన్నాడు ఇలమ్‌దీన్!

రహమాన్ అవునన్నట్టు తల వూపాడు.

"సరె, మీ యిష్టమే నా యిష్టం!" అన్నాడు మీరాషా.

త్వరలోనే ధాన్యం పంచడం జరిగింది. ధాన్యాన్ని పండించడంఆలస్యం, కాని పంచడంలో ఆలశ్యం ఏమివుంటుంది? ఒకవంతు సర్కార్‌ది. రెండవవంతు జాగీర్దార్‌ది. మూడవ వంతు నంబర్‌దార్‌ది. నాలుగవవంతు లాలామీరాషాది. ప్రతి వంతుకూ పంట తరుగుతూవస్తుంది. మొక్క జొన్న కండెలు మాయం అవుతూ వుంటాయి. చివరకు పండించిన రైతువంతుకు అపరిమితమైన మానసిక క్షోభా, ఆకలీ ఈ రెండూ మిగులుతాయి! ఆ క్షణాన రైతులకు ఎటుచూసినా శూన్యమే కనుపిస్తుంది! ఎటుచూసినా అంధకారమే కను పిస్తుంది! ఎటుచూసినా ఆకలే కనుపిస్తుంది! ఎటు చూసినా మృత్యువే కనుపిస్తుంది! ఎటుచూసినా శ్వేత, నిర్జీవ, భయం కర తుషారమే కనుపిస్తుంది! శూన్యం, అంధకారం, ఆకలి, మృత్యువు, తుషారం, తిరగవేసినా అంతే తుషారం, మృత్యు

వు, ఆకలి, అంధకారం, శూన్యం...వీటి మధ్య రైతులు నిలబడి వున్నారు తలవంచుకొని!!

కాగాన్ నదిమీద వంతెన కడుతున్నారు.

టికరీశాహాముురాద్ నుండి చమన్ కోటకు వెళ్ళేచోట కాగాన్ నది చాలా విస్తృతం అవుతుంది. ఇక్కడ, చీల, దేవదారు వృక్షాలతో క్రిక్కిరిసిన అడవులు నదికి రెండు వైపులా వున్నాయి. ఇక్కడ నది లోతు కూడా ఎక్కువే! ఈ వెడల్పయిన, లోతైన రేవులో వంతెన కట్టబోతున్నారు. ఇవ్వాళే కాదు. ఈ వంతెనను శతాబ్దాల క్రితం నుంచీ, డోంగరా సర్కార్ లేనప్పుడుకూడా, ఇక్కడే కట్టేవారు. నదికి రెండువైపులనూ వున్న రెండు దేవదారు వృక్షాలను ఒకదానికి ఒకటి ఎదురుగా వుండేటట్టు పడవేస్తారు నదిమీదకు! అప్పటికీ మధ్యలో పదిహేను ఇరవైగజాల ఖాళీ మిగిలి పోతుంది. ఆఖాళీని చెక్కతో నిర్మించిన తెప్పను ఒకదాన్ని వేసి పూడుస్తారు. మధ్యను మిగిలే ఖాళీలో చెక్క తెప్పను వేయడం రైతులమీద సర్కారుకు ఏ విధమైన కోపమూ లేనప్పుడే! రైతులమీద సర్కారుకు కోపం వచ్చివుంటే ఆ ఖాళీస్థలాన్ని మానవశరీరాలతో నింపుతారు. ఎదురు బదుళ్ళగా పడవేయబడ్డ రెండు చెట్లకూ మధ్యనున్న ఖాళీలో మానవులు ఒకళ్ళ తలను మరొకళ్ళు తమ కాళ్ళకు టాకించుకొని, ఒక కాళ్ళను మరొకళ్ళు తమ చేతులతో గట్టిగా వుచ్చుకొని, నిర్రసీలుక్కొని బారుగా పడుకొంటారు వంతెనలా! ఈ మానవ శరీరాలతో నిర్మింపబడ్డ అర్వాచీన-ప్రాచీన వంతెన క్రిందనుంచి కాగాన్నదీమ తల్లి నీలిజలాలు గలగలా శబ్దం చేసుకొంటూ ప్రవహిస్తూ వుంటాయి. పైనుంచి మహారాజు

గారి మెత్తని కాళ్ళు హాయిగా నడుస్తూవుంటాయి! మనుష్యుల గుండెలమీద దేవుళ్ళ పాదాలు! రైతుల గుండెల మీద మహారాజుల పాదాలు! శ్రామికుల గుండెలమీద దోపిడీదారుల పాదాలు! ఈ గుండెలూ ఈ పాదాలూ యుగ యుగాలక్రితం నుంచీ జంటగా వచ్చి ఇరవయ్యో శతాబ్దపు మలుపులో నిల్చినాయి.

# 7

ఇవ్వాళకూడా, ఇరవయ్యవ శతాబ్దపు మలుపులో కూడా, మానవ శరీరాలతో వంతెన నిర్మింప బడుతోంది! ఆసియాలోని ఇరవయ్యో శతాబ్దంలోని యూరప్ పద్దెనిమిదవ శతాబ్దంకంటేకూడా క్రూరం! అన్యాయం!! కనుక ఇవ్వాళ కూడామానవ శరీరాలతో వంతెన నిర్మింపబడుతోంది. సర్కారు ధాన్యాన్ని వసూలు చేసుకుంది. యవనరాశిని పొందింది. రక్తబలుల్ని తీసికొన్నది. అయినా సర్కారు రైతులమీద సంతోషంగా లేదు. కోపంగా వుంది! కనుక మానవశరీరాలతో వంతెన నిర్మింపబడుతోంది. రైతుల గుండెలు మహారాజుల పాదాలకు ఎదురుతిరిగినాయి. చూస్తూవుండగా జ్వాలా ముఖీ పర్వతాల్లా నిలబడ్డాయి. కనుక మానవ శరీరాలతో వంతెన నిర్మింప బడుతుంది! ఈ జ్వాలాముఖీ పర్వతాన్ని ఈ రైతుల గుండెలను అణచండి, త్రొక్కివెయ్యండి. మహారాజులకు శాంతి వుండదు. కనుక మానవ శరీరాలతో వంతెన నిర్మింప బడుతోంది!

ఎదురు తిరిగిన రైతులందరినీ సిపాయీల కావలాలో ఒకచోట నిలబెట్టారు.

శౌకత్ ఒకమాటు కండ్లు పసులగొట్టుకొని నాలుగువైపులా చూశాడు. అతని దృష్టికి సుల్తాన్ కనుపించాడు. సుల్తాన్‌ను మెడబట్టుకొని తీసుకుపోయి, చీళ వృక్షపు మొదటికి కట్టివేశాడు. అటువైపున వంతెన రెండవ చివర్న ఫజల్‌హాదీన్‌ని కట్టేశాడు. మధ్యలో ఇంకా ముగ్గురు మనుష్యుల ఖాళీవుంది. ఆ ఖాళీలో బర్‌కత్ నొకడినీ, గులాంనబీ నొకడినీ పడుకోబెట్టారు. ఇక సట్టనడి మధ్య ప్రదేశం ఖాళీగా వున్నది. అది చాలా ప్రమాదమైనదీ భయంకరమైన ప్రదేశం! అక్కడ కొంచం బలిష్ఠుడైన రైతు వుండాలి! శౌకత్ దృష్టి ఫజల్ మీాదకు పోయింది. అందరి లోకీ ఫజల్ బలిష్ఠుడు. ఆ దండనకు యోగ్యుడు!

శౌకత్ నవ్వి ఫజల్‌తో అన్నాడు "రా! మిత్రమా! త్వరగా వచ్చి మధ్యలో పడుకో!"

ఫజల్ బర్‌కత్, గులాం నబీల మధ్యలోకి వెళ్ళాడు. వెళుతూ ఫజల్ బరకత్ చెవిలో ఏమిటో చెప్పాడు. శౌకత్ ఫజల్‌ని ఒక్కపోటు పొడిచి "ఇక్కడ ఒకరితో నొకరు మాట లాడుకోకూడదు!" అన్నాడు.

ఫజల్ కండ్లు ఒక్కసారిగా నెత్తురు పూసినట్టయినాయి. కనురెప్పలు ఒక్కక్షణం కంపించాయి. వివశంగా క్రిందికి వ్రాలి పోయాయి.

వంతెన తయారైన తరువాత కాహాన్‌సింగ్, శౌకత్, అల్లాదాద్-వీళ్ళు ముగ్గురూ ఒకటి రెండుమార్లు వంతెనమీాద నడిచి గట్టి ఓడుల్ని పరీక్షించారు.

అల్లాదాద్ సంతోషం పట్టలేక వెర్రి కేక వేశాడు. "ఆహా...ఆహా...ఒరేయి, మిత్రమా! ఇది నంబర్ వన్ పెద్ద రోడ్డురా! తారురోడ్డు!" అన్నాడు.

తరువాత అందరూ అటు వడ్డుకు వెళ్ళడానికి సిద్ధమైనారు.

రైతులందరూ రాజావారికి వంగి నమస్కరించి తిరిగి ఒక మాటు తమ దాస్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నారు.

ముందు అటు వడ్డుకు ఎనిమిదిమంది సిపాయీల ఒక రక్షకదళం వెళ్ళింది.

బరువైన సైనికపాద రక్షలు మొదట చెట్టుమాను మీద నడుస్తున్నాయి. తరువాత మానవశరీరాలమీద. తిరిగి చెట్టుమాను మీద...!

రజ్జీ రాజా కర్మఆలీకి ప్రక్కనే నిలబడివున్నది. ఆమె ముఖం రక్తం విరిగి తెల్లబడ్డది పాలిపోయినట్లు! కండ్లు వాల్చుకొన్నది. విలువకల లేత ఎరుపు సిల్కుగౌను వేసుకొన్నది. గౌనుకు అక్కడక్కడా అందమైన చిన్నపూవులూ లతలూ శోభాయమానంగా వున్నాయి. రజ్జీ తల ఎత్తి సజల నేత్రాలతో ఒకటి రెండుమార్లు ఫజల్ వంక చూసింది.

తరువాత సైనికుల జట్టు శాహన్‌సింగ్‌తో ఇటు నించి అటువైపుకు తరలింది. రజ్జీ కండ్లు వగులకొట్టుకొని వెళ్తున్న పాదాలవంక చూస్తున్నది. ఇది సుల్తాన్ శరీరం... ఇది ఫజల్ శరీరం...ఇది గులాంనబీ శరీరం... ఇది ఫజల్‌హదీన్ శరీరం.. ఇది చెట్టుమొద్దు! రజ్జీ శరీరం కంపించింది వణికింది!

రాజా కర్మఆలీ బుజాన చెయ్యివేసి అతిప్రియమైన స్వరంలో "చలివేస్తోందా?" అని అడిగాడు రజ్జీని. రజ్జీ ఏమీ

సమాధానం ఈయలేదు. ఆమె సన్నని, పలుచని గులాబీ పెదాలు ఎండి కుంచుకుపోయి వున్నాయి. ఎండిన చురుకైన చూపుల్తో రజ్జీ నాలుగువైపులా కలయచూసింది; ఎక్కడైనా పారిపోవడానికి మార్గం లభిస్తుందేమోనని! కాని, ఎక్కడా పారిపోవడానికి మార్గం కనుపించలేదు. ఎటుచూసినా తుపాకులు పట్టుకుని రాక్షసుల్లా క్రూరంగా నిలబడ్డ సిపాయీలు, అతి దీనవదనాల్తో శోకవహ్నిలో మునిగి తలలువంచుకు నిలబడ్డ రైతులూ కనుపిస్తున్నారు.

రెండుక్షణాలు ఆలోచించి పారిపోవడానికి మార్గం దొరకదని స్థిరంగా నిశ్చయించుకొన్న తరువాత మెల్లగా తన కాళ్ళనవున్న విలువైన పాదరక్షలను వదలి, ఒట్టికాళ్ళతో నేల మీద నిలబడ్డది రజ్జీ!

రజ్జీ ఇలా పాదరక్షలను విడిచివేయడాన్ని రాజా కర్మ ఆలీ చూశాడు. అతను చిన్నగానవ్వి "చెప్పులు వేసుకో! గులాబీ పువ్వుల్లాంటి నీ పాదాలు కంది..." అని అన్నాడు రాజా కర్మఆలీ.

రజ్జీ అన్నది "వద్దు! నేను వట్టికాళ్ళతోనే నడుస్తాను!"

హాశమత్ అల్లాబేగ్ ముందుకు వచ్చి వంగి నమస్కరించి "ప్రభూ, తమరు ముందు దయచేయండి! తరువాత నేను వస్తాను!"

రాజా కర్మఆలీ రజ్జీచేతిని తనచేతిలోకి తీసుకొని "రా" అన్నాడు.

రాజా, రజ్జీ ఇద్దరూ మెల్లమెల్లగా నడవసాగారు. రాజాగారు ముందు నడుస్తున్నారు. రజ్జీ వెనక నడుస్తున్నది శూన్యంలోకి చూస్తూ! మెల్లగా నడుస్తున్న రజ్జీ మస్తిష్కాన్ని రక

శకాలైన అనుభూతులూ పెనవేసుకొన్నాయి. మొదట గట్టి నల్లని భూమిమీద నడుస్తున్న అనుభూతి కలిగిందిఆమెకు. తరువాత పచ్చని పచ్చని గడ్డిమీద నడుస్తున్నట్టు...ఆపైన చెట్టు మాను మీద...క్రమేణా మానవశరీరాలమీద... ఈ శరీరం సుల్తాన్‌ది, సుల్తాన్ ఆమెను చిన్నతనంలో ఎత్తుకొని ఆడించాడు!...ఈ శరీరం బర్‌కత్‌ది. బరకత్ ఒకనాటి ఆహ్లాదకరమైన సాయంత్రపుపూట ఆమెచేతిని తనచేతిలోకి తీసుకొని తన ప్రేమను నివేదించుకొన్నాడు! ...మరి... ఈ... ఈ...ఈ శరీరం ఎవరిది? రజ్జీ శరీరం ఆదిమధ్యాం కంపించింది. కాళ్ళు వణికినాయి. పడతానేమో అనుకొన్నది. ఇది ఎవరి ముఖం? ఆమె కాళ్ళక్రిందపడి నలిగిపోతున్న ఈ పెదాలు ఎవరివి? అరె...ఏమిటీ ఈ పెదాలు ఇలా ఘోష పెడుతున్నాయి? ఈ కన్నీరు ఎవరిది? కన్నీరులో తడిసిన ఈ కపోలాలు ఏమిటి? అవ్యక్తమైన ధ్వనులు..."రజ్జీ! ప్రేయసీ! ఎక్కడికి వెళుతున్నావు నువ్వు? ఈ మానవశరీరాల వంతెన జీవన్మరణ సంయోగం! దీన్ని దాటి ఎక్కడికి వెళ్ళిపోతున్నావు? రజ్జీ! ప్రేయసీ! ఎక్కడికి వెళుతున్నావు?" అరె తన తొలి ప్రణయపు చుంబనాన్ని అంకితంచేసిన ఈ వంపుమెడ ఇక్కడ వున్నదేం? కనురెప్పలను పైకిఎత్తి శూన్యదృక్కుల్తో రజ్జీ నాలుగు వైపులా చూసింది. చాలాదూరాల వరకూ వ్యాపించిన ఆకాశం. ఈ ఆకాశాన్ని వలయించిన భూమి...ఇంత విశాలంలో కనీసం తనకు చావడానికి స్థానం దొరికినా చాలు అనుకొన్నది ఆమె! రజ్జీ కాళ్ళు వణికినాయి. పడిపోవడానికి సిద్ధం అయింది ఆమె!

పుబికిన బలిష్టమైన ఫజల్ గుండెలమీదుగా బలమైన బూట్లు ధృఢమైన అడుగుల్తో నడిచి పోతున్నాయి. ఒక్కొక్క అడుక్కూ ఫజల్ ఛాతీ మంచుకు తడిసి కుంచించుకుపోయి గట్టి పడే తారురోడ్డులా ధృఢమౌతున్నది. బిగుసుకు పోతున్నది. ఎక్కడా ఒక్క నూలుపోగంత సందుకూడా లేదు. పైనించి అడుగులు అవిరామంగా నడుస్తున్నాయి. అడుగులు నడిచిన కొద్దీ ఫజల్ ఛాతీ మరీ గట్టిపడిపోతున్నది! అతను తన శరీరాన్ని సిమెంట్‌లా, ఇనుములా గట్టిపరుచుకొన్నాడు. ఆ సిమెంట్‌కోటలో స్వయంగా తను శగలు క్రక్కుతున్న దావానలంలా పుడికిపోతున్నాడు!

కాని రజ్జీ పాదాలు అతన్ని స్పర్శించేసరికి అతనిలోని గట్టితనమంతా ఎండకుకరిగే మంచులా కరిగిపోయింది. సిమెంటూ, ఇనుమూ కరిగి తిరిగి సజీవమైన మాంసం ముద్దలుగా మారినవి; ప్రేయసి పాదాలు నొచ్చుతాయనిగావును అతని శరీరమంతా పెద్ద పూలగుట్టలా మృదుతిరమైంది. ఫజల్ శరీరంలోని అణువణువూ వికలంగా స్పందిస్తూ, రజ్జీ గులాబీ పాదాలను ప్రశ్నించసాగినాయి. "రజ్జీ...ప్రేయసీ! ఎక్కడికి పోతున్నావు?"

ఒక అడుగు...రెండడుగులు!

ఫజల్ ఆత్మఘోష రజ్జీ చెవుల పడ్డది. "రజ్జీ నీవు నాదానివి... ఎక్కడికిపోతున్నావు నన్నువిడచి? నీ శరీరం నాది...నీ ఆత్మనాది...నీవు కన్న కలలన్నీ నావి... ఎక్కడిక వెళ్తున్నావునన్నువిడచి? నీకు జ్ఞాపకంవుందోలేదో, మొదటగా ప్రేమించడం నేర్పింది నేనే నీకు! నీకు జ్ఞాపకంవుందోలేదో ఆకాశంలో ఎలమబ్బు పారేవేళ, ఆకుపచ్చని మెరిసేగడ్డి పసుపు

వన్నెకు తిరిగేవేళ చిన్న కొడవలితో గడ్డి కోయడం నీకు నేనే నేర్పాను! నీకు జ్ఞాపకం వుందో లేదో, ఆకురాలే కాలంలో 'సఫేది' వృక్షాలు ఆకులురాల్చి మోడులైనప్పుడు వాటి రెండు సన్నని పుల్లల్తో మన్మధబాణాలను కట్టడం నేనే నీకు నేర్పింది. మంచు కురిసేకాలంలో, ద్రాక్ష తీగెలమీద ఉదయపు లే ఎండలు ఇంద్రధనుస్సుల్లా సప్తవర్ణాల్లో మెరిసే మంచు బిందువులను చూస్తూ ప్రథమంగా ప్రణయ ముద్రను – నీ పెదాలమీద అంకితం చేసింది నేనే! నీవు నాకు ఇహాజీవితపు ఆశవు! పరజీవితపు ముక్తివి! నన్నువిడిచి ఎక్కడికి వెళ్తావు రజ్జీ!"

ఆక్షణాన రాజాకర్మఆలీ ఫజల్ శరీరాన్ని ముందు శరీరంమీదకు వెళ్ళాడు. రజ్జీమాత్రం గుండెలమీద నిలబడి వున్నది. కర్మఆలీ వెనక్కుతిరిగి రజ్జీని తనవెంట రమ్మనమన్నట్టు సౌంజ్ఞచేశాడు. కాని, ఇంతలోనే ఫజల్ తన కాళ్ళనూ చేతులనూ విడచిపెట్టేశాడు. వంతెన మధ్యలోకి తెగిపోయింది. రజ్జీ, ఫజల్ ఇద్దరూ ఒకళ్ళకుఒకళ్ళు జంటగా, తోడుగా క్రింది నదిలోకి పడిపోయారు. ఒడ్డునవున్నవాళ్ళు చూస్తూవుండగానే కనురెప్పపాటులో క్రిందపడుతూన్న ఫజల్ రజ్జీని తన బలమైన బాహువుల్లోకి లాక్కున్నాడు. ఇద్దరూ ఒకళ్ళనిఒకళ్ళు గట్టిగా పెనవేసుకొన్నారు. తృటికాలంలో ఇద్దరూ కాగాన్ నదీ జలాల్లో కలిసిపోయారు.

---

# మూడవ అధ్యాయం

మర్నాటి ఉదయం అబ్దుల్ తన స్వగ్రామానికి బయలుదేరాడు. అతని హృదయం ఆనందడోలికల్లో తూగుతున్నది. దారిన తూగుతూ, తూలుతూ పాటల్ని పాడుకుంటూ వెళుతున్నాడు. అతని హృదయం భూమంత విస్తృతమై సర్వత్రా పరుచుకోవాలని చూస్తున్నది; ప్రపంచ విజేతలా! నిజానికి అతనీనాడు ప్రపంచ విజేతకు ఏమాత్రం తీసిపోడు. ప్రేమ సామ్రాజ్యాన్ని మొదటగా వశ్యం చేసుకొన్నాడు. ఒకలే యవ్వన జవరాలి మనోరాజ్యంలో శాశ్వతమైన స్థానాన్ని ఏర్పరచుకొన్నాడు. ప్రపంచ విజేతకన్నా తనేం తక్కువ! ఆనందాన్ని పట్టలేక మధ్యమధ్య చెంపలమీద చేతులు వేసుకొని పెద్దగా పల్లెటి రాగాన్ని ఆలాపిస్తున్నాడు— పెద్దగా...చాలా పెద్దగా! మధ్య మధ్యా బానో ఇంకా తనకు ప్రక్కనే నడుస్తూన్నట్టూ, మాట్లాడుతున్నట్టూ భ్రమపడుతున్నాడు. ప్రక్కలకు తిరిగి చూసుకొంటున్నాడు. తన భ్రమకు తనే నవ్వుకొంటున్నాడు. వూహల్లోనే బానోని చిత్రించుకొని ప్రశ్నించాడు.

"ఏం బానో! నడవలేకుండా వున్నావా? పోనీ బుజాన ఎక్కించుకోనా?"

హా చిత్రంలోని బానో ఇలా అన్నది: "ఊహు! మహారాజు బుజాన ఎక్కించుకొనేవాడివి వచ్చావులే- నీ కన్న తొందరగానే నడవగలను!"

"పందెం వేసుకొందామా?"

"ఊఁ కానియ్యి!"

అబ్దుల్ నవ్వుతూ పరుగెత్తసాగాడు. కొంతదూరం పోయాక పూర్తిగా అలసిపోయి ఒక చిన్న 'ఖంచరీ' చెట్టు క్రింద నిలబడ్డాడు. రెండు నిముషాలు ఆగి అలుపు తీర్చుకొన్న తరువాత నవ్వుతూ "చూశావా! ఓడిపోయావు!" అన్నాడు

బానో మూలుగుతూ తనదగ్గిరకు వస్తున్నది. బాగా అలసిపోయి వున్నది. తూగుతూ వచ్చి అబ్దుల్ చేతుల్లో వ్రాలిపోయింది బానో!

"సరే, రా! బుజానికి ఎక్కించుకొంటాను!"

చాలాసేపటివరకూ అబ్దుల్ బానో ఊహాచిత్రాన్ని బుజానికి తీసుకొని నడిచాడు. కొంతదూరం నడిచి బానోని క్రిందికి దించి నిలబెట్టి ఇలా అన్నాడు అబ్దుల్ "నేను అలసి పోయాను!"

"ఇంతేనా?"

"అవును! ఇంతే!"

"మరయితే, జీవితమంతా నన్ను ఎలా మోయగలవు?"

"నేనొక చిన్న శిశువును ప్రసాదిస్తాను నీకు. నీవు వాడిని మోయడంలో మునిగిపోతావు! ఇక నా సహాయం నీకు అవుసరం వుండదు...నేను నిన్ను మోయవలసిన పని వుండదు!"

బానో నవ్వింది.

అబ్దుల్ రెండడుగులు ముందుకువేసి ఒక చెట్టుదగ్గిర నిలబడ్డాడు. "ఈ చెట్టుపేరు ఏమిటో తెల్సా ?"

"తెలియదు. మరి నీకు తెల్సా ?"

"నాకూ తెలియదు !"

"మరి?"

అబ్దుల్ ఆ చెట్టువి చాలా ఆకుల్ని కోసి వాసనచూశాడు "వాసనచూడు...ఎలా కమ్మనివాసన కొడుతున్నాయో !" అబ్దుల్ తన చేతిలోని ఆకులన్నింటినీ బానో ముఖంమీదకు విసిరాడు.

ఒక పక్షి పై కొమ్మమీదనుంచీ పెద్దగా అరచింది. అబ్దుల్ అప్పటికి మన లోకంలోకి వచ్చాడు. దారిన తను ఒక్కడే వెళుతున్నాడనీ, ప్రక్కన బానో లేదనీ తెలుసుకొన్నాడు. తన రమ్యమైన కల్పనకు ఇలా ఆఘాతాన్ని కల్పించిన పక్షిమీద అతనికి మితిలేని కోపం వచ్చింది. ఒక రాయిని తీసుకొని గురిచూసి పైకి పక్షి మీదకు విసిరాడు. పక్షి అరుచుకొంటూ నదికి రెండవ వైపుకు అడవిలోకి వెళ్ళి పోయింది.

అబ్దుల్ తనలో తనే అనుకొన్నాడు. "వెధవ పక్షి ! నన్నే హేళన చేస్తున్నావా?"

అబ్దుల్ ఇక మెల్లగా దారిన నడవసాగాడు. చాలా వుదాసీనంగా వున్నాడు. అడుగులు ముందుకు పడడం లేదు ! అశ్రుపూరితాలైన బానోకండ్లు అతని మనో నేత్రాలకు ప్రత్యక్షంగా కనుపించసాగాయి. తను వచ్చేస్తూవుంటే బానో కండ్ల నిండా నీళ్ళు నింపుకొని "త్వరలో తిరిగిరా ! తిరిగి పట్నానికి

వెళ్ళేటప్పుడు నన్ను తప్పకుండా తీసుకొనిపో!" అన్నది. బానోని ఆ స్థితిలో చూసి అబ్దుల్ హృదయం ద్రవించింది. అతనేమీ మాట్లాడ లేక పోయాడు. మౌనంగా ఆమె తలను గుండెలలోకి అదుముకొని తల నిమిరాడు మృదువుగా!

నదిని దాటి వెళ్తున్న పక్షి మళ్ళీ ఒకమాటు పెద్దగా అరిచింది "చి...హూ...చి...హూ!

"దొంగముండా! నా దగ్గిర తుపాకీ వున్నట్లయితే నీ పని చెప్పేవాడిని! అబ్దుల్ చిన్నగా నవ్వుకొన్నాడు.

"చి...హూ! చి...హూ!" పక్షి మళ్ళీ అరచింది.

అబ్దుల్ తన దారిన ముందుకు నడుస్తున్నాడు.

కొంతదూరం పోయాక అతనికి నర్గిస్ పూలతోట ఒకటి కనుపించింది. (నర్గిస్ అంటే అరబ్ దేశంలోని ఒక ప్రసిద్ధమైన పుష్పం. ప్రాచీన ముస్లిం కవులు ఈ పుష్పాన్ని నాయకి కండ్లతో పోల్చేవారు) ఆ తోటను చూడగానే అబ్దుల్‌కు దానిలోని పుష్పాలన్నీ బానో కండ్లు అయినట్టూ అవి తనను పిలుస్తున్నట్టూ అనుపించింది. వెంటనే అతను తన చెప్పులనూ, టోపీనీ తీసి విడివిడిగా పెట్టి ఆ తోటలో పడుకున్నాడు!

అతనికి నాలుగువైపులా నర్గిస్ పూలు కమ్ముకొని వున్నాయి. తెల్లని ఆకులమధ్య పసుపువచ్చని అందమైనపూలు, బానో కండ్లలా అతనివైపు ప్రేమతో, సిగ్గుతో చూస్తున్నాయి.

"మీరంతా బానో కండ్లు! నేను మిమ్ముల్ను ముద్దు పెట్టుకుంటాను!" అబ్దుల్ ఒక పువ్వును చేతుల్లోకి తీసుకొని ముద్దుపెట్టుకొన్నాడు. ఒక పూవును క్రిందికి వంచడం వల్ల తోటలోని పూవులన్నీ కదిలాయి. దీంతో అబ్దుల్‌కు పట్ట

రాని ఆనందం కలిగింది. రెండు కళ్ళూ మూసుకొని తోట్టెలో అటూ ఇటూ దొర్లుతూ పూవులను ముద్దుపెట్టుకో సాగాడు. ఇంతలో ప్రక్కనే బానో నిలబడి పెద్దగా నవ్వినట్లయింది. అతను వెంటనే కండ్లు తెరచి చూశాడు నాలుగు వైపులా! ఎవరూ కనుపించలేదు. నవ్వు మాయం అయింది. ఎవ్వరూ లేరని నిర్ణయించుకొని అతను మళ్ళీ కండ్లు మూసుకొని తొట్టెలో పడుకొన్నాడు. మళ్ళీ నవ్వు...! అబుల్ తృళ్ళిపడి కండ్లు తెరచాడు. కాని ఎవ్వరూ లేరు. నవ్వు మాయం అయింది. అబ్దుల్ లేచి కూర్చుని మళ్ళీ ఒకమాటు నాలుగు వైపులా కలయ చూశాడు. బానో ఇక్కడికి ఎలా వస్తుంది? 'రంగడ్' అడవిలో తన తండ్రిదగ్గర వున్నది! మరి నవ్వింది ఎవరు?..."ఎవరది?" అబ్దుల్ పెద్దగా అరిచాడు.

చుట్టూవున్న కొండలు ప్రతిధ్వని రూపంలో తిరిగి అతన్నే ప్రశ్నించినాయి.

"ఎవరది?"

ఇక అబ్దుల్ పట్టలేక పోయాడు. అతనికి పట్టరాని కోపం వచ్చింది. చప్పున లేచి నిలబడి నాలుగు వైపులా దూరాలవరకూ కలయ చూశాడు. ఆశ్చర్యం! అతని టోపీ చెప్పులూ వెనక తను వుంచినచోట లేవు. మాయం అయి నాయి! అబ్దుల్ ఒకమాటు కండ్లు నులుముకున్నాడు. నిజం గానే చెప్పులూ టోపీ లేవు. మాయం అయినాయి. ఎవరు పట్టుకుపోయారు? ఏమీ తోచక తల గోక్కో సాగా డతను. రెండు క్షణాలు పోయాక చెప్పులనూ టోపీనీ వెతుక్కోవ డానికి తొట్టికి వెనక భాగానికి పోయా డతను. అటు వైపున పూలపొదమాటునుంచీ ఇద్దరు స్త్రీలు నవ్వుతూ ప్రత్యక్షమ

యినారు. అబ్దుల్ ఒక్క క్షణం మౌనంగా చూస్తూ నిలబడి పోయాడు ఆశ్చర్యంగా!

వాళ్ళు ఇద్దరూ పెద్దగా ఒకేతీరున నవ్వుతూ వుండడం వల్ల అబ్దుల్ కూడా నవ్వక తప్పిందికాదు.

"సరే నా చెప్పులు ఎక్కడ పెట్టారో చెప్పండి!" అబ్దుల్ అడిగాడు.

"మొదలు నీవు చెప్పు! నీవు మా పూల తోటలో ఎందుకు పడుకున్నావు?"

"నా టోపీ ఎక్కడ?"

"మా పూలను ఎందుకు ముద్దు పెట్టుకున్నావు?"

"పూలనే కాదు, మిమ్ములను కూడా ముద్దుపెట్టు కొంటాను!"

పై సమాధానాన్ని విని ఇద్దరు స్త్రీలూ కుంచించుకు పోయారు.

ఇద్దరిలో ఒక స్త్రీ కొంచం నిదానంగా అన్నది "ఛ... ఛ...సిగ్గులేదూ?"

రెండవ స్త్రీ అన్నది "నీకు తల్లీ తోడూ లేరూ?"

"ఇద్దరూ వున్నారు. తల్లి వున్నది. చెల్లెలూ వున్నది. కాని ముద్దుపెట్టుకోవడానికి ప్రేయసి లేదు!"

మొదటి స్త్రీ అందుకొన్నది "నా కాళ్ళ చెప్పుల్ని నీవు చూడలేదుగామాలు, చాలా గట్టివి!,,

అబ్దుల్ అన్నాడు "గట్టిగానే వున్నాయి. నువ్వే కుట్టినట్టున్నది!"

మొదటి స్త్రీకి క్రోధం అపారమైంది. కాలి చెప్పును విప్పి విసిరివేసింది. అబ్దుల్ తప్పుకొన్నాడు. రెండవ చెప్పును

విసిరింది. అదతని వీపుకు తగిలింది. అబ్దుల్ చప్పున చెప్పుల్ని వేసుకొని "ఇక టోపీకూడా ఇటు పడెయ్యి!" అన్నాడు.

టోపీ రెండవ స్త్రీ చేతిలో వున్నది. ఆమె టోపీని గిర్రున త్రిప్పి కాగాన్ నదిలో పారేసింది. టోపీ చాలా దూరం వరకూ పడవలా తేలుతూ, తూగుతూ వెళ్ళింది. చివరకు ఒక సుడిగుండంలో పడి మునిగిపోయింది.

అబ్దుల్ ఎగిరి రెండ స్త్రీ రెక్క పుచ్చుకుడున్నాడు. "ఛత్...నువ్వు నిజంగా చెప్పులు కుట్టేవాడి కూతురులావుంది ...అందువల్లే అలా పారేశావు!" అన్నాడు.

రెండవ స్త్రీ చేతిని విడిపించుకొని "ఏయ్! నేను మాదిగ దాన్ని కాదు. నేను బ్రాహ్మణ కన్యను. నా పేరు గంగ!" అన్నది. ఆమె వయస్సు 18 ఏండ్లు.

"మరి ఈమె నీకు స్నేహితురాలా? కులం?"

"స్నేహితురాలు కాదు. అక్క. పేరు సరస్వతి!" సరస్వతి వయస్సు 20 ఏండ్లు!

అబ్దుల్ గంగ చేతిని విడిచాడు. విచారంగా తలవంచుకొని "నా టోపీ చాలా విలువైనది! పట్నంనుంచి కొని తెచ్చుకున్నాను!" అన్నాడు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

సరస్వతి సిగ్గుపడుతూ అడిగింది "నీ వెవరు?"

"నేను అబ్దుల్ ని!"

"ఏవూరు?"

"టికరీశాహాముంరాద్...మరి నీవూరో?"

"బధియూని!"

"ఇక్కడికి ఎందుకు వచ్చారు?"

"నీళ్ళు పట్టుకుపోను వచ్చాము. కాని, పూలతోట్లకు ప్రక్కన నీ టోపీనీ, చెప్పుల్నీ, చూసి–మరి నీవు దాన్లో పొర్లాడడం చూసి –" మధ్యలో ఆపింది గంగ.

"ఆఁ చూసి! అదేనా చేయవలసిన పని?" అబ్దుల్ అడిగాడు.

సరస్వతీ గంగా నవ్వారు. ఇద్దరూ అలా కలసినవ్వడం అబ్దుల్‌కు చాలా నచ్చింది. రెండుక్షణాలు నిశ్శబ్దంగా వుండి "ఇకనైనా ఇంటికి వెళ్తారా? లేక మరెవరికైనా బట్టలు విప్పడమో, బురద పూయడమో లాంటి కార్యక్రమాలు వున్నయ్యా?" అడిగాడు.

కొద్ది క్షణాల అనంతరం సరస్వతీ గంగా ఇద్దరూ కాగాన్ నదీరేవులోకి పోయి తమ బిందెలను నింపుకున్నారు. మొదట సరస్వతి గంగకు బిందెను బుజానికెత్తింది. బిందెను ఎత్తుకోవడంతోనే గంగ మెడ పొడుగై వంపుతిరిగింది. శరీరం లోని వంపులు స్పష్టంగా కనపడసాగినాయి. వక్షస్థలం బాగా వుబికింది. నేర్పరి అయిన వేటగాడు ఎక్కుపెట్టిన బాణంలా తయారైంది గంగ!

ఇక సరస్వతి వడ్డున నిలబడివున్నది. ఆమె బిందె క్రింద ఇసుకలో వున్నది. చిన్నిచిన్ని అలలువచ్చి బిందెను తాకుతున్నాయి, తిరిగి నదిలోకి వెళ్ళిపోతున్నాయి. సరస్వతి ఒకమారు బిందెఎత్తడానికి సహాయంకోసరంగా వును, నాలుగువైపులా చూసింది. ఎవరూ కనుపించలేదు. తిరిగి అబ్దుల్‌వంక చూసి, అడిగింది. "నీవు అబ్దుల్‌వా?" ఆమె పరోక్షంగా "నీవు ముస్లింవా?" అని అడుగుతున్నది.

అబ్దుల్ చిన్నగా నవ్వాడు "అవును నేను అబ్దుల్‌నే! కాని బిందె ఎత్తడానికి రామదాసునుకూడా కాగలను!... హరి: ఓమ్ తత్సత్!" అన్నాడు.

సరస్వతి మళ్ళీ నాలుగువైపులా చూసింది "ఊఁ! త్వరగా ఎత్తు! చూడూ, ఎవ్వరితోటీ చెప్పకు!" అన్నది.

అబ్దుల్ బిందె ఎత్తుతూ "ఎవ్వరితోటీ చెప్పనులే... భయపడకు!" అన్నాడు.

బిందెను ఎత్తుతున్నప్పుడు సరస్వతి శరీరపు ఒంపులను అతి సమీపంనుండి చూడగలిగాడు అబ్దుల్! సరస్వతి అవయవాలు యవ్వనపు పొంగుతో నిండివున్నాయి. బిందెను ఎత్తుతూన్న అబ్దుల్ చెయ్యి అనుకోకుండానే వణికింది. బిందెలో నీళ్ళు చిందినవి! చిందిననీళ్ళు ఇద్దరి ముఖాలమీదా పడ్డాయి. సరస్వతి చురచురాచూస్తూ "నీళ్ళను చిందించావు!" అడిగింది.

"అవును, ప్రవాహం ఎదురుతిరిగితే నీళ్ళు చిందవా? దీనిలో ఆశ్చర్యం ఏముంది!"

"నువ్వు అనేది ఏమిటో నాకు అర్థం కావడంలేదు!" సరస్వతి గొంతు చాలా బలహీనంగా వున్నది.

"సరస్వతీ నది దక్షిణదేశంలో ప్రవహిస్తుంది. మరిదు ఉత్తరానికి మళ్ళితే నీళ్ళు చిందక ఏమవుతాయి?"

సరస్వతి వివశంగా ఉన్నది. "మీ చదువుకొన్న వాళ్ళ మాటలు మాకు అర్థంకావు. సరిగా చెప్పు!"

గంగ ఒక్కసారిగా ఎగిరిపడి "ఏమిటే చూస్తావు? ఆ బిందెను నెత్తిన విసిరికొట్టు, అప్పుడు కొంచెం అర్థం అయ్యేట్టు మాట్లాడుతాడు!" అన్నది.

"ఇదిగో గంగా, ఎక్కువగా మాట్లాడేస్తున్నావు... నేను నిన్ను ముట్టుకొంటాను!" అన్నాడు అబ్దుల్.

గంగ బిర్రబిగిసుకు నిలబడి అబ్దుల్‌వంక కోపంగా చూడసాగింది. ఆమె చూపులు చాలా అస్పష్టంగా, ద్వంద్వంగా వున్నాయి. ఆ చూపులలో అబ్దుల్‌కు గంగ యిలా అంటున్న ట్లనిపించింది. "నన్ను తాకకు...నన్ను ముట్టుకోకు! సరే, నన్ను దగ్గరకు తీసుకో...నీవు చాలా మంచివాడివి! కాదు. నువ్వంటే నాకు చాలా అసహ్యం...ద్వేషం!" గంగలో రెండురకాల భావాలూ స్పష్టంగా కనుపిస్తున్నాయి. ఈ విరుద్ధ భావ సంగమాన్ని చూసి అబ్దుల్ నవ్వాడు.

"ఎందుకూ నవ్వుతావు?" వెళుతూ వెళుతూ గంగ అడిగింది.

"ఎందుకా? నేను నిన్ను తాకనని నీకు గట్టిగా తెలుసు. అయినా నీకు కడుపులో అనుమానం నేను తాకుతానేమో నని! భయపడ్డావు! అందుకు!" అన్నాడు అబ్దుల్.

గంగ ధైర్యంగా చెప్పింది. "నీవు నన్ను తాకలేవు... నీ కండ్లలో సిగ్గు చారలు వున్నాయి!"

అబ్దుల్ గర్వంగా, సంతోషంగా గంగ కండ్లల్లోకి చూశాడు. అతనికి ఆషాఢంలో సరోవరాలమీద విహరించే నిండు, మేఘాలు కనుపించాయి గంగ కండ్లల్లో. అతనికి తన చెల్లెలు రజ్జీ జ్ఞాపకానికి వచ్చింది. అతను సరస్వతి వైపుకు తిరిగి ఇలా అన్నాడు. "మరి నువ్వు ఏమంటావు?"

సరస్వతి ముఖం ఎర్రనైంది. కాళ్ళు వణికినాయి. పడి పోతుందేమోననిపించింది. అబ్దుల్ పడకుండా పట్టుకొన్నాడు.

సరస్వతి బలహీనంగా అడిగింది. "నీవు నన్నెందుకు ముట్టుకొన్నావు ?"

అబ్దుల్ సమాధానం చెప్పలేదు.

వాళ్ళతోపాటు మౌనంగా ముందుకు నడిచాడు.

## 2

చాలాసేపటివరకూ ముగ్గురూ అలా మౌనంగా నడిచారు. ఈ లోపు అబ్దుల్ యిలా ఆలోచించాడు. సరస్వతి తనను 'నువ్వ' అని సంబోధించింది. ఐతే ఈ 'నువ్వ'ఏమిటి ? 'నువ్వ' అనేది మాటా ? లేక ముద్దా? కాక అగ్నికణమా ? ఏమిటిది? – ఇది మీరూ, తమరూ కంటే చిన్నది. చిన్నపాప! ముద్దులబుజ్జి ! తల్లిఒడిలో ముద్దులవర్షంవల్ల పెదాలు ఎఱ్ఱబడ్డ బుజ్జిపాప ! 'మీరు' 'నువ్వ'కు చిన్న అన్న! మీరూ అనే దాంటో సమహోదాతోపాటు కొంత వ్యత్యాసం ఎడంకూడా వుంటుంది. కాని ఈ 'నువ్వ' మాత్రం అత్యంత ఆత్మీయమైనది. ఈ 'నీవు' రెండు అపరచిత హృదయాలను యిట్టే కలిపివేస్తుంది. వేలకొలదీమైళ్ళ దూరాలను నికటస్థం చేస్తుంది. ఈ 'నీవు' రెండు మతాలమధ్య, రెండు సంస్కృతులమధ్య రెండు భావాలమధ్య వుండే చిత్రమైన సంధివూస!

అబ్దుల్ మళ్ళీ నవ్వాడు.

గంగ నదిఒడ్డుకు ఎక్కుతూ ఆగిపోయింది.

సరస్వతి కూడా ఆగిపోయింది.

అబ్దుల్ కూడా ఆగిపోయాడు.

గంగ వడ్డునుంచి క్రిందకు నీళ్ళల్లోకి సౌంజ్ఞ చేసి చూపుతూ "ఏమిటది ?" అన్నది.

"ఎక్కడా?" అబ్దుల్ సరస్వతీ యిద్దరూ ఒక్కమారుగా అడిగారు.

"అటు...క్రింద నది నీళ్ళదగ్గిర...రేవులో!"

ముగ్గురిచూపులూ క్రింద రేవులోకి పోయినాయి. అక్కడ రెండు శవాలు పడివున్నాయి.

"అయ్యో రామచంద్రా! కొంచెం ఈ బిందెదింపు- నా కాళ్ళు వణుకుతున్నాయి!" సరస్వతి అబ్దుల్‌ని ఉద్దేశించి అన్నది.

గంగ తన బిందెను తనే దించుకున్నది. "అక్కయ్యా! ఏమిటి నీవుకూడా అలా అనవసరంగా భయపడతావు! అసలు ఏమిటో వెళ్ళి చూసి వద్దాం పద!" అన్నది.

## 3

నదివడ్డున రెండు మానవ శరీరాలు జోర్లాపడి వున్నాయి. వాటిలో ఒకటి స్త్రీ శరీరం. రెండవది పురుష శరీరం! స్త్రీ తల వెంట్రుకలు పూర్తిగా విడిపడి నడుముల వరకూ చెల్లా చెదురుగా పరచుకొన్నాయి. పురుషుని శరీరం మీాద దెబ్బల తాలూకు గుర్తులు చాలా కనుపిస్తున్నాయి. రెండు శరీరాలూ చేతులు చేతులూ కలుపుకొని నీళ్ళల్లో తడిసి ఒడ్డున పడివున్నాయి. నలుపూ నీలమూ కలసిన ఒక రకమైన వికృత వర్ణాలలో కనుపిస్తూ ఆ శరీరాలు శాశ్వతంగా ఈ లోకాన్ని విడచినాయ అని పిస్తున్నాయి.

సరస్వతి భయపడి దగ్గిరలోవున్న ఒక ఎత్తైన గుట్ట మీాదకు వెళ్ళి కూర్చుని ఏడ్వసాగింది.

అబ్దుల్ నేరుగా ఆ శరీరాల దగ్గరకు వెళ్ళాడు. పురుష శరీరాన్ని వెల్లకిలా పొర్లించి ముఖం వంక చూశాడు. ఒక్క క్షణకాలం అతను స్థంభించి పోయాడు. గుండె ఆగినంత పనయింది అతనికి...! మెల్లగా వణుకుతున్న స్వరంలో "అరె...ఇతను ఫజల్ !" అన్నాడు అబ్దుల్.

వెంటనే ఆత్రంగా ప్రక్కనే వున్న స్త్రీ శరీరాన్ని పొర్లించి చూశాడు. అతను ఒళ్ళు మరచి గుండెలు జలదరించేటట్టు కేక వేశాడు. "రజ్జీ...రజ్జీ...!"

సరస్వతి గుట్ట దిగి అతని దగ్గరకు వచ్చి అడిగింది. "నీకు...నీకు...!"

"ఆఁ నా చెల్లెలు!" అబ్దుల్ రుద్ధస్వరంలో అన్నాడు.

గంగ అన్నది "అరె...ఈమె బ్రతికే వున్నది... అదుగో ! గుండెలు ఆడుతున్నాయి !"

సరస్వతి అన్నది. "చాలా నీళ్ళు త్రాగినట్టున్నారు. ఇదిగో గంగా ! నీవు ఇటు రా, ఈమెచేత నీళ్ళు త్రాగినవి కక్కిద్దాం ! అబ్దుల్ ! నీవు అతనిచేత కక్కించు !"

అబ్దుల్ ఫజల్‌ను వెల్లకిలా పడుకోబెట్టి నీళ్ళు కక్కించాడు. కాని అతని శ్వాస ఆడటం లేదు. అబ్దుల్ మెల్లగా అతని కాళ్ళనూ చేతులను పయికీ క్రిందకూ కదిలించి కృత్రిమ శ్వాసను కలిగించసాగాడు. కొద్ది క్షణాల తరువాత ఫజల్ శ్వాసకోశాలు తిరిగి యధాప్రకారం పనిచేయసాగాయి.

అబ్దుల్ ఫజల్ శరీరాన్ని తన చేతులతో రుద్ది బాగా వేడి ఎక్కించాడు. ఫజల్ పూర్తిగా తేరుకున్న తరువాత అబ్దుల్ తన చెల్లెలు రజ్జీ దగ్గరకు వెళ్ళాడు. అతను అవ్యక్తంగా చెల్లెలను కేక వేశాడు "రజ్జీ ! రజ్జీ !"

గంగ సంతోషంలో ఎగిరిపడ్డది "రజ్జీ లేచింది !"

సరస్వతి అన్నది "వీళ్ళను ఇంటికి పట్టుకు పోదాం. వేడి పాలూ ఖర్జూర పళ్ళూ ఇచ్చామంటే వెంటనే తేరుకుంటారు !"

అబ్దుల్ ఫజల్‌ని, సరస్వతి గంగలు రజ్జీని పైకి లేవదీశారు.

అబ్దుల్ అడిగాడు "మీ ఇల్లు ఎంత దూరం?"

సరస్వతి అన్నది "అదిగో ! ఆ 'చఖరీ' చెట్లులేవూ? గుంపుగా ! వాటి వెనకాలే, ఎక్కువదూరం లేదు ! రండి !"

ఇల్లు ఏమంతదూరం లేదు. ఏమంత పెద్దదికూడా కాదు. బయట గోడలమీద కూరమొక్కల పాదుల తీగెలు అల్లుకొని వున్నాయి. లోపల వసారాలో రెండు ఆవులు కట్టివేయబడి వున్నాయి.

మధ్య గదిని దాటి వంటఇంటి మొదట్లో పొయ్యి ముందుకూర్చుని ఒక ముసలమ్మ వంటచేస్తున్నది. ఆమెలో పలికివస్తున్న ఈ జనాన్ని చూసి ఆశ్చర్యపడ్డది. పెనంమీద రొట్టెను వేసిన విషయంకూడా మరచి నూతనులవంక చూస్తూ వుండడంవల్ల రొట్టె మాడిపోయింది.

మధ్యగదినిదాటి వాళ్ళు ఒక చీకటికొట్టులాంటి గదిలోకి పోయారు. గంగా సరస్వతులు రజ్జీని అక్కడే పక్క వేసి పడుకోబెట్టారు. ముసలిది మెదలకుండా మౌనంగా చూస్తూవున్నది.

సరస్వతి అడిగింది "అమ్మా ! పాలుతీశావా?"

"రోజూ నేను తీస్తున్నానా? వీళ్ళు ఎవరు?" ముసలామె చాలా నిష్కర్షగా కఠినంగా మాట్లాడింది.

సరస్వతి మరేమీ మాట్లాడలేదు. పాలపిడతను తీసుకొని మెదలకుండా వసారాలోకిపోయింది పాలు పితకడానికి. అబ్దుల్ కూడా వెంట వెళ్ళాడు. ఒక స్తంభాన్ని ఆనుకొని మౌనంగా నిలబడ్డాడు.

ముసలామె అబ్దుల్ దగ్గరకువచ్చి అడిగింది "నువ్వెవరు?"

సరస్వతి అందుకొన్నది "అతనొక బాటసారి!"

"అది నాకూ తెలుసు! అసలు ఎవరతను? కులం? వాళ్ళు ఇద్దరూ ఎవరూ?"

గంగ రాతిమీద సొంఠిఅరగదీస్తూ అన్నది. «అమ్మా! వాళ్ళిద్దరూ కాగాన్ నదిలో స్పృహతప్పి పడివుంటే తీసుకొచ్చాము. నీవుకూడా కొంచం మాకు సాయంచేశావంటే త్వరలో తెప్పరిల్లుకొంటారు. కొంచం ఆ వరుపులోని దూదిని గుడ్డలోకట్టి వెచ్చచేసి ఇవ్వు. వాళ్ళకు కాపుతాము త్వరగా లేస్తారు!"

"అసలు వీళ్ళు ఎవరో చెప్పందే?"

«బాగున్నది! నాకేం జ్యోతిష్యంతెల్సునా? ముఖాలు చూస్తూనే ఫలానా జాతి, ఫలానా కులమూ అని చెప్పడానికి! స్పృహకువచ్చాక అడిగి కనుక్కుందాము!" కోపంగా సమాధానాన్నిచ్చింది గంగ.

"కాని, ఇతను స్పృహలోనేవున్నాడుగా! చెప్పడేం?" అబ్దుల్ని చూపుతూ అడిగింది తల్లి.

సరస్వతి చప్పున అందుకొన్నది «ఇతనిపేరు రామదాసు!" అంటూ పిడతతీసుకొని పాలుపితుక్కొని కాగబెట్టడానికి పొయ్యిదగ్గరకు వెళుతున్న సరస్వతి అబ్దుల్ కాలిని

బలంగా త్రోక్కింది. అబ్దుల్ వెంటనే హిందువులా రెండు చేతులనూ జోడించి ముసలమ్మకు నమస్కారం చేశాడు.

అబ్దుల్ వైపు అనుమానంగా చూస్తూ "రామదాసా?" అన్నది తల్లి.

అబ్దుల్ ముసలామెవైపుచూసి చిన్నగా నవ్వాడు.

## 4

ఇలాంటి సమయాల్లో సొంతికొమ్ము రామబాణంలా పనిచేస్తుంది. తెలివిరాగానే రజ్జీ "ఫజల్ ఏడీ?" అని అడిగింది.

ఫజల్‌కు స్పృహరాగానే సహజంగానే "యా అల్లా!" అన్నాడు.

ఇలా "ఫజల్" అని పురుషుడిని స్త్రీ సంబోధించడం. పురుషుడు కండ్లు తెరవంగానే "యా అల్లా!"అనడం వినేసరికి ముసలామె గుండెలు అవిసిపోయినాయి. నూతనులు ముస్లిములని త్రికరణశుద్ధిగా నిర్ణయించుకొన్నది. పైగా వాళ్ళు దేవుడి మందిరంవున్న గదిలోకి వచ్చారు. ఆ గదీ, దేవుడూ సర్వం మైలపడ్డాయి! ఎలా?

ఇదే సమయాన రజ్జీ అబ్దుల్‌ని చూసింది. అనాలోచితంగా "అబ్దుల్...అన్నయ్యా! నువ్వా? అనేసింది రజ్జీ!

అన్నా చెల్లెలూ ఇద్దరూ కౌగలించుకొన్నారు.

ముసలామె మండిపడ్డది. సరస్వతిని అడిగింది. "ఇతని పేరు రామదాసని చెప్పావుగా?"

సరస్వతి ఏమీ ఎరుగనట్టు "నాకేం తెలుసు? నాతో అట్లాగని చెప్పాడు!" అన్నది.

"అయ్యో! రామరామా! నా దేవుడిమందిరం మైల పడిపోయింది. ఈ గదినిమొత్తం గంగాజలంతో పవిత్రం చెయ్యాలి! సందూపా ప్రతియేడూ హరిద్వారం వెళ్ళి ఒక పెద్ద టిన్నులో గంగాజలం పట్టుకువస్తాడు. అర్ధరూపాయికి రెండుచుక్కల చొప్పున అమ్ముతాడు. ఇప్పుడవి పట్టుకువచ్చి చల్లితేగాని ఈ గది పవిత్రం కాదు. అర్ధరూపాయి ఎక్కడ నుండి తేను?" అన్నది ముసలామె.

"అర్ధరూపాయికి రెండు చుక్కలా? ఎందుకమ్మా డబ్బులు దండగ, మీ ఇంట్లోనే వుందిగా గంగ!" అబ్దుల్ అన్నాడు.

గంగ నవ్వింది.

ముసలామెకు నవ్వు రాలేదు. ఆమె కూతుళ్ళమీద అరుస్తూకూడా రజ్జీ ఫజల్, అబ్దుల్-ముగ్గురూ తమలో తాము మాటలాడుకొంటున్నారు. సరస్వతి పక్కనే నిప్పుచేసింది. పొగపోవడానికి స్రాడుతోన్నది నిప్పును!

"గంగా, ఎంతపని చేశావే! సరస్వతీ నీకు బుద్ధి ఎలా లేకపోయిందే?" ముసలామె ఒకచే తీరాన అరుస్తున్నది.

సరసస్వతి అన్నది. అటుచూడు, "అమ్మా! పొయ్యిలో రొట్టె మాడిపోతున్నది!"

"మాడిపోనీ, నాకు ఇప్పుడు కులంవాళ్ళకు ముఖం ఎలా చూపించడమా? అనేది పట్టుకొన్నది. నా యింట్లోకి ముసల్మానులు వచ్చారుకదా, ఇంక ముఖమెలా చూపను?" అన్నది తల్లి.

గంగ మండిపడ్డది "కులంవాళ్ళంటావు? ఎవరాకులం వాళ్ళు! ఊళ్ళో మిషర్‌బు ఆరాంది ఒకటి బ్రాహ్మణకొంప!

నాన్నగారు పోయినప్పటినుంచీ వాళ్ళకూ మనకూ ఏ విధమైన సంబంధమూ లేదు. మంచికి కానీ, చెడ్డకు కాని, వాళ్ళింటికి మనం పోము మన యింటికి వాళ్ళు రారు ! ఇలాంటి కులాన్ని ఏం చేసుకొంటావు ? నెత్తిన కొట్టుకొంటావా ?"

"ఊఁ"

సరస్వతి అన్నది "నిరుడు మనచేను నాటేసింది ఎవరూ? మిషర్‌బు ఆరాంగానీ, అతని కొడుకుగానీ వేశారా ? లేక ఖుదాభిక్షు కొడుకు మంజూద్ వేశాడా ? వాళ్ళ కడుపు చల్లగా వాళ్ళు దున్ని, నాట్లు వేశారు కనుక ఈ ఏడు యింత తిండి తింటున్నాము !"

గంగ అందుకొన్నది "మరి మనపంటల్ని కోసిందిఎవరు మిషద్‌బుఆరామూ ? లేక అలీజు అల్లుడు గుల్లే కోశాడా?"

ముసలామె చేతులు నలుపుకుంటూ "నాకు అదంతా తెలియదు. ముసల్మానులు నా యింట్లోకి, దేవుడిమందిరపు గదిలోకి వచ్చారు. మందిరాన్ని శుద్ధిచేసుకోవాలి ! రూపాయి దయినా గంగా జలం వుంటేగాని శుద్ధికాదు !" అన్నది.

"కాగాన్ నదిలో నీళ్ళు చాలా వున్నాయి !" అబ్దుల్ అన్నాడు తమ మాటల్ని మాని !

ముసలి విధవరాలు కోపంతో అన్నది "ఏంచేయను ? ముసలిదాన్ని, విధవరాల్ని ! ఇప్పుడు నీవు అన్నమాటకు మా ఆయనగారే వున్నట్లయితే సమాధానం చెప్పేవారు! కాని అశక్తురాల్ని కావడంవల్ల నోరుమూసుకు వూరుకొంటున్నాను... నందూశాహ అర్ధరూపాయికి రెండుచుక్కల గంగాజలాన్ని యిస్తాడు. పాపం ఎప్పుడడిగితే అప్పుడు, పెండ్లి కాని, పేరంటమే కాని యిస్తూ వుంటాడు. అతని ధర్మమా అంటూ ఈ ధర్మ

రహిత కాశ్మీర్ దేశంలో మిగిలివున్న బ్రాహ్మణులం; ఇంత ధర్మాన్ని నిలబెట్టుకొంటున్నాము ! సంక్షి పాయే ఈ నీళ్ళను తేకపోతే మా బ్రాహ్మణులం ఎందునా కాకుండా పోతాము. ఇంతకూ యిప్పుడు ఏదిచేసేట్టు? దేవవిగ్రహాన్ని కడగడానికి, మందిరాన్ని శుద్ధిచేయడానికి, కనీసం రూపాయిదైనా గంగా జలం కావాలి ! రూపాయి ఎక్కడనుండి తీసుకురాను!" ముసలామె ఏడవసాగింది.

అబ్దుల్ మెల్లిగా తన స్థానంనుంచే కదిలాడు. జేబులో నుంచి ఒక రూపాయిని తీసి ముసలమ్మ చేతిలో పెడుతూ "ఇదిగోనమ్మా ! రూపాయి యిస్తున్నాను తీసుకో ! మేము వెళ్ళిన తరువాత నీ భగవంతుడిని శుద్ధిచేసుకో !" అన్నాడు.

ముసలిఆమె ఆశ్చర్యంగా అబ్దుల్‌వంక చూసింది. ఏమి టితను ? ఇలాంటి ముసల్మాను కూడా వుంటాడా ? నేను హిందువును-నా దేవుడి మందిరాన్ని పవిత్రం చేసుకోవడానికి తనంతతానుగా రూపాయిని యిస్తున్నాడీ ముస్లిమ్ ! ముసలామె ఒకమాటు అబ్దుల్‌వంకా మరొకమాటు, చేతిలోని వెండిరూపాయివంకా అవిశ్వాసంగా, విస్మయంగా చూసుకొన్నది.

అబ్దుల్‌నవ్వి "నీకు అనుమానంగా వున్నట్టున్నది ! క్రిందవేసి మోగించి చూసుకో, దొంగ రూపాయి కాదు. మంచిది !" అన్నాడు.

తొందరలో ముసలామె చేతిలోనుంచి వెండిరూపాయి జారి క్రింద బండమీదపడి ఘల్లుమన్నది. ముసలామె ముఖంలో సంతోషం, కృతజ్ఞతా మెరశాయి.

ఆమె వెంటనే రూపాయిని తన బొజ్జలో దోపుకొని గదినించి బయటికి వెళ్ళిపోయింది.

# 5

ఫజల్‌కు శరీరంలో కొంతబలం వచ్చింది. అబ్దుల్ అతన్ని లేవదీసి కూర్చోబెట్టి విషయాల్ని అడగడం ప్రారంభించాడు. "ఊఁ. చెప్పు! ఏమైంది? త్వరగా చెప్పు, ఏమైంది?" అనడిగాడు.

ప్రక్కనే పడుకొనివున్న రజ్జి ఫజల్‌ను తట్టి "ఇప్పుడే వద్దు ఫజల్...ఇప్పుడే వద్దు...!" అన్నది.

"కాదు ...ఇప్పుడే చెప్పు !

ఫజల్ చెప్పాడు "మీ అయ్యను రాజా కర్మ ఆలీ చంపివేశాడు. రజ్జిని కర్మ అలీ తీసుకొనిపోవా లనుకొన్నాడు!"

అబ్దుల్ శరీరం కంపించింది. వణికింది. సుడిగుండలోపడ్డ పచ్చగడ్డిపరకలా అతను విచలితుడయ్యాడు. అతని చెయ్యి ఫజల్ చేతిమీద మంచుగడ్డ కట్టుకుపోయినట్టు వుండిపోయింది. రెండుక్షణాల అనంతరం మనిషి కొయ్యబారి పోయాడు.

సరస్వతి అతని బుజంమీద చెయ్యివేసింది.

అబ్దుల్ అడిగాడు "తరువాత ...తరువాత...?"

ఫజల్ చెప్పాడు "పన్ను చెల్లించేదగ్గర పోట్లాటవచ్చింది. టికరీ శాహమురాద్ రైతులు పన్ను చెల్లించడానికి ఒప్పుకోలేదు. రాజా కర్మ ఆలీ సిపాయీలతో వచ్చిపడ్డాడు !"

"తరువాత!" అబ్దుల్ చాలా ఆరాటంగా అడిగాడు.

సమాధానానికి బదులుగా ఫజల్ చాలాసేపటివరకూ అబ్దుల్ ముఖంలోకిచూస్తూ వుండిపోయాడు. అలా ఎంతసేపు చూస్తూ వుండిపోయాడో తెలియదు. చివరకు నిదానంగా ఇలా అన్నాడు. "తరువాత మానవశరీరాల్తో వంతెనకట్టారు. రాజా కర్మఆలీ నీ చెల్లెల్ని రాత్రంతా తనగదిలో వుంచుకొన్నాడు.

# 6

అబ్దుల్‌కి చాలాసేపటివరకూ మాటపెగల్లేదు. గుండెల్లో రాయిపడ్డట్టు అయింది. కాళ్ళు మొద్దుబారిపోయినాయి. కొంతసేపు గడచి స్థిమితపడ్డతరువాత మెల్లగా అస్పష్టమైన స్వరంలో "తరువాత ?" అన్నాడు.

ఫజల్ నిదానంగా అక్షరాక్షరాన్నీ చూస్తున్నట్టు అన్నాడు. "తరువాత...నేను నీ చెల్లెలిని పెళ్ళి చేసుకోవాలను కొంటున్నాను."

రజ్జీ తల ప్రక్కకు తిప్పేసుకొన్నది. ఎక్కిళ్ళు పెట్ట సాగింది. గంగాసరస్వతీల కండ్లుకూడా చెమర్చినాయి. అబ్దుల్ ఫజల్‌వంక రెప్పవేయకుండా చూస్తూవుండిపోయాడు. అతని బలిష్టమైన గుండెలను చీల్చుకొని అశ్రువులు కళ్ళల్లో వుబికినాయి. వుండివుండి తనతలను ఫజల్‌గుండెల్లోకి దాచుకొన్నాడు అబ్దుల్. ఫజల్ గట్టిగా అబ్దుల్‌ను కౌగలించుకొన్నాడు.

"ఇప్పుడు ఏం జరిగేట్టు ? పోలీసులు మమ్మల్ని వెతుకుతూ వుంటారేమో !" ఫజల్ అబ్దుల్‌ను అడిగాడు.

"అవును, వెతుకుతూనే వుంటారు." గంగ అన్నది.

అబ్దుల్ ఆలోచనలో పడ్డాడు. ఏంచేసేట్టు ? సరస్వతి అబ్దుల్ ముఖాన్ని గట్టిగా వూగించిఅన్నది. "విను! నీ చెల్లెలు మా యింట్లోనే వుంటుంది. ఫజల్ కూడా మా యింట్లోనే వుంటాడు. వీళ్ళిద్దరూ యిక్కడవుంటే, పోలీసులకు అను మానంకూడా తగలదు. అసలు ఒక బ్రాహ్మణయింట్లో ఇద్దరు ముస్లిములు వుంటారనికూడా ఎవ్వరూ అనుకోరు."

గంగ సంతోషపడి ఇలాఅన్నది. "బాగున్నది. ఈ వుపాయం చాలాబాగున్నది. అదుగో! అబ్దుల్, నీవు రజ్జీనీ, ఫజల్ నూ మాదగ్గర వదిలిపెట్టేశేయి."

అబ్దుల్ అన్నాడు "మీ అమ్మ ఏమంటుందో ? మీ కులం, మీ భగవంతుడు...ఏమంటారో...?"

గంగఅన్నది "అమ్మకు సరస్వతి నిదానంగా అంతా చెబుతుంది. పోతే కులాన్ని నేనసలు లెఖ్ఖచేయను. ఇక భగ వంతుడంటావా ?" అంటూ ఒకమాటు గంగ పవిత్రమైన దేవతా విగ్రహాంవైపు పూజ్యదృష్టితో చూసింది. విగ్రహాం పాదాలమీదకు వరిగింది. చాలాసేపటివరకూ అలాగే పాదాల మీదపడి భగవంతుని ప్రార్థించింది. మెల్లిగాలేచి విగ్రహాన్ని చేతిలోకితీసుకొని మధ్యఇంటినీ, వసారానీదాటి బయటికి వెళ్ళి పోయింది గంగ. కొద్ది క్షణాలతరువాత తిరిగివచ్చింది ఆమె. కాని, ఆమెచేతిలో విగ్రహాంలేదు.

"ఏమిటి నీవు చేసివచ్చినపని?" అబ్దుల్ కోపంగా అడిగాడు.

గంగఅన్నది "మంచి పనేచేశాను. భగవంతుడు ఇక్కడ వుండడంవల్ల చాలాఇబ్బందులు వున్నాయి. ఇక్కడికి మంజూర్

వస్తాడు. గుల్లావస్తాడు. ఊరివాళ్ళు ఎంతోమంది వస్తూ వుంటారు. వీళ్ళందరూ మా చేలల్లో పనులుచేస్తారు. మమ్మల్ని సొంతచెల్లెళ్ళలా చూసుకొంటారు. మమ్మల్ని ఒకమాట కూడా అనరు. కాని, ఈ భగవంతుడిమూలంగా అమ్మ వాళ్ళను గడపదాటి లోపలికిరానివ్వదు. అందువల్ల మేము తప్ప మరెవ్వరూ వెళ్ళని పవిత్రమైన స్థలంలో భగవంతుడిని వుంచి వచ్చాను."

సరస్వతి అడిగింది "ఎక్కడ పెట్టావ్?"

"నీకు చూపిస్తానురా అక్కా!"

'చఖరీ! వృక్షాలమధ్య ఒకచిన్నగుంటవున్నది. గంగ దేవతామూర్తిని ఆ గుంటలో అతిజాగ్రత్తగా వుంచి, చుట్టూ పాదులా మట్టిపోగుపెట్టింది. పొరపాటునైనా నీళ్ళుపోకుండా!" మనం తప్ప ఇక ఇక్కడికి ఎవ్వరూ రారు! ఆ! బాగుందా?" అడిగింది గంగ.

"బాగుంది" అంటూ తల్లివైపుకు తిరిగి" బాగుంది కదమ్మా?" అన్నది సరస్వతి. తల్లి ఏమీ మాటలాడలేదు.

# 7

సరస్వతీ గంగా ఇద్దరూ దేవుడిదగ్గరనుండి తిరిగి వచ్చేసరికి అబ్దుల్ వెళ్ళిపోవడానికి ప్రయాణమై సిద్ధంగా వున్నాడు.

సరస్వతి అన్నది. "భోజనంచేసి వెళ్ళు!"

"తినను!" అబ్దుల్ స్వరం చాలా గంభీరంగా ఉన్నది. క్షణంతరువాత తన స్వరంలోని గంభీరతకు తనే సిగ్గుపడ్డాడు

అతను! చాలా మృదువైన స్వరంలో ఇలా అన్నాడు. "బిడ్డ సరస్వతీ, నాకు ఆకలిగాలేదు!"

అబ్దుల్ గంగతలమీద చెయ్యివేసి నిమురుతూ "నీవు చాలా పిచ్చిదానివి గంగా!" అన్నాడు.

గంగ తన సన్నని, ఎర్రని నాలుకను బయటికిపెట్టి అబ్దుల్ని ఉడికించడానికి అతని స్వరంలోనే "నీవు చాలా అమాకుడివి సోదరా!" అన్నది.

ముసిలామె దగ్గరకుపోయి నమస్కరించి "అమ్మా! నేను వెళుతున్నాను. నా చెల్లెలును నీకూతురిలాగాచూసుకో!" అన్నాడు అబ్దుల్.

ముసలామె ఏమీా మాటలాడలేదు. అబ్దుల్ మెల్లిగా బైటికి పోయాడు.

అబ్దుల్‌కు రజీని, ఫజల్‌నూ అక్కడ ఉంచడం ఇష్టలేదు. కాని, ఏం చేస్తాడు! వేరుమార్గంలేదు. అతను బయటికి వచ్చి 'చఖరీ' వృక్షసమూహంవైపుకు చూసి ఇలా అన్నాడు" భగవాన్, స్వామీ! వీళ్ళు నీ బిడ్డలే!" ఇలా అని అతను ముందుకు నడిచాడు కాగాన్‌వైపుకు. ఇంతలోనే ఎవరో అతన్ని వెనకనించి చొక్కాపుచ్చుకొని ఆపారు. అబ్దుల్ వెనక్కు తిరిగి చూశాడు. ఆపింది సరస్వతి! సరస్వతిచేతిలో ఒక పెద్ద కాగితం పొట్లాం ఉన్నది. పొట్లాంను విప్పింది. దాన్లో వలిచిన అఖరోటుపండ్లూ, కాల్చిన మొక్కజొన్నకండెలూ, బెల్లం వున్నాయి.

సరస్వతి ఆ పొట్లాన్ని అబ్దుల్ చేతిలో పెట్టి "వీటిని పట్టుకుపో! 'నీవు' ఉదయంనుంచీ ఏమీ తిననుకూడా లేదు!" అనేసి తిరిగి ఇంటివైపుకు వెళ్ళిపోయింది సరస్వతి.

అబ్దుల్ హృదయంలో, సరస్వతి నోటిమీదుగా ఉచ్చరింపబడ్డది. 'నీవు' మళ్ళీ ఒకమాటు మెరుపులా మెరిసింది. అబ్దుల్ పెదాలు చిన్నగా నవ్వుకొన్నాయి. అతను చిరునవ్వు ముఖంతో నిర్మానుష్యమైన కాగాన్ నదివడ్డున పడవ సాగాడు. ఆ వడ్డు అతన్ని అతని తండ్రి సమాధి దగ్గరకు తీసుకుపోతుంది ॥

# నాలుగవ అధ్యాయం

టీకరీశాహమురాద్ రైతులు నూరేజులాహా శవానికి అంత్యక్రియలు జరిపి తిరిగివచ్చి, నంబర్‌దార్ ఇలమ్‌దీన్ ఇంటికి ఎదురుగా వున్న సర్కారు మైదానంలో ప్రోగుపడ్డారు. దాదాపుగా ఒక వెయ్యిమంది గుంపువుంటుంది. టీకరీలో జరిగిన అకృత్యాలు ప్రక్కనవున్న అనేక వూళ్ళకు తెలిసిపోయాయి. నూరేను చంపడం, మానవ శరీరాలతో వంతెన కట్టడం, రజ్జీ, ఫజల్ ఇద్దరూ కాగాన్‌లో పడిపోవడం మొదలైనవార్తలు బడవారా, బానోరా, ఝూంగనీ, మొదలైన గ్రామాలకు తెలిసినవి. ఆ గ్రామాల రైతులుకూడా టీకరీ రైతుల్లాగానే పన్నులు ఇవ్వకూడదనే నిర్ణయాన్ని చేసుకొన్నారు. అందువల్లే ఇక్కడ జరిగిన ఈ అకృత్యాల్ని గురించి వివరాలను తెలుసుకోవడానికే తగు నిర్ణయాలను చేసుకోవడానికే, సానుభూతిని ప్రదర్శించడానికీ-ప్రతి గ్రామం

నుండీ పాతిక ముప్పైమంది రైతులు ఒక్కొక్క జట్టుగా తరలి వచ్చారు! అందరూ దుఃఖంతోనూ, క్రోధంతోనూ మునిగి వున్నారు. ప్రతివారి హృదయంలోనూ పగ తీర్చుకోవాలనే భావన తెర్లుతున్నది!

పరిస్థితి విషమంగా వుండడం కనిపెట్టి ఇలమ్‌దీన్ 'రాహో గ్రామపు మౌలవీ జులాలుద్దీన్‌గారిని పిలిపించాడు; ధర్మోపదేశం చేయించడానికి! జలాలుద్దీన్ ఇంగ్లీషుకూడా చదువుకొన్నాడు. రాజా జీవన్‌సింగ్ దర్బారులో ప్రముఖ స్థానాన్ని పొందినవాడు! మనిషి ఎర్రగా దొండపండులా వుంటాడు. గొంతుకూడా చాలా ప్రభావోత్పాదకంగా వుంటుంది. అమాయకులైన రైతులు అతని మాటల్ని దేవవాణిగా విశ్వసిస్తారు! ఇలమ్‌దీన్ ఈతనికి ప్రత్యేక భక్తుడు. అందువల్లే ఇతన్ని రైతులకు మత విషయికమైన ధర్మోపదేశం ఇప్పించడానికి పిలిపించాడు! ఈ ధర్మోపదేశకుడికి ఇద్దరు భార్యలు!

ఈ మౌలవీ జులాలుద్దీనే కాకుండా 'ఝాంగనీ' గ్రామపు హీరన్‌శాహాకూడా వచ్చాడు. ఈయనగారు ప్రసిద్ధమైన గురువులు. ఈయనకు అనేకములైన మాయమంత్రాలూ, టక్కుటమారాలు తెలుసునని ప్రతీతి. వీరిని గురించిన ఒకవదంతి చిత్రమైనదున్నది. వీరి గురువులు ముబారక్ శాహాగారి సమాధి మీద ప్రతిరోజూ రాత్రిపూట లేళ్ళూ, దుప్పులూ వచ్చి, వుచ్చలుపోసి అపవిత్రం చేస్తూవుండేవిట! ఒకరోజు హీరన్ శాహాగారు అర్ధరాత్రిపూట ఎందుకో తన గురువుగారి సమాధి దగ్గిరకు పోయారు. అప్పుడు సమాధిమీద లేళ్ళూ, దుప్పులూ పెగురుతున్నాయి. గోలచేస్తున్నాయి. వీరికి అలవిమాలిన

కోపం వచ్చింది. ఆ లేళ్ళనీ, దుప్పులనీ రాళ్ళూ రప్పలూ అనేట్లుగా శపించారు. వెంటనే, అంతవరకూ ప్రాణం కలిగి ఎగురుతూ, ఆడుకొంటున్న లేళ్ళూ, దుప్పులూ రాళ్ళూ బండలూ అయిపోయినాయి! ఇప్పటికీ కూడా శాహాగారి సమాధి దగ్గిర ఒకపెద్ద బండమీద నాలుగు లేడిబొమ్మలు చెక్కబడివున్నాయి. అవి వీరు శపించిన లేళ్ళే! ఆరోజునుంచే ఈ గురువు పేరు (పీర్) గురువు) హిరన్‌శాహా అనిపడ్డది (హిరన్ అంటే లేడి) ఈ గురువుగారిని ఆప్రాంతంలో అందరూ గౌరవిస్తారు. ఆడవాళ్ళు ప్రత్యేక శ్రద్ధతో పూజిస్తారు. ఈయనగారి దీవెనలకంటే తిట్లనే ప్రజలు ఎక్కువగా స్వీక రిస్తారు. ఈయనగారు ఎదురుపడి నాలుగు తిట్లు తిడితే వెళ్ళే పని పూర్తిగా జరిగిపోయిం దనుకోవచ్చును. కాని నవ్వుతూ మాటాడారా, ఆపని సున్నా జరిగినట్టే! అందువల్ల రైతులు ఎప్పుడూ హిరన్‌శాహాగారి చేత ఎలా తిట్లుతినడమా? అని ఎదురుచూస్తూవుంటారు.

సర్కారు మైదానంలో ప్రోగుపడ్డ రైతుల్లో క్షణ క్షణానికీ వుద్రేకం పెచ్చుపెరుగుతున్నది. కొంతమంది యువ కులు ఈ విషయమై జాగీర్దారుతో, సిపాయీలతో మాట్లాడ టానికికూడా సిద్ధం అయినారు. ఇలా రైతులు చేయిదాటి పోవడాన్నిచూసి జలాలుద్దీన్ ధర్మోపదేశం ప్రారంభించాడు. మొట్టమొదటగా మీరంతా ముస్లిములన్న విషయాన్ని జ్ఞాప కం చేసుకోమన్నాడు. తరువాత వెనుకటి యుగాల్లోని ముస్లి ముల ఔన్నత్యాన్నిగురించి సుదీర్ఘంగా వుపన్యసించాడు. తదుపరి ప్రస్తుతపు ముస్లిముల దీనావస్థనుగురించి కన్నీరు

కార్చాడు. చివరకు అందరినీ ఒకమాటు విస్తృతంగా సంబో ధించి, మీరంతా నిజమైన ముస్లిములుకండి, అన్నాడు. ఆ మీదట ముస్లిములు, నిజమైన ముస్లిములు కాకుండా ధర్మం తప్పడంవల్లనే ఈ గింజలకొరతా, కరువుకాటకాలూ వచ్చినా యన్నాడు. ముస్లిములు ధర్మం తప్పడంవల్ల అల్లా ఈ విధంగా కరువుకాటకాల రూపంలో తనకోపాన్ని తీర్చుకొంటున్నాడు అన్నాడు. ఇది అయ్యాక నూరేజులహో స్మృతినిగూర్చి కొంత సంతాపాన్ని వెలిబుచ్చాడు. చిట్టచివరకు నిజమైన ముస్లిము జాగీర్దారుకు పన్నుచెల్లిస్తూ అణిగిమణిగి వుంటాడనీ, అలా చెల్లించక ఎదురు తిరిగినవాడు ముస్లిముకాడనీ, కాఫిర్ (నాస్తి కుడు ముస్లిముమతాన్ని ఒప్పుకోనివాడు) అనీ అన్నాడు!

ఈ విధంగా ఒక రెండుగంటలసేపు విమర్శనాత్మకమైన ఉపన్యాసాన్నిఇచ్చి, సంతృప్తిగా ఇలమ్‌దీన్ ఇంట్లో విందు చేయడానికి వెళ్ళాడు జలాలుద్దీన్! ఆయనటు వెళ్ళగానే హీరన్‌శాహాగారు అందుకొన్నారు, పీర్ హీరన్‌శాహాగారు మొదటగాలేచి నిలబడి ఒకమాటు ప్రజలవంక చూశారు. తరువాత నవ్వారు. రెండుక్షణాల అనంతరం ఏడ్చారు. తదుపరి రైతులను తిట్టసాగారు. అరేయి దొంగ లండీకొడు కొడుకుల్లారా! మీరు అల్లాకు అపచారం చేశారురా! మీరు చస్తారు. నాశనంఅయిపోతారు. అల్లాకు కోపంవచ్చింది. భయపడండి! మీ అమ్మల...మీ అక్కల...! ఓరి గాడిద కొడుకుల్లారా! మిమ్మల్ని మట్టిలో కలిపేస్తా. నామరూపాలు లేకుండా చేస్తా. లేళ్ళను రాళ్ళుచేశాను. మిమ్మల్ని కూడా రాళ్ళుచేస్తా. పుట్టినప్పుడే అల్లా భాగాలన్నింటినీ నిర్ణయించు

తాడు. జాగీర్దార్ భాగం జాగిర్దారుకు ఇవ్వండి. నంబర్ దార్ భాగం నంబర్ దార్ కు ఇవ్వండి. ఓరి మీ అమ్మల...మీ అక్కల...! ఇలా పీర్ హీరన్ శాహ నిర్విరామంగా గంటల తర బడి వుపన్యాసాన్ని యిచ్చాడు. చివరకు ఆయననోటిలోంచి చొంగ కారసాగింది.' స్పృహతప్పి అక్కడే పడిపోయాడు.

రైతులు కంపించిపోయారు. రైతుల్లో కలవరం బయలు దేరింది. మసగలు బయలుదేరినాయి. "హీరన్ శాహగారు చెప్పింది నిజం! జలాలుద్దీన్ గారు చెప్పిందికూడా నిజమే." ఔను మరి, మన మౌలాలీగారూ, మన హీర్ గారూ మనకు అబద్ధం చెబుతారా? వీరిమాటలు నిజంగా వేదవాక్యాలు!"

## 2

రైతులు తిరిగి పెద్దగా, తీవ్రంగా మాట్లాడుకోసాగారు. ఒకళ్ళను ఒకళ్ళు నిందించుకోసాగారు. మొట్టమొదటగా జాగీర్దారుకు భాగం ఈయ నిరాకరించింది ఎవరు? ఈ నిరాకరణను సమర్థించేది ఎవరు? ఈ విధంగా రైతులు తర్కించుకో సాగారు. ఒకళ్ళను ఒకళ్ళు ఎత్తిపొడుచుకో సాగారు. ఒకరిద్దరు చిన్నగా కొట్లాడుకోనుకూడా సాగారు. క్రమంగా కొట్లాట పెరగసాగింది. చాలామంది రైతులు కర్రలు తీసుకున్నారు. ఎవరు ముందూ, ఎవరు వెనుకా అన్న ఈ విషయంమీదనే రక్తపాతం జరగ సిద్ధంగావున్న సమయంలో ఒకమూలనుంచి సుల్తాను లేచి మాట్లాడసాగాడు.

"సోదరులారా! ఏమిటి? మీలోమీరు పోట్లాడుకొం

-టున్నారా? పరిస్థితి ఏమిటో కొంచమైనా గమనించారా?"
అన్నాడు సుల్తాన్.

"ఏం గమనించక, చక్కగానే గమనించాము. నిన్న కాక మొన్న పుట్టావు, వేలెడు లేవు, నీవు మాకు చెప్ప వచ్చావా? నీ మాటలువినబట్టే వూరు వారందరికీ అపకీర్తి వచ్చింది!" రహమాన్ పెద్దగా అరుస్తూ తన చేతికర్రను సుల్తాన్ మీదకు విసిరాడు. సుల్తాన్ తప్పుకొన్నాడు.

"మరీ మూర్ఖంలో పడిపోకు! ఎవ్వరి మాటల్నీ వినకు! స్వంతబుద్ధిని వుపయోగించి ఒక్కక్షణం ఆలోచించు! ఈ విధంగా పండిన ధాన్యాన్ని తలాకొంచెం పంచేస్తే ఇక రైతులు తినేదేమిటి?" అన్నాడు సుల్తాన్.

"ఏం తింటామా? నీతలకాయ!" రహమాన్ మళ్ళీ కర్ర విసిరాడు. కాని ఈసారి నబీబక్ష రహమాన్ చేతిలోనుంచి కర్రను లాగేశాడు" అరె...కుర్రవాడు...ఏమిటీ వుషారుగా మాట్లాడుతున్నాడు, మాట్లాడనీ, విందాం, నష్టం ఏంవచ్చింది అన్నాడు నబీబక్ష!

"నేను చెప్పే చివరిమాట ఒక్కటే, ఒక్కటి! మనం రైతులం-ఇలా మనలోమనం పోట్లాడుకుంటే అనవసరంగా చచ్చిపోతాం, లేక కలసి ఒక్కటిగావున్నామా జాగీర్దారూ, జమీందారూ, సిపాయిలూ అందరూ కలిసికూడా మనల్ని ఏమీ చెయ్యలేరు. మనల్ని వంచలేరు!" సుల్తాన్ అన్నాడు.

"అవును. నీవు చెప్పింది బాగానేవున్నది. కాని, ఇప్పుడు మేము ఏంచెయ్యాలి?" చాలామంది రైతులు తలలు వూపారు.

సుల్తాన్ అన్నాడు: "పంచాయ్యాలీ అన్నది నాకు బాగా తెలియదు. కాని, రాజా కర్మఆలీ ఇక్కడ అంటే మన గ్రామంలో చాలా అవమానింపబడ్డాడు. ఒక్క నూలువాసిలో నదిలో మునిగి చచ్చిపోయేవాడు. తప్పించుకున్నాడు. అందుకు అతనికి మనమీద అపారమైన కోపం పొంగుతున్నది. ఆ కోపాన్ని చల్లార్చుకోవడానికి ఈ గ్రామంమీద రెండువందలూ చుట్టుపట్ల గ్రామాలమీద మూడువందలూ రూపాయలు జుల్మానా వేశాడు.

"ఇది అబద్ధం! ఇది అబద్ధం! రాజాకర్మఆలీ ఏ విధమైన జుల్మానా వేయలేదు!" చాలామంది రైతులు అరచారు.

"నేను అబద్ధం చెప్పడంలేదు. రహమాన్ యిందాక నాతో అన్నాడు. కావాలంటే అడగండి."

రైతులు రహమాన్ గొంతు పట్టుకొన్నారు "చెప్పు! నిజమేనా? చెప్పు! నిజమేనా ?"

రహమాన్‌ని నాలుగువైపులా క్రోధితులైన రైతులు చుట్టుముట్టారు. రహమాన్ పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. మెల్లగా "అవును. నాకు ఇలమ్‌దీన్ చెప్పాడు. ఎవ్వరితోటీ చెప్పవద్దనికూడా అన్నాడు!" అన్నాడు.

రైతుల అనేక స్వరాలు ఏకంగా ధీత్కరించాయి. "ఏడా గాడ్దికొడుకు? ఆ ఇలమ్‌దీన్ ఏడీ? మాముందుకి తీసుకు రండి!"

గులామ్‌నబీ అన్నాడు "అతను మాలవీజలాలుద్దీన్ గార్ని ఇంటికి తీసుకువెళ్ళాడు."

"వాడమ్మ...దొంగలంజాకొడుకు...పదండి యింటికి పోయి పడదాం. వాడిని నిలువునా పాతేద్దాం. అదే వాడికి మందు...!"

"అంతే... అంతే...అదేచేద్దాం!" కొన్ని వందలమంది రైతులు తలలూపి సిద్ధం అయ్యారు ఇలమ్‌దీన్‌కి నిలువునా పాతెయ్యడానికి.

"ఆగండి!" సుల్తాన్ పెద్దగా అరిచాడు. రైతుల్లోని ఈ ఆవేశాన్ని చూసి సుల్తానుకు భయంవేసింది. రైతుల్లో తన మాటలు ఇంతగా పనిచేస్తాయని అతను అనుకోలేదు. ఒకవంక తన ప్రభావాన్ని రైతుల్లోచూసి సంతసిస్తున్నాడతను. మరొక వంక యిక ఏమిజరగనున్నదో?" ఇక ఏమిజరగనున్నదోనని భయపడుతున్నాడతను. తన కండ్ల ముందు ఉద్భవిస్తున్న రైతుల్లోని ఈ క్రొత్తశక్తిని చూస్తూవుంటేనూ, దాన్ని గురించి ఆలోచిస్తూవుంటేనూ సుల్తాన్‌కు గుండెల్లో అదటుగా వుంటున్నది!

సుల్తాన్ ముఖంవంక, సుల్తాన్ అనుజ్ఞకోసరం దాదాపుగా వెయ్యిమంది రైతులు ఎదురుచూస్తున్నారు. అందరి ముఖాల్లోనూ ఒకేరకమైన భావోద్రిక్తత, భావావేశం కనుపిస్తున్నాయి.

సుల్తాన్ అన్నాడు "నలుముఖాలా పోలీసులువున్నారు. ఎవ్వరుగాని, ఏమాత్రమైనా పొరపాటుగా వ్యవహరిస్తే, నిలువునా కాల్చేస్తారు. ఒక్క నూరాజులాహో సమాధి ప్రక్కన మరొక నూరు సమాధులు తయారౌతాయి. కనుక వుద్రేకపడి

ప్రయోజనంలేదు, మరొకమార్గం వెతకాలి! మరొకఉపాయం చూడాలి!”

ఒక యువకుడు క్రోధంతో అన్నాడు “ఆ క్రొత్త ఉపాయం ఏమిటో నువ్వే చెప్పు! మన చెల్లెళ్ళనూ, అక్కలనూ జాగీర్దారుగారి డేరాలోకి పంపించడమేనా ఆ ఉపాయం!”

సుల్తాన్ అన్నాడు “నేను అనేది, మనం ఒక అర్జీరాసి మహారాజా జీవన్‌సింగ్‌గారికి పంపిస్తే...అయ్యా! మీ వుద్యోగులు, మీ సిపాయీలు, మీ పోలీసులు, మీ జాగీర్దారుగారు, మీ కాహన్‌సింగ్ వీరంతా...మమ్మల్ని ఇలాంటి బాధల్ని పెడుతున్నారని రాసిపంపిస్తే? నేను చెబుతున్నాను, మహారాజుగారు తప్పకుండా వింటారు. మన మొర తప్పకుండా ఆలకిస్తారు!”

“అవును తప్పకవింటారు! మహారాజుగారు చాలా మంచివారుట!”

“అయితే అర్జీరాయండి!” ఒకరైతు అన్నాడు.

“అయితే అర్జీరాయండి!” ముగ్గురురైతులు అన్నారు.

“అవును రాయండి......అర్జీరాయండి – ఇప్పుడే రాసెయ్యండి!” మూడువందలమంది అరిచారు.

ఒకరైతు పరుగెత్తుకుంటూవెళ్ళి ఎదురుగావున్న చెట్టు మానుకు అంటించబడ్డ ఒక పాత పోలీస్ నోటీసును వూడ పెరుక్కువచ్చి సుల్తాన్‌ముందు వుంచి “అవును రాయి, ఇప్పుడే రాయి, త్వరగారాయి!” అన్నాడు.

సుల్తాన్ చాలా వివశంగా “అరే...ఎలారాయను? నాకు చదువురాదుగా! రాయడం రాదుగా!” అన్నాడు.

నాలుగువైపులా కలయచూశాడు అర్జీరాయగలవాడికోసరం!

ఒక వెయ్యిమంది రైతులు వివశంగా తమలో తాము చూసుకోసాగారు. వాళ్ళల్లో ఏ ఒక్కడికికూడా వ్రాయడం రాదు. వాళ్ళకు చదువురాదు. సంధ్యరాదు. వ్రాతరాదు. వాళ్ళదగ్గిర, భాష, భావాలూ, పరస్పర సానుభూతి వున్నాయి! కాని, వ్రాయలేరు! వాళ్ళు శ్రమచేయగలరు. ప్రేమించగలరు, తల్లీ, తండ్రీ అన్నా అక్కల స్నేహాన్ని ఆస్వాదించగలరు! కానీ, వాళ్ళకు వ్రాతరాదు! గీతం, కవిత్వం, శక్తీ, కన్నీరు అన్నీ వున్నాయి వాళ్ళదగ్గిర! కాని, వ్రాతలేదు! క్రియాత్మకమైన శక్తీ, పరిశ్రమలోని సౌందర్యం వాళ్ళదగ్గిర వున్నాయి. కాని, చదవడం, వ్రాయడం వాళ్ళకు రాదు! ఆ అమాయక రైతులదగ్గిర సర్వశక్తులూ వున్నాయి! కాని ఏమీచేయలేరు వివశులు! అన్నీవుండీ ఏమీలేనివాళ్ళయారు. ఈ ఒక్క చదువురాని కారణంగా వారినుండి సర్వం దోచుకోబడుతోంది. సంగీతం స్వరాన్నీ సౌందర్యం లావణ్యాన్నీ అంతర్నిహితం చేసుకొన్నట్టు అజ్ఞానం, నిరక్షరాస్యత రైతుల సర్వశక్తులనూ అంతర్నిహితం చేసుకొన్నాయి. మొగ్గను పుష్పంగానూ, స్త్రీని మాతృదేవతగానూ, రచనాశక్తిని క్రాంతిగానూ మార్చే ఆదర్శం వాళ్ళకు లేదు. వాళ్ళు నిరాదర్శులు!

రైతులు క్రోధోన్మత్తులై ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసుకొన్నారు వివశంగా! దూరంగా అబ్దుల్ రాకను ఎవడో చూశాడు. వెయ్యిమంది రైతులూ ఒక్కసారిగా అరిచారు. సంతోషం పట్టలేక! తమవైపే వస్తున్న అబ్దుల్‌కు ఎదురు పరుగెత్తారు. రైతులు ఇలా తనవైపుకు గుంపుగా

ఎందుకువస్తున్నారో అబ్దుల్‌కు అర్థంకాలేదు. ఏమైనా పారి పోవడం ఉత్తమం అనుకున్నాడు. కాని, ఇంతలోనే రైతులు అతన్ని చుట్టేశారు. ఒకరైతు పోలీసు నోటీసును త్రిప్పి వెనుక భాగాన్ని అబ్దుల్ చేతుల్లోపెట్టి "రాయి...రాయి'" అన్నాడు. మరొక రైతు సన్ననిపుల్ల నొకదానిని తెచ్చి అబ్దుల్ చేతికి ఇచ్చి పెద్దగా అరిచాడు "రాయి...రాయి...!"

అబ్దుల్‌కు ఏమీ అర్థంకాలేదు. "ఏంరాయను ?" అన్నాడు.

ఒక ముసలి రైతు అన్నాడు. "రాయి...దీనిలో రాయి...రజ్జీ నాకూతురు ఇవ్వాళ చనిపోయింది ... ఊఁ రాయి !"

మరొకరైతు అన్నాడు "రాయి... పొలం దున్నకోవ డానికి, నాకు ఎద్దులులేవని రాయి !"

మూడో అతను అన్నాడు ! "నాకు తిండికి గింజలు లేవని రాయి !"

నాలుగో అతను అన్నాడు "మహారాజుగారైన జీవన సింగ్‌గార్కి, నాభూమి లాలామీరాషా దగ్గిర తాకట్టులో వున్నది ! – అరె...రాయీ ? రాయవేం?".

రైతుల చేతివ్రేళ్ళు అబ్దుల్ చేతికి గ్రుచ్చుకుపోయి నాయి.

అయిదవ అతను అన్నాడు "రాయి–మేము ప్రాణాల నైనా ఇస్తాంగానీ, ఇక ఈ అత్యాచారాలను సహించం! కావా లంటే మేము తుపాకీగుండ్లకు మా గుండెలను బలిపెడతాం కాని మా కూతుళ్ళ అవమానాలను చూడలేము. కావాలంటే

మీరు మమ్మల్ని చంపండి, కాని మా పొట్టలు మాడ్చి కాని జాగీర్దార్లకు ధాన్యాన్ని కొలవము. రాయి...రాయి... రాయవేం?"

అబ్దుల్ రాయకుండా అవ్యక్తంగా రైతులవంక చూస్తున్నాడు. వెయ్యిమంది రైతులు అతని చేతులు పుచ్చుకుని నిల్చున్నారు. వాళ్ళ గోర్లు అతని ముంజేతిలో గుచ్చుకు పోతున్నాయి. రక్తం స్రవిస్తున్నది. అయినా ఎవ్వరూ చూడడంలేదు. వెయ్యిమంది ఆవేశపూరితమైన కేకలు అతని చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. వాళ్ళ వేడి నిశ్వాసలు అతని ముఖానికి తగులుతున్నాయి. నలువైపులనుంచీ కేకలు "రాయి.. రాయి...రాయి... ఇది నా కథ. ఇది శతాబ్దాలుగా గాలిలో కరుగుతున్న నా కథ... కాగితం మీద పెట్టు: రాయి... ఇవ్వాళ తెగించి చెబుతున్నాను!"

ముసలి రైతు తన చేతులను వెనక్కు తీసుకున్నాడు. అబ్దుల్ ముంజేతినించి తన కారణంగా రక్తం కారడాన్ని చూచి సిగ్గుపడ్డాడు. అబ్దుల్ ముసలి రైతువైపు ఒకమాటు, కారుతున్న రక్తంవైపు ఒకమాటూ చూశాడు. మెల్లగా చెట్టు పుల్లను తీసుకొని రక్తంలో ముంచి వ్రాయసాగాడు. "మహారాజ రాజశ్రీ, ప్రభువులూ, మాకు రక్షకులూ అయిన మహారాజ జీవన్‌సింగ్‌గార్కి..."

సన్నని రక్తపు చార పోలీస్ నోటీసు వెనుకభాగాన్ని అలుముకొన్నది.

# ఐదవ అధ్యాయం

లాలామీరారామా తన గదిలో కూర్చుని జమాఖర్చుల పుస్తకాలను ముందువేసుకొని లెఖ్ఖలు కట్టుకొంటున్నాడు. ఆ గది చాలా యిరకాటం అయినది. అయినా లాలా దాన్ని అన్నివిధాలా వాడుకొంటున్నాడు. అదే అతని ఆఫీసుగది. అదే అతని దుకాణపుగది. అదే అతని సరుకులకు గోదామ్! ఒకవైపున క్రిందినుంచి చూరుపైవరకూ ధాన్యపు భస్తాల వరుసలు వున్నాయి. మరొకవైపున బెల్లపుబుట్టలు. టీ ఆకు డబ్బాలు. ఎండు రేగుల టిన్నులూ, అక్కడే ఒక రేక్‌లో గుడ్డలతానులు – వీటిముందు రెండు త్రాసులూ రాళ్ళూ వున్నాయి! చూడడానికి ఈ రెండుత్రాసులూరాళ్ళూ ఒకటిగానే కనుపిస్తూ వుంటాయి. కాని, కొనేప్పుడు ఏత్రాసునూ రాళ్ళనూ ఉపయోగించాలో అమ్మేవ్వుడు ఏత్రాసూరాళ్ళను ఉపయోగించాలో లాలాకే తెలుసు! ఒక ఇరవై, పాతిక రేకు డబ్బాల్లో ద్రాక్షపండ్లు, పప్పులు, మందులూ ఇతరసరుకులూ అమర్చి వున్నాయి. ఒకవైపున రకరకాలైన గాజుల బొత్తులు త్రాళ్ళకు కట్టి పైనుంచి వేళ్ళాడ దీయబడి వున్నాయి. లాలా ఆనుకు కూర్చున్న గోడ పైవరుసన కృష్ణుడూ, రాముడూ, బ్రహ్మా, విష్ణూ, శివాజీ మహాత్మాగాంధీ, మహారాజ హరిసింగ్ మొదలైనవారి ఛాయాచిత్రాలు తగిలించి వున్నాయి. ఈ చిత్రాలకు క్రింద రంగురంగుల కాగితాలు అందంగా కత్తి

రించబడి తోరణాలుగా అతికించి వున్నాయి. కాగితాలకు క్రింద వివిధరకాలైన అద్దాలూ. నకిలీ ముత్యాలహారాలు గోడన వేళ్ళాడుతున్నాయి! వీటన్నిటికీ క్రింద ఎత్తైన పరుపు వేసుకొని, గోడను ఆనుకొని కూర్చుని, లాలా ఫతేహాదీన్ జులాహా ఖాతాను మొత్తం లెఖ్ఖ తేల్చడంలో నిమగ్నుడయ్యాడు !

లాలామీరాషా లెఖ్ఖల పుస్తకాలనుంచి తల ఎత్తి "ఫత్తూ ! నీ లెఖ్ఖను మొత్తం తేల్చానోయ్ ! ఈ రెండుఏళ్ళనుంచీ నీవు నాకు నేసిఇచ్చిన బట్టలకూ, నేను నీకు ఇచ్చిన ధాన్యపు గింజలకూ, ఇతర సరుకులకూ నేను, నీకు ఇవ్వవలసినదిగానీ, నీవు నాకు ఇవ్వవలసినదిగానీ కానీ లేదు !"

ఫతేహాదీన్‌కు (ఫత్తూకు) పోయినప్రాణాలువచ్చినాయి. వణుకుతూన్న చేతుల్తో తన తెల్లనిగడ్డాన్ని సవరించుకొంటూ "భగవంతుడి దయ లాలా! కాని, ఈసారి నూలుకొనటానికి డబ్బులేదు, ఏంచేయను!" అన్నాడు.

"నీకు కావాలంటే ఏకులు నా దగ్గరనుంచే పట్టుకుపో. నూలు వడుక్కో! ఐతే, నేను నీకు ఏకులకు ఏకులధరకాక, నూలుధర తీసుకుంటాను. వడికినకూలిని నీవు వదులుకోవలసి వస్తుంది," లాలామీరాషా అతి నిమ్మళంగా చెప్పాడీమాటని.

"సరే, భగవంతుడు నీకు మేలుచేస్తాడు. లాలా! తిండి గింజలు లేవు. అవికూడా పెట్టుబడిపెట్టు."

"సరే, ఇక్కడ వేలుముద్ర వెయ్యి!"

ఫతేహాదీన్ వేలుముద్ర వేస్తూవుండగా లాలా ఇలా

అడిగాడు. "నీ కూతురు గుల్ ఇప్పుడిటు రావడమే మానే సింది. కనపడటంలేదేం?"

ఫతేహాదీన్ ఖాతాపుస్తకంలో వేలుముద్ర వేసి, చేతికి వున్న మసిని తలకు రాచుకొంటూ "వచ్చే భాద్రపదంలో దానికి పెండ్లి. అందుకనే ఒంటరిగా బయటికి రావడంలేదు. అదికాక మనవూళ్ళో గోలలు ఎక్కువగా వున్నాయికదూ! పాపం అనూరా..." అన్నాడు.

"అరే...ఫత్తూ ఏగోలలు జరిగితేమాత్రం నీకు ఏమిటోయ్ భయం? నీవు ఎవ్వరిజోలీ పోంంరి పట్టించుకోవు. గోసంటి చాలాసార్లు అనుకొన్నది. ఒక్కమాటు గుల్ని ఇటు పంపించరాదూ?"

"రోజులు మారిపోయినాయి లాలా. క్రిందవూళ్ళో గోల విను రైతులు ఎలా అరుస్తున్నారో...ఇవ్వాళ అందరూ నిప్పులుత్రొక్కినట్టు వున్నారు."

కొన్ని నిమిషాలు ఇద్దరూ నిశ్శబ్దంగా వున్నారు.

క్రింద వూళ్ళోనుంచి రైతులు కేకలూ, అరుపులూ నదీ ప్రవాహాపు కలకలధ్వనిలా అవిరామంగా వినిపిస్తున్నాయి.

లాలా అన్నాడు. "వట్టి మూర్ఖులు. రాజాకర్మఆలీకి వ్యతిరేకంగా రాజా జీవనసింగ్‌గార్కి అర్జీ రాసి పంపిస్తున్నారుట...వట్టి మూర్ఖులు..."

"అవును నేనూ అలాగేవిన్నాను. రాయిస్తున్నారుట. మరి భగవంతుడు ఏం చేయదల్చుకొన్నాడో?"

"రాజా కర్మఆలీ వీళ్ళ మూలకంగా ప్రాణాపాయ స్థితి నించి బయటపడ్డాడు. ఇంతటితో వూరుకొన్నారా అదృష్ట

వంతులే! ఊరుకోక వూఁ ఆఁ అన్నారా వూసవూరంతా తగల పెట్టించేయిస్తాడు. ఇప్పుడే సిపాయీలు క్రిందకు, వూళ్ళోకి వెళ్ళారు.

"పాపం అంతపని జరక్కూడదు."

"ఏమ్! ఫత్తూ! నీవు యిలాంటివాటిల్లో జోక్యం కలిగించుకోకు."

"అబ్బే...నాకు ఇలాంటివన్నీ ఎందుకు లాలా? అల్లాను తల్చుకొంటూ ఒకమూల పడివుండే ముసలివాడిని!"

"సరే, వెళ్ళు. గోమతి చూడాలనుకొంటున్నదిగానీ, గుల్‌ని పంపించు."

"సరే లాలా! సలాము."

ఫత్తూ కర్రసాయంతో గదిలోనుంచి బయటికి వెళ్ళిపోయాడు. బయట వరండాలో గోమతి ఎదురయినది. ఫత్తూ వంగి నమస్కరించి "కులాసాగా వున్నారా అమ్మగారూ!" అడిగాడు.

గోమతి ఒక పళ్ళెంలో పలహారాలను పెట్టుకొని ఖానే దార్ హాశమత్ అల్లాబేగ్‌కు తీసుకుపోతున్నది. వాసనకొట్టే నల్లని గుడ్డలతో వున్న ఫత్తూను చూచి ఒక ప్రక్కకు తప్పుకొని నిలబడ్డది. అన్నది. "నీవు కులాసాగా వున్నావా? గుల్ ఎలా వుంది!"

"బాగానే వుంది ఇవ్వాళ పంపిస్తానమ్మగారూ! మీరు రోజూ గుల్‌ని పిలిపించమంటున్నారుటగా, లాలా చెప్పాడు!"

"ఆఁ అవును...పంపించు...చాలా రోజు లయినది దాన్ని చూసి!"

ఫత్తూ మళ్ళీ ఒకమాటు నమస్కరించాడు. గోమతి వయ్యారంగా లోపలకు పోయి మీరాషా గది దగ్గర ఆగి అన్నది "నీకు అన్నం వంట ఇంటిలో పెట్టివుంచాను. వెళ్ళి తిను!"

మీరాషా తల ఎత్తకుండానే "సరే" అన్నాడు.

"నేను థానేదార్ గారికి అన్నం పట్టుకు పోతు న్నాను!"

"సరే!" మీరాషా మరికొంచం పద్దుల పుస్తకాల మీదకు వంగాడు.

"గుల్ ను నువ్వెందుకు పిలిచావు? పిలిపించమని నేను ఎప్పుడన్నాను?"

"ఈ ఇంటిలో ఎప్పుడూ మగవాళ్ళే వుంటున్నారు. అందువలన నేనే అనుకొన్నాను, నీకు ఎప్పుడైనా రెండవ ఆడదాని అవుసరం...!" మీరాషా అన్నాడు.

"నా కంతా తెలుసు! నీవు గనక గుల్ వంక కన్నెత్తి చూశావా, పళ్ళేం నెత్తిన వేసి కొడతాను...ఇవ్వాళ రాత్రికి కాహాన్ సింగ్ వస్తాడు...గుల్ వస్తుంది...!" గోమతి అన్నది.

"ఐతే నేను వెళ్ళి దాన్ని పంపవద్దని చెప్పివస్తాను"

"ఏం?"

"పాపం, రేపు భాద్రపదంలో దానికి పెండ్లి"

"ఐతే వచ్చిన నష్టం ఏమిటి? మనకు మాత్రం భాద్ర పదంలో కదూ పెండ్లి జరిగింది?

గోమతి వెనక్కు తిరిగి థానేదార్ గదిలోకి పోయింది. మీరాషా క్రోధంతో లెక్కల పుస్తకాల్ని విసిరి నేల కేసి

కొట్టాడు. పుస్తకం కుట్లూడి పేజీలు క్రింద నలువైపులా పరుచుకొన్నాయి. మీరాసా వివశంగా మాటమాటికి గుప్పెడలు మూసుకొంటున్నాడు. తెరుస్తున్నాడు... రెండు క్షణాలు క్రిందకు దిగి కిందపరచుకొన్న కాగితాలను సర్దుకోసాగాడు. ఆ కాగితాలమీద రకరకాల దస్తూరులు వున్నాయి!

రహమాన్ దగ్గరనుండి కొన్నవి వెనుకటి పంటలలో యాభైమణుగులు జొన్నలు–మణుగు ఒకటికి ఎనిమిది రూపాయిల చొప్పున!

రహమాన్‌కు జొన్నలు అమ్మినది–మణుగు ఒకటికి పదిహేడు రూపాయిల చొప్పున... రెండు మణుగుల మూడు సేర్లు!

గుల్‌కు ఖర్జూరాలూ, మొక్కజొన్న కండెలూ–వుచితంగా! ఫత్తూ పేర వద్దు ఎనిమిది అణాలు!

జబరో ఎనిమిది ఏళ్ళనుంచీ వడ్డీ యివ్వలేదు అసలూ ఇవ్వలేదు. భూమిని జప్తు చెయ్యడమైనది–ఎనిమిది సెంట్లు నాలుగు గజాలు.

ఖైరూ తండ్రి అంత్యక్రియల సందర్భంలో సైను ఇచ్చినది–ఎనిమిది రూపాయీలు...వడ్డ సహితంగా పది రూపాయలు! వచ్చేపడు ముడిఉన్ని నిచ్చి తీర్చుకొంటాడు.

మధ్యలో ఒక పేజీ ఖాళీగా కనుపించింది. మీరాసా ఈ కాగితాన్ని చేతిలోకి తీసుకొన్నాడు. ఆలోచించాడు, ఈపేజీ ఎందుకు ఖాళీగావుంది? ఆ పేజీమీద ఏం రాసేట్టు? చట్‌న అతనికి ఒక పేరు తట్టింది...గోమతి! మీరాసా ఖాళీ పేజీలో ఈ విధంగా వ్రాయసాగాడు.

గోమతి...అటు వడ్డీలో చేరదు...ఇటు అసల్లో చేరదు అటు సెంట్లూ కాదు, ఇటు గజాలూ కాదు. గోమతి, జప్తు చేయబడ్డ ఆస్తి! గోమతి, శవంమీది సైనుగుడ్డ, గోమతి మణుగు ఒక్కింటికీ ఎనిమిదిరూపాయలు. గోమతి మణుగు ఒక్కింటికీ ఎనిమిదివందలు! గోమతి మణుగు ఒక్కింటికి ఎనిమిదివేలు! గోమతి...గోమతి...గోమతి!

మీరాషా ఖాళీకాగితాల నన్నింటినీ చింపి అవతల పారేశాడు. వ్రాసిన కాగితాలను ప్రోగుచేసి సంచిలోకటి పైన పెట్టడానికి బల్లమీదకు ఎక్కాడు ప్రక్కగదిలోనుంచి గోమతి అల్లాబేగ్ కలసి నవ్వేనవ్వులు వినిపిస్తున్నాయి. బల్లమీదకు ఎక్కిన మీరాషాకు కాలు జారింది. క్రిందపడ్డాడు. తిరిగి పద్దుల కాగితాలన్నీ నేలకు వచ్చుకున్నాయి. అతని చెయ్యి తగిలి సీసాలూ, టిన్నులూ దొర్లిపోయినాయి. సీసాల్లోని సరుకులు క్రింద విరజిమ్ముకున్నాయి. ఒక ధాన్యపుబస్తా దొర్లింది. ప్రక్క గదిలోని నవ్వులు మరీ ఎక్కువయినాయి. మీరాషాకు వాళ్ళు తనను గురించే నవ్వుతున్నారు అనిపించింది నువ్వా మీరాషావి? టీకరీషాహాము రాదంతటికీ ధని కుడవు నువ్వా? జాగీర్దారుగారి సభాసదుడవె? నువ్వా మీరాషావి? కాదు. నువ్వు గాడిదలమీరూవి! గాడిదల మీరూవి! గాడిదల-గాడిదల-గాడిదల మీరూ-మీరూ-రూ-!

ప్రక్కగదిలో గోమతి అల్లాబేగ్ ఇద్దరూ భోంచేస్తున్నారు. నవ్వుకొంటున్నారు. మాట్లాడుకొంటున్నారు!

గోమతి అన్నది "ఈసారి మీరు చాలా రోజుల వరకూ ఇక్కడ మకాంవేస్తారులావుంది!"

హాశమత్ కోడికాలును చీకుతూ "ఈ తగాయిదాను తెచ్చినందుకు భగవంతుడికి కోటిదండాలు పెట్టుకొంటున్నాను. లేకపోతే ఇవ్వాడప్పుడే నిన్ను చూడడం పడేదికాదు.

"అవును. నాకు అంతా తెలుసులే! నీవు బడవారాలో దానిపేరు ఏమిటి? సయ్యాదానీ-ఆ-ఆ-సయ్యాదానీ-తో కూడా ప్రేమ సాగించావుట! ఇటు నా దగ్గరకు వచ్చి పై పై మెరుగులు చూపిస్తున్నావు. మనస్సులో లేని ప్రేమను మాటల్లో వినిపిస్తున్నావు!"

"అరె-దానికీ నీకూ పోటీఏమిటి? అది ఏడుజన్మలు ఎత్తినా అందంలో నీతో పోటీ చేయగలదా? అసలు అందానికి పాటోహారా పెట్టిందిపేరు!" అంటూ ఒకగుక్క సారాయి త్రాగి "టీ త్రాగు" అన్నాడు అల్లాబేగ్.

"ఊఁ-హూఁ- పగటిపూట త్రాగను."

"కాదు. పగటిపూటే త్రాగాలి!"

"లాలా ప్రక్కగదిలోనే వున్నాడు"

"అరె-లాలా వున్నాడా? హా-హా-హా-భలేచెప్పావు! ఏమన్నావు? లాలా వున్నాడు?-హి-హి-హి-లాలా-లా లా-అరె-చంపేశావ్రఫో!" అల్లాబేగ్ పొట్ట చేత్తో పుచ్చుకు నవ్వసాగాడు.

హాశమత్ అల్లాబేగ్ నవ్వుతూనే వున్నాడు. ఇంతలో ఎవరో తలుపుకొట్టాడు. అల్లాబేగ్ గోమతి నడుమును చుట్టిన తన చేతిని యివతలికి తీసుకుని "లోపలికి రావచ్చును!" అన్నాడు.

మొదట శౌకత్ లోపలకువచ్చాడు. అతని తరువాత ఒక పొడుగాటితాడు, తరువాత ఇనుపగొలుసు - ఆ తరువాత అబ్దులూ లోపలకు వచ్చారు. గోమతి రెప్పవాల్చకుండా అబ్దుల్‌వంక చూడసాగింది.

హాశమత్ అన్నాడు "ఇతనెవరు ?"

శౌకత్ అన్నాడు "ఇతను నూరేజుషాహీ కొడుకు అబ్దులండీ: ఇతను రైతులను రెచ్చకొడుతున్నాడు. తమకు వ్యతిరేకంగా పెద్దరాజావారి దగ్గరకు అర్జీరాసి పంపుతున్నాడు. సమయానికి మేము పట్టుకున్నాము. వీడిని పట్టుకోపోతే, రైతులు మహా కిందుమీదు చేశారులెండి!"

అల్లాదాద్ నవ్వి "తుపాకీ పేల్చవలసి వచ్చిందండీ !" అన్నాడు.

"ఇంతకూ ఒక్కడికైనా బుద్ధిచెప్పారా ? లేకఒ ట్టిగా తుపాకీగుండ్లు దండుగచేశారా ?"

"ఆఁ! ఏడెనిమిది శవాలను నేను చూశానండి. చాలా మంది గాయపడ్డారు. కొంతమంది కాలికి బుద్ధిచెప్పారు. వాళ్ళ నాయకుడు వీడేనండీ...చివరకు పట్టుకున్నాం!"

శౌకత్ అబ్దుల్ తలవేపు చేతితో సౌంజ్ఞచేసి చూపుతో నాకు చేతులు మహాజిలపుకుతున్నాయి అండి ! మీారు 'ఊ' అంటేచాలు మొక్కజొన్న కండెను ఎగరగొట్టేసినట్లు ఎగరగొట్టేస్తాను !" అన్నాడు.

హాశమత్ కూర్చున్న చోటునుంచి లేచి అబ్దుల్ దగ్గరకు వచ్చాడు. అతని చేతిలో కోడికాలు తాలూకు ఎముక వున్నది. ఆ ఎముకను విసిరి అబ్దుల్ ముఖానికి వేసికొట్టాడు

"ఏమోయ్! చదువుసంధ్యలు ఇందుకేనా? రాజుకు వ్యతిరేకంగా ప్రజలను రెచ్చకొట్టడానికేనా?" అన్నాడు.

కోడిఎముక అబ్దుల్ ముక్కుమీద విసురుగా వచ్చి తగలడంవల్ల ముక్కులోనుంచి రక్తం కారసాగింది. రక్తాన్ని తుడుచుకొంటూ అతడన్నాడు. నేను 'ఫ్రెంచ' పట్నంలో స్కూలుమాష్టర్ని. నాలుగు ఏళ్ళ తరువాత తల్లితండ్రులను చూడడానికి ఇక్కడికి వచ్చాను. రాగానే నన్నీ రైతులు చుట్టుముట్టారు. వాస్తవానికి నాకేమీ తెలియదు!"

"రైతులు నిన్ను చుట్టుముట్టారు...నీవు వాళ్ళకు అర్జీ వ్రాసిఇచ్చావు అవునా?" అల్లాబేగ్ అబ్దుల్ ముఖాన ఒక గుద్దుగుద్దాడు.

అబ్దులుకు పెదాలు పగిలి రక్తం కారసాగింది. సంకెళ్ళు వున్న చేతులతోనే రక్తాన్ని తుడుచుకొంటూ "అవును" సమాధానాన్ని ఇచ్చాడు అబ్దుల్.

హాశమత్ అల్లాబేగ్ మళ్ళీ చెయ్యి ఎత్తాడు. కాని, గోమతి చప్పున వచ్చి అల్లాబేగ్ చెయ్యి పుచ్చుకొన్నది. "ఆడదాన్ని, నేను చూడలేను!"

తరువాత సారాగ్లాసు నోటికి అందిస్తూ "ఇదిగో! కోపాన్ని పుచ్చుకో శెయ్యి! ఇటురా!" అన్నది. హాశమత్ భోజనం దగ్గిరకు వెళ్ళిపోయాడు.

"వీడిని గొడ్లకొట్లో కట్టివేసి పడెయ్యండి. రేపు వుదయం పెద్దస్టేషనుకు పట్టుకుపోదాం!" అన్నాడు అల్లాబేగ్.

శౌకత్ అల్లాదాద్‌లు అబ్దుల్‌ని గదినుండి బయటికి తీసుకుపోయారు. గోమతి అబ్దుల్ వంక చూస్తూ వుండిపోయింది.

"ఏమిటె చూస్తున్నావు ?" అల్లాబేగ్ క్రోధంతో అరిచాడు.

"పాపం! నాకతను నిర్దోషిలా కనుపిస్తున్నాడు" గోమతి అన్నది.

అల్లాబేగ్ మండిపడి "నీకు నిర్దోషిగా కాదు, మరొక రకంగా కనుపిస్తున్నాడు! కొంచం ఇటు ఈ రివాల్వరువంక కూడా చూడు!" అన్నాడు.

గోమతి నవ్వుతూ అతనిగుండెలను కదుచుకొన్నది. మెల్లగా తనచేతిని కోటులోపలకు పోనిచ్చి గుండెలను నిమురుతూ "గుండెలు మండుతున్నాయూ?" అన్నది.

అల్లాబేగ్ గోమతి ముఖంమీదకు వంగాడు. కాని గోమతి ఒక్కవూపుతో అతన్ని తప్పించుకొని అవతలకి పరుగెత్తింది కిలకిలా నవ్వుతూ.

## 2

గోమతి అలా వయ్యారంగా వంపులుతిరుగుతూ అల్లాబేగ్ గదిలోనుంచి పరుగెత్తుకు రావడం, బయట మెల్లాలో ఖూబానీ వృక్షంక్రింద పేక ఆడుతున్న శౌకత్, అల్లాదాద్, మరి ఇద్దరి సిపాయీలు చూశారు. వరవళ్ళు తొక్కుతున్న గోమతి అందాన్నిచూసి శౌకత్ వూరక వుండలేక పోయాడు. అతడిలా అన్నాడు. "అల్లాదాద్! మహా అందగత్తెయి! నీతోడు ఏమొగవాడి వంకనయినా ఒకమాటు కన్నెత్తి చూసిందా, ఇకవాడు అడుగు కదల్చలేడు. అక్కడే రాయి బండైపోతాడు."

అల్లాదాద్ నిట్టూర్చి "ఏం ప్రయోజనం ? మనం దరిద్రులం. ఎవరో అదృష్టవంతులు అనుభవిస్తూ ఉంటారు." అన్నాడు.

"వూరికే నిట్టూరుస్తా వెందుకోయ్? దానికి ఎంతమంది మొగాళ్ళయినా చాలరు. ఎవరికి తెలుసు ఒక వేళ నిన్ను కూడా..."

అల్లాదాద్ వెంటనే శౌకత్ నోటిని మూస్తూ "కొంప ముంచేస్తావు? థానేదారు విన్నాడా, చర్మం వలుస్తాడు. అతను ఇదంటే పడిచస్తున్నాడు... అట్లావల్లో వేసుకొన్నది." అన్నాడు.

శౌకత్ పేకముక్కను వేస్తూ "ఏయ్! నాకు అలాంటి భయాలు ఏమీ లేవోయ్. కాని నావరకూ నన్ను చెప్పమంటే నాకు ఆడవాళ్ళమీద మనస్సు చాలతక్కువ. రక్తం తీయడం, ప్రాణాలుతీయడం వీటిలోవచ్చిన ఆనందం ఆడదానితో కులుకుతూ నవ్వడంలో వస్తుందా చెప్పు? రాంపుర్ లో జరిగిన ఒక సంఘటనను చెప్పనా? ఒకసారి ఏమైందంటే ఒకఆడది నన్ను మహా ఇదిగా ప్రేమించింది."

అల్లాదాద్ ముక్కలన్నీ క్రిందపారేసి "అబ్బ...ఆట వద్దోయ్! మనస్సు ఏమీ బాగుండలేదు...ఏదైనా విషయం మాట్లాడు" అన్నాడు.

"ఇంకా దీనివిషయం గురించే ఆలోచిస్తున్నావా ? బాధపడుతున్నావా ?"

"అబ్బే...దీనివిషయం కాదోయ్. అది మనకు అందని పండు."

"మరి ఇంక దేనివిషయం నీవు ఆలోచించేది? ఇప్పుడు నలుగురు ఇంట్లో వున్నారాయె."

"నలుగురేం లెఖ్ఖోయ్ మనకు? ఐదవదాన్ని గురించి ఆలోచిస్తున్నాను."

శౌకత్ ఒకమాటు అల్లాదాద్‌ను ఆపాదమస్తకం పరిశీలనగా చూసి "అవునుమరి... నీలాంటి బలిష్టుడికి చిన్న ఆంబోతులాంటి ఆడదయితే సరిపోతుంది. అసలు నన్నడిగితే నీలాంటి వాళ్ళనందరినీ సర్కారువారు ఆంబోతులాగా విడిచి పెట్టి పెంచాలంటాను!" అన్నాడు.

అల్లాదాద్ నవ్వుతూ తనచేతుల్ని వుబికిన మాంసపు కండలను చూసుకోసాగాడు.

శౌకత్ ఒకరకమైన విచిత్ర విషాదయుక్త స్వరంలో "నిన్ను ఆడవాళ్ళు ఎక్కువగా కోరుతూవుంటారనుకొంటాను" అన్నాడు.

సంతోషంతో అల్లాదాద్ ముఖం వికసించింది. ఛాతీ పొంగింది. మెడమీద కండరాలు వుబికినాయి.

శౌకత్ మళ్ళీఅన్నాడు "నాకుమాత్రం, ఆడవాళ్ళంటే బొత్తిగా ఇష్టం వుండదు. మీరంతా ఆడవాళ్ళకోసం పడి చస్తూవుంటారు దాన్లో ఏమిరుచివున్నదనో! నాకు మానవ శరీరాన్ని చీల్చి, రక్తాన్నితీసి, పిండడం అంటే మహా ఇష్టం."

"నా కాబోయే ఐదవభార్య పచ్చగా చాలా అందంగా వుంటుంది. అచ్చం చంద్రుడిలావుంటుంది. పేరుకూడా తగిందే! బానో!... బానో!...బానో! నిజం! చంద్రుడిలా మెరుస్తూ వుంటుంది. నేను దాని తండ్రికి ఐదువందలు ఇచ్చాను. పెండ్లి

సమయాన మరొక ఏడువందల యాభై ఇవ్వాలి!" అల్లాదాద్ అన్నాడు.

"అంటే, పెండ్లికి ఏడువందలయాభై ఇవ్వాలన్నా?"

"అవును! ఇప్పటికి నాదగ్గిర ఐదువందలు పోగయి నాయి. ఈ గలభాలు మరొక రెండురోజులు ఇలాగే సాగితే మిగిలిన రెండువందలయాభైకూడా జమ అవుతవి!"

"ఊఁ అయితే!"

"అయితే, ఇంకేముంది! మావూళ్ళో, మా ఇంట్లో పెండ్లి మేళాం మోగుతుంది! డడ-డడ-డగడ-డగడ-పి-పిపిపి-పి!" అల్లాదాద్ తన పొట్టమీద మద్దెలను వాయిస్తూ నోటితో సన్నాయిని అనుకరిస్తూ ఎగరసాగాడు. శౌకత్ మిగిలిన సిపాయీలు నవ్వుతున్నారు.

కొంచంసేపు ఆలోచించి శౌకత్ ఇలా అన్నాడు. "నేను చెప్పేది ఒక్కటి విను! నీవు ఐదుగురిని ఎలా భరించ గలవు? ఒకదానికి విడాకులిచ్చేశెయ్యి అప్పుడు కొంత పేచీ తప్పుతుంది! ఔనా?"

"ఔను! నేనూ అదే అనుకొంటున్నాను. విడాకులు ఇవ్వవలసి వస్తుంది!"

"ఇంకొకటి జరగవచ్చు! ఒక పెళ్ళాం ఏ పశువుల్ని మేపడానికో, కొండమీదకు వెళ్ళిందనుకో, అక్కడినుంచి కాలుజారి పడుతుంది! చచ్చిపోతుంది. ఇదీ జరగ వచ్చుగా?"

"అవును. జరగవచ్చును!" అల్లాదాద్ మెల్లిగా అన్నాడు.

"అంతకన్నా, మరొకటికూడా జరగవచ్చును. ఒక పెండ్లాము రాత్రిపూట బయట పడుకున్నదనుకో! సగంరాత్రి వేళ ఆమెను ఏ ఎలుగుగొడ్డో, చిరుతపులో, తోడేలో ఎత్తుకు పోవచ్చును. తెల్లవారి ఆమె శవం..."

అల్లాదాద్ గడ్డం గీరుకొంటూ "అవును! ఇలానూ జరగడానికి వీలుంది!" అన్నాడు.

శౌకత్ తన కత్తిని బయటికితీసి, దాన్ని అల్లాదాద్ కండ్లదగ్గిరకు తీసుకుపోయి "నా వల్ల నీ కేమైనా సాయం కావలసివుంటే చెప్పు! సిద్ధంగావున్నాను!" అన్నాడు,

అల్లాదాద్ నవ్వుతూ శౌకత్ బుజంమీద చెయ్యివేసి "ఇప్పుడప్పుడే అలాంటి అవుసరం ఏమీ లేదోయ్, మిత్రమా అయినా మీలాంటి మిత్రులను చూసుకొనే నేను బ్రతుకు తున్నాననుకో! అంతపని చేయనవసరం లేకుండా విడాకులు ఇచ్చేయవచ్చు! ఒకవేళ విడాకులు ఆలస్యం అనుకుంటే నలుగురి పెండ్లాల తరువాత ఐదో పెండ్లాముగా, నూరా తన కూతుర్ని ఇవ్వడనుకుంటే, వెంటనే పేరుమార్చి స్తే సరిపోయె! నా పేరు రహమత్ ఖాను అంటాను!" అన్నాడు.

శౌకత్ చాకు ముడిచి "పోవోయ్! నీతో ఏమీ మాటాడడానికి వీలులేదు! నీ వసలు మామూలైనులో మనిషివి కావు!" అన్నాడు.

అల్లాదాద్ రెండుక్షణాలు పెద్దగా నవ్వాడు. తరువాత చప్పున నవ్వడం ఆపాడు. అటునించి గోమతి ఒక చిన్న పిడ తను చంక పెట్టుకొని తమవైపే వస్తున్నది.

అల్లాదాద్ తనలో తనే ఇలా అనుకొన్నాడు "ఈమె ఇటువస్తున్నది. రాకుండా వుండటం మంచిది. మేము సిపాయీలం, మా దగ్గరకు ఆడది వంటరిగా రాకుండా వుండడం మంచిది. మేము సిపాయీలం, మా దగ్గరకు ఆడది వంటరిగా రావడం అంత మంచిదికాదు. ఆ విషయం తెలిసికూడా ఈమె ఇటే ఎందుకు వస్తున్నది. రాకుండా వుంటే బాగుండు! రాకుండావుంటే బాగుండు! తరువాత ఏమైనా పొరపాటు జరిగితే అనుకొని ప్రయోజనం వుండదు! తరువాత ఏమైనా జరిగితే అనుకొని ప్రయోజనం వుండదు."

కాని, గోమతి మెల్లగా నడుస్తూ అటే వచ్చేస్తున్నది. బాగా దగ్గరకు వచ్చి ఇలా అన్నది "పశువుల కొట్టు తాళం చెవ్వ నాకు ఇచ్చెయ్యి!"

అల్లాదాద్ ఏమీ మాటాడలేదు.

శౌకత్ అడిగాడు "ఎందుకు?"

"పాలు పితకడానికి వెళ్ళుతున్నాను!"

"లోపల ఖైదీ వున్నాడు. అతడు చాలా ప్రమాదకరమైన ఖైదీ, పైగా చేతులకు సంకెళ్ళు విప్పివేశారు!"

గోమతి చిరునవ్వు నవ్వుతూ అల్లాదాద్ వైపు చూసి ఇలా అన్నది "నన్నేమీ అనడు. ఒకవేళ పారిపోతాడని భయపడుతున్నారేమో? ఎక్కడికి పారిపోగలడు? ఎటు పోవాలన్నా మీముందునుంచి పోవలసినదేకదా?"

అల్లాదాద్ అన్నాడు "అతడు పారిపోతాడనికాదు. మేము చెప్పడం, నిన్ను ఏమైనా చేస్తాడేమోనని!"

గోమతి అర్ధోక్తిగా అల్లాదాద్ వైపుచూచి "నావిషయం నేను చూసుకుంటాను!" అన్నది.

శౌకత్ అల్లాదాద్ చేతిలోనుంచి తాళంచెవి తీసుకొని గోమతికి యిచ్చాడు. ఈ యివ్వడంలో శౌకత్ మునివేళ్ళు గోమతి చేతికి తగిలినాయి. ఈ క్షణకాలపు స్పర్శతో శౌకత్ శరీరం అంతటిలోనూ విద్యుత్ శక్తి ప్రవహించినట్లయింది. అతను పులకించిపోయాడు. అల్లాదాద్ చూస్తూ వుండిపోయాడు. గోమతి వెళ్ళిపోయింది.

గోమతి తాళంచెవ్వి తీసుకు వెళ్ళిపోయాక శౌకత్ యిలా అన్నాడు. "నాకు బొత్తిగా యిష్టంలేదోయ్! బొత్తిగా యిష్టంలేదు! ప్రపంచంలోకల్లా సర్వశ్రేష్ఠ సౌందర్యవతిని ఒక ప్రక్కనా, మరొక ప్రక్కన చాకునుపెట్టి, నీకు ఏంకావాలో తీసుకోమంటే, నేను చాకునే తీసుకుంటాను!"

అల్లాదాద్ ఏమీ మాట్లాడలేదు. గోమతివంక చూస్తున్నాడు. గోమతి నేరుగా పశువులకొట్టు దగ్గిరకు పోయింది. తలుపు తీసింది. లోపలకుపోయి తిరిగి తలుపు వేసేసుకున్నది.

## 3

పశువులకొట్లో వాసనకొట్టే మురికినేలమీద పడివున్న అబ్దుల్ కేకవేశాడు "ఎవరది?"

ఎదురుగావున్న తలుపు కొద్దిగా తెరుచుకోవడం, తలుపుకు సరిగా ఎవరో అందమైన స్త్రీ పండ్లతో నిండిన మామిడికొమ్మలా ప్రత్యక్షం అవడమూ జరిగింది. ఒక్కక్షణం ఆ స్త్రీ అలాగే, తలుపు సాగవట్టి తెరిచి, నిలబడ్డది. తరువాత

తలుపు పూర్తిగా వేసేసి మెల్లిగా అడుగుల్లో అడుగులు వేసు కొంటూ అబ్దుల్ వైపుకు నడిచింది.

గోమతి నేరుగా వెళ్ళి అబ్దుల్ తలదగ్గిర క్షణం నిలబడ్డది. నిశ్శబ్దంగా; అబ్దుల్ పడుకున్నవాడల్లా లేచి కూర్చున్నాడు. కాని గోమతి ఏమీ మాట్లాడకుండా వెనక్కు తిరిగి గదికి రెండవ వైపునవున్న ఆవుదగ్గిరకు వెళ్ళి పాలు పితకసాగింది.

"గోమతి! మొదట్లో నేను నిన్ను గుర్తుపట్టలేదు. ఈ ఐదు ఏండ్లల్లో నీవు చాలా మారిపోయావు!" అబ్దుల్ అన్నాడు.

"మొదట్లో నేనూ నిన్ను గుర్తుపట్టలేదు. ఐదుఏండ్ల క్రితం, నీవు చాలా చిన్న కుర్రవాడివి!" గోమతి అన్నది.

"గోమతి! వీళ్ళు, ఈ సిపాయిలు ... మా నాన్నను అనవసరంగా చంపేశారు!" అబ్దుల్ గొంతు రుద్ధంగా వున్నది.

గోమతి మెదలకుండా పాలు పితుకుతున్నది. తెల్లని పాలధారలు పిడతలో చిత్రమైన శబ్దాల్ని కలిగిస్తున్నాయి. అబ్దుల్‌కు ఆ పాలధారలను చూడగానే మరుగునపడ్డ ఆకలి జ్ఞప్తికి వచ్చింది. "గోమతి! నేను నిన్నటినుంచీ ఏమీ తినలేదు చాలా ఆకలి వేస్తున్నది!" అన్నాడు అబ్దుల్.

గోమతి ఏమీ మాట్లాడలేదు. మౌనంగా పాలు పితుకుతున్నది.

ప్రక్కనే కట్టివేసివున్న పెయ్యదూడ పాలనుచూసి పెద్దగా అరచింది. ఆవుకూడా సమాధానంగా అరిచింది.

పాలు పిడతలోకి అవిరామధారల్లో ప్రవహిస్తున్నాయి.

అబ్దుల్‌కు ఆకలి తీవ్రం అయింది. పాలు పిడతలోకి పడే శబ్దాన్ని అతనలా ఎక్కువసేపు వినలేకపోయాడు. రెండు చెవులనూ గట్టిగా మూసుకొని ఎండుగడ్డిలో ముఖాన్ని దాచుకొన్నాడు.

పాలపిడత నిండింది. నురుగు పైకిదొర్లింది. గోమతి ఆవు దగ్గరనుంచిలేచి దూడనువిప్పి తల్లిదగ్గరకు తోలింది. దూడ చెంగనాలు పెడుతూ తల్లిదగ్గరకుపోయి పాలు కుడవసాగింది.

పాలపిడత పాలతోనిండి తొణికిసలాడుతున్నది.

అబ్దుల్ గడ్డిలో ముఖందాచుకు పడుకున్నాడు.

గోమతి తలదగ్గిర నిలబడివున్నది.

గోమతి అన్నది "లే, లేచి, పాలుతాగు."

పడుకునివున్న అబ్దుల్ లేవబోతూవుండగానే గోమతి అతని సరసనకూర్చుని నురుగుతో తొణికిసలాడుతున్న పిడతను అబ్దుల్ పెదాలకు అందించింది. అబ్దుల్ పాలను త్రాగసాగాడు. క్రమేణా పిడతలోపాలు తరుగుతూ వచ్చాయి. చివరకు అబ్దుల్ పెదాలమీాద నురుగురూపంలో నామమాత్రంగా చిహ్నాలు మిగిలిపోయాయి పాలు.

గోమతి తన సన్నని వాయిల్‌పమిటతో అబ్దుల్ పెదాలను తుడిచింది. అతని పెదాలని, ముక్కుసవున్న రక్తపు మరకల్ని తుడిచింది. ఆమెనలా తుడవవద్దని రెండుమూడుసార్లు చేతులతోనే వారించబోయాడు అబ్దుల్. కాని గోమతి అతని వారింపును లెక్కచెయ్యలేదు. అతను ఎక్కువగా వారించలేకపోయాడు. అతనిచేతులు నిశ్శక్తమైనాయి. ఒక విచిత్రమైన

మృదుత్వం, తంద్రాలస్యత అతన్ని నలువైపులనుంచీ చుట్టు ముట్టినాయి.

గోమతిఅడిగింది. "నీవు పట్నంలో స్కూలు మాస్టరు వటగా? ఎనిమిదవక్లాసు ప్యాసయ్యావుటగా? అలాగని తెలిసింది."

"అవును! ఇప్పుడు పదవక్లాసు పరీక్ష యివ్వడానికి రావల్పిండి వెళ్ళాలనుకొంటున్నాను...ఇంతలో...!" అబ్దుల్ మధ్యలోనే ఆపేశాడు.

"ఎక్కడికీ—రావల్పిండా!" గోమతి చాలా నిదానంగా అన్నది. "నాకు పెండ్లికాకముందు మా గ్రామాన్నుంచి రావల్పిండికి ఒకమాటు వెళ్ళాను. అక్కడ మా బంధువు ఒకతను సజ్జనదేవ్ అనివున్నాడు. మొదట అసలు అతనికీ నాకూ పెండ్లి నిశ్చయంఅయింది. కాని, తరువాత తప్పిపోయింది అతను మాకు బంధువుఅవడంవల్ల పెండ్లి ఆగిపోయింది. అదికాదు, నాకు తెలియక అడుగుతాను. ప్రేమవున్నచోట పెండ్లి జరగదు; కారణం ఏమిటో?" గోమతి ప్రశ్నించింది.

అబ్దుల్ ఏమీ సమాధానాన్ని ఈయలేదు.

గోమతి అన్నది "చూడూ! నీవుగనక రావల్పిండి వెళ్ళేట్లయితే సజ్జనదేవుని కల్సుకో...తప్పకుండా కలుసుకో! ఇప్పుడతనుకూడా పెండ్లిచేసుకొని వుండవచ్చు! పిల్లలు కూడా పుట్టారేమో! తప్పకుండా వెళ్ళు అతని దగ్గిరకు! వెళ్ళి అతని భార్య ఎలావుంటుందో చూడు, అందంగా వుంటుందో-వుండదో చూడు! దేనికి వుండదు, అందంగానే వుంటుంది...

ఏమైనా కానీ నీవు రావల్పిండి తప్పకుండా వెళ్ళు సజ్జదేవుని చూడు... ఆఁ! తప్పకుండా!

"రావల్పిండి ఎక్కడవెళతాను నేను? జైలుకు వెళ్ళబోతూవుంటే!"

"నువ్వు జైలుకు ఎందుకు పోవడం? అవసరం లేదు. నువ్వు రావల్పిండి వెళ్ళుదువుగాని, తప్పకుండా! నేను నిన్ను రావల్పిండి పంపిస్తాను!"

"ఎలా?"

"నువ్వు పూరక చూస్తూవుండు!"

ఇలా అంటూ గోమతి తన చిన్నిచేతులతో అబ్దుల్ మెడమీద పేరుకొని ఇంకాకనుపిస్తున్న రక్తపుచారలను తుడిచింది. అబ్దుల్ మెడ ఎంతబలంగా వున్నది? మెడమీది నరాలు ఎలా స్పష్టంగా ఉబికి కనుపిస్తున్నాయి! మెడక్రింద బలమైన రెండు ఎముకలు...గోమతి మెల్లగా అబ్దుల్ మెడను తన చేతులతో రాచింది. వుండి వుండి అబ్దుల్ ఒక్కసారిగా విచలితుడయ్యాడు!" గోమతి! వద్దు...నువ్వు ఆహాఁవద్దు... నేను...నేను రావుల్పిండి వెళ్ళను... నీవు నన్ను పంపించకు. గోమతీ వద్దు!"

గోమతి చిన్నగా నవ్వింది. ఉబికిన ఆమె వక్షస్థలం అబ్దుల్ గుండెలకు తాకింది. కొద్ది క్షణాలు మౌనంగా గడిచాయి. గోమతి వెళ్ళడానికిలేచి నిలబడ్డది. అబ్దుల్ మౌనంగా గోమతివైపు చూస్తున్నాడు వెళుతున్న గోమతి "సరే, నేను రాత్రికి వస్తాను! అనేసి వెళ్ళిపోయింది గాలిపీవెనలా. అబ్దుల్ రావద్దని చెబుదాం అనుకొన్నాడు. కాని చెప్పలేకపోయాడు.

ఆమె ఎందుకు తన దగ్గరకురావడం? తను ఆమెను ఏమౌతాడు? ఆమె తనకుఏమౌతుంది? ఆమె వస్తానన్నప్పుడు వద్దని తనెందుకు అనలేకపోయాడు? మొదలైన ప్రశ్నలు అతని మస్తిష్కంలో నీళ్ళమీది బుడగలా అసంఖ్యాకంగా ఉద్భవించినాయి. మరు క్షణంలోనే లుప్తం అయినాయి.

## 4

పశువుల గదిలో నుంచి బయటకు వచ్చి తాళాం చెవ్వను అల్లాదాద్ చేతికి ఇచ్చివేసింది గోమతి.

"పిడత ఖాళీగా వుందే?" శౌకత్ అడిగాడు.

"ఖైదీ నిన్నటినుండి ఏమీ తినలేదుట..." అన్నది గోమతి.

"అతనికి ఏమీ పెట్టవద్దన్నారు థానేదార్‌గారు" అల్లాదాద్ అన్నాడు.

గోమతి అన్నది "ఐతే అల్లాదాద్‌గారూ, నేను రాత్రికి కూడా అన్నం పట్టుకుపోయి పెడతాను...నీవు థానేదారుతో చెప్పకు!" అంటూ గోమతి వెనకటి లాగానే అర్థోక్తిగా నవ్వింది. ఆ నవ్వును చూచి అల్లాదాద్ స్తంభించిపోయాడు. యుగ యుగాలుగా తపస్సుచేసి నిరాశచెందిన భక్తుడికి ఒక్కసారిగా భగవత్ దర్శనం కలిగినట్లయింది. అతను మారు మాటాడలేకపోయాడు! సరే, అని మాత్రం అనగలిగాడు.

గోమతి వెళ్ళిన తరువాత శౌకత్ ఇలా అన్నాడు "మిత్రమా! నీవుచేసేపని నాకు ఏమీ నచ్చలేదోయ్!"

అల్లాదాద్ లేచి నిలబడి 'ఖూభానీ' వృక్షసమీపంలో పచారు చేయసాగాడు. రెండుక్షణాల తరువాత ఆగి "శౌకత్ పరవాలేదోయ్! థానేదార్‌నుచూసి నేను ఏమాత్రం భయ పడడంలేదు. ఏడిశాడు!" అని తనలాపెద్దగా మాట్లాడినందుకు తనకు తనే కంగారుపడ్డాడు అల్లాదాద్.

గోమతి వరండాలోనుంచి వెళ్తూ తనుచేస్తున్న సాహసానికి తనే నవ్వుకొన్నది. ఉత్తరపుదిశగా ఎవరో వస్తు న్నట్లుండడంవల్ల వరండాలోనే రెండుక్షణాలు ఆగి పరిశీలనగా చూసింది. ఆవచ్చేది గుల్! గుల్ ఒక ఇరుకైన చొక్కా- కీరల పైజామానూ వేసుకొని తన యింటికి వస్తున్నది. గోమతి మనస్సులోనే అనుకొన్నది. గుల్ చాలా అందమైన పిల్ల. చాలారోజులనుండి మీరాషా గుల్‌ను అనుభవించా లనుకుంటున్నాడు. కాని సాధ్యపడటంలేదు. అందుకు కావలసిన ధైర్యం మీరాషా దగ్గిరలేదు. గుల్‌కుకూడా మీరాషా తనను కోరుతున్నాడని తెలుసును. మీరాషా గుల్‌కు, కొబ్బరి, ఖర్జూరాలూ. అఖరోటు పండ్లూ – అవీ పెడుతూ వుంటే గుల్ భయపడేది. అవి తీసుకోవడానికి గుల్ చేతులు వణికేవి! ఎంత అయినా స్త్రీ కదా, మీరాషా కోరుతున్నా డని తెలియకుండా వుంటుందా? కాని, తెలిసికూడా తెలియ నట్లు నటించేది. బయటపడి అడిగే సాహసం మీరాషా చేయ లేకపోయేవాడు. అక్కడికీ ఒకసారి తెగించి అద్దాలు పొదిగిన చుక్కలపై జామాను, చొక్కాను యిచ్చాడు గుల్‌కు. అప్పుడుకూడా ధైర్యంచేసి నీవు నాకు కావాలని అడగలేక పోయాడు. సాహసించలేకపోయాడు. ఒట్టి పిరికివాడు. వాళ్ళ

మీంద పొర్లాడేకుక్క ! ఛీ...ఛీ...గోమతి కాండ్రించి వుమ్మేసింది.

గుల్ ఉత్తరపు దారిగుండా వరండాలోకివచ్చి నేరుగా మీరాసాహెబ్ వున్న గదిలోకి పోయింది. గోమతి నవ్వుకొన్నది. ఇదే సమయంలో ప్రక్కనే ఎవరోవచ్చి నిలబడ్డట్టయింది. గోమతి తలత్రిప్పి ప్రక్కకు చూసింది. ఠాకూర్ కాహాన్‌సింగ్ ప్రక్కనే నిలబడి నవ్వుతూ మీసాలను దువ్వుకొంటున్నాడు.

గోమతి అడిగింది. "కర్మఆలీగారు ఎలావున్నారు?"

"పట్నంనుంచి డాక్టరు వచ్చాడు. ఒక నెలరోజులకు గానీ ఆరోగ్యం కుదుటపడదని చెబుతున్నాడు!"

గోమతి మౌనంగా వున్నది.

కాహాన్‌సింగ్ అన్నాడు "ఏమీ తోచడంలేదు. సరే నిన్నూ చూసినట్టవుతుంది. థానేదార్‌తోటీ మాటాడినట్టవుతుందని యిటు వచ్చాను."

గోమతి నవ్వుతూ అన్నది "ఇవ్వాళ యిక్కడేవుండండి పట్నంనుంచి మంచి క్రొత్తసారాయిని తెప్పించాను. దానికి తోడుగా...!"

"తోడుగా ?" కాహాన్‌సింగ్ బాగా దగ్గిరకువచ్చి అడిగాడు.

గోమతి కొంచెం వెనక్కుజరిగి అన్నది "మరోక్రొత్త సారాయంకూడా వున్నది!"

"ఎక్కడ ?"

"అదుగో, ఎదురుగా లాలా గదిలో వున్నది. ఇప్పుడే చూపిస్తాను."

గుల్ తన గదిలోకి రావడంచూసి లాలా కొంచెం గాభరాపడ్డాడు. అతనికి ఆ సమయాన గుల్ మహా అందంగా కనుపించింది. తన గదిలోకి తొలి వసంత వాయువులు వచ్చి నాయనుకొన్నాడు. అప్పుడు లాలా త్రాసులో దేన్నో తూస్తు న్నాడు. గాభరాపడి త్రాసును క్రిందికి వదిలిపెట్టేశాడు. గుల్ బాగా దగిరకువచ్చి నిలబడ్డ తరువాత కొంచం స్థిమితపడి "నువ్వా!" అన్నాడు.

గుల్ చేతులు గోరింటాకుతో ఎర్రగా మెరుస్తున్నాయి. ఒకచేత్తో ముక్కునవున్న ఎర్రరాతి పుడకను తాకుతూ "అవునండి!" అన్నది గుల్.

గుల్ నేలమీద కూర్చోబోతూవున్నది. ఇంతలోనే లాలాచేతిని పుచ్చుకొని "అరెరె- క్రిందకూర్చోకు! ఇక్కడ - బల్లమీద - ఇక్కడ బల్లమీదకూర్చో!" అన్నాడు. అంటూనే లాలా గుల్ చేతిని పుచ్చుకొని బలవంతాన బల్ల మీద కూర్చోబెట్టాడు. తరువాత చేతులు నలుపుకొంటూ "చెప్పు. ఏంకావాలి నీకు. ద్రాక్షలు ఇవ్వనా? ఖర్జూర, అఖరోటు - మొక్కజొన్నకండెలు - కావపోతే అద్దం - దువ్వెనలూ, అద్దకం గుడ్డలు - చెప్పు? ఏంకావాలి నీకు.!" అన్నాడు.

గుల్ నవ్వింది, నాకు అంతా తెల్సులే అన్నట్టు.

"లాలా, నాకు ఆగాజు ప్లేటునూ, అటు ఆ పచ్చని దండలేదూ,? అదీ ఇద్దురూ అన్నది గుల్.

"తప్పకుండా - తప్పకుండా- నీకులేదంటానా? ఇదిగో తీసుకో - ఇదిగో తీసికో! ఇవేకాదు. నీకోసరం - సరే సరే,

అదంతా తరువాత!" అంటూ ఒకరకమైన అతి దీనమైన చూపులను చూస్తూ "భాద్రపదంలో నీపెండ్లి జరుగుతుందని విన్నాను!" అన్నాడు.

గుల్ సిగ్గుపడి తలవంచుకొన్నది. ఆమెముఖం ఒక్క సారిగా ఎర్రపడిపోయింది.

మీరాషా చేతులు నలుపుకొంటున్నాడు. మూగిగా అతని హృదయం ఆక్రందించసాగింది. "అయ్యో దీనికికూడా పెండ్లి అయిపోతుందే! ఈ అందమైనరూపంకూడా వూరు నించి వెళ్ళిపోతుందే! ఇలాంటి అందమైనరూపం, మనోహర మైన ఆకారం వూరినుంచి వెళ్ళిపోతే ఎలా? మీరాషా పైకి మాత్రం అనలేదు.

మీరాషా లోగడ ఒకమాటు గాడిదను ప్రేమిం చాడు. అప్పుడతని జీవితంలో గాడిదే సర్వప్రధానం. మరొక మాటు గోమతిని ప్రేమించాడు. ఇప్పుడు గుల్‌ను ప్రేమిస్తు న్నాడు. అతను అందరినీ ప్రేమిస్తున్నాడేగాని, ఇంతవరకూ అతన్ని ప్రేమించినవాళ్ళు ఎవ్వరూలేరు. ఒక్క ధనంమాత్రం ప్రేమించింది. కాని ధనం మానవుడిని ప్రేమించడం, గాడిదను మానవుడు ప్రేమించడంకన్నా హీనం!

ఇంత ఆస్తినీ, ధనాన్నీ సంపాయించికూడా అతని హృదయం శూన్యంగా వుంది. నాలుక అరుచికరంగా వుంది. గుల్‌నుచూసి నిస్సహాయంగా నోరూస్చుకొంటున్నాడు.

గుల్ తనకు ఇచ్చిన వస్తువుల్ని సర్దుకొని "ఐతే, ఇక వెళ్ళిరానా?" అన్నది.

నాలుగు సంవత్సరాలుగా ఇదే జరుగుతున్నది. గుల్ వస్తుంది. కొన్ని వస్తువుల్ని తీసుకొంటుంది. వెంటనే వెళ్ళిపోతుంది. కనీసం ఆ వస్తువుల్ని ఇస్తున్న లాలాకు తన అభిప్రాయాన్ని తెలియచేసే అవకాశాన్నయినా ఇచ్చేదికాదు. అలా గుల్ మౌనంగా వెళ్ళిపోతూవుంటే లాలాకూడా మౌనంగా చూస్తూవుండేవాడు. గుల్‌కు లాలా ఉపకారాన్ని ఏవిధంగానూ తీర్చడం సంభవంగా కనుపించేదికాదు. లాలా గుల్‌కు ఇలా తినే వస్తువుల్ని ఇవ్వడం ఉపకారం అనుకొనేవాడేకాదు. అందువల్ల ఇద్దరూ మౌనంగావుండేవారు. రబ్బరు బుడగలో గాలిఎక్కువయి పగిలిపోవచ్చినట్టుగా నిశ్శబ్దం చరమస్తాయిని అందుకొన్నప్పుడు "సరే, ఇక నీవు వెళ్ళు గుల్." అంటాడు లాలా. గుల్ వెళ్ళిపోతుంది, కాని, లాలా ఎందుకనో ఇవ్వాళ ఆఒక్కమాటనుకూడా అనలేకపోయాడు. కేవలం దయాప్రార్థితుడిలా చూస్తూ వుండిపోయాడు. గుల్ తన మామూలుప్రకారం ముందుకు నడిచింది వెళ్ళిపోవడానికి.

లాలా తెప్పరిల్లుకొన్నాడు. "ఇదుగో గుల్, ఇటువిను. మా ఆవుపెయ్య దూడనుపెట్టింది. చాలా అందంగావున్నది. చూస్తావా? దానినె త్తిన తెల్లని పంచకళ్యాణి చారకూడా వున్నది, చూస్తావా?" అన్నాడు.

"ఎక్కడ వున్నది?"

"పశువుల పాకలో."

గుల్ అనుకొన్నది. "ఉపకారానికి, బదులు తీర్చవలసిన సమయం వచ్చేసింది. ఎంతఅయినా ఉపకారమే. ప్రేమ ఎన్నటికీ కాదు." గుల్‌కు లాలా అనాకారనీ, అందగాడు

కాదనీ బాగా తెలుసును. కాని, ఈక్షణానవున్నంత అనాకారిగ లోగడ ఎన్నడూ అతడు గుల్‌కు కనుపించలేదు. ఇదివరకు లాలా మానంలో ఒకరకమైన ప్రేమయాచన వుండేది. ఆ యాచన కొంతవరకు గుల్ హృదయాన్ని ఆకర్షించేది. ఇప్పుడలాంటి యాచన ఏమీలేదు అతనిలో. ఒట్టి కామం, దుర్గంధం—ముక్కులువడిపోయే దుర్గంధం వుంది.

గుల్ అభ్యంతరాన్ని తెలియపరుస్తూ "లాలా, భాద్రపదంలో పెండ్లి నిశ్చయం జరిగింది." అన్నది.

లాలా వినిపించుకోకుండా గుల్ చేతిని పట్టుకు లాక్కుపోతూ "అరె, చాలా మంచిదూడ. చాలా అందమైనదూడ! పశువులగది ఎంతో దూరంలేదు; ఇక్కడే!" అంటున్నాడు.

గుల్ వద్దని అరుస్తున్నది. గది దగ్గిరపడ్డకొద్దీ లాలాకు తొందర ఎక్కువ అవుతున్నది. గుల్ అరుపులుకూడా ఎక్కువ అవుతూనే వున్నాయి. క్షణక్షణానికి లాలాకు ఆత్రం ఎక్కువ అవుతున్నది. దానితోపాటు కోపంకూడా ఎక్కువ అవుతున్నది. అతని ముఖం కోపంతో నల్లపడ్డది. అతనికి తనమీద, తన వంకరముక్కుమీదా, తన అందవికారంమీద, తననైచ్య గుణాలమీద, గుల్ అందంమీద, గోమతి విశ్వాసఘాతం మీద; ప్రతివస్తువుమీదా క్రోధం పెరిగిపోతున్నది. కోపం ఎందుకురాదు అతనికి? ఏం అతనికోపం ఉచితమైనదికాదా? గుల్‌కు అతనెంతో ఉపకారం చేశాడు. దానికి బదులుతీర్చవవసరంలేదా? కాకపోయినా అదంతా 'ఉపకారంగా' మాత్రమే ఎందుకు వుండిపోయింది. ప్రేమగా ఎందుకుమారర

లేదు? గుల్‌ని పశువులగదివైపు లాక్కుపోతున్న లాలాకు తీవ్రమైన నవ్వులధ్వని వినిపించింది. అతను వెనక్కుతిరిగి చూశాడు. శౌకత్ అల్లాదాద్‌లు అతన్నిచూసి నవ్వుతున్నారు.

లాలా ఆగిపోయాడు.

అల్లాదాద్ అన్నాడు. "ఎక్కడికి లాలా! ఆ గదిలో మా కైదీ వున్నాడు."

లాలాకుకూడా పశువుల గదిలో కైదీవున్న విషయం జ్ఞాపకానికి వచ్చింది. అతనిపట్టు సడలింది. గుల్ లాలాపట్టును విదిలించుకుని పరుగెత్తసాగింది. శౌకత్, అల్లాదాద్ నీ ఖూబానీ వృక్షాన్నిదాటి ముందుకుపోయింది. పరుగెత్తుతున్న ఆమెకు అగస్మాత్తుగా ఎవరో ఎదురుగా నిలబడి కనుపించారు. తనచేతిని బలంగా పట్టుకొన్నారు. గుల్ గాభరాపడి తలఎత్తి చూసింది. ఎదురుగా బాగా ఒడ్డూ, పొడుగూ కలిగి, అజానుబాహుడైన వ్యక్తి ఒకతను నిలబడివున్నాడు.

"దారివదులు, నన్నుపోనియ్యి చెయ్యివదులు" గుల్ అరిచింది.

"అరె...ఇది క్రొత్త సారాయమేనే!" కాహన్‌సింగ్ ఆనందపరవశు డయ్యాడు.

గోమతి దగ్గిరకు వచ్చింది. అన్నది "భాద్రపదంలో దీనికి పెండ్లి!"

"నన్ను వెళ్ళనివ్వండి" గుల్ అరిచింది.

"భాద్రపదం ఇంకా చాలారోజులు.. ఇలాంటి అందమైన రాత్రిని వదిలి భాద్రపదం కోసరం ఎదురుచూస్తారా...!" శాహాన్‌సింగ్ గుల్ చేతిని మరీ బలంగా పట్టుకొన్నాడు.

## 5

ఈ రాత్రి చాలా అందమైనది; గుల్ శాహర్ శాహాన్ సింగ్ గదిలోవున్నది. ఈ రాత్రి చాలా అందమైనది; గోమతి హాశమత్ అల్లాబేగ్ గదిలోవున్నది; ఈ రాత్రి చాలా అందమైనది; సిపాయీలు ఖూబానీ వృక్షంక్రింద చీట్లాడుకొంటున్నారు. ఈ రాత్రి చాలా అందమైనది; లాలా తన డబ్బును ముందుపోసుకు కూర్చుని ఎండిన హృదయపు పగుళ్ళను లెక్కపెట్టుకొంటున్నాడు. లాలా భావోన్మత్తు డయ్యాడు. అతనిలో ఏదో పిచ్చిఆవేశం జొరబడ్డది. ఎవరినైనా లాగించి ఒక్క గుద్దు గుద్దా లనిపిస్తున్నది అతనికి! ఒక్కగుద్దు...దాంతో గదుల తలుపులన్నీ వూడి క్రింద పడిపోవాలి! ఒక్కగుద్దు దాంతో పై కప్పులు ఎగిరిపోవాలి! ఒక్కగుద్దు... దాంతో హాశమత్ అల్లా బేగ్ సారానవ్వు శాశ్వతంగా వినపడకండా పోవాలి! ఒక్క గుద్దు – అలాజరగదా ? అలాజరగదా ? అలాజరగదా ? లాలామీరాసా ఆవేశంతోనూ, కోపంతోనూ పండ్లు కొరుక్కొన్నాడు.

## 6

ఈ రాత్రి చాలా అందంగావున్నది గోమతి తనలో తనే ఇలా అనుకొన్నది. ఈరాత్రి ఎంత అందంగా వున్నది: నా హృదయంలో ఏమిటీ ఉన్మాదం? ఇవ్వాళే క్రొత్తగా

నాకు వివాహం జరుగుతున్నట్టుగా వున్న దేం? గోమతి ఆరోజు చాలా అందంగా అలంకరించుకొన్నది. గాఢనీలపు పాంటు నొకదాన్ని వేసుకొన్నది. వంటికి పచ్చగులాబీల అత్తరును రాచుకొన్నది. తనకు తనే అతి నూతనంగా కనుపిస్తున్నది.

ఈ రోజున ఎందుకనో లాలా బాధ ఆమెకు ఒకరకమైన వినోదాన్ని కలిగిస్తున్నది. లాలా మానసికంగా ఇంకా బాధపడితే చూడవచ్చుకదా అనుకొంటున్న దామె! అవతల గుల్ కాహన్‌సింగ్ దగ్గరనుండి కేకలు వేస్తున్నది. ఆ కేకలను వింటుంటే గోమతికి తను తహశీలుదారు దగ్గిర చిక్కువడ్డ మొదటిరాత్రి జ్ఞాపకానికి వస్తున్నది. ఆరోజు లాలా తనను ఒంటరిగా తహశీలుదారు గదిలోవదలి, అర్జంటు పనివుందని వూళ్ళోకి వెళ్ళాడు. తిరిగి రాత్రి రెండుగంటలకు గాని రాలేదు. ఆరోజు జ్ఞాపకానికి వచ్చింది గోమతికి. ఇవ్వాళ గుల్‌ను కాహన్‌సింగ్ వదిలి పెట్టేసరికికూడా రెండు గంటలు అవుతవి! ఇవ్వాళ తను హాశమత్ అల్లా బేగ్ దగ్గిరకుపోదు. అతన్ని బాగా ఏడిపిస్తుంది.

## 7

గోమతి చక్కగా అలంకరించుకొని ఒక పళ్ళెంనిండా ఆహార పదార్థాలను తీసుకొని పశువుల గదివైపుకు బయలు దేరింది. శౌకత్, అల్లాదాద్‌లు కావలాకాస్తున్నారు.

గోమతి అలాదాద్‌ను అడిగింది; "తాళం చెవ్వు ఇటు తే!"

అల్లాదాద్ తాళంచెవ్వును ఇచ్చాడు.

గోమతి అన్నది "లాలా గనక అడిగితే ధానేదార్ గార్కి అన్నం పెడుతున్నదని చెప్పండి. ధానేదార్ అడిగితే లాలాదగ్గిర వున్నదని చెప్పండి."

"కానీ !" అల్లాదీన్ అన్నాడు.

"కానీ–కానీ ఏమీలేదు ! వాళ్ళు యిద్దరూ ఒకరిని ఒకరు అడగడానికి ఎన్నటికీ సాహసించరు. అందువల్ల ఏవిధమైన భయమూలేదు ! నేను మీ ఖైదీకి అన్నం పెట్టివస్తాను.

గోమతివెళ్ళి తాళం తీసింది,

తలుపు తెరచుకొన్నది.

అల్లాదాద్ భయంతో వణికిపోసాగాడు.

గదిలో అబ్దుల్‌కు తిరిగి ఒకమాటు వెనకటి అపరిచితమైన సువాసన వచ్చింది. అరె – ఇది వచ్చగులాబీల అత్తరు వాసనకదా? అబ్దుల్ లేచి కూర్చున్నాడు. గోమతి అపరూప సుందరిలా అలంకరించుకొని, పళ్ళెంలో సన్నని దీపాన్ని వెలిగించుకొని గదిలోకి ప్రవేశించింది. సన్నని చిన్ని దీపపువెలుగు చీకట్లలో గోమతి తళతళా మెరసిపోతున్నది. అబ్దుల్ లేచి నిలబడ్డాడు. ముందుకు నడిచాడు. గోమతి మెరిసే కాటుక కండ్లూ, నవ్వే సన్నని పెదాలూ తనను ఆహ్వానిస్తున్నాయి. అనిపించింది అబ్దుల్‌కు. అబ్దుల్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అతనికి బానో జ్ఞాపకానికి వచ్చింది. కాని, బానో చాలా దూరంగా వున్నది. గోమతి చాలా దగ్గిరలోవుండి అబ్దుల్‌ను భ్రమింపచేస్తున్నది. అబ్దుల్‌ను ఏదో అవ్యక్తమైన భయం వేధిస్తున్నది. సాహసించమని ప్రోత్సహిస్తున్నది.

గోమతి అన్నది "మొదట భోజనంచెయ్యి !"

అబ్దుల్ అన్నాడు "కాదు. మొదట కబుర్లు చెప్పు, తరువాత భోజనంచేస్తాను!"

ఇద్దరూ ఎండు గడ్డిమీద ఒకరికి ఒకరు దగ్గరగా కూర్చున్నారు.

అబ్దుల్ అడిగాడు "నన్ను రావల్పిండి పంపడానికి యే ఉపాయాన్నాలోచించావు?

గోమతి నిద్రలోనుండి దిగ్గున లేచి నట్టయింది. ఆమె రావల్పిండినీ, పరీక్షలనూ, అబ్దుల్ బంధింపబడడాన్నీ-సర్వాన్నీ మర్చిపోయింది. ఆమెకు ఒక్క- అబ్దుల్ మాత్రమే జ్ఞాపకం! మిగిలినవి ఏమీ జ్ఞాపకంలేవు! ఇప్పుడు అబ్దుల్ నోటిమీదుగా రావల్పిండి మాట వినేసరికి ఆమె జ్ఞాపకాల మడతల్లోనుండి రావల్పిండి పుట్టుకువచ్చింది...సద్యోజాత శిశువులా: ఆశిశువు చిరునవ్వుల్లోనుంచిసజ్జన దేవు కనుపించాడు. సజ్జన దేవుగోమతికి ఎదురుగా నిలబడివున్నాడు. అతని రెండుచేతుల్లో చేతులు వేసి తను ఎదురుగా నిలబడ్డది గోమతి. ఆ క్షణాన వారి ఇద్దరి ముఖాల్లోనూ ఒక అపూర్వమైన నవ్వు ప్రస్ఫుటితమైంది. అలాంటి చిరునవ్వును తిరిగి ఈనాటి వరకూ గోమతి ఎవ్వరి ముఖంలోగాని తన ముఖంలోగాని చూడలేదు. గోమతి ప్రస్తుతాన్ని ఒక్క-క్షణకాలం విస్మరించి తన వెనకటి అమాయకమైన యవ్వనపు ప్రథమ జీవితాన్ని చూడసాగింది. అప్పుడు తను చాలా అమాయికమైనది. ఎవరినైనా పవిత్రంగా నిష్క-పటంగా ప్రేమించగల స్థితిలోవున్నది. అలాంటి తనను లాలా బంగారు గొలుసులతో బంధించివేశాడు, తన సహజత్వాన్నంతా హరించివేశాడు!

గోమతి గుండెలు వేగంగా కొట్టుకొనసాగాయి. అబ్దుల్ ముఖంలో సజ్జదేవు కనుపిస్తున్నాడు. అదే అమాయకత్వం, అదే కుర్రతనం, అదేఅనుభవహీనత! గోమతి సంధిగ్ధావస్థలో పడ్డది. తను శారీరక సౌఖ్యాన్ని చూసుకొని-దానికి తగినట్టు ప్రవర్తించడం వుచితమా? లేక ఈ అమాయక యువకుడికి మార్గాన్ని చూపి తను బలికావడం వుచితమా? కాకపోయినా, తనేం అన్యాయం చేసిందని తనకీ దండన? తనకు అబ్దుల్ లాంటి యువకుడు ఎందుకు లభించలేదు? ఎందుకని? ఎందుకని?

గోమతి రెండు చేతులతోటీ తన ముఖాన్ని కప్పేసుకొన్నది.

అబ్దుల్ ఆమెను తన గుండెలకు అదుముకొన్నాడు.

అవతలకి త్రోసి "నన్ను ముట్టుకోకు అన్నది" గోమతి

అబ్దుల్ చకితుడయ్యాడు.

గోమతి అబ్దుల్ బుజంమీద తల వాల్చింది. అన్నది. "క్షమించు నేను ఇప్పుడు మానసికంగా సరైనస్థితిలో లేను. నేను కావాలంటే నిన్ను నాశనం చేయించగలను...కాని అలా చేయించను. ఈ ప్రపంచంలో మానవు లందరికీ బ్రతకడానికి సమానమైన హక్కు వున్నది!"

"ఏమిటలా విచిత్రంగా మాటాడుతున్నావు గోమతీ?"

"అవును ఇప్పుడు విచిత్రంగానే వుంటాయి. రేపు నీవు పెండ్లి చేసుకొన్న తరువాత అనుకొంటావు; ఒకనాడు గోమతి నన్ను తన గుప్పెటలో వుంచుకొన్నది. కావాలంటే నిలిపివేసేది. కాని దయదలచి వదిలిపెట్టింది; అని!"

నేను బానోని పెండ్లి చేసుకొంటాను!"

"బానో ఎవరు?" గోమతి గాభరాగా అడిగింది.

అబ్దుల్ జ్ఞాపకాల్లోకి బానో మెల్ల మెల్లగా ప్రవేశిస్తున్నది. అబ్దుల్ ముఖం సంతోషంతో వికసించింది. అతను మనోహరమైన స్వరంలో "బానో నా కాబోయే భార్య!" అన్నాడు.

గోమతి లేచి నిలబడి "నీవు భోజనంచేయి. తరువాత వదిలి పెట్టేస్తాను!" అన్నది.

"నీవు నన్ను విడిచిపెడతా నన్న విషయం స్ఫురణకు రావడంతోనే ఆకలంతా మాయం అయిపోయింది!"

"అయితే పద! ఇప్పుడే బయటికి నడు! ఆలస్యం వద్దు!"

అబ్దుల్ లేచి నిలబడ్డాడు.

గోమతి భోజనపదార్థాలు తెచ్చిన పళ్ళెం వైపు ఒక మాటు చూసింది. ఈ పదార్థాలను ఎంత ప్రేమతో చేసింది ఆమె! ఈ అలంకరణను ఎంత మమతతో చేసుకువచ్చింది ఆమె! ఈ అందమైన రాత్రిలో ఎన్ని అమర సుఖాలను కలకన్నది ఆమె! గోమతికి అపారమైన కోపం వచ్చింది. ఆహార పదార్థాల పళ్ళాన్ని ఒక్క తన్నుతన్నింది. పళ్ళెం పెద్ద శబ్దం చేసుకొంటూ వెళ్ళి గోడకు తగిలి అక్కడినుండి దొర్లి బర్రె ముందుకు వచ్చిపడ్డది. బర్రె పళ్ళాన్ని వాసనచూడసాగింది. లాలా భోజనంచేయడం జ్ఞాపకానికి వస్తున్నది!

"ఏమిటి...ఏమిటావని?" అబ్దుల్ అడిగాడు.

"ఏమీలేదు!"

"బయట సిపాయీలు నన్నేమీ అనరా ?"

"ఏమీ అనరు!"

"నీకు ఎలా కృతజ్ఞత తెల్పను ?"

"కృతజ్ఞత తెల్ప నవసరంలేదు!"

"నేను రావల్పిండి వెళ్ళి తప్పకుండా సజ్జన దేవ్‌ను కలుసుకొంటాను !"

"నీఇష్టం!"

"అతన్ని కల్సుకొని ఏంచెప్పను!"

గోమతికి తలతిరిగినట్టయింది. క్రిందపడకుండా గోడను ఆనుకుంది. రెండుక్షణాలు ఆగి స్థిమితపడ్డ తరువాత చాలా నిరాశగా, చాలా వుదాసీనంగా "ఒకప్పుడు నీవు ప్రేమించిన బాలిక ఇప్పుడు వేశ్యలా బజారు వ్యాపారం చేస్తున్నదని చెప్పు!" అన్నది.

"గోమతి! ఏమిటీ మాటలు ?"

"నిజం చెబుతున్నాను అబ్దుల్ !" గోమతి ఏడ్వ సాగింది.

తిరిగి ఒక్కక్షణంలోనే గోమతి కాఠిన్య ప్రతిమ అయింది.

"సరే, ఇక నీవు తలుపుతీసుకొని బయటికినడు !"

"బయట సిపాయీలు వున్నారుగా ?"

"నీకెందుకు...నీవు తలుపు తెరు"

అబ్దుల్ తలుపు తెరచాడు. పురాతన దర్వాజా ఒక మారు ఛీత్కరించింది. బయటి వెలుగు కొంత లోపలకు ప్రవేశించింది. అబ్దుల్ గడపలోకివచ్చి నిలబడ్డాడు. బయట

ఖూబానీ చెట్టుక్రింద కూర్చున్న శౌకత్ అల్లాదాద్‌లు అబ్దుల్‌ని పోల్చుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారు.

"ఎవరది?" శౌకత్ కేకవేశాడు.

"నేను. అబ్దుల్‌ని!"

శౌకత్ చాకు బయటికి తీశాడు. అల్లాదాద్ ఒక అడుగు ముందుకు వేశాడు.

"ఏమిటి అమ్మగారూ?" అల్లాదాద్ అడిగాడు.

గోమతి అతిస్థిమితంగా, నిరామయంగా అన్నది. "ఇది పశువులకొట్టు వాకిలి. ఈవాకిలిగుండా ఒకమనిషి లోపలికి వచ్చాడు. ఒకేమనిషి బయటికి వెళ్తాడు! అంతేను!"

అల్లాదాద్ కొద్దిసేపటివరకూ స్థంభించిపోయాడు. అతి నిదానంగా గొంతు తడుపుకొంటూ "సరే" అని మాత్రం అనగలిగాడు ఐదునిమిషాలు ఆగి!

"వద్దు...వద్దు..." అబ్దుల్ పెదాలు కదిలినాయి.

"అల్లాదాద్ ఏమిటి నీవు మరీ బుర్రలేకండా పనులు చేస్తున్నావు?" శౌకత్ అన్నాడు.

"వద్దు... వద్దు... నేనలా వప్పుకోను!" అబ్దుల్ పెదాలు మళ్ళీ కదిలినవి.

గోమతి తీవ్రస్వరంలో మాట్లాడింది. "ఇకనీవు ఒక్క-క్షణంకూడా ఆలస్యం చేయకు. ఈవరకు నీవు వెళ్ళిపోవలసినది-ఇంకా కొంచం ఆలస్యంచేస్తే, ఎవరికి తెలుసు నేనూ నా అభిప్రాయాన్ని మార్చుకొంటానేమో! ఈ ఒక్క-క్షణాన్ని సద్వినియోగంచేసుకో ఫో! నేను ఇక్క-డ ఈ వాకిట్లో నిలబడి చూస్తూ వుంటాను. నీవు పూర్తిగా చూపుకు అందకుండా

చాటిపోయేవరకూ ఎవ్వరూ ఈగదిలో ప్రవేశించలేరు. నీజాడను తెలుసుకోలేరు. ఊఁ పో!" గోమతి అబ్దుల్‌ను బయటికి ఒక్క త్రోపు తోసింది. అబ్దుల్ మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ వెనక్కు తిరిగి చూచుకొంటూ ముందుకు నడిచాడు. తరువాత నడకను తీవ్రంచేశాడు. పరుగెత్తాడు. చివరకు అతను దక్షిణపు పల్లానికి దిగి ఆకాశం అంచులను ఆవరించిన నలుపు ఛాయల్లో అదృశ్యుడయ్యాడు. పల్లానికి దిగేప్పుడు తనవైపు ఒకమాటు తిరిగి చూస్తాడని గోమతి అనుకొన్నది. కాని అబ్దుల్ చూడలేదు. గోమతి చిన్నగా నవ్వుకొన్నది. తరువాత మెల్లగా వణుకుతున్న స్వరంలో అల్లాదాద్‌తో ఇలా అన్నది.

"అల్లాదాద్ పశువులగదిలో ప్రవేశించడానికి నీ వంతు వచ్చింది. రా!"

# 8

తూర్పువరండాలో థానేదార్ హాశమత్ అల్లాబేగ్ గోమతికోసరం ఎదురుచూస్తూ చాలా అస్థిమితంగా పచార్లు చేస్తున్నాడు.

ఉత్తరపు వరండాలో లాలామీరాషా అల్లాబేగ్ లాగానే అస్థిమితంగా పచార్లు చేస్తున్నాడు. ఇలా తిరుగుతూ తిరుగుతూ ఇద్దరూ ఒకమాటు తూర్పు, ఉత్తరపు వరండాల చివర్లన కలుసుకొన్నారు.

లాలా థానేదారు నడిగాడు. "గోమతి ఎక్కడ వున్నది ?"

థానేదారు సాశ్చర్యంగా అదే నేనూ నిన్ను అడుగు దాం అనుకొంటున్నాను!" అన్నాడు.

థానేదారు మనస్సులో మెరపులా ఒక ఆలోచన మెరసింది. నేరుగా తనగదిలోకిపోయి లాంగ్ బూటు వేసుకొని, చేతికర్రను తీసుకొని బయటికి బయలుదేరాడు. లాలాకూడా అతని వెంటనే వున్నాడు. థానేదారు గదిలోకి వెళ్ళినప్పుడు టేబిల్ మీద రెండు గ్లాసులు వున్నాయి! ఒకగ్లాసులో గట గట త్రాగిన సారాయి మిగిలివున్నది. రెండవది ఖాళీగ్లాసు. దాన్లో అసలు సారాయి పొయ్యలేదు! హాశమత్ క్రోధంతో వుడికిపోయాడు. చేతికర్రతో రెండుగ్లాసులనూ విసరికొట్టాడు. అవి క్రిందపడి ముక్కలుముక్కలు అయిపోయినవి.

లాలా పెదాలమీద ఒకరకం అయిన కుటిల హాస్యం మెరసింది. అతను చేతులుజోడించి "ప్రభూ! ఎక్కడికి పోతుంది... ఇక్కడే ఎక్కడో వుంటుంది" అన్నాడు.

హాశమత్ గదినుండి బయటికి నడిచాడు.

డ్రాయరుమీద పిస్టల్ బాక్సు వున్నది. లాలా ఒక్క క్షణం ఆగి బాక్సును పరిశీలనగా చూశాడు. మెదలకుండా బాక్సును బుజానికి తగిలించుకొని హాశమత్ వెనకనే తనూ నడిచాడు.

హాశమత్ అల్లాబేగ్ తీవ్రగమనంతో పశువులకొట్టు వైపుకు నడుస్తున్నాడు. లాలా కూడా అతనితోపాటు నడవ డానికి ప్రయత్నిస్తూ "అటు ఎక్కడికి వెళుతున్నారు! అటు పశువులకొట్టు వున్నది! అక్కడ అన్నీ పశువులే! కాకపోతే మీ ఖైదీ ఒకడున్నాడు.

"నువ్వు నోరుమూసుకుని నాతోవచ్చెయ్యి" హాశమత్ గర్జించాడు.

కొట్టుదగ్గిరకుపోయి అతను "లోపల ఎవరున్నారు ?" అని శౌకత్‌ను అడిగాడు.

శౌకత్ మాట్లాడలేదు.

"మాట్లాడవేరా, వంది !"

లాలా మీరాషా బుజానవున్న పిస్తోల్‌బాక్సు అప్రయత్నంగా అతని బుజంమీదనుంచి జారి క్రింద హాశమత్ కాళ్ళమీద పడ్డది. లాలా బాక్సును పైకి తీసుకుందామని వంగాడు. ఇంతలోనే హాశమత్ లాలా చేతిలోనుంచి బాక్సుని లాక్కుని పిస్తోల్‌నిండా గుండ్లు నింపాడు.

లాలా చేతులుజోడించి "ప్రభూ. ప్రభూ ! కొంచెం శాంతించండి. అది నా భార్య. కొంచం ఆలోచించండి ప్రభూ నాశనమైపోతాను !" అని బ్రతిమలాడుకొంటున్నాడు.

"తలుపుతియ్యి !" హాశమత్ గర్జించాడు.

శౌకత్ తలుపుతీశాడు.

"ప్రభూ ! ప్రభూ ! కొంచం ఆలోచించండి...కొంచం శాంతించండి !" లాలా వూరకే అరుస్తున్నాడు ఏదో అరిష్టాన్ని సూచించే స్వరంలో.

హాశమత్ లాలాను ఒకత్రోపుత్రోసి అవతలికి నెట్టి తాను పశువులకొట్టులోకిపోయి లోపలినించి తలుపు బిగించేసుకున్నాడు.

లాలా చేతులు జోడించుకుని ఏడుస్తున్న స్వరంలో "ప్రభూ ! ప్రభూ !" అంటున్నాడు.

ఉన్నట్టుండి లోపలనుండి రెండుసార్లు పిస్టల్ కాల్చిన శబ్దంతోపాటు ఒక చీత్కారం బయటికి వినవచ్చింది. తరువాత నాలుగువైపులా నిశ్శబ్దం.

"అయ్యో రామచంద్రా!" లాలా పెద్దగా అరిచి నేల మీద చతికిలపడ్డాడు.

కొద్దిసేపటి తరువాత పశువులకొట్టు తలుపు తెరుచు కున్నది. హాశమత్ అల్లాబేగ్ పిస్టల్ బాక్సులో పెట్టుకొంటూ బయటికి వచ్చాడు. అతని కాళ్ళు వణుకుతున్నాయి. కండ్లు చింతనిప్పుల్లా ఎర్రగా వున్నాయి.

"ప్రభూ! ప్రభూ! నేను సర్వనాశనం అయిపోయాను. నేను చచ్చిపోయాను...కాని, మీరుకూడా నాశనం అయి పోతారు...తప్పదు ఇది ఖూనీ, ఇది దాగదు...మిమ్మల్ని ఉరికంభం ఎక్కిస్తారు! ప్రభూ! మీరు నాశనం అయిపో తారు! మీరీ ప్రమాదాన్నుంచి తప్పించుకోవాలంటే ఒకటే మార్గం. మీరు యిక్కడినుండి పారిపొండి...ఈ జాగీరుకు చాలాదూరం...బహుదూరం! నేను మీమంచికోసమే చెబు తున్నాను!" లాలా అన్నాడు.

హాశమత్ శౌకత్‌తో యిలా అన్నాడు "మన గుర్రా లను పట్టుకురా! ఇక ఒక్కక్షణంకూడా యీ జాగీరులో వుండకూడదు.

# 9

కొద్దిసేపటి తరువాత ఇద్దరు గుర్రపురౌతులు టీకరీశాహా మురాద్ సరిహద్దుల్ని దాటి దక్షిణదిశగా పరుగెత్తారు. లాలా మీరాషా ముఖాన విజయసూచకమైన చిరునవ్వు వొకటి

కొరసింది. క్షణం ఆగి లాలా వరండాబయటికి మెట్లమీదకు వచ్చి ఏడుస్తూ అరవసాగాడు.

"అయ్యో! దేవుడా! నేను నాశనమైపోయాను. నా తోంప కూలిపోయింది.



# ఆరవ అధ్యాయం

రాత్రి పడుకోబోతూ తల్లి సరస్వతితో అన్నది. "ఈ తోంపలో ఎలుకలు దుంప తెంచేస్తున్నాయి. అఖరోట్లూ, ఖర్జూరపండ్లూ తరిగినాయి. ఎలుకలు తినివుంటాయి!"

సరస్వతి అన్నది. "ఎలుకలు కాదమ్మా, కొద్దిగా అఖరోట్లూ, ఖర్జూరపండ్లూ - నేను అబ్దుల్‌కు పెట్టాను.

గంగ చిరునవ్వునవ్వి ప్రక్కకుతిరిగి పడుకున్నది. దుప్పటిని కండ్లకు అడ్డం కప్పేసుకొన్నది.

ఏదో అనడానికి ఆత్రంగా తల్లి పెదాలను కదిపింది. కాని, ఏమీ అనకుండా మౌనంగా వుండిపోయింది. అయినప్పటికీ ఆమెముఖం ఎలాతెలాపోతూ కనుపిస్తున్నది. ఇటు సరస్వతిముఖం వెనకటికంటే కళకళ లాడుతున్నది. ఎర్ర తామర పుష్పంలా వికసించింది. ఒకమాటు ఆవలించి "ఇవ్వాళ చాలా హాయిగా నిద్ర పడుతుంది!" అన్నది సరస్వతి.

తల్లి మెల్లిగా తన పక్కమీదనుంచి లేచింది. తలుపు తీసుకొని బయటికి వెళ్ళింది. సరస్వతి మౌనంగా తల్లివంక

చూస్తూ వుండిపోయింది. సరస్వతికి తల్లి తనమీద ఎందుకు కోపంగావున్నదో తెలుసును...తల్లిలో ఒక చెడ్డ అలవాటు వున్నది. ఎలాంటి పరిస్థితిలో నూ తనకోపాన్ని బయటపెట్టకు. మౌనంగా వూరుకుంటుంది. సరస్వతి గంగను ఉద్దేశించి "అమ్మలో ఏమిటో మార్పు వస్తున్నది." అన్నది గంగ మాట్లాడలేదు. సరస్వతి గంగవైపుకు తిరిగి ఆమెను దగ్గరకు లాక్కుంటూ చాలా బలహీనమైన స్వరంలో "నిద్ర పోయావా?" అని అడిగింది.

"లేదు సరసూ!" గంగఅన్నది. సరస్వతి చెయ్యి గంగ వక్షస్థలంమీద వున్నది.

సరస్వతి "వాళ్ళు ఇద్దరూ ఇప్పుడు ఏంచేస్తూ వుంటారో!" అన్నది. ఆమె అన్నది లోపలగదిలో పడుకున్న ఫజల్ రజ్జీనిగురించి. ఆమె స్వరం చాలా మృదువుగావున్నది. ఆ మృదుత్వంలో ఒకరకమైన తీక్ష్ణతకూడా కనుపిస్తున్నది. బూడిదను తాకినప్పుడు నిప్పురవ్వ తగిలినట్టు.

"ఏంచేస్తూ వుంటారు; నిద్రపోతూ వుంటారు." గంగ అన్నది.

సరస్వతి మౌనంగా గంగను తనలోకి అదుముకొంటు న్నది. గంగకు వూపిరాడడంలేదు.

"సరసూ! నాకు వూపిరాడడంలేదు. నన్ను వదిలిపెట్టు లేకపోతే అమ్మకు చెబుతాను." గంగ అన్నది.

సరస్వతి గంగను విడిచిపెట్టింది.

కొద్దిసేపు తిరిగి మౌనం. గంగకు నిద్రవచ్చింది. ఇంతలో సరస్వతి మళ్ళీలేపింది గంగను. "నిద్రపోయావా, గంగా?"

"లేదక్కా,"

"నాకు నిద్ర రావడంలేదు."

"ఐతే మంచికథ ఏదైనా చెప్పు. నిద్రవస్తుంది."

"సరే చెబుతాను. కాని, నీవు 'ఊ' కొడుతూ వుండాలి!"

"ఊ!"

"అనగా అనగా ఒకరాజు...అతడికి ఏడుగురు రాణులు!"

"ఊ!"

"వాళ్ళల్లో ఆరుగురు రాణులు చాలా మంచివాళ్ళు! ఏడవరాణిమాత్రం మహాచెడ్డది! అది రాక్షసి! అందువల్ల మానవరక్తం త్రాగుతూ వుంటుంది!"

"ఊ!"

"ఇట్లా వుండగా. పెద్దరాణీ ఒక కొడుకుని కన్నది. ఇదిచూసి ఏడవరాణీ, రాక్షసికి, కన్నుకుట్టింది. ఎలాగరా ఆ కొడుకుని చంపుకుతినడం అని ఆలోచించి ఒకప్లాను వేసింది. పెద్దరాణీతో మహామంచిగా వుండసాగింది. నలభై రోజుల వరకూ ఆమెకూ ఆమె కొడుక్కూ మహా అణుకువగా సేవ చేసింది. నలభై ఒకటవరోజున ఎవ్వరూ లేకుండా చూసి పసిపావడి రక్తాన్ని తాగేసింది!"

"అయ్యో! రామా!" గంగ పూర్తిగా లేచి కూర్చుని శ్రద్ధగా కథ వినసాగింది. "తరువాత ఏమైంది!" అనడిగింది.

"తరువాత రాజు చాలా విచారగ్రస్తుడైనాడు. మహల్లోవున్న రాణులూ దాసీలూ అందరూ ఏడవసాగారు.

రాక్షసి అందరికన్నా పెద్దగా ఏడవసాగింది. జుట్టు పీక్కోనూ, శోకాలుపెట్టనూ సాగించింది!"

"తరువాత?" గంగ ఆత్రంగా అడిగింది.

"తరువాత...రెండవరాణి రెండవ సంవత్సరం ఒక కొడుకుని కన్నది!"

"ఐతే...రాక్షసి ఈ కుర్రవాడి రక్తంకూడా తాగేసిందా?" గంగ అడిగింది.

"అవును! కాని." ఆపి ఫజల్ రజీవున్న గదివైపు చెయ్యిచూపి "లోపల ఏమిటి శబ్దం?" అనడిగింది సరస్వతి.

"నాకేం తెలుసు? నీవు కథచెప్పు?" అన్నది గంగ.

సరస్వతికి గుండెలు తీవ్రంగా కొట్టుకోసాగాయి. కాళ్ళూ చేతులూ చల్లబడి చీమలు పాకుతున్నట్టవుతున్నాయి. స్వరం పూర్తిగా మారిపోయింది. రెండుక్షణాలు ఆగి "తరువాత కథనంతా మర్చిపోయాను!" అన్నది సరస్వతి.

"నువ్వు అబద్ధం చెబుతున్నావు" గంగ అన్నది.

"నిజమే! నేను అబద్ధంచెప్పాను. నాకు నిద్రవస్తున్నది. అందుకని చెప్పలేను!" అన్నది సరస్వతి.

"ఇప్పుడేగా నిద్ర రావడంలేదన్నావు?"

"ఇప్పుడు వస్తున్నది!"

"ఇదీ అబద్ధం!"

"నిజం! ఇదీ అబద్ధం! అసలు నేను కథ చెప్పదల్చుకోలేదు!"

"ఎందుకని చెప్పదల్చుకోలేదు ?"

సరస్వతి ఏదో సమాధానం చెప్పబోతున్నది; ఇంత లోనే గది తలుపుతీసుకొని ఒక్క-వూపులో వచ్చి సరస్వతి పక్క-లో పడ్డది రజ్జీ !

"ఏమైంది ?" సరస్వతి అడిగింది.

"పెండ్లి అయ్యేవరకూ మేమిద్దరం ఒకచోట పడు కోము !" రజ్జీ అన్నది.

సరస్వతికి చెప్పరాని ఆనందం కలిగింది. శరీరంలో వున్న వెనకటి బాధలన్నీ తొలగిపోయినాయి. శరీరం తేలిక పడ్డది.

సరస్వతి గంగతో ఇలా అన్నది "గంగా, కోపం తెచ్చుకోకు ! ఇక నీకు మంచి కథ వినిపిస్తాను. రజ్జీ ! నీవూ వింటావా? రా ! దగ్గరకురా !"

గంగ సరస్వతిని ఇదివరకే కౌగలించుకొని పడుకొని వున్నది. ఇప్పుడు రజ్జీకూడా దగ్గిరకువచ్చి సరస్వతి చుట్టూ చేతులను పెనవేసుకు పడుకొన్నది. సరస్వతి ఆనందంతో కన్నులు మూసుకొని చెప్పసాగింది. "ఒక రాజుకు ఏడుగురు రాణులు. . .!"

## 2

బయట ముసలామె 'చఖరీ' వృక్షసమూహంలో గుంటలో వుంచబడిన దేవతావిగ్రహాన్ని ముందు పెట్టుకొని ఏడుస్తున్నది. ముసలామె గుండెల్ని బాదుకుని, నిస్సహాయంగా

ఆకాశం వైపు చేతులను జాపి, దేవతావిగ్రహపు కాళ్ళమీద పడి భోరుమని ఏడుస్తున్నది.

దేవతావిగ్రహం రాతితో చెక్కబడినది; ధోవతిని ధరించి నవ్వుతున్న ఆకృతిలో కొన్ని పళ్ళను బయటికిపెట్టి, రెండు చేతులనూ, ఎవరినో వుద్ధరిస్తున్నట్టు పైకి జాపి వున్నదా విగ్రహం!

ఈ దేవతా విగ్రహాన్ని ముసలామె తన పుట్టింటినుంచి తెచ్చుకొన్నది. పుట్టిన వూళ్ళో ఒక పెద్ద శిథిలగుట్టలో దొరికిందా విగ్రహం ఆమెకు. కొంచం ఇతిహాస పరిజ్ఞానం కలవారు ఎవరయినా ఆ విగ్రహాన్ని చూస్తే-అది నాలుగు వందల సంవత్సరాలక్రితం త్రిభువన మహారాజుగారి స్నానాల గదిలో వుండేదని ఇట్టే అర్థం చేసుకొంటూరు. ఈ విగ్రహాన్ని చెక్కిన శిల్పాచార్యులవారు, ఆ విగ్రహాన్ని చెక్కేరోజులలో ఎక్కువగా మహారాజుగారి హాస్యగాడి ఆకారాన్ని దృష్టిలో వుంచుకొన్నారు. అందువల్ల విగ్రహానికి పూర్తిగా హాస్యగాడి రూపం వచ్చింది. హాస్యగాడి రూపంలోవున్న ఈ విగ్రహం మహారాజుగారి స్నానాగారంలోవున్న రోజుల్లోనే ఒకనాడు మహారాజు స్నానం చేస్తూవుండగా ముస్లిములు రాజమహాలును ముట్టడించారు. రాజుగారు అక్కడే స్నానాగారంలోనే హత్యచేయబడ్డారు. మహాలు కూలద్రోయబడ్డది. ఈ విగ్రహం అక్కడే రాతి గుట్టల్లో కప్పివేసుకు పోయింది. అప్పుడే ఈ విగ్రహానికి ముందు పండ్లుమూడూ వూడిపోయాయి. అయినప్పటికి కూడా ముఖంలోని నవ్వు చెదరలేదు. ఈ నాలుగయిదు శతాబ్దాలనుంచీ, ఏర్లూ ఎల్లంకలూ మొలచిన శిథి

లాల అడుగున వుండి మానవుడి వుస్నతిని చూసి నవ్వుతున్న దీ విగ్రహం! పాపం! ఆ ముసలామెకు ఈ విగ్రహంమీద అపారమైన విశ్వాసం! సంకటగ్రస్తమైన అనేక సమయాలలో ముసలామె ఈ విగ్రహం ముందు మోకరిల్లి ప్రార్థించింది. తన భర్త ప్రాణాపాయస్థితిలో వుండగా ఒకమాటు ప్రార్థించినది. అయినా భర్త బ్రతకలేదు. పిల్లల రక్షణకోసం ఒకసూటు ప్రార్థించింది. తిరిగి ఇప్పుడు ప్రార్థిస్తున్నది. ఆ విగ్రహంపాదాల మీదపడి ఏడుస్తున్నది. క్రోధంతో అరుస్తున్నది.

"ఈశ్వరా! నా కూతుళ్ళకు సద్బుద్ధిని కలిగించు. వాళ్ళకు ధర్మమార్గాన్ని చూపించు! భగవంతుడా! నా కూతుళ్ళు ముసల్మానులయి పోతున్నారు. వాళ్ళను రక్షించు. ఈముసన్మాను రాక్షసుల బారినుండి తప్పించు. భగవంతుడా! ధర్మరహితులయిన ముసల్మానులను నాశనంచేయి. సర్వ నాశనం చేయి...!"

ముసలామె ఏడుస్తూ ప్రార్థిస్తున్నది. రాతి విగ్రహం లోని హాస్యగాడు ఆమెనుచూచి నవ్వుతున్నాడు. ఇప్పుడే కాదు ఈ హాస్యగాడు శతాబ్దాలక్రితం మహారాజా త్రిభువనుడి బ్రాహ్మణరాజ్యం ధ్వంసమై, ఆ స్థానంలో అరబ్ రాజ్యం స్థాపింపబడ్డప్పుడు కూడా నవ్వుతూనే వున్నాడు. తరువాత ఆసేతు హిమాచల పర్వతం వ్యాపించిన మొగలుల రాజ్యం విచ్ఛిన్నమైనప్పుడుకూడా ఈహాస్యగాడు నవ్వుతూనేవున్నాడు తరువాత గంగ తనను పూజామందిరంలోనుంచి తెచ్చి చఖరీ వృక్షసమూహంలో గుంటలో పారేసినప్పుడు కూడా నవ్వు తూనే వున్నాడు. అంతేకాదు రేపు ఇక్కడినుంచి కూడా

తీసి మ్యూజియంలో ఒక మూల పడేసినప్పుడుకూడా నవ్వు తూనేవుంటాడు. అందుకు కారణం ఈ విగ్రహాన్ని చెక్కిన శిల్పి మానవహృదయపు లోతుల్ని ఎరిగినవాడు. అజంతా శిల్పకారుల్లాగా, యూనాన్ కళాకారుల్లాగా, కాళిదాసులాగా ఈ శిల్పికికూడా మానవహృదయం సువిదితం! ఇతిహాసం మానవ మేధస్సుకు హద్దుల్ని కడుతుందనేమాట నిజమే! కాని ఒకొక్కప్పుడు మానవమేధస్సు ఇతిహాసం నిర్మించిన హద్దుల్ని అధిగమిస్తుంది.

ముసలామె అమాయకురాలు, చదువు సంధ్యలులేనిది. ప్రార్థిస్తున్నది. తెలివిగల రాతివిగ్రహం ఆమె ప్రార్థనలను పరిహాసం చేస్తున్నది. నవ్వుతున్నది ముసలామె ఏడ్చి ఏడ్చి మౌనం వహించింది. ఈ ఏడుపులో కొంతవరకూ ఆమె హృదయభారం తగ్గింది. నిద్రవస్తున్నట్లుండడంవల్ల తిరిగి యింటి ముఖం పట్టింది. గడపలోకి వచ్చేసరికి రజ్జి సరస్వతి, గంగా ఒకరిని ఒకరు కౌగలించుకుని పడుకుని కనుపించారు ముగ్గురూ ఈ విధంగా పడుకుని వుండడంచూచి తల్లిహృదయం క్షోభించింది. ఒక్క క్షణకాలంపాటు అసలు భగవంతుడిమీదనే ఆమెకు అవిశ్వాసం కలిగింది. కాని చాలా కష్టంమీద తన లోని అవిశ్వాసభావాలను అణచివేసుకున్నది! మెల్లగా లోపలకుపోయి పొయ్యిలోవున్న బూడిదను ఇంతతీసుకుని తనకూ రజ్జికి మధ్య ఒకగీతనుగీసి తను పొయ్యివైపుపడి నిద్రపోయింది.

ముసలామె తొలికోడి కూసినప్పుడు అందరికంటే ముందు నిద్రలేచింది. కూతుళ్ళవంక చూసింది ముగ్గురూ వెనుకటిలాగానే కౌగలించుకొని పడుకున్నారు. వసారాలోనుండి

ఆకాశంలోని కొన్ని నక్షత్రాలు శతరంజిలో ఓడిన పావుల్లా ఎలా తెలా పోతూ కనుపిస్తున్నాయి. గాలి పీవెనల మృదు స్పర్శలకు సరస్వతి ముఖంమీది వెంట్రుకలు మెల్లగా ఇటూ అటూ కదులుతున్నాయి. ముసలామె తమ వైపుకు రావడం చూసి ఆవు 'అంబా' అని పెద్దగానే కేకపెట్టింది. అందమైన ఆవుదూడ విస్మయంగా కండ్లు పెద్దవిచేసి చూడసాగింది.

ముసలామె పాలపిడతను తోమిపెట్టి నదికి స్నానానికి పోయింది. తిరిగి వచ్చేసరికి గంగా సరస్వతులు మేల్కొన్నారు. గంగ పొయ్యి ముట్టించింది. సరస్వతి పాలు పితికింది. వాకిట్లోకి వచ్చినతల్లి వెంటతెచ్చిన నదీజలాన్ని అక్కడేపెట్టి వెనక్కి తిరిగింది, బయటికి వెళ్ళడానికి! గంగ అడిగింది ఏమిటమ్మా! తిరిగి వెళుతున్నావు ?"

"ఏమీలేదు. ఇవ్వాళ నాకు వ్రతం ! నేనేమీతినను."

"ఇవ్వాళ ఏకాదశి కాదుగా !" గంగ అడిగింది.

"అమ్మకు కోపం వచ్చినరోజు...ఏకాదశే!" సరస్వతి అన్నది.

"అవును ! కడుపున అలాంటి సంతానం పుడితే... ఏకాదశి చేసుకోక తప్పేదేముంది" తల్లి అన్నది.

"నేనేం తప్పుచేశాను !" సరస్వతి అరిచింది.

"ఇంకేం చెయ్యాలి ? ఇంట్లో ముసల్మానులను తెచ్చి పెట్టావుగా ?"

గంగ అన్నది "అమ్మా...ముసల్మానులు మనుషులు కారా ? రజ్జీ ముస్లిము. అయితేయేం ? మాలాగా లేదా ?

నీ కూతుర్నే పోలీసులు పట్టుకున్నారనుకో అప్పుడు నీవు బాధపడవా ?"

"పడవచ్చును !" తల్లి అన్నది.

"మరి అలాంటప్పుడు రజీని రక్షించడంలో తప్పేమిటి?" సరస్వతి మళ్ళీ అడిచింది.

"ఎందుకలా అరుస్తావు ? నీ లక్షణాలు నే చూస్తూనే వున్నాను...ఇంకేం ? ఎవడినైనా ముసల్మానుని పెళ్ళి చేసుకో !" తల్లి అన్నది.

"ఆ చేసుకుంటాను !" సరస్వతి మండిపడ్డది.

"నువ్వు నోరుమూసుకోవే !" గంగ అన్నది సరస్వతిని.

"హరిభగవంతుడా !" ముసలావిడ రెండు చేతులూపైకి ఎత్తి భగవంతుడికి నమస్కరిస్తూ వెనక్కి తిరిగి చకరీ స్త్రీల సమూహంలోకి పరుగెత్తింది. అక్కడ దేవతావిగ్రహాల పాదాలమీదపడి ఏడుస్తూ "హరిభగవంతుడా ! నీవు చూస్తుంటే లేదా ? ఈ ముసల్మానులు నా కూతుళ్ళను మతభ్రష్టులను చేశారు... వాళ్ళను నాశనంచెయ్యి...సర్వనాశనంచెయ్యి" అని ప్రార్థించింది.

"నాశనంకాదు చేసేది, నీ తలకాయచేస్తాడు ! భగవంతుడు ఎవ్వరికీ అపకారం చెయ్యడు. నువ్వు ఇంకా మంచిని కోరితే చేస్తాడేమోగాని, ఇలాగా యితరులకు అపకారాన్ని కోరితేమాత్రం ఎన్నటికీ చేయడు !" తల్లి వెనకాలేవచ్చి నిలబడివున్న గంగ కోపంతో అన్నది.

ముసలావె పమిటలో ముఖాన్ని దాచుకొని భోరుమన్నది. గంగకు తల్లిమీద జాలిగలిగినది. దగ్గరకువెళ్ళి తల్లిని

కౌగలించుకొని తనూ కన్నీళ్ళు కార్చసాగింది. రుద్ధకంఠంతో "భయపడకమ్మా! నీకెందుకూ భయం? మేమేమైనా చిన్న పిల్లలమా? పాడైపోతామని విచారించడానికి! అంతా తెలిసినవాళ్ళం! పాపం వాళ్ళని ఊవళంగా బయటికి పంపుదామన్నా వీలులేదు. ఎక్కడికి పోతారు? ఎక్కడచూసినా కొట్లాటలుగా వున్నాయి. పోలీసులు వీళ్ళని తెగవెతుకుతున్నారు. బయటికి పంపితే ప్రజలు వీళ్ళని నేరుగా రాజాకర్మ ఆలీదగ్గరకు పట్టుకుపోతారు. తరువాత వీళ్ళని ఏంచేస్తారో నేను వేరే నీకు చెప్ప నవుసరంలేదు!" అన్నది గంగ.

తల్లి పమిటచెరగుతో కన్నీళ్ళు తుడుచుకొన్నది.

"ఇక వూరుకో అమ్మా!" గంగ అనూనయించింది. "ఒక్క నాలుగయిదు రోజులు అబ్దుల్ వచ్చేవరకూ వుంటారు విళ్ళు ఇక్కడ. తరువాత వాళ్ళంతట వాళ్ళే వెళ్ళిపోతారు. అబ్దుల్ మనకు ఒప్పచెప్పాడు. మనం అబ్దుల్‌కు వప్పచెప్పేస్తే మన బాధ్యత తీరిపోతుంది. అంతే ఒక్క నాలుగైదురోజులు... మా అమ్మ చాలామంచిది. ఊఁ, ఇక వూరుకో!"

గంగ తల్లిని ముద్దుపెట్టుకొన్నది. తల్లి గంగను ముద్దుపెట్టుకొన్నది. సరస్వతి మాత్రం ఒకప్రక్క కండ్లు ఎర్రనచేసుకొని నిలబడ్డది బెట్టుగా. గంగ సరస్వతిని తల్లిదగ్గరకు నెట్టింది. సరస్వతిలోని బెట్టుసరంతా కరిగిపోయింది. తల్లీ కూతుళ్ళు ఇద్దరూ కౌగలించుకొని కన్నీళ్ళు కార్చారు.

తల్లి వాళ్ళను ఇంట్లో వుంచడానికయితే ఒప్పుకున్నది గాని భోజనం చెయ్యలేదు. ముసల్మానులు ఇంట్లో వున్నంతవరకూ నేను భోజనం చెయ్యనన్నది. పళ్ళూఫలాలూ తిని వుం

టాలే అన్నది. అనేకం చెప్పి బ్రతిమలాడిన మీదట వసారాలో విడిగా వంటచేసుకొనటానికి అంగీకరించింది. కాని, ఈ అభిప్రాయాన్ని రజ్జీఫజల్ ఇద్దరూ వ్యతిరేకించారు. వాళ్ళు అన్నారు "మానుంచి మీకు బాధలు కలుగుతున్నాయి. ఇది మంచిదికాదు. మేము ఇక్కడ వుండము."

సరస్వతి, గంగ వాళ్ళకు నచ్చచెప్పారు. "మీరు ఏం మన్నా పిచ్చి ఎక్కిందా? ఎక్కడికి పోతారు? బయట కాలు పెడితే పోలీసులు పట్టుకుపోతారు తెలుసా? కనీసం అబ్బాస్ వచ్చేవరకైనా వుండండి! మా అమ్మ కారణంగా మిమ్మల్ని ఇక్కడ వుంచడం మేమూ మంచిది కాదనుకొంటున్నాము. అట్లాగని మిమ్మల్ని ఇలాగ అర్ధంతరంగా బయటికి పోనివ్వడం మా అభిమతం కాదు. మా అమ్మ సనాతన అభిప్రాయాలు కలది. మా పూర్వీకులులాగానే మా అమ్మకూడా అన్యమతస్థులను ఇంట్లోకి రానివ్వకూడదనుకొంటుంది. అమె మీద కోపగించుకొని వెళ్ళిపోతే ఏమైపోతారో ఆలోచించండి!"

పరిస్థితిని ఫజల్, రజ్జీ ఇద్దరూ అర్థం చేసుకొన్నారు. అయినా ఫజల్ ఇలా అన్నాడు. "ఏమైనా కానీ, రాత్రి పూట మాత్రం నేనిక్కడ పడుకోను. నది ఒడ్డుకుపోయి పడుకొంటాను."

రజ్జీ ఫజల్ ముఖంలోకి సూటిగా చూసింది. ఫజల్ తల వంచుకొన్నాడు. పరిస్థితి గంగకు అర్థంఅయింది. నవ్వుతూ "ఐతే ఫజల్! నాకు అర్థం అయిందిలే. రేపే మంజూర్ నిచ్చి మౌలవీని పిలిపించి మీ ఇద్దరికీ 'నిఖా' కట్టిస్తాను" అన్నది.

ఫజల్ ముఖం వికసించింది. రజ్జీ గాభరాగా "వద్దు... వద్దు... ఇలాంటస్థితిలో మరొక ఆపదను కొని తెచ్చుకోవడం దేనికి?" అన్నది

ఫజల్ అందుకొన్నాడు. "నిఖా కట్టుకోవడం ఆపదను కొని తెచ్చుకోవడమా."

"అదికాదు నేనన్నది. నికాకట్టించే మౌలవీ మనం ఇక్కడ వున్నామని మరెవరితోనైనా అంటే ఏమౌతుందో ఆలోచించు?"

"అట్లా ఎన్నటికీ జరుగదు. గంగ చెప్పడంలా? నుంజూర్ వాళ్ళ మౌలవీ చాలా మంచివాడుట. ఎవ్వరితోటీ అనడుట!"

గంగ నవ్వింది. "రజ్జీ! ఆయన ఎవ్వరితోనూ చెప్పడు."
"కానీ..." రజ్జీ మధ్యలోనే ఆపేసింది.
"ఆఁ కానీ...ఏమిటి? చెప్పు?" ఫజల్ అడిగాడు.

"ఏమీలేదు!" రజ్జీ చాలా బలహీనంగా అన్నది. సరస్వతీ గంగా నవ్వారు. ముసలామెకూడా నవ్వింది. రజ్జీ ముఖం ఎర్రనైంది. సిగ్గుతో తలవంచుకు ఇలా అన్నది" ఇలా తాషా కోలా లేకుండా ఎవరు పెండ్లి చేసుకొంటారేమిటి?"

ఫజల్ కోపంతో ఇలా అన్నాడు. "అవును! తాడూ కోలా లేకుండా ఎవరు పెడ్లి చేసుకొంటారు? నేను చేసుకోను! ఇదిగో ఇప్పుడే వెళ్ళిపోతున్నాను!"

ఫజల్ గడపదాటి వెళ్ళుతున్నాడు. సరస్వతి వెళ్ళి చెయ్యిపట్టుకుని "ఎక్కడికి వెళ్ళుతున్నావు?" అన్నది.

"స్టేషన్‌కు వెళ్తున్నాను. పోలీసులకు పట్టుపడిపోతాను! ఇంకెందుకు?"

రజ్జీ పకపకా నవ్వుకుంటూపోయి ఫజల్‌ని పట్టుకొన్నది తల వంచుకొని "నీ ఇష్టం!" అన్నది.

"ఓ...హో...ఓ...హో..." ఫజల్ ఆనందంతో పొంగిపోతూ రజ్జీ చేతులను పట్టుకొని ఎగురుతూ పాట సాగాడు" ఆలీవా మస్తకలందర్...మాలాజీ ధేవక్ తడాకా! ఓ...హో...ఓహో...!"

సరస్వతీ గంగా నవ్వసాగారు. ముసలామె ద్వేషంతో ముఖం తిప్పేసుకొన్నది. ఈ ముసల్మానులకు కొద్దిగాకూడా సిగ్గులేదు. నేను నందూశాహా దగ్గరకు వెళుతున్నాను. భగవంతుడిని గంగాజలంతో శుద్ధిచెయ్యాలి! తల్లి తన రొండిన వున్న రూపాయిని తడిమి చూచుకొన్నది. మెల్లగా నందూ శాహా దగ్గరకు బయలుదేరింది.

## 3

ముసలామె నందూషా దగ్గరకు పోయింది. అతను ఒక లావాటి దిండుకు వీపును మోటించి తన పీఠంమీద కూర్చుని వున్నాడు. నందూషా చాలా లావుపాటి మనిషి. అతని స్థూల కాయాన్ని గురించి తెల్సుకోవాలంటే ఒక్క విషయం చెపితే సరిపోతుంది అతను రోజు మొత్తంమీద రెండుమార్లు మాత్రమే తన స్థానాన్నుంచి లేస్తాడు. ఒకటి దొడ్డికిపోవడానికి! రెండు థానేదారుకు నమస్కరించడానికీ! మరి ఇతర సమయాల్లో ఎల్లప్పుడూ అతను తన పీఠాన్ని విడువడు!

ముసలామె రొంటినుండి రూపాయిని తీసి "నందూషా నాకు ఒక రూపాయికి గంగాజలాన్ని ఇవ్వు!" అన్నది.

జుమ్మా నందూషాకు కాళ్ళు పిసుకుతున్నాడు. నందూషా ఆశ్చర్యంతో ఒకమాటు రూపాయివంక చూశాడు. మరొకమాటు ముసలామెవంక చూశాడు. చప్పున జుమ్మా వైపు తిరిగి "చాలు! ఇక వెళ్ళు, మళ్ళీ పిలిచినప్పుడు రా!" అన్నాడు.

జుమ్మా లేచి వెళ్ళిపోయాడు. నందూషా ముసలామె వైపుకు తిరిగి "ఇది ఎడ్వర్డు రూపాయి. కొత్తది, నీకు ఎక్కడిది?" అని అడిగాడు.

"ఎక్కడిదిఏమిటి? మాదగ్గిర రూపాయలు వుండవా?" తల్లి అన్నది.

"అదికాదు నేను అనేది– మీదగ్గిర రూపాయలెందుకు వుండవు? చాలా వుండవచ్చు! కాని, ఇది సరిక్రొత్త రూపాయి...ఎడ్వర్డురూపాయి! ఇది ఈపల్లెలోకి ఎలావచ్చిందీ అని అడుగుతున్నాను."

"ఒక బాటసారి వెళ్ళుతూ ఇచ్చిపోయాడు."

"అతనికి ఏమి ఇచ్చావు?"

"ఏమీ ఇవ్వలేదు!"

"ఏమీ ఇవ్వలేదా? ఐతే నీకు రూపాయి ఎలా ఇచ్చాడు? ధర్మంచేశాడా? రూపాయి? మొత్తం? చాలా గొప్పవాడయి వుండాలి! ఎవరబ్బా అతను?"

"ఒక ముసల్మాను!"

"ముసల్మానా ? ముసల్మాను ఒక బ్రాహ్మణికి ఎలా రూపాయిని ఇచ్చాడు?"

ముసలామె ఏమీ మాట్లాడలేదు.

"ఇదుగో ముసలమ్మా నిజంచెప్పు... రోజులు మంచివి కావు ?"

"రోజులు మంచివికావా ? అలాఅనడంలో నీ అభిప్రాయం? నాకూతుళ్ళు మహాతల్లులు !" తల్లి అన్నది.

సరె... నేను అనడం నీ పిల్లలు మంచివాళ్ళు కాదని కాదు. వాళ్ళు సాక్షాత్తూ మహాతల్లులు ! అయినా రోజులు మంచివికాదు చూడు! నంబర్ దార్ కొడుకు నీ చిన్నకూతురు గంగమీద కన్ను వేశాడు. నేనిలా చెబుతున్నందుకు ఏమీ అనుకోకు. నేను ముందుగానే చెబుతున్నాను; రోజులు మంచివి కావు. ఎటుచూచినా ముసల్మానుల ఉపద్రవాలు ఎక్కువగా వున్నాయి! ముసల్మానులు రాజా, మహారాజా డోంగరా, ఎవ్వరికీ పన్నులు చెల్లించ నంటున్నారు. నువ్వే చెప్పు, ఇలా పన్నులు ఇవ్వం అంటే వ్యవహారాలు నడుస్తాయా ? ఈ ముసల్మానులు ఇలా ఎదురుతిరిగితే, డోంగరా రాజ్యం నిలవక పోతే మనకు హిందువులకు – ఇక్కడ ఎవరుదిక్కు చెప్పు ?"

ముసలామె తలవూపింది "నీవు చెప్పేది నిజమే"

నందూపా రెండుచేతులనూ జాపి "అందుకనే ఈ క్రొత్తరూపాయి, ఎక్స్వర్డురూపాయి ఎక్కడిదని అడుగుతున్నాను. ఈ వూళ్ళోవున్న రూపాయలన్నీ టోరియారూపాయిలు. (విక్టోరియా) కాని ఇది టోరియారూపాయి కాదు. కొత్తది చూడమ్మా! ఇటు నాముఖంలోకి చూసి నిజంచెప్పు !

చెప్పుతల్లీ! లేకపోతే ఏమి వుపద్రవం వస్తుందో పొరుగూర్ల నుండి చాలా దొంగముండాకొడుకులువస్తున్నారు మనవూరికి!"

ముసలామె ఒకమాటు నాలుగువైపులా చూచి ఇలా అన్నది "నందూషా ఎవ్వరితోటీ అనవుగా ?"

"రామ...రామ! ఎలాంటిమాట అన్నావమ్మా? ఎవరితోనైనా అంటే మహామారి ఎత్తుకుపోవాలి నన్ను! తల పగిలి రెండువక్కలై పోవాలి! జగదంబమీద ఒట్టు! నేను ఎవ్వరితోటీ చెప్పను... అసలు ఎవరితోనైనా ఎందుకు చెబుతాను? మనకేనష్టం అని నాకు తెలియదా ? మొత్తం మన వూళ్ళో నాలుగుకొంపలు వున్నాయి బ్రాహ్మణులవి. వాటిల్లో మీ దొకటి - మీకు నష్టం కలిగితే నాకు కలిగినట్టుకాదా ? మనంఅంతా కలిసిమెలిసి ఒకజట్టుగా వుండాలి. అసలు ఏం జరిగిందో చెప్పు ?"

ముసలామె తలవంచుకొని మెల్లగా అన్నది "మాఇంట్లోకి ఇద్దరు ముసల్మానులు వచ్చివడ్డారు, ఒక ఆడదికూడా వాళ్ళతో పాటు! దేవుడిగది అపవిత్రం అయింది. అందుకే ఈ గంగా జలం!" -

నందూషా తన స్థానంనుండి కొంచం కదిలాడు "ఇంతకూ వాళ్ళు ఎవరో చెప్పలేదు"

"ఆడపిల్లపేరు రజ్జీ-దానిఅన్న అబ్దుల్! అబ్దుల్ ఇప్పుడు లేడు వెళ్ళిపోయాడు. రజ్జీతో మరొక మగవాడు వున్నాడు. వీళ్ళు ఇద్దరూ నదిఒడ్డున స్పృహలేకండా పడివుండగా చూసి నా కూతుళ్ళు పట్టుకువచ్చారు!"

నందూషా ఒకమాటు గట్టిగా నిశ్వసించి మౌనాన్ని వహించాడు క్షణకాలం. తరువాత "సరె, నీవు గంగాజలం పట్టుకువెళ్ళు!" అన్నాడు.

ముసలామె చేతులు నలుపుకొంటూ కళ్ళనీళ్ళు నింపుకొని "నందూషా! వాళ్ళుఇద్దరూ నా దేవుడిగదిలో వున్నారు. పోలీసులు వాళ్ళను వెతుకుతున్నారుట !" అన్నది.

"నిజమే! నే నేం చేయగలను? నీకు గంగా జలాన్ని ఇస్తాను ఒక రూపాయికి గంగాజలం పట్టుకువెళ్ళు అంతే!"

ముసలామె నందూషా కాళ్ళమీద పడ్డది "నందూషాహా! నీకు దండం పెడతాను ! నన్నేం చెయ్యమంటావో చెప్పు?"

"చేసేదేముంది? పోలీసులకు తెలియపరచు! లేకపోతే నీకుకూడా సంకెళ్ళు పడతాయి. ఈ ఫజల్ రజ్జీ ఇద్దరూ టీకరీ శాహామురాద్ గ్రామస్థులు. వీళ్ళకోసరం పోలీసులు వెతుకుతున్నారు. ఠాకుర్ శాహాన్‌సింగ్ తన సిపాయీలతో వూరిమీదకువచ్చి పడ్డాడు. నామాట విని నేరుగావెళ్ళి తెలియపరచావా? నువ్వూ బ్రతుకుతావు, వూరివాళ్ళూ బ్రతుకుతారు, లేదా, అందరికీ చుట్టుకొంటుంది...!"

"ఇది విశ్వాసఘాతం కాదా?"

"అయితే నీ ఇష్టం, ఆలోచించుకో! ఏ ఆపద వచ్చినా నీకూ, నీ కూతుళ్ళకూ వస్తుంది. నాకేమిటి? మూడు లోనూ లేను. పదమూడూలోనూ లేను !"

ముసలామె కన్నీళ్ళు కార్చసాగింది. "హరి భగవంతుడా! ఇప్పుడేం చెయ్యను? పోలీసులను పిలవనా!"

# 4

సరస్వతి గంగా మౌలాపీగార్ని తీసుకొని తిరిగివస్తూ వుండగా దారిలో మంజూర్ కనుపించాడు వాళ్ళకు. అతను పొలం దున్నుకొంటున్నాడు.

గంగ అన్నది "అప్పుడే దున్నడం ప్రారంభించావా?"

మంజూర్ అన్నాడు "రైతులకు ఇంకేం పనివుంటుంది గంగా?" అని మౌలవీగార్ని చూచి "సలామండి. మౌలవీ గారు ఈ బ్రాహ్మణులతో కలసి ఎక్కడికి పోతున్నారు? బ్రాహ్మణులు మోసగాళ్ళు, నమ్మరాదు. జాగ్రత్తండి!"

మౌలవీగారు నవ్వి "నీవు కూడా వచ్చేశేయి. సద్విషయం. నాత్యానికి ఒకరు ప్రక్కన వుండడంకూడా అవసరం!" అన్నారు.

"ఐతే, నాగలిని వదలి రమ్మంటారా?"

"అవును, వచ్చేశెయ్యి!" గంగ దగ్గిరకుపోయి చెయ్యి పుచ్చుకొని "ఒక్క నిమిషం పని! ఇప్పుడే వద్దువు వచ్చేశెయ్యి!" అన్నది.

మంజూర్ ఎద్దులను ఆపగ్నే వదలి "సరే, వస్తున్నాను పద!" నీవు పిల్చావని పనికూడా వదిలి పెట్టేస్తున్నాను!"

సరస్వతి గంగ కండ్లలోనూ, మంజూర్ కండ్లలోనూ తీవ్రగమనంతో ప్రసరించే మెరపుల్ని చూసింది. ఆమెకు వెంటనే అబ్దుల్ జ్ఞాపకానికి వచ్చాడు. సరస్వతి నైరాశ్యంలో మునిగిపోయింది. సరస్వతి తన విశాలమైన కండ్లను మరీ పెద్దవిచేసుకొని దూరంగా నీలిఆకాశపునీడల్ని ప్రతిఫలిస్తూ లని బడివున్న సీమరేగి చెట్టువైపుకు చూచింది. నీలి ఆకాశంలో

తెల్లని మబ్బులు దక్షిణపు వేడికి జడిసి వరుసలుగా పరుగెత్తుకు వచ్చేస్తున్నాయి. వసంతఋతువు వస్తున్నది. సరస్వతి హృదయం ఒకవిచిత్రభావావేశంతో నిండిపోయింది. ప్రకృతంతా పూవుల మయమై వికసించినట్లు తనాప్రకృతిలో వంటరిగా ఆనంద డోలికల్లో ఊగుతూ తిరుగుతున్నట్టూ అనిపించి కంపించింది సరస్వతి.

పూరినంబర్ దార్ కొడుకు మంజూర్ తన వెంట నడుస్తున్న గంగవైపుచూసి ఇలా అనుకొన్నాడు—గంగ ఎంత బాగున్నది! సరస్వతికూడా బాగానే వున్నది. కాని, వారిద్దరి బాగులో చాలా వ్యత్యాసమున్నది. గంగ అప్పుడే చర్మం పెడుతున్న పచ్చినిమ్మరెబ్బ. సరస్వతి పూర్తిగా వికసించి, పండి, పండ్లతోనిండిన సీమరేగికొమ్మ! చూడు, ఎలా నడుస్తున్నారో ఇద్దరూ.

ఇంటి ద్వారందగ్గరకు వచ్చి సరస్వతీ గంగలు ఆగిపోయారు. అప్పచెల్లెండ్రు ఇద్దరూ ముక్కులమీద చేతులువేసుకొని నిశ్శబ్దంగా వుండమని మాలవీకి మంజూర్‌కూ సూచించారు. పరిస్థితిని మొదటే చెప్పివున్నప్పటికీ మళ్ళీ దగ్గరకు పోయి గంగ ఇలా అన్నది. "మాలవీగారూ! మళ్ళీ ఎవ్వరితోటీ అనకూడదు!"

ముసలి మాలవీ నవ్వి ఇలా అన్నాడు. "చూడమ్మా! నేను ముసల్మానుని. మాట తప్పడం అంటూ ఎన్నటికీ జరుగదు. పైగా ఇది మా ముస్లిములకు సాయపడడమేనాయె! చూడమ్మా! ఈ సత్కార్యంలో భగవంతుడు నా తరఫున వున్నాడని నా విశ్వాసం. ఇక మీరు వుండనే వున్నారుకదా?"

మంజూర్ అన్నాడు "అసలు విషయం ఏమిటో ఇంత వరకూ నాకు చెప్పనేలేదు?"

గంగ అన్నది " ఫజల్‌కూ రజ్జీకి పెండ్లి! అందుకనే మౌలవీగార్ని పిలుచుకు వచ్చాను...నీవు సాక్షివి!"

"ఎవరా ఫజల్ రజ్జీ?" మంజూర్ అడిగాడు. క్షణం ఆలోచించుకొని ఆశ్చర్యంతో సరస్వతి, గంగా, మౌలవీల ముఖాలల్లోకి చూశాడు. ఎందుకనో ఒకక్షణకాలం మంజూర్ ముఖంలో విజయసూచకమైన చిహ్నాలు మెరిశాయి. కొంచం గొంతుపెద్దదిచేసి "ఎవరాఫజల్ రజ్జీలు?" టీకరీశాహాముురాద్ వాళ్ళేనా?" అన్నాడు.

"ఔను! వాళ్ళే...వాళ్ళే" గంగా సరస్వతులు తలలు వూపారు

మంజూర్ పెద్దగా అన్నాడు "భగవంతుడా, నీవు ఎంత దయామయుడివి?"

"పదండమ్మా! పదండి! త్వరగా పని ముగించేసు కొందాము" మౌలవీ అన్నాడు.

సరస్వతి అన్నది "వుండండి! నేను తలుపుతడతాను!"

సరస్వతి తలుపు తట్టడానికి ముందుకు అడుగువేసింది. మంజూర్ వెనక దిగబడ్డ గంగను చెయ్యిపుచ్చుకు వత్తుతూ "నేను హిందువుగా మారిపోతున్నానేమో ననుకొంటూ వుంటాను అప్పుడప్పుడూ, ఐతే నేనేకాదు నీవుకూడా ముస్లి ముగా మారుతున్నట్లుంది?" అన్నాడు.

గంగ తన చేతిని మంజూర్ గుండెలమీదవుంచి, అక్కడినుండితీసి తన గుండెలమీద పెట్టుకొంటూ అన్నది: సగం నేనూ, సగం నీవూ !"

"ఊఁ !"

గంగ మరేమిటో మాట్లాడబోతున్నది! ఇంతలో సరస్వతి తలుపు తట్టింది. గంగ చెప్పబోయిన మాటను ఆపే సింది. సరస్వతి మళ్ళీ తలుపుతట్టింది.

లోపలనుండి మొదట మెల్లగా అడుగులశబ్దం వినిపించింది. తరువాత తలుపు తెరువబడ్డది. మొదట కొంచెం; తరువాత పూర్తిగా ! గంగా సరస్వతి. మంజూర్, మాలవీ-నలుగురూ భయకంపితులై ఒక అడుగు వెనక్కి వేశారు !

ఆ తలుపు తీసినవాడు పోలీస్ !

అతను నవ్వుతూ "రండి...రండి ! లోపలకురండి ! మీకోసరమే ఎదురుచూస్తున్నాము!" అన్నాడు.

లోపలకు భయపడుతూ ప్రవేశిస్తున్న గంగ తలఎత్తి ఒకమాటు గదివైపు చూసింది. ఒక మంచంమీద హావల్దార్ హీరాసింగ్ కూర్చుని వున్నాడు. మరొక మంచంమీద ఐదారుగురు సిపాయీలు, పోలీసులూ కూర్చునివున్నారు. వాకిట్లో స్థంభానికి ఫజలూ మరొక స్థంభానికి రజీ కట్టివేయబడివున్నారు. ముసలామె పొయ్యిముందు కూర్చుని పోలీసులకు టీ తయారు చేస్తున్నది. గంగా సరస్వతులు లోపలకు రావడంచూసి ముసలామె కొంచం వులిక్కిపడ్డది. తన ముఖానికి పమిటచెంగును అడ్డంపెట్టుకొని త్వరత్వరగా పొయ్యిని వూదసాగింది.

అంగ నేరుగా తల్లి దగ్గరకుపోయింది. "అమ్మా! ఈ పోలీసులను ఎవరూ ఇక్కడికి పిలుచుకువచ్చింది?" అని అడిగింది. తల్లి మరీ పొయ్యిమీదకువంగి వూదసాగింది.

హావల్‌దార్ హీరాసింగ్ నవ్వి అన్నాడు "పిచ్చిదానా! పోలీసువాళ్ళని ఎవరు పిలవాలి? ఎవ్వరూ పిలవకుండానే వస్తారు! మీ ఇంట్లో ఏదో పెండ్లి జరుగుతున్నదని విన్నాను. సరే, ఈ శుభకార్యాన్ని చూసి ఆనందిద్దామని యిటు వచ్చాము! ఏం పోలీసువాళ్ళం మనుషులం కామా?"

"మనుషులే అయితే వీళ్ళను యీ విధంగా స్థంభాలకు కట్టివేయరు!" గంగ కోపంగా అన్నది.

"అరె...వీళ్ళవిషయమా నీవు అనేది? ఇప్పుడే కట్లు విప్పించివేస్తాను! అసలు ఏమైందంటే మమ్మలను చూడగానే పాపం మీ అతిథులు పారిపోసాగారు. సరే...నువ్వు వచ్చి చూస్తే ఖాళీగా యిల్లు వుండిపోతే, కోపగిస్తావేమోనని భయపడి కట్టేసి అట్టేపెట్టాను! నీకోసరం! నువ్వు విప్పమంటే, ఇప్పుడే విప్పివేస్తాను! చెప్పు?" అన్నాడు హీరాసింగ్.

"విప్పించేసెయ్యి!" గంగ దార్ఢ్యకంగా అన్నది.

హావల్‌దార్ సిపాయిలవైపు చూసి సౌంజ్ఞచేసి "అరేయి, వీళ్ళిద్దర్నీ విప్పేశెయ్యండిరా!" అన్నాడు.

సిపాయిలు ఫజల్ రజీలను కట్లు విప్పేశారు, వాళ్ళ చుట్టూ కావలాగా నిలబడ్డారు.

హావల్‌దార్ హీరాసింగ్ మాలవీవైపు తిరిగి "అరె... మాలవీగారా! నేను మిమ్ములను చూడలేదు క్షమించండి! ఓ...హో...మంజూర్ నువ్వా? అవునులే, ఊరినంబర్

దార్ కొడుకువు, ఈ యింట్లోకి రావడానికి నీకూ హక్కు-వున్నది!" అన్నాడు.

సరస్వతి గర్జించింది. "ఏమిటి మీ అభిప్రాయం?"

"ఏమీ లేదు. ఏమీ లేదు. నేరుపూరకే అంటున్నాను. సరేగాని, సరస్వతి, నీవు ఎంత పెద్దదానవు అయ్యావు? నిన్నటి వరకూ నావళ్ళో ఆడుకుంటూవుండేదానవు!" హావల్దార్ హీరాసింగ్ అన్నాడు.

సిగ్గుతో అవమానంతో సరస్వతి రెండడుగులు వెనక్కు-వేసింది. సిపాయీలు నవ్వసాగారు.

"సరె, నాకెందుకు? ఇదిగో అబ్బాయీ, పోలీసులూ! మీరంతా యిటు వరండాలోకి రండి! మౌలవీగారూ మీరు ఇక వీళ్ళిద్దరికీ 'నికా' కానివ్వండి!" హీరాసింగ్ అన్నాడు.

అందరూ ఆశ్చర్యంగా హావల్దార్ వైపు చూడసాగారు.

హీరాసింగ్‌కు తను ఒక ప్రముఖ నాటకంలోని ముఖ్య పాత్ర ఐనట్టుగా వుంది. గర్వంతో ఛాతీ వుబికింది. అతను మంచంమీదనుంచి లేచి బయటికివెళ్ళి వాకిట్లో పచారు చేయసాగాడు. అతను చేతిలోని రివాల్వరును బెత్తంలా వూగిస్తూ మాట్లాడుతున్నాడు. "ఈ పెండ్లి జరుగుతుంది. తప్పకుండా జరుగుతుంది. మౌలవీగారూ! నేను చెప్పేది నిజం. నికా కట్టేశయ్యండి. ఎవ్వరి హృదయంలోని ప్రేమనూ నాశనం చెయ్యడము తగదు. పాపం! నేను చెప్తున్నాను. మౌలవీగారు కట్టెశయ్యండి! ఇందుకుగాను నావుద్యోగం పోయినా ఫరవా లేదు. ఊ!"

సరస్వతి, గంగా, మంజూర్ మౌనంగా వున్నారు. ఫజల్ రజ్జీ ఇద్దరూ విస్మితులై ఒకరిముఖాలు ఒకరు చూసు కుంటున్నారు. మాలవీ మెల్లగా తన గడ్డాన్ని నిమురుకుంటు న్నాడు. వీళ్ళ ముఖాల్లోని విస్మయాన్నిచూచి హీరాసింగ్ తనలో తనే ఆనందిస్తున్నాడు.

"మాలవీగారు, ఏమిటలా చూస్తారు? మీపని మీరు కానివ్వండి! వీళ్ళిద్దరికీ పెండ్లి జరిగేవరకూ నేను ఇక్కడినుండి పోను!" హీరాసింగ్ అన్నాడు.

మాలవీ సంకోచిస్తూ ముందుకు నడిచాడు. వరండాలో ఒకవైపు కొద్దిస్థలాన్ని సుభ్రంచేసి కంబళీ పరిచారు. సరస్వతి, గంగలు మాలవీ ఆ కంబళిమీద రజ్జీని ఫజల్‌నీ కూర్చోబెట్టి 'నికా' చదివేశాడు. నికా చదవడం అయ్యాక హావల్‌దార్ హీరాసింగ్‌కు కృతజ్ఞత తెలియజేశాడు మాలవీ!

హీరాసింగ్ అన్నాడు "సరస్వతీ! ఐతే కొంచం తీపి పెట్టవా?"

సరస్వతి, గంగా ఖర్జూరపళ్ళు, అఖరోట్లూ, వెన్న పట్టుకురావడానికి ఇంట్లోకి పోయారు. హీరాసింగ్ ఒక సిపాయివంక చూసి సౌంజ్ఞచేశాడు. సిపాయీలు వెంటనే ముందుకుపోయి బయటనుంచి తలుపుగొళ్ళెం పెట్టేశారు.

ఇదిచూసి పొయ్యిముందు కూర్చున్న ముసలమ్మ భయభీతయై లేచి నిలబడింది. హీరాసింగ్ ధైర్యాన్ని ఇస్తూ యిలా అన్నాడు. "భయపడకు ముసలమ్మా! నీ కూతుళ్ళకు ఏమీ ఫరవాలేదు, నేను ఠాకుర్‌ని, రసపుత్రుడను... ఆడిన మాట తప్పను!"

తరువాత ఫజల్ వైపుకు తిరిగి "నేను అన్నమాటను చెల్లించుకున్నాను. మీకు పెండ్లి జరిగింది. ఇకనడవండి !" అన్నాడు.

"ఎక్కడికి ?" ఫజల్ అడిగాడు.

"కోలుకొక్కిరాయిని వేస్తారు. సిద్ధంకా" హావల్‌దార్ అన్నాడు.

"కోలుకొక్కిరాయినా ?"

"అవును"

హావల్‌దార్ సిపాయీలకు సౌంజ్ఞ చేశాడు. సిపాయిలు ఫజల్ దగ్గరకు నడిచారు. ఫజల్ రక్తనాళాల్లో రక్తప్రవహగు తీవ్రం అయింది అతని ముఖం కంది ఎర్రబడింది.

"ఒక్క నిమిషంలో కోలుకొక్కిరాయికి సిద్ధంకాక పోయావా? తుపాకీగుండు నీ గుండెలను దూసుకుపోతుంది. జాగ్రత్త !" హీరాసింగ్ అరిచాడు.

ఫజల్ నేలమీద గొంతుకూర్చుని మోకాళ్ళక్రింద దుగాచేతులను పోనిచ్చి చెవులు పుచ్చుకున్నాడు.

"భలే ! ఇక వీడి వీపుమీద రెండుమళ్ళరాయిని ఒక దాన్ని పట్టుకువచ్చి పెట్టండి "హీరాసింగ్ అన్నాడు.

సిపాయీలు బయటికిపోయి బండను పట్టుకువచ్చారు.

లోపలనుంచి గంగ సరస్వతులు తలుపుల్ని బద్దలు కొడుతూ అరుస్తున్నారు. "తలుపు తెరవండి! తలుపు తెరవండి!"

మంజూర్ తలుపు తీయడానికి ముందుకు నడిచాడు. కాని ఒకసిపాయి అడ్డంపోయాడు. అడ్డంవచ్చిన సిపాయీని ఒక్కగుద్దు గుద్దాడు మంజూర్. అవతలి సిపాయి మరొక

సిపాయి సాయంతో మంజూర్‌ను క్రిందపడేసి కాళ్ళతో తన్నుతూ చేతులతో పొడవనూ చేయసాగాడు.

హీరాసింగ్ నవ్వాడు. "కొంచం చూసి జాగ్రత్తగా కొట్టండి పూరె నంబర్‌దార్ కొడుకు!" అన్నాడు.

మాలవీ గడగడ వణుకుతూ "ఇక నేను వెళ్ళనా ?" అన్నాడు.

హీరాసింగ్ తెల్లని మాలవీ గడ్డాన్ని లాగుతూ "నువ్వెక్కడికి వెళ్ళేది?" అని మాలవీ నెత్తిన రెండు బాదులు బాదాడు. "ఇక నీవు వెళ్ళేది జైలుకే! అదిగాదు ముసలాడా! నీకు ఏం బుద్ధిలేదూ? పారిపోయి వచ్చిన సర్కారు ఖైదీలకు సాయపడతావా? నికాకట్టిస్తావా ?... అరేయి మఖ్ఖన్‌సింగ్ కొంచం ఈ ముసలాడికి పళ్ళు మరమ్మతు చెయ్యాగా !" అన్నాడు.

మఖ్ఖన్‌సింగ్ మాలవీని క్రింద పడేసి కొట్టసాగాడు.

"తలుపు తెరవండి ! తలుపు తెరవండి !" లోపలనుండి గంగాసరస్వతులు అరుస్తున్నారు.

హీరాసింగ్ ముసలామెతో అన్నాడు. "ఇక మేము వెళ్ళిన తరువాత తలుపు తెరు !" అన్నాడు.

లోపలనుండి గంగ అరిచింది. "హవల్‌దార్‌గారూ ఏంచేస్తున్నారు ? తలుపు తెరవండి !"

హవల్‌దార్ హీరాసింగ్ దర్వాజా దగ్గిరకుపోయి మెల్లగా అన్నాడు "చూడండి బ్రాహ్మణమ్మవార్లూ! నేను ఠాకుర్‌ను, రజపుత్రుడను, కనుక మిమ్ములను తాకకూడదు, తాకను కాని ముస్లిముల్ని తాకవచ్చును, వాళ్ళు మాస్తొత్తు!

మాకు పూర్తిగా హక్కు-వున్నది వాళ్ళను వాడుకోవడానికి నేను ఇక్కడనుండి వెళ్ళగానే ఫజల్‌ని రాజాకర్మఆలీ దగ్గరకు పంపిస్తాను. రాజావారు ఫజల్‌ను చూసి చాలా సంతసిస్తారు! పోతే మాలవీనీ, మంజూర్‌నూ రెండురోజులు జైల్లో వుంచి వళ్ళు మర్దనచేసి పంపించివేస్తారు! ఇక మిగిలేది రజ్జీ! నాకు చాలు అది!"

లోపలనుండి గంగ అరిచింది "హవల్‌దారుగారు మీరు రలా చెయ్యకండి. తప్పు మీరే రజ్జీకి దగ్గిరవుండి వివాహం చేయించారు .. అలా వేయలేరు!"

హావల్‌దార్ అతికోమల స్వరంలో "అవును చేయించాను. అందువల్ల నష్టం ఏమిటి? ఫజల్‌కు భార్య కానీ, ఈ రాత్రికి నాదగ్గిర వుంటుంది! అసలు ఆమాత్రం కొత్తదనం లేకపోతే జీవితంలో మజా ఏమిటి చెప్పు? పెండ్లి కాని కన్యశీలం తనది. ఆ శీలాన్ని గురించి మంచీ చెడ్డా ఖ్యాతీ అపఖ్యాతీ సర్వం ఆ కన్యకే, కాని పెండ్లి అయిన ముత్తైదు అలా కాదు. ఆమెశీలం కుటుంబం మొత్తానిది, ఖ్యాతిగాని, అపఖ్యాతిగాని మొత్తం కుటుంబానిది. అలాంటి శీలాన్ని చెరచాలి అప్పుడూ మజా! అందువల్లే నేను మిమ్ములను వదిలిపెట్టేశాను లేకపోతే ఈ పాటికి ఎప్పుడో...!" అన్నాడు.

లోపలనుండి తలుపును అదేపనిగా బాదుతున్నారు, హావల్‌దారుని నానాతిట్లూ తిడుతున్నారు గంగాసరస్వతులు.

హావల్‌దారు నవ్వుతూ "పదండోయ్! పంతులమ్మలకు కోపంవచ్చింది. ఖైదీలను క్షేమనుకు తీసుకుపొండోయ్! సరే, పంతులమ్మగారూ! వెళ్ళివస్తాము: మీరేమీ భయపడకండి...

మళ్ళీ ఇలాంటిది ఏమైనా జరిగితే మాకు తెలియపరచండి మేము వస్తాము. పంతులమ్మగారూ! వెళ్ళివస్తాము. మీరు పెట్టి ఇచ్చిన టీ చాలా బాగుంది...ఎక్కడ పట్టుకువచ్చారు ఈ కొత్తరకం ఆకును?" అన్నాడు.

గది లోపలవున్న గంగా సరస్వతులు రజీ అరవుల్ని విన్నారు. తరువాత ఫజల్ మూలుగుల్ని విన్నారు. ఫజల్ అత్యంత నిరాశగా మూలిగాడు. తదుపరి వరుసన కొన్ని పదధ్వనుల్ని బయటికి నడుస్తున్నట్టు విన్నారు. క్రమంగా పదధ్వనులు దూరం అయినాయి – చివరకు వినపడకుండా పోయాయి. నిశ్శబ్దం. ఘోరమైన నిశ్శబ్దం...ఆ భయంకర నిశ్శబ్దంలో ఎక్కడినించో గోండ్రుకప్పలఅరుపులు సన్నగా ఊక్రృతంగా వినిపిస్తున్నాయి. బెక...బెక బెక ... బెక...! కప్పలు ఒక నిరాశామయ స్వరంలో నిర్విరామంగా అరుస్తున్నాయి. బెక...బెక ... బెక...బెక ...మానవ జీవితానికి ఏమీ అర్థం లేదు. మనిషి పుడతాడు. పెరుగుతాడు. ప్రేమిస్తాడు. చస్తాడు. అంతా ఒట్టిచెత్త. అర్థంలేదు...ఇదితప్పదు...బెక బెక...బెక బెక...ఎక్కడా మానవుల్లేరు. వున్నవాళ్ళంతా పశువులు... ఈ విస్తృతమైన పశుసమూహంలో క్రూరమైన అర్థరహితమైన శబ్దం ఒకటి నిరంతరం వినబడుతూ వుంటుంది...బెక బెక ...బెక...బెక!

గంగ కోపంతో తలుపును ఒక్కతన్ను తన్నింది. వెంటనే తలుపు విసురుగా తెరుచుకొన్నది. ఆ వూపుకు గంగా సరస్వతులు ఇద్దరూవచ్చి బయట పడ్డారు. చప్పున లేచి నిలబడి పరిసరాన్ని చూశారు. ఎవ్వరూ కనుపించలేదు. రజీని, ఫజల్‌నూ కట్టివేసిన తాళ్ళు స్తంభాల్ని వేళ్ళాడుతున్నాయి.

మంచంపైన సిపాయిలు తాగిన టీ కప్పులు వున్నాయి. పొయ్యిలో కట్టెలు మండుతున్నాయి. ఆవుదూడ ఆశ్చర్యంగా చూస్తున్నది. ఇంట్లో ఎవ్వరూ లేరు. ఒక్కక్షణం గంగా సరస్వతులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు. మరుక్షణంలో ఇద్దరూ చకురీ వృక్ష సమూహంవద్దకు పరుగెత్తారు.

తల్లి భగవంతుడి పాదాలమీదపడి ఏడుస్తున్నది. "ఓ...భగవాన్! నేనిదంతా నా మతాన్ని భ్రష్టంకాకుండా వుండడానికి – నీ కోసరం – నీవు భ్రష్టంకాకుండా వుండడానికి చేశాను. నా కూతుళ్ళు భ్రష్టంకాకుండా వుండడానికిచేశాను. కాని, నీ కేమైనా పొరపాటు చేశానేమో? నేనేమైనా పొరపాటు పడ్డానేమో? చెప్పు?"

సరస్వతి అన్నది "అమ్మా! నువ్వు ఇవ్వాళ ఘోరమైన పాపాన్ని చేశావు. నీవుచేసిన పాపాన్ని యే గంగాజలం కూడా తొలగించలేవు."

తల్లి ఉలిక్కిపడి కూతుళ్ళవైపు చూచింది. వెంటనే ముఖం తిప్పేసుకొని దేవతా విగ్రహపు పాదాలమీదపడి భోరున ఏడవసాగింది.

రాతివిగ్రహంలోని హాస్యగాడు వెనకటిలాగానే నవ్వుతున్నాడు.

---

# ఏడవ అధ్యాయం

సరస్వతీ, గంగలు స్టేషనుకుపోయి ఫజల్, రజ్జీ, మంజూర్, మాలవీలను విడిపించాలని చాలా ప్రయత్నించారు. కాని ప్రయోజనం లేకపోయింది. స్టేషన్‌లో థానేదార్ శాహన్‌సింగ్ వున్నాడు. అతను గంగను చూశాడు. అతనికి ఏదో అలభ్యమైన అద్భుతమైనవస్తువును చూసినట్టుగా వున్నది. శాహన్‌సింగ్‌కు ఇంతవరకూ పెండ్లి కాలేదు. అసలతనికి ఇన్నాళ్ళుగా పెండ్లి అవుసరంకూడా కనుపించలేదు. కాని గంగను చూచాక ఎందుకనో అతనికి ఒక్క క్షణకాలం పాటు మనస్సు పెండ్లి మీదకు పోయింది. ఒక్క క్షణకాలం అతనికి స్త్రీ వ్యక్తిత్వంలో మహోన్నత లోతులు గోచరించినాయి. అంతవరకూ అతను స్త్రీలకు ఎప్పుడూ తన వెంటవుండే లాంగ్‌బూటుకుమించి గౌరవాన్ని ఇవ్వలేదు. లాంగ్‌బూటు ఎలా తనకు అనివార్యంగా అవుసరమో అలాగే స్త్రీకూడా అనుకొనేవాడు. కాని... గంగను చూసినతరువాత అతని అభిప్రాయంలో ఏదో మార్పుజరిగింది. స్త్రీకి పురుషజీవితంలో లాంగ్‌బూటుకు మించి వున్నతమైన స్థానం వుంటుందని తెలుసుకొన్నాడు. ఆస్థానాన్ని అతను వూహించను కూడా లేదు! శాహన్‌సింగ్‌కు గంగను చూస్తూఉన్నకొలదీ తన వ్యక్తిత్వం ఆమె సౌందర్యముందు క్షీణించి, చివరకు లుప్తమైపోతున్నట్టనిపించింది. అతను

తనకు తను అత్యంత దుర్బలుడూ, మహత్వహీనుడూ అయి నట్టు ఫీలయ్యాడు. సూర్యుడిముందు దీపంలా నిస్తేజుడయ్యాడు. విశాలంగా, తెల్లగావుండి ఆత్మవిశ్వాసాన్ని సాహసాన్ని ప్రతిఫలిస్తున్న గంగ ముఖంలోకి చూస్తూవుండిపోయాడు.

మరుక్షణంలో అతనికి ఒక ఆలోచన తట్టింది. గంగ తనను ప్రేమిస్తే! మహోన్నతంగా-కొండమీది పశుల కాపరులు పాడుకొనే పాటలంత నిర్మలంగా-రాజహంసల రెక్కలంత తెల్లగా-కొలనులోని నీలమణిపుష్పాలంత అందంగా సురభితంగా-ప్రేమిస్తే! కాని తనుస్వయంగా అంతఉన్నత మైన ప్రేమను ఆస్వాదించలేడు. అతనిలో ఆ ప్రేమను ఆస్వాదించ డానికి కావలసిన తత్వాలు నశించాయి. అయినప్పటికీ గంగను చూచినతరువాత అతనిలో కొంతమార్పు జరిగింది. గంగ తనను ఉన్నతంగా ప్రేమిస్తే ఎంతబాగుండును! అనే స్థితికి వచ్చాడు. కాహన్‌సింగు వడ్డూపాడుగూకల అందమైన పోలీసు అధికారి. కాని గంగను చూచిన తరువాత తన అధికారాన్ని అందాన్ని అన్నిటినీ మర్చిపోయాడు. గంగను హృదయాన్ని అర్పించాడు. హృదయాన్ని అర్పించికూడా తను సఫలుడు కాలేడని అతనికి తెలుసు. గంగ శాహాబురాద్ టీకరీ పర్వతంమీది మంచు లాంటిది. అక్కడికి ఎవ్వరూ చేరలేరు. ఎవ్వరూ స్పృశించలేరు. కాహన్‌సింగ్ పెదాలు వివశంగా బిగుసుకొన్నాయి. అతను టేబిల్‌మీదవున్న రిపోర్టు కాగితాన్ని చూస్తూ "ఈ నలు గురిలో ఎవ్వరినీ విడిచిపెట్టడానికి వీలులేదు!" అన్నాడు.

తరువాత కాహాన్‌సింగ్ గంగవైపు ప్రేమగా చూస్తూ ఒక సిపాయిని కేకవేసి ఇలా చెప్పాడు. "శహాబ్! పిల్లల్ని ద్దర్నీ జాగ్రత్తగా తీసుకుపోయి వాళ్ళ ఇంటిదగ్గర వదలిరా!"

శహాబ్, గంగా, సరస్వతి ముగ్గురూ మౌనంగా పోలీస్ స్టేషనునుంచి బయలుదేరారు. ముందు సరస్వతి, తరువాత గంగ, చివరకు సిపాయీ నడుస్తున్నాడు. పోలీస్ స్టేషను దాటారు. నందూషా ఇంటిని దాటారు. ఎండిపోయిన అతని జొన్నచేనుని దాటారు. ఖురాబానీ వృక్షసమూహాన్ని దాటారు. తరువాత సర్కారు మైదానం వచ్చింది. ఈ మైదానంలో ఊరిపిల్లలంతా వెన్నెలరాత్రులలో ఆడుకొంటూ వుంటారు. ఒకమాటు ఆటలో గంగ చెట్టుమీదనుంచి క్రిందపడ్డది. బుజం మీద కొంచం దెబ్బ తగిలింది. రక్తం కారసాగింది. మంజూర్ గంగను బుజానవేసుకొని వైద్యుడి దగ్గరకు తీసుకుపోయాడు. నడుస్తున్న గంగ అప్యక్తంగా దెబ్బతగిలిన బుజాన్ని తడివి చూచుకొన్నది. తరువాత వాళ్ళు మైదానాన్ని దాటి కొద్దిసేపు చేలగట్లమీద నడిచారు. కొంతదూరం నడిచాక సీమరేగి చెట్టుక్రిందచేరారు. గంగ కండ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి. దూరంగా మంజూర్ చేను కనుపిస్తున్నది. ఎద్దులు ఇంకా అలాగే చేలో నిలబడివున్నాయి! వాటి మెడమీద ఇంకా నాగలి అలాగేవుంది. అవి చేనుమధ్యలో నిలబడి తమ యజమాని కోసరం ఎదురు చూస్తున్నాయి.

గంగ ఒకమాటు అక్కముఖంలోకి చూచింది. మరొకమాటు సిపాయిముఖంలోకి చూచింది. ఆమె ముఖం క్రొత్త స్ఫూరించినట్టు వికసించింది. చప్పున పరుగెత్తుకొంటూ చేలోకి

వెళ్ళి ఎద్దుల్ని అదలాయించి నాగలి పట్టుకు దున్నసాగింది. నాగలి కర్రు భూమిలోకి గ్రుచ్చుకుపోయింది. నాగలి ముందుకు పోయినకొద్దీ నల్లని భూమి పగిలి చారలు ఏర్పడి చిమ్ముకో సాగింది. ఈ చాళ్ళల్లోనే విత్తనాలు చల్లుతారు. మొక్కలు మొలుస్తాయి గంగకు చల్లనిగాలి స్పర్శలా సారవంతమైన మట్టి ప్రక్కలకు అవ్యక్తమైన ఆనందం కలిగింది. ఆమెకు ఏదో గొప్ప ధైర్యం విశ్వాసం కలిగాయి ... చేలు దున్ని నన్నాళ్ళూ...విత్తులు చల్లినన్నాళ్ళూ...చాళ్ళల్లో మొక్కలు మొలచినన్నాళ్ళూ నిరాశపడవలసిన అవసరం ఏమీలేదు అనుకొన్నది !

## 2

సాయంత్రం కనుచీకటిపడే వేళకు గంగా సరస్వతులు తమ ఇంటికి బయలుదేరారు. దారిలో తల్లి ఎదురుపడ్డది. ఏదో పనిమీద నందూషా కొట్టుదగ్గరకు వెళుతున్నది. తల్లీ కూతుళ్ళు ఒకరితో ఒకరు మాట్లాడుకోలేదు. గంగ ఇంటికి వచ్చి పొయ్యిముట్టిస్తూ కూర్చున్నది. సరస్వతి నదికిపోయి నీళ్ళు పట్టుకురావడానికి బయలుదేరింది. సరస్వతి గోడనవున్న కుండను నెత్తినపెట్టుకొని దానిమీద బిందె నొకదాన్ని పెట్టుకొని బయటికి నడిచింది. చఖరీ వృక్షాలదగ్గిరకు వచ్చే సరికి ఒక క్రొత్తవూహ తట్టింది. ఒక్కక్షణం నిలబడి ఆలో చించింది. మెల్లిగా వృక్షసమూహంలోకి వెళ్ళి దేవతా ప్రతి మను తీసుకొని, చకచకా నదివైపుకు నడిచిపోయింది.

విస్తృతమైన నదీతీరంలో పూవులతోట్టి పడివున్నది. సరస్వతి అక్కడే మొదటగా అబ్దుల్‌ను చూచింది. అబ్దుల్

జ్ఞాపకానికి రాగానే సరస్వతి ముఖం వికసించింది. చిరునవ్వు నవ్వుకొన్నది. మరుక్షణంలోనే ఆ చిరునవ్వు స్థానంలో గాఢమైన విషాదం మెరసింది. ఆమె కండ్లల్లో భయం తొంగి చూసింది. ఇప్పుడు ఏం అయ్యేట్టు? అబ్దుల్ ఏం అంటాడు? అతనికి ఎలా యథార్థాన్ని తెలియచేయడం? మొదలైన ప్రశ్నలను వేసుకొంటూ చాలాసేపు తోట్టిదగ్గిర నిలబడి, బరువుగా విషాదంగా నదిలోకి దిగింది నీళ్ళకు!

## 3

నది ఒడ్డుకుపోయి బిందెను క్రింద ఇసుకమీద పెట్టింది. తలమీది ఎర్రని చుట్టకుదురును విడిగా వుంచింది. పైజమాను నీళ్ళలో తడవకండా మోకాళ్ళవరకూ మడిచి, దేవతా విగ్రహాన్ని చేతిలోకి తీసుకొని నదిలోకిదిగింది సరస్వతి. మోకాటిలోతు నీళ్ళల్లోకి పోయాక అత్యంత ఆదరంతో భక్తితో దేవతా విగ్రహాన్ని క్రింద నీళ్ళల్లోకి విడిచిపెట్టి, కొద్దిక్షణాల పాటు కళ్ళుమూసుకొని అలాగే నిలబడిపోయింది. మొదటగా భగవంతుడిని వుద్దేశించి తనా విగ్రహాన్ని అక్కడకు తెచ్చి వదిలేసిన కారణాన్ని వివరించి చెబుదాం అనుకొన్నది. కాని విరక్షరాస్యకావడంవల్ల చెప్పలేకపోయింది. అక్కడికీ జ్ఞాపకం చేసుకొని తల్లి చెప్పిన రెండుమూడు మంత్రాలను ఉచ్చరించింది. అయినా ఆమె మనస్సుకు తృప్తి కలుగలేదు.

నదిజలాలు చాలా నిర్మలంగా స్వచ్ఛంగా వున్నాయి. మోకాటిలోతు, నీళ్ళల్లోనుంచి కూడా దేవతా విగ్రహం నవ్వుతూ స్పష్టంగా కనుపిస్తున్నది. సరస్వతి చేతులు జోడించుకొని విగ్రహంతో ఇలా అన్నది. "నీకోసరం, నీ కారణంగా

మా అమ్మ ఇంత పెద్ద పాపాన్ని చేసింది. అయినా నీవు నవ్వుతున్నావు. నీవు ఎందుకిలా ఎల్లప్పుడూ నవ్వుతూ వుంటావో, నీ నవ్వుకు అర్థం ఏమిటో నాకు బోధ పడటంలేదు. మా దుఃఖాలుగానీ, నష్టాలుగానీ నీమీద ఏవిధమైన ప్రభావాన్నీ ఎందువల్ల వెయ్యలేక పోతున్నాయో నాకు తెలియడం లేదు. నీవే చెప్పు. రేపు అబ్దుల్ వచ్చి రజ్జీ, ఫజల్ ఇద్దరూ ఏరని అడిగితే ఏం సమాధానం చెప్పను? అందుకనే నీవీ నీళ్ళల్లో ఎవ్వరికంటా పడకుండా వుండటం వుచితం అని ఇక్కడికి వట్టుకువచ్చి వుంచాను నిన్ను. ఇక్కడ వుండడంవల్ల మా అమ్మ నిన్ను ఎన్నటికీ చూడదు వస్తుతః మాఅమ్మ చాలా మంచిది. కాని, నిన్ను చూడగానే మారిపోతుంది. నన్నూ గంగనూ - మంజూర్‌నూ - అందరినీ ఒకరకమైన, చిత్రమైన చూపుల్తో చూస్తుంది. నీవు దగ్గిర లేకండా, నీవు కనపడకుండా వుంటే అలా చూడదు మామూలుగా వుంటుంది. చక్కగా మాట్లాడుతుంది. ఓ భగవంతుడా! నన్ను క్షమించు. మా అమ్మలోవచ్చే ఈ మార్పువల్ల నేను చాలా విసిగిపోయాను. అందువల్లే నిన్ను ఇక్కడికి తీసుకువచ్చి వుంచాను. ఇక్కడ ఎల్లప్పుడూ కాగాన్ నదీజలాలు నిన్ను స్నానమాడిస్తూ వుంటాయి. నీవు మా అమ్మకు దూరం అవుతావు మా అమ్మ తిరిగి మంచిది అవుతుంది.!—ఔనా?"

ఇంత చెప్పుకున్నా సరస్వతి మనస్సుకు తృప్తి కలుగ లేదు. ఏదో అపరాధం చేసినదానిలాగా లోపల లోపల కుములుతున్నది. సరస్వతికి దేవతా విగ్రహం ఇంకా తనవైపు చూసి నవ్వుతున్నట్టుగా వున్నది. సరస్వతి వెనక్కు తిరిగింది.

క్రిందవున్న ఎర్రని చుట్టకుదురును నెత్తిన పెట్టుకొన్నది. బిం దెను తీసుకొని నిండా నీళ్ళు నింపుకొన్నది ఎక్కువగావున్న కొద్దిపాటి నీళ్ళను చేతితో కొట్టి తగ్గించింది. తరువాత ఒక చేత్తో బింది పైఅంచు పట్టుకొని మరొకచేతిని బిందె అడుగు భాగంలోవుంచి ఎత్తుకొన బోతూవుండగా ఎవరిదో పురుష హస్తం బిందెపైభాగాన్ని పట్టుకొని అవలీలగా బిందెను బుజా నికి ఎత్తివేసింది. సరస్వతి తలఎత్తి చూసింది.

"ఎవరు... అబ్దుల్?" సరస్వతి అన్నది.

అబ్దుల్ నవ్వి "కాదు...రామదాసుని...సరసూ!" అన్నాడు.

"సరసూ!" అన్నప్పుడు అబ్దుల్‌స్వరం అతిమృదువుగా ప్రేమపూర్ణంగా వుంది. తనస్వరాన్ని విని తనే ఆశ్చర్య పడ్డాడుఅబ్దుల్. సరస్వతి దగ్గిరవుంటే అబ్దుల్ బానోని పూర్తిగా మర్చిపోతాడు. అందుకు కారణం లేకపోలేదు. ఒకటి బానో చాలా దూరంలో వున్నది. సరస్వతి తన సౌందర్యపు వలను వన్ని అబ్దుల్ మేధస్సును వశపరచుకొన్నది. ఎర్రని గులాబీ పెదాలు, ఎత్తయిన గుండ్రని వక్షస్థలాలూ, వేడివేడి నిశ్వా సాలూ బానో జ్ఞాపకాలకు అడ్డుపడుతున్నాయి. సరస్వతికూడా ఎందుకనో అబ్దుల్ సముఖంలో తనను తాను పూర్తిగా మర్చి పోతున్నది. అతని గొంతులోని "ప్రేమపూర్ణతను" సరస్వతి విన్నది. ఆమెకు అది ఎంతో రమ్యంగా వున్నది, సముద్రపు తుఫానులో ప్రళయ అలలమధ్య తేలిపోతూవుండే చిన్న అంద మైన రంగుల చేపలావుంది. ఆమెకా ప్రేమపూర్ణత! పాపం చిన్నచాత. పెద్దతుఫాను! చూస్తూవుండగానే ప్రళయ రూపా

లను దాల్చిన అలలు సుళ్ళు తిరగసాగాయి. ఈ చిన్నిచాప్య ఈ ప్రేమపూరిత ఆ సుళ్ళల్లో, గుండాల్లో చిక్కుకొని పోయింది. సరస్వతి గుండెలు గతుక్కుమన్నాయి. ఒక్క కేక పెట్టి రెండడుగులు వెనక్కు వేసింది. ఈ కేకతో అబ్దుల్ స్వస్థి తికి వచ్చాడు. అనాదినుండి ఎన్నో బాధలుపడి, సమాజంపట్ల స్త్రీలపట్ల, తన, పరాయీ అని కల్పించిన భేదం తిరిగి అబ్దు ల్‌లో పనిచెయ్యసాగింది. సరస్వతి పరాయిస్త్రీ అన్న స్పృహ అతనికి కలిగింది.

అబ్దుల్ అడిగాడు "ఎందుకలా భయంగా చూస్తు న్నావు నన్ను ?"

సరస్వతి చెప్పేసింది "మా అమ్మ ఫజల్‌ని, రజ్జీని పట్టించేసింది!"

అబ్దుల్ ఒక్కక్షణం నిర్విణ్ణుడై పోయాడు. కండ్లు భ్రమించాయి. వళ్ళు తిరిగింది. ప్రక్కనేవున్న బండమీద చతికిలపడ్డాడు.

సరస్వతి బాధగా అన్నది. "అబ్దుల్ మమ్మల్ని పొర పాటుగా అర్థం చేసుకోకు! ఫజల్‌నీ రజ్జీనీ విడిపించాలని స్టేషన్‌కు కూడా వెళ్ళాము. కాని వాళ్ళు విడిచిపెట్టలేదు. ఎంత బ్రతిమలాడినా విడిచిపెట్టలేదు. అంతేకాదు మావూరి నంబర్‌దార్ కొడుకు మంజూర్‌నీ మౌలవీగార్నికూడా ఖైదు చేశారు."

అబ్దుల్ ఏమీ మాట్లాడలేదు.

"ఇక వాళ్ళు నిన్ను పట్టుకోవాలని చూస్తున్నారు. నీవు చెల్లెలిని కలుసుకోవడానికి తప్పకవస్తావని వాళ్ళవుద్దేశ్యం.

శాబాష్ సిపాయిలులేరూ? అతను, ఇవాళ్ళ రాత్రికి పోలీసులు మా యింటికి కావలా కాస్తారని చెబుతున్నాడు. శాబాష్ చాలా మంచివాడు. ఎలాగైనా ఫజల్‌నూ రజీన్ విడిపించడానికి ప్రయత్నిస్తానన్నాడు. వాళ్ళమీద తనకు ఎంతో సానుభూతి వున్నదన్నాడు."

అబ్దుల్ ఏమీ మాట్లాడలేదు.

సరస్వతి అతి ప్రాధేయంగా "నేను నిర్దోషిని అబ్దుల్" అన్నది.

అబ్దుల్ లేచి నిలబడ్డాడు. ఒకసారి సరస్వతివంక చూశాడు. తనలోని హిందువులమీది ద్వేష మే రూపాన్ని దాల్చి సరస్వతిలా కనుపించింది అతనికి. శతాబ్దాలుగా ఏమూలనో దాగుకొనిఉన్న పరమతద్వేషం అంతా ఆ ఒక్క-క్షణంలో పొంగి పైకి వుబికింది. అబ్దుల్ సహజంగా చాలా మంచివాడు. తనలోని పరమతద్వేషాన్ని ఇన్నాళ్ళుగా అణుచుకున్నాడు గాలి తగలని ప్రణాం ఎవరో తనే కుళ్ళినట్టు ఇన్నాళ్ళుగా ఈ ద్వేషం అబ్దుల్ హృదయంలో ఏమూలనో పడివుండి నిద్రుస్తున్నది. ఇప్పుడు సమయం చూసుకొని మేల్కొన్నంది. అబ్దుల్ మండిపడ్డాడు. ఇలా అన్నాడు.

"అవును, మీరంతా నిర్దోషులు. మీ హిందువులందరూ నిర్దోషులు! నేరస్థులం మేము. ముస్లిములం మేము నేరస్థులం! మీ మహారాజు నిర్దోషి-ఠాకూర్ కాహన్‌సింగ్ నిర్దోషి- మీ అమ్మ నిర్దోషి-ఎందువల్ల అంటే మీరంతా హిందువులు! మీరంతా నిర్దోషులు - ఎందువల్ల అంటే మీరంతా పాలకులు! మేమంతా నేరస్థులం! ఎందువల్ల

అంటే మేము పాలితులం! మేము పాలితులం కాబట్టే మా నాన్న నిలువునా కాల్చి చంపబడ్డాడు. మా అమ్మ విధవ అయింది. అభమూ శుభమూ తెలియని నా చెల్లెలిని భోగం దాన్ని చేశారు. ఇదంతా ఎందుకు జరిగిందంటే మేము ముస్లిము లము కావడంవల్ల, మేము పాలితులం కావడంవల్ల ...మీ హిందువుల్ని అల్లా నాశనం చేస్తాడు! థూ–నీ హిందూ!"

అబ్దుల్ మధ్యలోనే ఆపేశాడు. సరస్వతివైపు చూశాడు సరస్వతి అతనికి అతి నిస్సహాయంగా వివశురాలైనట్టు కనుపిం చింది. ఆమె కండ్లు చమర్చి వున్నాయి. తన కోపానికీ మాట ల్లోని కాఠిన్యానికీ, స్వరంలోని తీవ్రతకూ సిగ్గుపడ్డాడు అబ్దుల్! కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. అబ్దుల్ వంగి క్రిందవున్న ఒక రాతిని తీసుకొని అవతలి ఒడ్డుకువిసరాడు. రాయి అవతలి ఒడ్డున పడక నీళ్ళల్లో పడ్డది. క్షణం ఆగి అబ్దుల్ వెనక్కుతిరిగి పట్నం వెళ్ళేదారిన ముందుకు నడవసాగాడు. ఆ దారి ఖానో దగ్గరకు తీవుకుపోతుంది. పట్నం తీసుకుపోతుంది.

సరస్వతి కేక వేసింది "అబ్దుల్!"

అబ్దుల్ ఆగలేదు. వెనక్కు తిరిగి చూడనైనా లేదు. విషాదంతో మెల్లగా అడుగుల్ని వేసుకొంటూ బరువుగా తనదారిన నడిచాడు. అతని అడుగులు వివశంగా ముందుకు పడుతున్నాయి. భుజాలు జారిపోయినాయి. మనస్సు ఆరిన సున్నం బట్టీలా పొగవిడుస్తున్నది. చిన్నతనంలో ఒకసారి అతను పొరపాటున చల్లారిన సున్నపురాయి నొకదాన్ని తీసు కొని చెయ్యి గాల్చుకొన్నాడు. లాలా మీరాషా కొత్తగా ఇల్లు కట్టించుకొంటున్నాడు. కాగాన్ నదిఒడ్డున సున్నంబట్టీ

పెట్టాడు. అబ్దుల్ ఆడుతూ చల్లారిన సున్నపురాయి నొక దాన్ని తీసుకొని సున్నం చెయ్యాలనే వుద్దేశ్యంతో అరి చేతిలో పెట్టుకొని నది నీళ్ళను కాసిని చల్లాడు దానిమీద వెంటనే సున్నపురాయి చురచురమని పొంగింది. చెయ్యి బొబ్బ పొక్కింది. సరిగా అబ్దుల్ హృదయం అలాగే వుంది ఇప్పుడు. పైకి ఎంతో ప్రశాంతంగా చల్లారినట్టు వున్నది కాని లోపల జ్వలిస్తున్నది!

సరస్వతిదగ్గర మరి కొంచంసేపు నిల్చుంటే కోపాన్ని పట్టలేక చెయ్యి చేసుకోవలసివచ్చేది. అందువల్ల అక్కడ నిలబడకుండా వెంటనే బయలుదేరాడు అబ్దుల్! తరువాత ఒక్కమాటు వెనక్కి తిరిగి వెళ్ళి ఆఖరుసారిగా సరస్వతిని చూద్దాం అనుకొన్నాడు. కాని తన ఈ కోర్కను బలవంతాన అణచుకొన్నాడు. తలఎత్తకుండా ముందుకు నడవ సాగాడు.

ఇవ్వాళ తను చాలా జాగ్రత్తగా వెళ్ళాలి! నదీ తీరాన్ని విడిచి అడ్డదారుల్లోంచీ, అడవుల్లోనుంచీ నడిచిపోవాలి! అడవుల్లో పులులూ ఎలుగ్గొడ్లూ వుంటాయి. అయినా జాగిర్దార్ సిపాయీలంత క్రూరమైనవి కావు! అబ్దుల్ తలఎత్తి నదికి పశ్చిమంగావున్న పర్వతంవైపుకు చూశాడు. సూర్యుడు పర్వతం మాటున అస్తమిస్తున్నాడు.

సూర్యాస్తమయంవరకూ సరస్వతి అలాగే నదిఒడ్డున నిలబడివున్నది. అబ్దుల్ కనుపించినంతవరకూ రెప్పవాల్చకుండా చూసింది. అబ్దుల్ కనుచూపు దాటిపోయాక నీళ్ళబిందెతో ఇంటికి నడిచింది!

# ఎనిమిదవ అధ్యాయం

అబ్దుల్ పట్నాన్ని చేరుకొనేసరికి దాదాపుగా రాత్రి పన్నెండయింది. అతను అంధకార కూపంగావుండే, తానూర్ బజారులోకి అడుగు పెడుతూండగానే కచేరీ గడియారం పన్నెండు కొట్టింది. పక్కనేవున్న కోటలో ఫిరంగి వేశారు. ఫిరంగిమోత పట్నాన్ని వలయించి చుట్టూవున్న కొండల్లో ప్రతిధ్వనించి, క్రమంగా లుప్తం అయింది. పక్కకాలువ వంతెన మీద నడుస్తుండగా అబ్దుల్ కాళ్ళనవున్న ఇనుపనాడాల చెప్పులు వంతెనమీది నల్లరాళ్ళస్పర్శకు కర్ణకఠోరంగా శబ్దం చేస్తూ వుండడంవల్ల అక్కడ నిద్రపోతూవున్న కావలా పోలీసుకు మెళుకువ వచ్చింది. అతను అబ్దుల్‌ను ఆపి ఇలా అన్నాడు "ఇప్పుడు; రాత్రి పన్నెండు గంటలప్పుడు ఎక్కడికి వెళుతున్నావు ?"

అబ్దుల్ చాలా అలసటగా సమాధానాన్ని ఇచ్చాడు. "బాటసారిని, చాలాదూరంనుంచి వస్తున్నాను. చాలా ఆకలితో వున్నాను. తానూర్ బజారులో కాదర్ ఆలీ దుకాణం వుందేమోనని వెళుతున్నాను... అక్కడ ఏమైనా తినటానికి దొరకవచ్చునని!"

పోలీసుకు అబ్దుల్ గొంతులోని నమ్రత చాలా ఇంపుగా వున్నది. చిన్నగా నవ్వుతూ "సరే వెళ్ళు! కాని నీ

చెప్పులను వదిలి చంకలో పెట్టుకు వెళ్ళు! చెప్పులు వేసుకు నడిచావంటే జైల్లో కుక్కుతాను. నుంచునే కొంచం కునికాను. ఇంతలోనే వచ్చావు శత్రువులా. కమ్మని నిద్రను పాడుచేశావు!"
అన్నాడు.

అబ్దుల్ చెప్పులను విడిచి చంకలో పెట్టుకొన్నాడు.

వంతెన దిగువలో మందుసామానులు అమ్మే ఫతేహాఆలీ దుకాణం. దుకాణం వేసివున్నది. దుకాణాన్ని ఆనుకొనే హిందూమాదిగలబజారు. ఈ బజారులోని హిందూమాదిగలు చాలా అందమైన చెప్పులను తయారుచేస్తూ వుంటారు. ఆ చెప్పులను సామాన్యులు కొనలేరు. రాజులూ, మహారాజులూ. జాగీర్దార్లూ, నవాబులూ కొంటూవుంటారు. ఈ మాదిగల స్త్రీలుకూడా చాలా అందంగా వుంటారు. వాళ్ళని మటుకూ ధనికుల్యులూ, జాగీర్దార్లూ కాక సామాన్యులు ఎవరు కొనగలరు? ఈ మాదిగల బజారుచివర హామీద్ కిళ్ళీకొట్టు. హామీద్ గొప్ప షోకిలాయువకుడు. ఎప్పుడూ ఆడవాళ్ళలా షోకుచేసుకు కూర్చుంటాడు కొట్లో. పట్నంలో పోలీస్ సూపర్నెంట్ ఇతనిమీద ప్రత్యేకమైన అభిమానంతో వుంటాడు. హామీద్ "కవ్వాలి" చక్కగా పాడుతాడు, కిళ్ళీ బాగా రుచిగా కడతాడు. ఇంతేకాక ఇంకా అనేకం, ప్రత్యేకం అయిన గుణాలు వున్నాయి అతనిలో. అతనిలోని ప్రత్యేకమైన గుణాలను షోకిలాపురుషులు రహస్యంగా చెప్పుకొంటూ వుంటారు.

ఇతనికి ముందు పట్నంలో అసలు కిళ్ళీకొట్టే లేదు. ఒకరిద్దరు పెట్టికూడా మరుసటిరోజునే ఎత్తివేసుకొన్నారు. ఆకులు నములడంలో ఏమున్నది? గుర్రాలు నమిలినట్టు

కాచూసున్నం వేసుకొని ఆకులు నమలడం! అనుకొనేవాళ్ళు వెనక కాని హమీద్ దుకాణం పెట్టినప్పటినుంచీ కిళ్ళీమీద ప్రజలుదృష్టి మారిపోయింది. తమలపాకులకు జీవం వచ్చింది. కొద్దిపాటి చేదూ, ఖారం వగరూ, కలసిన అతని కిళ్ళీమీద ప్రజలు ఒకేతీరున మోహితు లయ్యారు!

అబ్దుల్ మాదిగల బజారుదాటి హమీద్ కిళ్ళీకొట్టు దగ్గరకు వచ్చాడు. ఇంకా కిళ్ళీకొట్టు తెరచివున్నది. ఎవరో ఒకరిద్దరువ్యక్తులు కిళ్ళీలుకట్టించుకు వెళ్ళుచున్నారు. హమీద్‌కు ప్రక్కనే బాగా మీదకు ఒరిగి హవల్దార్ ఒకతను నిలబడి హమీద్‌తో మాట్లాడుతున్నాడు. అతనిదృష్టి అబ్దుల్ మీద పడ్డది. కేక వేశాడు.

"ఏయ్! ఎవరునువ్వు?"

"బాటసారినండి... చాలాదూరంనుంచి వస్తున్నాను. రెండురోజులనుండీ అన్నంలేదు. చాలా ఆకలితో వున్నాను. తానూర్ బజారు వెళ్ళుతున్నాను. బహుశ యేకొట్టయినా తెరచి వున్నదేమోనని!" అబ్దుల్ సవినయంగా అన్నాడు.

"తానూర్ బజార్ వెళ్తూవుంటే చెప్పులు ఎందుకు చంకలో పెట్టుకువెళ్ళుతున్నావ్?" హవల్దార్ అడిగాడు.

"ఢక్కీ వంతెనమీద వున్న కావలా పోలీసు ఇలా చెప్పాడండి. చెప్పులు విడిచి చంకలో పెట్టుకోమన్నాడు... నా చెప్పులు బాగా మోతపెడుతున్నాయట!"

"కావలావాడి అమ్మని ... నీ అక్కని ... వెంటనే, చెప్పులువేసుకో! లేకపోతే ఖైదులో కుక్కుతాను!"

"సరేనండి!" అంటూ అబ్దుల్ హావల్‌దారుకు నమస్కారం చేసి చెప్పులు వేసుకొని ముందుకు నడిచాడు.

హావల్‌దార్ హమీద్ మీదకు బాగా వంగి "ఒక్క కిళ్ళీకట్టియివ్వు! ఎలావుండాలి? రాత్రంతా నిషా తగ్గకూడదు!" అన్నాడు.

హమీద్ వయ్యారంగా ఒక్క వూపు ముందుకువూగి చేతులను త్రిప్పుతూ, నవ్వుతూ "హావల్‌దార్‌గారూ! అలాంటి కిళ్ళీ కావాలంటే డబ్బు ఎక్కువపడుతుంది!" అన్నాడు.

"అరే...డబ్బుకు ఏమిటోయ్ తక్కువ? నీకోసరం, నీ కిళ్ళీకోసరం ఎంతకావాలంటే అంత ఇచ్చేయనా?" హావల్‌దార్ జేబులో రూపాయీలను గలగల్లాడిస్తూ అన్నాడు.

## 2

హమీద్ దుకాణం దగ్గిరనుంచి బజారు ఎగువకు పోతుంది. కనుక అబ్దుల్ అక్కడనుంచి తానూర్ బజారు మొత్తాన్ని చూడగలడు తానూర్ బజార్‌లో కొట్టులన్ని వేసివున్నాయి! ఒక్క కొట్టుమాత్రం తెరచివున్నది లోపలనుంచి వెలుతురు మసగ్గా బయటికి వచ్చిపడుతున్నది. అబ్దుల్ బ్రతుకు జీవుడా! అనుకొన్నాడు. అలసిన నడకతో తానూర్ బజారు ఎగువకు ఎక్కసాగాడు.

పైకి ఎక్కడంలో అతను పూర్తిగా అలసిపోయాడు. రెండురోజులనుంచీ ఏమీ తినకపోవడంవల్ల కండ్లు తిరగసాగినాయి. ఆయాసం రాసాగింది. కాదరు అలీతానూర్ దుకాణం వరకూ నడిచేసరికి అతని సర్వశక్తులూ వుడిగిపోయినాయి.

దుకాణపు మొగదల్లో వున్న ఒక పాత మట్టిపట్టిన బెంచీమీద పడిపోయాడు అబ్దుల్ !

అప్పుడు దుకాణంలో ఎవ్వరూ లేరు. కాదర్ ఆలీ అతని నౌకరూ, దుకాణం సర్ది వేసి భోజనం చెయ్యడానికి కూర్చున్నారు. ఒక అపరిచితుడైన వ్యక్తి ఇలా దుకాణం దగ్గరకు వచ్చి పడిపోవడాన్ని చూసి ఇద్దరూ భోజనం ముందు నుంచి లేచి నిలబడ్డారు.

కాదర్ ఆలీ పరుగెత్తుకుపోయి అబ్దుల్‌ను బుజంపట్టుకు క్రిందపడకుండా నిలబెట్టాడు. "అరె-అబ్దుల్ నువ్వా! ఎప్పుడు వచ్చావు?" అని అడిగాడు,

అబ్దుల్ కాదర్ ఆలీ తానూర్‌కు పాత ఖాతాదారు. వెనక అబ్దుల్ ఇక్కడే భోంచేస్తూ వుండేవాడు. పైగా ఎప్పుడూ అప్పు అడిగేవాడుకాదు. అందువల్లే కాదర్ ఆలీకి అబ్దుల్ అంటే చాలా ఇష్టం! అంతేకాక అబ్దుల్ మాటలుకూడా కాదర్ ఆలీకి ఎంతో నచ్చుతాయి! బీద స్కూలు టీచర్ లాగా ఎంతో నమ్రంగా మాట్లాడుతాడు అబ్దుల్ !

అబ్దుల్ అన్నాడు "నాకు త్వరగా అన్నంపెట్టండి!"

కాదర్ ఆలీ అన్నాడు "ఇప్పుడు అన్నంలేదు. పాలు మాత్రం కాసినివున్నాయి. అవి తాగు త్వరలో భోజనం తయారవుతుంది అప్పుడు తిందువుగాని! అరేయి, గుల్! అబ్దుల్‌కు పాలు తెచ్చి యిచ్చి త్వరగా భోజనం తయారు చెయ్యి!"

ఈగోల సంతావిని దుకాణంలో ఒకమూల నిద్ర పోతున్న మరొక తను లేచి "ఏమిటది? ఏమిటిది? ఏమిటీగోల? అనడిగాడు.

కాదర్ ఆలీ అతనికి నచ్చచెబుతూ "ఏమీ లేదులే జహామత్ భాయీ: ఇతను (విక్టోరియా స్కూలు మాస్టరు అబ్దుల్ ! అక్కడ పిల్లలను చదివిస్తూ వుంటాడు! స్టారినుంచి ఇవ్వాడే వచ్చాడు, ఆకల్తో వున్నాడు. ఇవ్వాడే అన్నంపెట్టి పంపిస్తాను. నిద్ర చెడిపోయినందుకు కోప్పడకు, జహామత్ భాయీ?" అన్నాడు.

కాదర్ ఆలీ ఈ కొద్దిక్షణాల్లోనే ఇంతగా మాటాడ డానికి కారణం, జహామత్ అంటే అతనికి చాలాభయం; జహామత్ ఆలీఅంటే కాదర్ ఆలీకి ఒక్కడికే కాదు భయం: పెద్దపెద్ద ధనికులకూ జాగీర్దార్లకూడా భయమే! జహామత్ ఆలీ అసలుపేరు రహామత్ ఆలీ కాని అతను తనపేరును జహా మత్ ఆలీ అని చెప్పుకొంటాడు. ఇతర్లుకూడా తనను అలాగే పిలవాలని అతని వుద్దేశ్యం. జహామత్ ఆలీ పొడుగయిన భారీ అయిన బలిష్టుడైన మనిషి. అతను తండ్రికి కాకుండా తాతకు పుట్టాడు. ఈవిషయాన్ని చాలా గర్వంగా నలుగురిలో చెప్పు కొంటాడు. ఎవరైనా 'ఇదెట్లా సంభవమయ్యా' అని ప్రశ్నిస్తే ఈ విధంగా వివరిస్తాడు. "మేము ఐదువందల ఏండ్లనుండి "జంగావరాదో" గ్రామపు నంబర్ దార్లమూ జాగీర్దార్లమూ! మాలోవున్న ముఖ్యమైన ఆచారం తండ్రి తన భార్యనే కాకుండా పెద్దకొడుకు భార్యనుకూడా తనదిగానే చూచు కొంటాడు. ఇదెలాగ? అని ప్రశ్నించవద్దు...ఉదాహరణ యిస్తాను. మాతాత బ్రతికి వున్నాడు భగవంతుడి దయవల్ల

అతను నాకంటే బలిష్ఠుడూ, ఒడ్డూ పొడుగూ కలవాడు. అతని పెద్దకొడుకు అంటే నాతండ్రికూడా బ్రతికివున్నాడు. నే నలిని కొడుకుని, నాకుకూడా ఒక కొడుకున్నాడు. ఇక చూడు వరుసఎలాగవస్తుందో: మాతాత మా నాన్న భార్యను సొంతం చేసుకొన్నాడు. మా నాయన నా పెండ్లాన్ని సొంతం చేసుకొన్నాడు. నేను నా కొడుకు పెండ్లాన్ని సొంతం చేసుకొంటాను. ఈ విధంగా మాతాత యదార్థానికి మా తండ్రి అవుతాడు. నామనుమడికి నేను తండ్రి నవుతాను!"

ఇలాగే చెబుతూవుంటే ఒకమాటు కాదర్ ఆలీకి కోపం వచ్చి ఇలా అన్నాడు. "ఐతే మీజాతి మొత్తం ఇలాంటి హారామ్ జాతేనంటావు?"

ఇందుమీద జహామత్ ఆలీకి చాలా కోపంవచ్చి కాదర్ ఆలీమీదకు కత్తిదూసిరాడు. కాని కాదర్ ఆలీ మంచి బలాఢ్యుడు కావడంవల్ల ఏ విధమైన ప్రమాదమూ లేకుండా పోయింది. ఈ సంఘటన జరిగాక కాదర్ ఆలీ జహామత్ ఆలీ ఇద్దరూ ప్రాణ స్నేహితులు అయ్యారు. జహామత్ ఆలీ తన మిత్రబృంద సమేతంగా ఎప్పుడూ కాదర్ ఆలీ దుకాణంలోనే తిష్టవేసుకు కూర్చుని వుంటాడు, జహామత్ ఆలీ ఇంతకుక్రితం పోలీసు హావల్దారుగా వున్నాడు. కాని అతనికి హిందువుల సేవ ఏమాత్రం ఇష్టంలేదు. కనుకనే ఒక చిన్న మాటను మండిపడి పోలీస్ సూపరింటెండెంటును చెప్పుతీసుకు కొట్టాడు. సూపరింటెండెంటు హిందువు. రసపుత్రుడు. ఇందుమీదట జహామత్ ఆలీకి నౌకరీపోయింది. ఆరు నెలలు శిక్ష పడ్డది. జైలు నుంచి వచ్చాక ఎలాగయినాసరే హిందూరాజ్యాన్ని సమాప్తం

చెయ్యాలనే పట్టుదల పట్టుకుకూర్చున్నాడతను. తనుపోయిన ప్రతిచోటా "మిత్రుల్లారా! అయిదువందల సంవత్సరాలనుంచీ మనం స్వతంత్రంగా వుంటున్నాము. భూములు మనవి, వ్యవసాయం మనది-సర్వం మనది. కాని మహారాజా గులాబ్ సింగ్ కాలంనుంచీ హిందువులు మన రాజ్యం మీద అధికారం చెలా యిస్తున్నారు. మనభూములమీద అధికారం చెలా యిస్తున్నారు." ఇలాగ అంటుంటాడు.

జాగీరులో చాలా దూరంవరకూ వెళ్ళి తన ప్రచారాన్ని కొనసాగించి వచ్చాడు. జాగీరులోనే కాకుండా జాగీరు బయటకూడా చాలామంది జహామత్ ఖాని ఎరుగుదురు, పట్నంలోనూ, బయట పల్లెల్లోని, చిన్నచిన్న ముస్లిము వ్యాపారుల దగ్గిరా. 'ఖోజా'జాతి వ్యాపారుల దగ్గిరా అతను బలవంతాన డబ్బు వసూలుచేస్తూ వుంటాడు. ఇప్పటివరకు జహామత్ ఆలీఖాన్ నాలుగుపెండ్లిళ్ళు చేసికొన్నాడు. పెద్ద పెండ్లాము ఆచారాన్ని అనుసరించి తండ్రిదగ్గరవున్నది. మిగిలిన ముగ్గురు పెండ్లాలూ ఇతనిదగ్గరే వున్నారు. ఇతనికొడుక్కి ఇప్పుడు పన్నెండో యేడు, మరొక రెండేళ్ళు ఎలాగో గడిస్తే కొడుక్కి పెండ్లిచేసి తమవంశపు పురాతన ఆచారాన్ని నిలబెట్టుకొందామని చూస్తున్నాడు. ఈ ఆచారంమీద జహామత్ ఆలీఖాన్‌కు అమితమైన గర్వమూ, విశ్వాసమూ. ఈ ఆచారం వల్లనే తమ వంశంలోని ప్రతిఒక్కడూ పూర్ణాయుష్మంతుడై వుంటున్నాడని అతనంటాడు.

జహామత్ ఆలీఖాన్ అబ్దుల్ పేరు వినేసరికి వులిక్కిపడ్డాడు. క్షణం మౌనంగా కూర్చుని తన దుప్పటిని కప్పుకొని

ఎదురుగావచ్చి నిలబడ్డాడు అబ్దుల్‌కు. అబ్దుల్ అప్పుడే వేడి వేడి పాలను తాగుతూవున్నాడు. పాలుత్రాగేసి గ్లాసును క్రిందపెట్టి జహామత్ ఖాన్ వైపుచూసి కొంచంగా భయపడి చిరునవ్వునవ్వుతూ సలాం పెట్టాడు అబ్దుల్.

కాదర్ ఆలీఅన్నాడు "భోజనంతయారయింది. మాతో పాటు తిందువుగాని రా! చల్లారిపోతుంది."

# 3

అబ్దుల్ కాదర్ ఆలీ, అతని నౌకరు జాంబాజ్ ముగ్గురూ భోంచేయడానికి కూర్చున్నారు. జహామత్ ఆలీ బాగా తిని వున్నప్పటికీ తనూ వీళ్ళతో పాటు వచ్చి భోజనంముందు కూర్చున్నాడు. రొట్టెముక్క నోటదాన్ని విరుచుకొంటూ అబ్దుల్‌ని అడిగాడు "ఇంటినించే వస్తున్నావా?"

"అవును."

"అక్కడి పరిస్థితి ఏమిటి?"

"అంతా చక్కగానే వుంది!"

"నీవు అబద్ధం చెబుతున్నావు."

"ఎట్లా?"

"ఎట్లాగా! నాకు అంతా తెలుసు. నీమీద అరెస్టు వారంటు వుంది."

అబ్దుల్ ఏమీ మాట్లాడలేదు.

"మీ నాన్నను జాగీర్దార్ కర్మఆలీ చంపేశాడు. మీ మీ చెల్లెలు రజ్జిని ఆమెకు కాబోయేభర్త ఫజల్‌నీ తాహూర్

కాహన్‌సింగ్ అరెస్టుచేశాడు. నాకు అంతా తెలుస్తూనే వుంటుంది.''

అబ్దుల్ అన్నంపళ్ళెంలో నుంచి చేతిని వెనక్కు లాక్కున్నాడు.

జహామత్ ఆలీఖాన్ అబ్దుల్ వీపు నిమురుతూ ''అరె... రె... ఖోంచెయ్యి. నేను నిన్ను పోలీసులకు పట్టిచెప్పను. నే సలాంటి నీచుడను కాను. నేను ముసల్మానుని'' అన్నాడు.

''మరయితే ఏం చేయదలిచారు?'' అబ్దుల్ అడిగాడు.

జహామత్ ఆలీఖాన్ ఒక ఎముకను చీకుతూ ''ఇప్పటికే నీమీద చాలా అత్యాచారాలు జరిగినాయి! ఇంకాకూడా జరుగుతాయి. నిన్ను ఉద్యోగంలోనుంచి తీసేస్తారు. మెట్రిక్ పరీక్షకు కూర్చోనియ్యరు. నీవు రావల్సిండి పోలేవు!'' అన్నాడు

అబ్దుల్ హృదయం లోపల్లోపలే కుమిలిపోయింది. అతను ఎన్నో ఆశయాల్ని మనస్సులో పెట్టుకొని పట్నానికి వచ్చాడు. ఎంతో కష్టపడి ఇంతవరకూ చదివాడు బాగా చదవాలనీ, గొప్పవాడు. చాలా గొప్పవాడు కావాలనీ అతని వుద్దేశ్యం. తన ఉద్దేశ్యానికి అతను ఎంతో వుత్సాహంతో పరిశ్రమచెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. కాని, ఏం ప్రయోజనం! పెనుతుఫానులో అతని పరిశ్రమా - వుత్సాహం - ఆశలూ- అన్నీ కొట్టుకుపోయాయి. ఇన్నినాళ్ళుగా ఎంతో శ్రమకోర్చి అతను కట్టుకున్న ఆశ అనే రమ్యమైన బొమ్మరిల్లు ముక్కలు ముక్కలుగాకూల్చి వేయబడ్డది. ఇప్పుడతనికి యిల్లులేదు. వాకిలి లేదు. కులంలేదు. గోత్రంలేదు. ఏమీలేవు. అబ్దుల్ హృదయంలో ద్వేషం దుర్దమనీయమైన వేగంతో పెల్లుబికింది. అతను

బలంగా జహామత్ ఆలీఖాన్ జుబ్బ పుచ్చుకొని "భాయీ జహామత్ ఆలీఖాన్ మొదట నే చదువుకొని రాజావారి కొలువులో వుద్యోగం చేద్దాం అనుకున్నాను. ఇప్పుడలా కాదు! నాకు వుద్యోగంవద్దు. నేను ఎవరినైనా కొట్టాలి! చంపాలి. చెప్పు. ఎవరిపేరైనా చెప్పు! వాడిని చంపేస్తాను!" ఉద్వేగంతో అనేశాడు.

జహామత్ ఆలీఖాన్ నవ్వి "అబ్బే అలా త్వరపడి లాభంలేదు. ఏంచెయ్యాలన్నా ఓపికా ఓర్పూ అవసరం! ఇలాంటి వ్యవహారాల్లో ఓర్పు చాలా అవసరం!" అన్నాడు.

"నా చుట్టూ అంధకారమయం. ఎక్కడికి పోవాలో ఏం చెయ్యాలో నాకేమీ తెలియడంలేదు. ఏం చెయ్యాలో చెప్పు! ఎక్కడికి పోవాలో చెప్పు!"

జహామత్ ఆలీఖాన్ ఎముకను చక్కగా చీకివేసి "భయపడకు రేపురాత్రికి రెసిడెంట్ సాహెబ్ గారి దగ్గిరకు తీసుకుపోతాను. ఆయనగారే నీకు దారిచూపుతారు!" అన్నాడు.

అబ్దుల్ ఆశ్చర్యంతో అడిగాడు. "నీవు రెసిడెంట్ గార్ని ఎరుగుదువా?

జహామత్ ఖాన్ మళ్ళీ నవ్వాడు "ఎందుకలా పెద్దగా అరుస్తాన్ మెల్లగా మాట్లాడు. రేపురాత్రి పదిగంటలకు నేను నిన్ను వారిదగ్గరకు తీసుకుపోతాను. ఉదయాన్నే నీవు నాతో వచ్చెయ్యి. పగలంతా మంగలి వలీజు షాపులో వుండు. రాత్రికికలిసి వెడదాం. తెలిసిందా?"

అబ్దుల్ జహామత్ ఆలీఖాన్ చేతిని గట్టిగా పట్టుకుని తన కండ్లకు అద్దుకున్నాడు. ఆలీఖాన్ చెయ్యి కన్నీళ్ళతో

తడిసింది. అతను వెంటనే చేతిని లాగివేసుకున్నాడు. "అరె-ఏమిటీ్వని? ముసల్మానువైఉండి ఏడుస్తున్నావ్? ఛీ-ఛీ-!* అన్నాడు జహమత్ ఖాన్.

# 4

సర్ థామస్ ఎంగ్ హజ్బండ్ ముఖ్య జాగీరుకు రెసిడెంట్. శ్రీనగర్ రాజదర్బారులోవుండే రెసిడెంట్ పదవిలో. అధికారంలో ఇతనికంటె గొప్ప! అయినా థామస్ ముఖ్య జాగీరులోనే వుండటానికి ఇష్టపడ్డాడు. ఒకవిధంగా ముఖ్య జాగీరు రెసిడెంట్ పదవిని తాను స్వయంగా కోరుకొన్నాడు. ఎందువల్లఅంటే ముఖ్యజాగీరులోని రాజకీయ, సైనికపరిస్థితులు అతనికి బాగా తెలుసును. ఈ ముఖ్యజాగీరునుంచే ప్రజలు పెద్ద సంఖ్యలో ఇండియన్ ఆర్మీలో చేరారు. ముఖ్యజాగీరులోనిఒక్క-చందేరి ప్రాంతంనుంచే 60 వేలమంది సైనికులు బ్రిటిషువారి తరఫున ప్రపంచంమీాద యుద్ధం చేయడానికి వెళ్ళారు. వారికి ప్రపంచాన్ని జయించిపెట్టడానికి వెళ్ళారు. మరొక విశేషం; ముఖ్యజాగీరు పంజాబు సరిహద్దుల్లో కలుస్తుంది. ఇలాంటివే అనేకమైన విషయాలు ఆలోచించి తనొక సీనియర్ ఆఫీసర్ అయివుండికూడా జూనియర్ పదవిని స్వీకరించాడు. ప్రభుభక్తుడూ సామ్రాజ్య భక్తుడూ అయిన సర్ థామస్ ఎంగ్ హజ్బండ్!

సర్ థామస్ యంగ్ హజ్బండ్ అటు ఎంగ్ (యువకుడు), కాడు. ఇటు హజ్బండ్ (పతి) కాడు అతనికి యాభై సంవత్సరాల వయస్సు, విధురుడు (భార్యా చనిపోయింది) అందువల్ల తన దగ్గిఱవుండే నౌకరు భార్యన్ను వాడుకుంటూ వుంటాడు.

ఇతని దగ్గిరవున్న నౌకరు భార్యాకు పుట్టే పిల్లలకండ్లు ఇంగ్లీష్ వాళ్ళ కండ్లలా నీలంగా వుంటాయి. శరీరం కూడా నున్నగా ఎర్రగా వుంటుంది. నౌకరుకుకూడా ఈవిషయం చాలా రోజుల నుంచీ తెలుసును. అయినా వుద్యోగం, ధనం ఈరెండూ అతని నోరు మూసివేసినాయి. రెసిడెంట్ బహద్దూర్‌గారి నౌకరు అనే గొప్పే తనకుచాలు. అనుకున్నాడు. ఈస్థానంలో వుంటే గొప్పగొప్పవాళ్ళనుకూడా దబాయించవచ్చు" దొర గారు లేరు!" దొరగారున్నారు. కాని రేపు రావలసినదే ఇవ్వాళలాభంలేదు!" "సరే, ప్రయత్నం చేస్తాను. అయినా లాభంలేదనిపిస్తున్నది." మొదలైన సమాధానాల్ని ఇస్తూ గర్వంగా వ్యవహరించవచ్చును. అక్కడికి వెళ్ళేవాళ్ళు నౌకరుని ముఖంమీదపొగుడుతారు. కాని చాటున నానాతిట్లు తిడతారు. "లంజీకొడుకు. రెసిడెంట్ బహద్దూర్‌కు నౌకర్నం టాడు, పొడుగాటితెురాయి పెట్టుకు గర్వంగా తిరుగు తుంటాడు. పెండ్లాన్ని మాత్రం అదుపులో వుంచుకోలేడు!" అంటుంటారు.

## 5

సర్ థామస్ యంగ్ హజ్బండ్‌కు అస్సాంనుండి కాష్మీరం వరకూ వుండే హిమాలయ పర్వత ప్రాంతపు ప్రతి ఒక్క జాగీరునుగురించీ, రాజ్యాన్నిగురించీ క్షుణ్ణంగా తెల్సును! "తను నేపాల్, భోటాంగ్ - ఇత్యాది ప్రతి జాగీరులోనూ, రాజ్యంలోనూ కొన్నాళ్ళు వున్నాడు. దీర్ఘకాలంపాటు కాష్మీరునంతా పరికించి, ముఖ్య జాగీరుకు రెసిడెంట్‌గా

ఫుంఛ్ పట్నంలో వుంటున్నాము. మొదట్లో ఈ ముఖ్య జాగీరుగా రెజిడెన్సీ శాఖ లేదుట. మహారాజా ప్రతాపసింగ్ కాలంనుండి శ్రీనగర్‌లోని పెద్దరెసిడెంట్‌గారు చెప్పినమీదట, ఇక్కడకూడా రెసిడెన్సీ శాఖను తెరిచారు. మహారాజా ప్రతాపసింగ్‌ను కాశ్మీర్‌కు అధిపతిగా స్వీకరించడానికి వారిచేత కొన్ని షరతులకు ఒప్పించారు. ఇంగ్లీషువాళ్ళు! వాటిల్లో ముఖ్యజాగీరులో రెసిడెన్సీశాఖను తెరవడం ఒకటి! ముఖ్య జాగీరులో ఈ శాఖను తెరిచినప్పటినుండి కాశ్మీరుకూ, శ్రీనగరుకూ మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటోంది! మొదట్లో ముఖ్య జాగీరుకు ప్రధాని శ్రీనగరునుంచి వచ్చేవాడు. ఇప్పుడు పంజాబునుంచి వస్తున్నాడు. ఒక్క మంత్రేకాదు; జడ్జీలూ, డాక్టర్లూ, స్కూలుమాస్టర్లూ, చివరకు చిన్నచిన్న కచేరీల్లో వుండే రిజిస్ట్రార్లుకూడా పంజాబునుంచే వస్తున్నారు. శ్రీనగరు దర్బారునుండి ఇక్కడికి వచ్చేది. ఒక్క మూడవతరగతి క్లర్కులు మాత్రమే! వాళ్ళను నిండుదర్బారులో హేళన చేస్తారు, డోంగరీభాషలో తిడతారు. అయినా వాళ్ళు ఏమీ మాట్లాడరు!

సర్ థామస్ ఎంగ్‌హజ్బండ్ ఆంగ్లేయుడు అయివుండి కూడా ముఖ్యజాగీరుమీద శ్రద్ధ, భక్తి విశ్వాసాలను కనబరుస్తూ వుంటాడు.' శ్రీనగరు దర్బారులోవుండే రెసిడెంట్ శ్రీనగరును గురించి ఆలోచిస్తూవుంటాడు. సర్ థామస్ ముఖ్య జాగీరును గురించి ఆలోచిస్తూవుంటాడు. తాడును ఆయన అటులాగుతూవుంటాడు. ఈయన ఇటు లాగుతూవుంటాడు. ఈ పోటీలో ఎప్పుడూ ముఖ్యజాగీరు పైచేయిగా వుంటుంది.

శ్రీనగరుకు ఎప్పుడూ ఓటమి తప్పదు! ఉదాహరణకు కాష్మీర్ పోస్టల్ సర్వీసు స్థానంలో పంజాబు పోస్టల్ సర్వీసును నియుక్తం చెయ్యడంగాని, లేక కాష్మీరు పాఠ్యక్రమాన్ని మార్చి పంజాబు పాఠ్యక్రమాన్ని పెట్టడంలోగాని, లేక మహారాజుగారి సేవకు సంతసించి బకింగ్‌హామ్ ప్రభువు 21 ఫిరంగీల శాల్యూట్ స్వీకరించడంలోగాని, ఇత్యాది ప్రతివిషయంలోనూ ముఖ్య జాగీరుకే విజయం లభిస్తూవుంటుంది. దాదాపు ఇన్ని ఫిరంగుల శాల్యూట్ శ్రీనగరు దర్బారుకుకూడా స్వీకృతమైవుంది. ఇలాగ ప్రత్యర్థికూడా సమానస్థితికి రావడాన్ని, అలాంటి అవకాశాన్ని ఇచ్చిన బకింగ్‌హామ్ రాజ్యాన్నిగురించి శ్రీనగరు దర్బారులో చెవులు కొరుక్కుంటారు. మథనలు పడతారు. అంతకుమించి మరేమీ చెయ్యలేక మెదలకుండా వూరుకొంటారు. అవును సూర్యుడస్తమించని ఇంగ్లీషు ప్రభుత్వంతో పోరాడగలశక్తి ఎవరికుంది? ఇటు ముఖ్యజాగీరు మహారాజుగారు తనకు లభించిన ఈ విజయానికి సంతసిస్తూ, మీసాలను దువ్వుకొంటూ అంటారు "ఎలాగైతే నేం 21 ఫిరంగి శాల్యూటునూ ఒప్పించాము చివరకు. మనకు లభించిన ఈ విజయానికి శ్రీనగరు మహారాజు మండిపడుతూ వుంటాడు. మండనీ, శత్రువు ఎంతమండితే అంతమంచిది! ఇంతకూ మన రెసిడెంట్ చాలా మంచివాడు. ఏమంటారు మంత్రిగారూ?"

మంత్రి తలవంచుకొని "మహారాజులు యథార్థాన్ని శలవిచ్చారు." అంటాడు.

"ఐతే మన రెసిడెంట్ బహద్దూర్‌గారికి ఇనాం ఏమి ఇవ్వమంటారు?"

"జోడుగుర్రాలూ, రెండువందల మొహారీలూ, ఏడుగురు బానిసలూ, ఒక కత్తీ ఇవ్వాలనే నిర్ణయం జరుగుతుంది. కాని సర్ థామస్ బానిసలను తీసుకోవడానికి సంకోచిస్తాడు. ఇందుమీదట మహారాజుగారు పెద్దగానవ్వుతూ ఇలా అంటారు. "మన రెసిడెంట్ నపుంసకుడయ్యాడు! నన్ను చూడు, నాకు ఏడుగురు రాణులూ, రెండువందలమంది బానిసలూ వున్నారు ఇంకా ఏడుగురు రాణులనూ రెండువందలమంది బానిసలనూ వుంచగలను! నువ్వు వుంచగలవు! కాకపోతే నాకరు పెళ్ళాన్ని... దాని పైజమాలో దూరతానంటావు!" ఈవిధంగా నిండుదర్బారులో నవ్వుల ప్రవాహం బయలుదేరుతుంది. చక్కగా చదువుకున్న సభ్యత కలిగిన సర్ థామస్ కూడావిధిగా నవ్వుతాడు. పైకి నవ్వినా లోపలమాత్రం "ఇలాంటి ఇండియన్స్‌ని తుపాకితో కాల్చినా పాపంలేదు" అనుకుంటూ వుంటాడు. కాని నవ్వక తప్పదు. నవ్వుతాడు. ఆనవ్వడానికికూడా ముఖ్యమైన కారణం ఒకటున్నది. అస్సామునుండి కాష్మీరువరకూ వున్న బ్రిటిష్ రాజ్య సరిహద్దుల్లోని దేశీయరాజ్యాలు చాలా ప్రమాదకరమైనవి. ఆంగ్లేయులు ఈ ప్రమాదకరమైన సరిహద్దుల్లో తమ రాజ్యాన్ని కాపాడుకోవాలంటే నవ్వకతప్పదు నవ్వాలి! పైగా ఇక్కడ బలప్రయోగం అంతగా పనిచేయదు. 'దేశాన్ని బట్టి వేషమూ' అన్న సామెతను అనుసరిస్తేనే ఇక్కడ నెగ్గడంకద్దు లేకపోతే అస్సాముదగ్గిరనుండి కాష్మీరంవరకూ వున్న మొత్తం హద్దంతా శత్రువులకు హస్తగతం అవుతుంది. ఇందువల్లే ఆంగ్లేయులు అస్సామునుండి కాష్మీరంవరకూ వున్న మొత్తం సరి

హద్దులోనూ ఒక విస్తృతమైన చిరునవ్వును పరిచి వుంచు కున్నారు. పైన చిరునవ్వూ! లోపల ఫిరంగులూ!.

సర్ థామస్ రాజ్యాంగ వ్యవహారాల్లో మంచి నిపుణత కలవాడు. ముఖ్య జాగీరులోని అంగుళాంగుళ ప్రదేశమూ అతనికి సువిదితం! థామస్‌లో వున్న ప్రత్యేకత; తను ఎక్కడైనా వుండనీ ఆ ప్రదేశానికి సంబంధించిన ఐతిహాసిక, భౌగోళిక పరిస్థితుల్ని అన్నింటినీ క్షుణ్ణంగా తెల్సుకుంటాడు. అతని లోని ఈ ప్రవృత్తికి స్థానిక ప్రజలే సిగ్గుపడుతూవుంటారు! ముఖ్య జాగీరు మహారాజు, శాన్‌సింగ్ పైకి థామస్‌తో నవ్వుతూ మాట్లాడినా లోపల చాలా ద్వేషిస్తూవుంటాడు. రాజా శాన్‌సింగ్ తండ్రి ఆన్‌సింగ్. ఈ జాగీరునూ, ఈ జాగీరుకు సంబంధించిన మొత్తం యిలాకాలనూ ఆన్‌సింగ్ స్వయంగా ముస్లిముల దగ్గిరనుండి గెల్చుకున్నాడు. ఒకసారి, ముస్లిములు ఎదురు తిరిగారు. ఆ తిరుగుబాటును అణచవలసి వచ్చింది. అప్పుడు ఆన్‌సింగ్ ప్రతిఒక్క ముస్లింతలకూ ఏడురూపాయలు రాజబొక్కసంలోనుంచి ఇస్తానని ప్రకటించాడు, తన సిపాయీల సందరనూ, దేశమంతటా తరిమాడు. ఒకొక్కతలకు ఏడేసిరూపాయలు! ఈ విధంగా రాజ్యమంతటా వ్యాపించనున్న తిరుగుబాటును అణచిపారేశాడు. ఇందువల్ల శాన్‌సింగ్ ఈ ముఖ్య జాగీరుమీద అధికారం తన వంశానికేగాని మరి ఏ యితర ఇంగ్లీషువాడికీ వుండడం సహించడు! కాని ఏమిచేసేట్టు? తన దర్బారులో తనకంటే పెద్దదొంగ ఇంగ్లీషువాడు. ఎవరని సభ్యమైన వేషంలో కూర్చుని వున్నాడు. అతనితో ఏమాత్రం వైమనస్యంగా వ్యవహరించినా వెంటనే అతని చిరునవ్వు

మూయం అవుతుంది. పరదా తొలగించబడుతుంది. పరదాకు వెనుకవున్న ఫిరంగులూ బాయినెట్లూ అన్నీ బయటికి వచ్చేస్తాయి. రాజ్యపు అస్తిత్వమే ప్రమాదంలో పడిపోతుంది. కను కనే రాజా శాస్‌సింగ్ సుపుత్రుడు రాజా ఆన్‌సింగ్ పుత్రుడు- ఈ విధమైన నాలుగు వేల సంవత్సరాల పురాతన వంశం- సర్ థామస్ ఎంగ్‌హాజ్బ్యాండ్ సుపుత్రుడు ఫ్రాన్సీసీస్ ఎంగ్‌హాజ జ్బండ్ సుపుత్రుడు విలియం యంగ్ హాజ్బ్యండ్ సుపుత్రుడు- ఈ విధంగా వస్తున్న మూడువందల సంవత్సరాల వంశంముందు తల వంచవలసి వస్తున్నది.

ఈ విధంగా నాలుగువేల సంవత్సరాల పురాతనమైన మహారాజుగారి వంశం మూడువందల సంవత్సరాల వయస్సు కలిగిన అతినూతన బ్రిటిష్‌వారి నవీన విజ్ఞానముందు, అధికారంముందు తలవంచుతున్నది యాభైసంవత్సరాల వివురుడైన సర్ థామస్ అత్యంత నేర్పరి అనీ, అతనికి రాజ్యం మొత్తంలోని పరిస్థితులు సువిదితమనీ, చక్రాన్ని ఎటుకావాలంటే అటు త్రిప్పగల సమర్థుడనీ, రాజా ఆన్‌సింగ్‌కు తెలుసును. అందుచేతనే సర్ థామస్‌తో మిత్రభావాన్ని ప్రకటిస్తున్నాడతను! ఎప్పుడయినా సర్ థామస్ రాజా ఆన్‌సింగ్ గృహానికి వెడితే ఇద్దరూ ఏమాత్రమూ సంకోచంలేకండా ఒకర్నొకరు గాఢంగా ఆలింగనము చేసుకొంటారు. బాల్య మిత్రుల్లా! ఆలింగనానంతరం ఆన్‌సింగ్ గృహ ముఖద్వారం మీద బంగారుఫ్రేములో తగిలించబడిన థామస్ చిత్రంవైపు చూస్తూ "ప్రపంచంలో నాకు ఎవరైనా నిజమైన మిత్రులు వున్నారంటే, ఒక్క ఈ చిత్రమే!" అంటాడు.

సర్ థామస్ మొదటగా ఆన్‌సింగ్ గృహంలో తన చిత్రాన్ని చూసి అతని నోటిమీదుగా తన ప్రశంసను విని సంతసించాడు. కాని కొద్దిరోజులకే తను వెళ్ళిపోయిన తరువాత, ఆన్‌సింగ్ తన చిత్రాన్ని నౌకర్లచేత చీకటిగదిలో పారేయిస్తూ వుంటాడని తెలిసింది. థామస్‌కు మొదటగా ఈ విషయాన్ని తెల్సుకొని థామస్ బాధపడ్డాడు. వ్యధపడ్డాడు. కాని కొన్నాళ్ళ తరువాత అతనికి వ్యవహారం పరిపాటయి పోయింది. తనుకూడా తన రెసిడెన్సీ భవనంలో ముఖద్వారానికి రాజా ఆన్‌సింగ్ త్రివర్ణ చిత్రాన్ని తగిలించి వుంచసాగాడు. రాజా ఆన్‌సింగ్ రెసిడెన్సీ భవనానికి వచ్చినప్పుడు శ్రద్ధాభక్తులతో సైనికవందనాన్ని గావిస్తూ వుంటాడు. ఆ చిత్రానికి! అతను వెళ్ళిపోయిన తరువాత ఆ చిత్రాన్ని తీసి మూలగదిలో పడేయిస్తూ వుంటాడు థామస్! థామస్ ఇలా చేస్తూంటాడని రాజా ఆన్‌సింగ్‌కు కూడా తెలుసును. అయినా ఏమీ మాట్లాడడు. పైకి ఎంతో మిత్రత్వం ప్రదర్శించుకొంటూ ఆలింగనం చేసుకొంటూ వుంటారు. మనస్సులో ఒకళ్ళని ఒకళ్ళు తిట్టుకొంటూ వుంటారు. ఇద్దరికీ ఒకరిఅవుసరం మరొకరికి వున్నది. కనుక ఒకరినిచూస్తే మరొకరికి భయం: అందువలన ఇద్దరూ ఏమీ తెలియనట్లు మిత్రత్వాన్ని ప్రదర్శిస్తూ వుంటారు.

రాత్రిసమయం రెసిడెన్సీ భవనపు అందమైన తోటలో, సర్ థామస్ ఒకమూల పడివున్న ఈజీఛైరులో పడుకొని వున్నాడు. వెన్నెల పిండారబోసినట్టుగా వున్నది. సర్ థామస్ ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్నాడు. కాలిబాటకు రెండు

పైవులా ఫ్రెంచ్ దేశపు ద్రాక్షతీగెలు పండ్లతో నిండి తలలు వూపుతున్నాయి. వాటినుండి వచ్చే ఫ్రెంచ్ సారాయపు వాసన థామస్‌కు మత్తును కలిగిస్తోంది. అతను కండ్లుమూసు కొని గంట్రకితం తనకు విందుచేసిన రాజా ఆన్‌సింగ్‌ను, అతని కుమారుడు సంగ్రామసింగ్‌నూ గురించి ఆలోచిస్తున్నాడు.

"రాజాఆన్‌సింగ్! చ్ఛ! ఇతన్ని గురించి ఆలోచించడం అనవ సరం. ప్రస్తుతఃపులిలాంటివాడే, కాని ముసలివాడయి పోయాడు ముసలిపులి! లెఖ్ఖేముంటి? పోతే, రాజకుమారుడు సంగ్రామ సింగ్‌ను గురించి ఆలోచించడం అవసరం; అతడికి ఆడవాళ్ళన్నా వేట అన్నా బహుప్రీతి కనుక, తండ్రికంటే నయం... ఇతన్ని చూచి అంతగా భయపడ నవుసరం లేదు. ఆన్‌సింగ్ ముసలి వాడే అయినా. పులి! పులిముసలిది అయినా భయపడవలసి నదే! కర్నల్‌డిక్ వృద్ధుడు – శ్రీనగర్ రెసిడెన్సీనుండి ఒక సందేశాన్ని తీసుకువచ్చాడు. అతడి కూతురు మాలీ చాలా అందగత్తె. మరి పెండ్లాము ఇటాలియన్ స్త్రీ! కూతురు అందంగా వుండదా? ఇటాలియన్ చిత్రకారుడి కుంచనుండి ప్రసూతమైన నూతన దివ్య చిత్రంలా వుంటుందిమాలీ! రాజ కుమారుడు సంగ్రామసింగ్ భోజనం చేసినంతసేపూ మాలీ వంకనే చూస్తున్నాడు, మాలీతోనే మాట్లాడుతున్నాడు! ఛన్... నల్లవాడు! మంత్రి జ్ఞానసింగ్, సైన్యాధిపతి సిక్కు సర్దారు. వీళ్ళంతా మనకు సదర్ దగ్గిరనుండి విశ్వాసపాత్రులుగా వున్నారు. అయినా నల్లవాడి విశ్వాసం నమ్మవిశ్వాసం! నేను ఎన్ని సంవత్సరాలనుండి గోతులు త్రవ్వుతున్నాను – ఎన్ని సంవత్సరాలనుండి భూమిలోపల డయినమైట్లను అమరుస్తు

న్నాను! మరి సామ్రాజ్యభారాన్ని నిర్వహించడం అంటే సామాన్యమా? నేనుకాబట్టి ఇన్నిపనుల్ని చేశాను." అను కొన్నాడు థామస్

సర్ థామస్ పని గోతులు త్రవ్వడం, ముందు సామాను లను పేర్చడం, సామ్రాజ్యాల్ని విచ్ఛిన్నం చేయడం! అందు వల్ల ఎక్కడి ప్రదేశం ఎలాంటిదో, ఎక్కడెక్కడ ఎలాంటి లావాలు తెర్లుతూ వుంటాయో స్పష్టంగా తెలుసును!

ఫ్రెంచ్ సారాయం వాసనతో పాటు గులాబీల వాసనలు కూడా వస్తున్నాయి. దూరంగా ఎక్కడో బుల్ బుల్ అరిచింది. బుల్ బుల్ అరుపు వెన్నెట్లో కలిసి వెన్నెలే అరచినట్లనిపించింది. "మాలిమెడనవున్న బంగారుగొలుసు బాగున్నది.! అవును మరి ఇటాలియన్ రక్తంకదూ? ఆర కంఠంపైద బంగారం మెరుస్తూ ఉంటుంది! తన దేశంలో ఇంగ్లీష్ స్త్రీలకు ఇలాంటి మెడలు గాని, వక్షస్థలాలుగాని వుండవు. ఇంగ్లీషు స్త్రీలు బొచ్చుగొరిగిన గొర్రెపోతులా సాఫీగావుంటారు; ఈ వంపులు వాళ్ళదగ్గిర అలభ్యం. థామస్‌కు తనభార్య జ్ఞాపకానికి వచ్చింది. బహు అందవికారి! లంకాశాయర్‌లో ఒక కసాయివాడి కూతురు. దాన్ని నూర్తేనేచాలు. పరమ దరిద్రపుగొట్టు ముఖాలన్నీ జ్ఞాపకానికి వస్తాయి; అంతదరిద్రులు! కాని ఈ మాలీ!... మాలీ!...మాలీ!...మాలీ! ఈ నల్లవాడితో, సంగ్రామ సింగ్‌తో ఎలా నవ్వుతూ మాట్లాడుతున్నది! అసలు నేను డిక్‌తో మొదలే జాగ్రత్తగా వుండమని చెప్పవలసినది. అయినా నేను చెప్పేపనేమిటి? డిక్‌కు తెలియదా? ఒక నల్లవాడితో తనకూతురు మాట్లాడుతూవుంటే చూస్తూవూరు

కోవడమే? ఈ డిక్ అసలు ఇక్కడికి ఏంపనిమీద వచ్చాడు. నాకు చెప్పినదే కాకుండా మరొక సందేశంకూడా ఏమైనా తను తీసుకొని వచ్చాడేమో! సి. ఐ. డి. మిషన్ ఏమైనా ఇతన్ని ఇక్కడికి పంపించిందేమో! అదే నిజమైతే, ఇతన్ని సి. ఐ. డి. మిషనే ఇక్కడికి పంపివుంటే – అది చాలా అసభ్యమైనపని, నేను రాజీనామా ఇస్తాను. ఈడిక్ కు అసలు సంగతి సందర్భాలు బొత్తిగా తెలియవు. భోటాన్ లో ఇత నెలా సర్వం నాశనం చేశాడు? సమయానికి నేనే అక్కడికి చేరకపోయి నట్టయితే ఏమైనా వుందా? ఓ – హెలో – గాడ్!" థామస్ తన కండ్లను తెరిచాడు. ఎదురుగా నౌకరు నిలబడివున్నాడు.

"ఏమిటి గులామ్?" థామస్ కొండభాషలో అడిగాడు. సర్ థామస్ పాతిక ముప్పై భాషలను చక్కగా మాట్లాడగలడు. అర్థం చేసుకోగలడు. అవసరమైతే 'మౌనా'న్నే భాషగా ఉపయోగించగలడు. దాన్ని అర్థం చేసుకోవడం బహుకష్టం! చాలా కొద్దిమంది అర్థంచేసుకోగలుగుతారు!

నౌకరు అన్నాడు. "జహామత్ ఆలీఖాన్ వచ్చాడు... అతనివెంట ఒక యువకుడుకూడా వున్నాడు. యువకుడి పేరు అబ్దుల్!"

"లోపలకు పంపించు!"

నౌకరు వెనక్కుతిరిగి వెళ్ళిపోయాడు. తోటలోని కాలిబాటన వెళ్తూ కనుపిస్తున్నాడు. తోట చాలా విశాలమైనది. సారాయంు వాసన వెనకటిలాగానే వస్తూవున్నది. బుల్ బుల్ ఇంకా అరుస్తున్నది. థామస్ తిరిగి కండ్లు మూసు

కొన్నాడు. వశాలీ బంగారు నావలా అతని మనో ఫలకం మీద ఫ్లాగుతూ కనుపించింది. అసలు విషయం ఏమిటో బోధపడదు; తను వృద్ధుడౌతున్న కొలదీ తనకంటే వయస్కు లైన స్త్రీలను గురించి ప్రమాదకరంగా ఆలోచిస్తున్నాడు థామస్! థామస్ అనుకొన్నాడు. "ఇది చాలా ప్రమాద కరమైన విషయం పద్ధతిని పట్టిచూస్తే పెన్షన్ పుచ్చుకొన్న తరువాత తను ఏ పద్దెనిమిదేండ్ల యువతినో పెండ్లాడక తప్పే ట్టుగా లేదు. సరే, ఎంతోమంది పెన్షన్ పొందిన వుద్యో గులు అలా చేశారు. చేస్తున్నారు! అలాంటప్పుడు తనుచేస్తే మాత్రం వచ్చిన తప్పేమిటి? అసలు నిజం మాట్లాడితే డెభై ఏండ్లు వసగాని పురుడు స్త్రీ స్వభావాన్ని అర్థంచేసుకోగల స్థితికి రాడు. సరే, పెన్షన్ పుచ్చుకుని 18 ఏండ్ల యువతిని పెండ్లి ఆడితే, ఈ నౌకరు భార్య ఏమయ్యేట్టు? ఈ పిల్లలూ? ఓ – మై – గాడ్! అద్భుతమైన పొరపాటంటే ఇది! సరే, ఆలోచిద్దాము...ఇంతవరకూ..!"

తిరిగి ఎవరివో పదధ్వనులు వినిపించినాయి. సర్ థామస్ కండ్లుతెరచి చూశాడు. నౌకరు, జహామత్‌నూ, అబ్దుల్‌నూ తీసుకొని వస్తున్నాడు.

"నౌకరు ఎంతమంచివాడు. ఎంతవిశ్వాసం తనమీద. తనమీద విశ్వాసాన్ని చూపించడంలో పెళ్ళాన్నికూడా త్యజించుకొన్నాడు. అసలు ఈ నల్లవాళ్ళల్లో కొంతమంది అంతే...దొరలకోసరం అవుసరం అయితే గౌరవమర్యాదలనే కాకుండా ప్రాణాలనుకూడా ఇచ్చేస్తారు. ఇలాంటి నల్లవాళ్ళు కుక్కల్లా యజమానులమీద విశ్వాసాన్ని ప్రదర్శించేవాళ్ళు

వుండబట్టే ఇన్నాళ్ళు ఇంగ్లీషువాడి సామ్రాజ్యం నిలిచిం"ి. లేకపోతే ఏనాడో మూటాముల్లె సర్దుకోవలసి వచ్చేది."

సక్ థామస్ తనలో తనే నవ్వుకొన్నాడు.

"కాని జహామత్ ఆలీఖాన్ మాత్రం అలాంటివాడు కాదు. పైకి నవ్వుతూ వుంటాడు. లోపల విషం కక్కుతూ వుంటాడు. దుర్మార్గుడు, ప్రమాదకరమైన వ్యక్తి కూడాను! ఎంతఅయినా అవుసరానికి పనికివచ్చే వ్యక్తి నిప్పుంటించడానికి బాగా పనికివస్తాడు. మూర్ఖుడు, గర్విష్టి, మోసకారి, విశ్వాస ఘాతకుడు, దేశభక్తుడు, దేశాన్ని చీల్చుకుతినగల స్వార్థ పరుడు... జహామత్ ఆలీఖాన్ నిన్ను నేను బాగా అర్థంచేసుకున్నాను. మనఇద్దరి స్నేహము చాలా రోజులపరకూ నిలుస్తుంది...!"

"మరి ఈ యువకుడు ఎవరు? హు ...అబ్దుల్" అబ్దుల్ ఆతనికి ఏవిధంగానూ కొరుకుడు పడడంలేదు. సుహా బాధ పెట్టేస్తున్నాడు. తను చిన్న విషయాలన్నీ ఒకమాటు థామస్ తండ్రిముందు తిరిగిచని—ఉత్తర దేశంలో రైతులు పన్నులు కట్టమని ఎదురు తిరగడం! రజ్జీ...ఫజల్...రాజాశర్మ ఆలీ... అందరూ అతని తండ్రిముందు తిరిగారు. కాని ఇంతమంది లోనూ అబ్దుల్ ముఖంమాత్రం అతనికి చిత్రంగానూ, సమస్యగానూ కనుపించసాగింది. సామాన్యమైన సరళమైన ముఖం, నిజాయితీ ముఖంలో తొణికిస లాడుతున్నది; "అబ్బే ఇతను లాభంలేదు. ఇలాంటివాళ్ళు అసలు ఎందుకు పుడతారు? రాజకీయాల్లో వీళ్ళు ఎందుకు ఉపయోగించగలరు? కాని, ఇతనింకా యువకుడు. ఇకముందు పక్షానికిరావచ్చు. ప్రస్తుతం ఇతనిలోని

నిజాయితీని మనం వాడుకోనవచ్చును. కాకపోయినా ఇతన్ని పైకి ఇలాగే. సరళమైన వాడుగా, నిజాయితీపరుడుగా వుంచి లోపలి వ్యక్తిత్వాన్ని మార్చేస్తే? ఔను, అదిబాగుంటుంది. ముఖంచూస్తే సౌమ్యంగా, దేశభక్తి ప్రాపితంగా కనుపిస్తూ వుంటుంది. లోపల అంతా విశ్వాసఘాతుకం. ఔను ఇది బాగుంటుంది. కాని ఇలా లోపల స్వయంపాకంగా వుండే వాళ్ళు చాలాఅరుదుగా కనుపిస్తారు. ఇలాంటివాళ్ళను లొంగ దీసుకోనాలన్నా పెద్దఎత్తున లంచంపెట్టాలి. కనీసం మంత్రి పదవి నైనా ఇస్తేగాని దొరికిరారు."

అబ్దుల్ ముఖాన్నిచూస్తూనే సర్ థామస్ ఇలా అను కొన్నాడు. "ఇతడికి ఇప్పుడప్పుడే ఏ గుట్టును తెలియచేయ డానికి వీలులేదు. ఏబాధ్యతాయుతమైన పనినీ వప్పచెప్పడానికి వీలులేదు."

అబ్దుల్‌కూ, జహామత్ ఆలీఖాన్‌కూ' నౌకరుకూ దొరగారు చాలాసేపటివరకూ నిద్రమగతలో పడుకునివున్నట్టు కనుపించారు. వాళ్ళు చాలాసేపటిగా సలాంచేసి అలాగే దొరగారిముందు నిలబడి వున్నారు. సర్ థామస్ ఈజీచైర్‌లో పడుకుని చాలాసేపటివరకూ వాళ్ళనుచూస్తూ ఉన్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో! వాళ్ళ సలాంకుకూడా ప్రతి సమా ధాన్నా ఈయలేదు. చివరకు అబ్దుల్ దొరగారు నిద్రపోతు న్నాడని స్థిరంగా నిర్ణయించుకొన్నాడు. ఇంతలోకే గంభీర మైన స్వరంలో "కూర్చో" అన్నాడు థామస్. అబ్దుల్ త్రుళ్ళిపడ్డాడు.

అబ్దుల్ జహామత్ ఖాన్ ఇద్దరూ దొరగారి కాళ్ళదగ్గర క్రింద పచ్చగడ్డిమీద కూర్చున్నారు. నౌకరు వెళ్ళిపోయాడు.

# 6

జహామత్ తనరెండు అరిచేతులనూ గట్టిగా ఒక మాటు రుద్దుకొన్నాడు. తరువాత అమిత ఆనందంతో తన చేతులమీద 'వుఫ్'ని వూదుకొని ఇలా అన్నాడు. "సాబ్! "దాగ్" తహశీల్లోకూడా ముస్లిములందరూ మహారాజుగార్కి వ్యతిరేకంగా పన్నులు చెల్లించరాదని తీర్మానించారు. నిర్ణయించారు!!"

దొరగారు ఏమీ మాట్లాడలేదు.

జహామత్ చెప్పుకుపోతున్నాడు. "కనేతర్" గ్రామం కూడా మనలో కలిసినట్టే. ఆ వూరి నంబర్‌దార్ మనలో కలిసిపోయాడు. పోతే, మాందర్‌లోకూడా పని అప్పుడే ప్రారంభింపబడి తీవ్రంగా సాగుతున్నది."

దొరవారు అబ్దుల్ వైపు చూస్తున్నారు.

రెండు క్షణాలు ఆగి జహామత్ యిలా అన్నాడు "సాబ్! ఇతన్నికూడా మనలో చేర్చుకోండి. ఇతనిపేరు అబ్దుల్!"

అబ్దుల్‌కూడా దొరగారివైపు చూస్తున్నాడు.

"నీ తండ్రి రైతులపోరాటంలో చనిపోయాడా?" దొరగారు అడిగారు.

"లేదండీ! మా నాన్న ఏమీ పోరాడలేదు."

జహామత్ అందుకున్నాడు "రజ్జీ యితని చెల్లెలేనండి!"

"రజ్జీ ఎక్కడ వున్నది ?" దొరగారు అడిగాడు.

"ఏమో నాకు తెలియదు" అబ్దుల్ అన్నాడు.

జహామత్ అన్నాడు "సాబ్ ! ఇతడిని వుద్యోగంనుంచి తీసివేస్తారుట ! పద్లోక్లాసు పరీక్షలో ఖూర్చోనివ్వరట. ఎల్లుండి హైస్కూలు పిల్లలందరూ పరీక్షలు రాయడానికి రావల్పిండి వెళుతున్నారు. పాపం ! ఇతనుకూడా వెళ్ళేట్టు చెయ్యండి- చాలా బీదవాడు-సాయం చెయ్యండి !"

దొరగారు అన్నారు "అబ్దుల్, భయపడకు ! నీవు ఎల్లుండి అందరితోపాటూ పరీక్ష రాయడానికి వెళ్ళగలవు !"

అబ్దుల్ ముఖం కమలంలా వికసించింది. అతను కృతజ్ఞతాపూర్వకంగా సర్ థామస్ వైపు చూశాడు.

"ఇక పోతే నీ నౌకరీ విషయం ! బహుశా నిన్ను వెంటనే ఉద్యోగంలో పెట్టుకోవడం సంభవం కాకపోవచ్చు — కాని, నీ ఉద్యోగం మాత్రం ఎక్కడికీపోదు. మహా అయితే కొద్దిరోజులపాటు సస్పెండ్ చెయ్యడం జరుగుతుంది. మిగిలిన విషయాలు తరువాత చూసుకుందాము !" థామస్ తన చేతి వేళ్ళను చిత్రంగా కదుపుతూ అన్నాడు.

తరువాత క్షణం ఆగి స్నేహపూర్వకంగా అబ్దుల్ వైపు చెయ్యి జాపాడు. థామస్, అబ్దుల్ తన రెండు చేతులతోటీ థామస్ చేతిని పుచ్చుకున్నాడు. అతని హృదయం తీవ్రంగా స్పందించింది. అబ్దుల్ ఇంతవరకూ ఏ ఇంగ్లీషువాడినీ కల్సుకుని ఎరుగడు. ఈ ప్రథమ కలయికలోనే ఇంగ్లీషువాడి దయార్ద్రతకు అతను ప్రతిభావితుడైనాడు. అతని కండ్లు అశ్రుపూరితాలయినాయి.

"రావల్పిండినుండి తిరిగి వచ్చేప్పుడు-నన్ను మళ్ళీ ఒక మాటు తప్పకుండా కలుసుకో !" అన్నాడు థామస్.

జహామత్ అన్నాడు "పాపం! బీదముస్లిం యువకుడండీ యా అల్లా ! ముస్లిములకు మంచిరోజులు-ఎప్పుడో ?"

థామస్ అన్నాడు "భయపడకు. మీకుకూడా మంచి రోజులు వస్తున్నాయి. ప్రభుత్వం మీగురించికూడా జాగ్రతగా ఆలోచిస్తున్నది."

జహామత్ అన్నాడు "నేను ఈ విషయాన్ని పంజాబులోని కొన్ని ముస్లిం మత-వార్తాపత్రికల్లో చదివాను !" అన్నాడు. జహామత్ కు కొద్దిగా ఉర్దూ చదవటం వ్రాయటం వచ్చును. అందువల్ల మాట్లాడేటప్పుడు సమాసయుక్తమైన కఠిన ఉర్దూపదాలను తన సంభాషణల్లోకి దొర్లిస్తూవుంటాడు. అతనిలోని బలహీనతను చూసినప్పుడు థామస్ ముఖంలో ఒకరకమైన నవ్వు స్ఫురిస్తూ కనుపించేది. పైమాటల్నికూడా జహామత్ కఠిన సమాసమాసయుక్తమైన ఉర్దూభాషలో మాట్లాడాడు. థామస్ నవ్వుతూ "సరె, సరె, అబ్దుల్-యిక నీవు వెళ్ళు-జహామత్ ! నీవుకూడా !" అన్నాడు.

## 7

అబ్దుల్ వెళ్ళిపోయాడు. జహామత్ ఇంకా అక్కడే వున్నాడు. థామస్ అతడిని కోప్పడుతూ ఇలా అన్నాడు. "నీవు నిర్లక్ష్యంగా వుంటున్నావు ! అబ్దుల్ ఎంత మంచివాడే కానీ, నీవు ఇలాంటి మాటల్ని అతని ఎదుదుగా మాట్లాడకూడదు. నేను మీ ముస్లిములకు సాయపడుతున్నానంటే

దానికి అర్థం, ఇతర మతస్థులను విరోధం చేసుకొంటూనని గాని లేక ఇతర మతస్థుల మనసుల్లో నాగురించి అనుమానాన్ని పెంచుకొంటూనని, కాదు. ఇతర మతస్థుల మనస్సుల్లో అనుమానం కలగడం మీకూ ఏమాత్రం మంచిది కాదు. అందువల్ల మీ మొత్తం జాతిజాతే నష్టపడవలసివస్తుంది. నాకేమిటి? నాకు ఇందులో వచ్చే లాభ నష్టాలు ఏమీ లేవు. అన్నీ మీవే! అందువలననే ఇంత ఇదిగా చెబుతున్నాను!"

జహమత్ ఒక్క క్షణకాలంపాటు మౌనంగా తల వంచుకు వుండిపోయాడు. తరువాత దొరగారి కుర్చీకి బాగా దగ్గరకు జరిగి "సాబ్! సర్కారువారు, మహారాజుగారి అధికారం నుండి "గిలిగిట్" రాజ్యాన్ని లాక్కుంటారటగా! అట్లాగని విన్నాను. నిజమేనంటారా?"

థామస్ అన్నాడు "సైన్యం దృష్ట్యా చూచేట్టయితే "గిలిగిట్" ఇంతకుక్రితమే ఇంగ్లీషు సర్కారు క్రిందకు వచ్చేసింది. అక్కడున్న సైనిక వ్యవస్థలన్నీ ఇంగ్లీషు సర్కారువే! పోతే, డోగరా ప్రభుత్వం తరఫున ఒకమంత్రి సివిల్ వ్యవహారాలను చూస్తూవుంటాడు అక్కడ! నాకు ఏమీ తెలియదు. కాని, ఇంగ్లీషు ప్రభుత్వం, ఇలా సైనిక వ్యవహారాలు ఒకళ్ళూ సివిలు వ్యవహారాలు ఒకళ్ళూ చూడడం బాగుండదు. అన్నీ తనే చూడడం మంచిది అని అనుకొంటే అనుకొని వుండవచ్చును! నిజం ఆలోచించినా అంతే! ఒక్క ప్రభుత్వంలో ఇద్దరి పరిపాలనలు ఏమిటి? ఒక్కళ్ళే చేస్తే రాజ్యవ్యవస్థా పరిపాలనా అన్నీ చక్కగావుంటాయి."

"అవును తమరు సెలవిచ్చినదానిలో చెడ్డేముంది? ఒకళ్ళు సైనిక విభాగాలనూ, మరొకరు సివిలు భాగాలనూ - చూస్తూవుంటే పేచీలు రావచ్చును." జహామత్ పైమాటలను తన మామూలు ప్రకారం గంభీరమైన కఠినభాషలో మాట్లాడాడు.

థామస్ చిన్నగా నవ్వాడు

జహామత్ చేతులు నలుపుకుంటూ నవ్వుతూ, "సాబ్ నేను మీకూ, మీరు నాకూ బాగా తెలుసును. తేడాల్లా, ముస్లిములందరూ హిందూరాజ్యాన్ని నిరసిస్తున్నారనీ, మీరు 'ఊ' అంటే చాలు. ప్రభుత్వాన్ని తల్లక్రిందులు చేసి వేస్తారనీ నాకు తెలుసు. మీరు దాన్ని ఒప్పుకోవడం లేదు. అర్థం చేసుకోవడంలేదు. అంతే తేడా" అన్నాడు.

సర్ థామస్ మెల్లగా కండ్లుమూసుకొని "జహామత్ అప్పుడేకాదు. ఇంకా సమయం రాలేదు" అన్నాడు.

# 8

ఎక్కడో బుల్ బుల్ అరుస్తున్నది. వాతావరణం అంత ట్లోనూ, గిలిగిట్ అంతలీనం అయి, కాంతిలో వెచ్చదనంలా కనుపిస్తున్నది. మాలీమెడలో బంగారుగొలుసు మెరుస్తున్నది. నౌకరు కొడుకులకండ్లు గాఢనీలాలై ఇంగ్లీషువారి కండ్లను జ్ఞాపకం చేస్తున్నాయి. ఇలాగే అనేక వస్తువులు - ఒకదాంట్లో నుంచి ఉద్భవించడం, మరొకదాంట్లో లీనం అవడం జరుగుతున్నది. చిరునవ్వులూ - సారంగాలూ, చిరునవ్వులూ డైనమెట్లూ! చెప్పులూ - ఫోటోలూ ! కాదు ఫోటోలు చెప్పులు,

చెప్పాలే ఫోటోలు! జాగీర్‌దార్లూ, పెట్టుబడిదార్లూ: వీటన్నింటికి మధ్యా అబ్దుల్ ముఖం థామస్‌ను బాధపెట్టసాగింది. సమస్యలు ఎప్పుడూ వాటంతట అవి పరిష్కరింపబడవు. పైగా పరిష్కరించినకొద్దీ చిక్కుపడుతూ వుంటాయి కూడాను:

థామస్‌కు అబ్దుల్ ముఖంలో తన యవ్వనపు జీవితం పొడ చూపసాగింది. అబ్దుల్ వయస్సులో తనూ ఇంతే! ఇంతే అమాయకంగా, ఇంతే సరళంగా నిష్కపటంగా వుండేవాడు. కాని తను ఈ గడచిన జీవితంలో ఆ నిష్కపటాన్నీ, సరళత్వాన్నీ గోల్పోయాడు. అవే వుండివుండి జ్ఞాపకానికి వస్తున్నాయి. పియానోలోని మందరస్వరంలా బాధపెడుతున్నాయి. ఈ పియానోను తెరవాలి, పరిశీలించాలి! కాని తాళంచెవులు ఏవి? ఎక్కడవున్నాయి? థామస్ తన జీవితాన్నంతా ఈ ఇంగ్లీషు సామ్రాజ్యమనే బృహత్తర పియానోమీద వేళ్ళు త్రిప్పుతూ గడిపేశాడు. ఇప్పుడు వృద్ధుడయ్యాడు. చేతివేళ్ళు పగిలి రక్తం స్రవిస్తున్నది కాని, ఇంతవరకూ ప్రధానమైన తాళంచెవ్వులు ఎక్కడవున్నవో తెలియలేదు. జ్ఞానసింగ్, జహామత్, అబ్దుల్! గిలిగిట్, సైన్యం, గైర్ సైన్యం, వకాల్ రాజకుమారుడు సంగ్రామసింగ్! వీళ్ళందరూ ఈ సమస్యలన్నీ-వివిధరకాలైన వ్యతిరేకస్వరాలు! కాని థామస్ తన నేర్పుతో వీళ్ళందరినీ ఎటూ ఏదీ చెడకుండా సవ్యంగా పట్టుకువచ్చాడు. కాని నేటివరకూ అతనికి ఇన్ని స్వరాలనూ ఏకస్వరంలో మేళవింపచేసే మూలమైన లయ...తాళం...ఏదో అతనికి తెలియలేదు. అంతేకాదు; హిమాలయ పర్వతప్రాంతాల్లో ఆ మూల నుంచి ఈమూలవరకూ వ్యాపించిన పూలబాటలూ, మంచు

శిఖరాలు, పియానోలో హెచ్చుతగ్గుస్వరాల రూపాల్లో, థామస్ చెవులలో ఒక అమరమైన, శాశ్వతమైన అవి నాశనస్థైన దివ్య సంగీతాన్ని వినిపిస్తున్నాయి. క్లాక్ టవర్ గంటల్లా! టన్... టన్...టన్... ఈ టన్...టన్...ల అర్థం స్పష్టం! నీవు మమ్మలను ఎన్నటికీ జయించలేవు. మమ్మల్ని జయించాలంటే మొదలు పియానో తాళాంచెవిని వెతుక్కో! టన్...టన్... తాళాంచెవిని కనుక్కున్నవాడే, చేపట్టినవాడే మమ్మలను జయించగలడు! తాళాంచెవి ఎక్కడవున్నది? తాళాంచెవి ఎక్కడవున్నది? హిమాలయ ప్రాంతపు మొత్తంలోని వివిధ స్వరాలూ, ఎగురుతూ, గంతులు వేస్తూ థామస్‌ను ప్రశ్నించ సాగాయి. థామస్ ఉగ్రుడయ్యాడు. కోపంతో మండిపోతూ "నో...నో... అలాజరగదు!...తాళాంచెవి తప్పక దొరుకు తుంది...తాళాంచెవ్వి తప్పక దొరుకుతుంది! "అనుకొన్నాడు.

జహామత్ వులిక్కిపడి అడిగాడు "ఏ తాళాంచెవ్వండీ?"

యాభై భాషల్లో పరిచయంవుండి, హిమాలయ ప్రాంతపు దాదాపు ముప్పై సంస్థానాలకు రెసిడెంట్ అయి, అనుభవంకల ఇంగ్లిషువాడు, సర్ థామస్ అర్ధనిమీలితంగా కండ్లు తెరచి, మృదువుగా వివవంగా, "ఏమీలేదు జహామత్... ఏమీలేదు జహామత్... నేను స్వప్నము చూస్తున్నాను!" అన్నాడు.

---

# తొమ్మిదవ అధ్యాయము

సాయంత్రం అయింది. బానో రంపపుకోత ప్రదేశం నుండి క్రిందకు నదిఒడ్డుకు చూస్తున్నది. నదివడ్డున పూరివైపు నుంచి నల్లనిపొగ ఆకాశంలోకి ప్రాకుతున్నది. పక్షులు కల రవంచేస్తూ పగటి శ్రమనంతా మర్చిపోవడానికి అడివివైపుకు గూళ్ళను వెతుక్కుంటూపోతున్నాయి! గాఢనీలపు నీలమణి పుష్పాలు అప్పటివరకు దినకరుడి ప్రఖర కిరణాలస్పర్శకు వడలి పోయినట్లుగా ముఖాలను ఆకులసందున దాచేసుకొంటు న్నాయి. ఈ దృశ్యాలను చూస్తూవుంటే బానోకు ఆవలింతలు వస్తున్నాయి. ఒకమాటు దీర్ఘంగా ఆవలించింది. ఈ ఆవలింత బానో శరీరాన్నంతటినీ కొంచంగా గగుర్పొడిచేట్లు చేసింది. ఆమెలోని వ్యాకులతనూ, సన్నని బాధనూ అధికంచేసింది. ఏమిటీ మార్పు? ఎందుకీ వ్యాకులత? బానోకు అర్థం కావడం లేదు. క్రింద నదీతీరంలో వెండి అలలను, సూర్యుడి తుదికిర ణాలు తమ బంగారు హస్తాలతో ఆలింగనం చేసుకొంటు న్నాయి. ఈ ఆలింగనం బానో హృదయస్పందనాన్ని అధికం చేస్తున్నది. శరీరాన్ని పులకింప చేస్తున్నది.

బానో జీవితంలోకి ప్రేమ ఒక్కసారిగా అకస్మాత్తుగా ప్రవేశించింది. వేటగాడిలా పొంచునివుండి క్రమక్రమంగా ప్రవేశించలేదు. ఈ ఆకస్మిక ప్రవేశంతో బానో వులిక్కిపడ్డది.

కిం కర్తవ్య విమూఢ అయింది. ఏమి చెయ్యవచ్చునో, ఏమీ చెయ్యకూడదో ఆలోచించలేని స్థితిలో పడ్డది. ఎటుపోవాలి? తన బాధను వ్యధను—ఎవరితో చెప్పుకోవాలి? ఏమీ తోచడంలేదు. రాత్రిళ్ళకు రాత్రిళ్ళు నిద్ర మేల్కొంటుంది. కన్నీళ్ళతో చెంపలు తడిసిపోతున్నాయి. అయినా ఏమి చెయ్యాలో బోధపడదు. తనకేనా ఈ బాధ! అందరికీ ఇంతేనా? ఈ తియ్యని బాధ! బాధతో మిశ్రితమైన ఆనందం! కాదు. ఇది బానోకి ఒక్కదానికే కాదు. ఈ అనుభవం ప్రేమించిన ప్రతి వారికీను. తియ్యని బాధ: బాధామిశ్రిత ఆనందం! ఇది అందరికీనూ! ఐతే అబ్దుల్‌కుకూడా యింతేనా? అతని హృదయం లోనూ ఎవడో కూర్చున్నట్టు వుండి శరీరాంగాలన్నింటినీ తడిగుడ్డను పిండినట్టు పిండుతూ వుంటాడా? చాలా విచిత్రమైన అనుభవం. బానోకు ఈ నూతనానుభవం తన ఒక్కదాని వరకే ననిపించింది. అబ్దుల్ తనను ఎంత గాఢంగా ప్రేమించినా అతనికి అంత తీవ్రానుభూతి కలగడం సంభవంకాదు అనుకున్నది. నిజంకూడా అంతేను? ప్రేమానుభూతులు బానోలో చూపినంత తీవ్రతను అబ్దుల్లో చూపలేవు. ఈ మృదుత్వం, ఈ వుష్ణతా, తియ్యనిబాధా అబ్దుల్‌కు లభ్యంకావు. కారణం; అబ్దుల్ పురుషుడు. బానో స్త్రీ. స్త్రీ బీజానికి క్షేత్రం. బీజానికి ఆశ్రయాన్నిచ్చి, మృదుత్వాన్నీ, ఉష్ణతనూ ఇచ్చి జీవాన్ని పోస్తుంది, ప్రేమను ఉజ్జీవింప చేస్తుంది. బానో ప్రేమకు సృష్టికర్త. అబ్దుల్ భోక్త. అందువల్లే బానో అనుభవాలు అబ్దుల్‌కు అలభ్యం. చాతకం మేఘాలనూ, మయూరం చిరుగాలినీ, మీనం సముద్ర జలాలనూ వెతుక్కున్నట్టు నిద్రలో

పసిపాపడు మాతృస్తనాలను తడిమినట్టు – ప్రేమ స్త్రీల హృదయాలను వెతుక్కుంటుంది తడువుకొంటుంది! ప్రేమ బానో హృదయంలో తన ప్రభావాన్ని పూర్తిగా ప్రవేశించి అంతటి తీవ్రమైన ప్రేమ భావాలను అనుభూతికి తెచ్చుకోవడం, ఒక్క స్త్రీకే సాధ్యం. ఇంతగాఢమైన అనుభవం అబ్దుల్‌కుకూడా కలుగుతుందా? ఐతే ఇన్నాళ్ళివరకూ ఎందుకు రాడు? తన హృదయంలో మండే ఈ అగ్నిని రగిల్చివెళ్ళిన వాడు తిరిగి ఎందుకురాడు? భోక్తకు కృషికర్త పడేబాధలు ఎందుకు అర్థం కావు? బీజానికి భూమి ఆరాటం ఎందుకు తెలియదు? ఐతే ఇవే ప్రశ్నలు బానో హృదయంలో చాలా అస్పష్టంగా మెలికలు తిరుగుతున్నాయి! పసిపాపడు ఏడుస్తూ నీళ్ళునిండిన కండ్లతో అందమైనదృశ్యాన్ని చూస్తున్నట్టు వుంది ఆమెకు!

బానోస్థితి చిత్రంగా తయారైంది. క్షణానికి ఒకరకంగా మారిపోతున్నది. క్షణం ఉదాసీనత. క్షణం వుత్సాహం! క్షణం ఆనందం! క్షణం దుఃఖం! ఎప్పుడూ జాగ్రత్త, జాగరూకత ... గాఢమైన భావుకత ... అగ్నిలాంటి మెరుపూ మంటా ... నదీప్రవాహంమీద తూలే చుక్కాని సరిలేని పడవ! ఆకాశంలా గాఢం...విశాలం...ప్రశ్నార్థకం... భూదేవిలా క్షణక్షణకంపితం...పరిభ్రమితం...వీటన్నిటి మిశ్రమరూపం బానో అయింది!

కాదర్‌బట్ట తనకూతుర్ని జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. ఆమెలోవచ్చే ప్రతి చిన్నమార్పునూ గమనిస్తున్నాడు. గమనించి బాధపడుతున్నాడు. అతనికి కూతురులోని మార్పులు క్రమంగా అర్థం కాసాగుతున్నాయి. అర్థం అయినకొలదీ

కూతురుమీద విపరీతం అయిన కోపం వస్తున్నది. కాని ఏం చేయగలడు? భూదేవిముందు అతను పూర్తిగా నిస్సహాయుడు. అందువల్లే వివశంగా తనకోపాన్ని తనమీదనే చూపుకొంటున్నాడు. భానోలోని మార్పులను చూచి ఏం ప్రమాదం సంభవించనున్నదోనని భయభీతుడౌతున్నాడు!

# 2

భానో రాత్రిళ్ళకు రాత్రిళ్ళు నిద్రలేకుండా కండ్లలో జ్యోతులు వేసుకు గడిపేస్తున్నది. ఆ రాత్రి నిద్రపోవడానికి ఎంతో ప్రయత్నించింది. కాని నిద్రపట్టడంలేదు. క్షణానికి ఒకసారి ఎవరో వీపునిమిరి నిద్రపుచ్చుతున్నట్టు కునుకుపట్టేది. మరుక్షణంలోనే వులిక్కిపడేది దిగ్గున కండ్లుతెరచి చూసేది. ఎవరో అపరచిత పురుషుడు తన వక్షస్థలంమీద చెయ్యివేసినట్టుగా వుండేది భానోకి! ఓ...భగవంతుడా! గుండెలు ఎందుకింత వేగంగా కొట్టుకొంటున్నాయి?...అబ్దుల్ ఇదంతా నీ కోసరమే! అబ్దుల్ నువ్వు ఎక్కడ వున్నావు...?... చూడు! నీవు వస్తే నిన్ను నేను ఏమీ అనను...నేను నీ పాదాలముందు పరిచేసుకొంటాను...నదిలా! సముద్రంలా! శాంతంగా, హుందాగా, గంభీరంగా. మెల్లగా ప్రవహించే నదిలా! తీవ్రమైన వేగాలతో పాదాలవరకూ వచ్చి...బంగారు పాదాలను చూసి, తన వేగాన్ని మరిచి; మెల్లగా, మృదువుగా లాలిస్తూన స్పర్శించే సముద్రపు చిరు కెరటంలా! నీ కాళ్ళ ముందుపరుచుకొంటాను! నేను నీ కోసరం మలయపవనాన్ని

అవుతాను. చల్లని, తియ్యని, సువాసనలతో నిండితూగే... మలయపవనం! సాయంత్రంపూట చిరుగాలిలో, దేవదారు వృక్షం క్రింద మన చిన్నగుడిశ వెండికొండలా మెరిసే సమయాల్లో. నేను నీకు స్వాగతం ఇవ్వడానికి నల్లని నా తల వెండ్రుకల్ని విప్పుకొని, సిద్ధంగావుంటాను. నీవడిని కస్తూరి మృగంలా కమ్మనికస్తూరి వాసనలతో నింపేస్తాను! అలాంటి దివ్యసమయాల్లో మొత్తం వాతావరణమే బంగారుపూత పూసినట్లు మెరుస్తూవుంటుంది. ఎక్కడచూసినా వెండికొండ ధగధగలే! ఓ...హో... ఆ సాయంత్రం ఎంత దివ్యం! తేజోవంతం!! అరె...ఎవరా పాడేది? ఎవరు ఇలా బాధా పూర్ణమైన గానాన్ని ఆలాపిస్తున్నారు?

గడ్డీ ఆయీ హూహీవాలీ
ఓఏ టికటి నదేయీ బాబూ
సాడీరాత్ జుదాయీవాలీ
(నా ప్రియుడిని తీసుకుపో
వడానికి రైలుబండి వచ్చింది
టిక్కట్ బాబూ! అతనికి
టిక్కట్ ఇవ్వకు; ఇది మా
కు వియోగపు రాత్రి!)

పాట విన్న తరువాత బానోకు దుఃఖం ఆపుకొన్నా ఆగలేదు. పొర్లి పొర్లి ఏడ్చింది. చివరకు ఎక్కిళ్ళు రాసాగినాయి. కాదర్ బట్టకు మెళుకువ వచ్చింది. అతను వాత్సల్యంతో తనకూతురు తలను నిమురుతూ "ఏమిటమ్మా, ఎందుకూ ఏడుస్తున్నావు?" అనడగాడు.

అలా చాలాసేపటివరకూ కాదర్ బట్టు తనకూతురు తలను నిమురుతూ వున్నాడు. భానోకి క్రమంగా ఎక్కిళ్ళు తగ్గసాగినాయి. కాదర్ బట్టు మళ్ళీ అడిగాడు. "ఏమిటమ్మా విషయం భయపడ్డావా?"

"లేదు నాన్నా!"

"మరి?"

భానో చాలాసేపు మౌనంగావున్నది. "అమ్మ జ్ఞాపకానికి వస్తున్నది!" అన్నది.

కాని ఈ సమాధానం కాదర్ బట్టును సంతృప్తి పరచలేకపోయింది. భానో నిద్రపోయాక కూడా అతను చాలాసేపు మేలుకొనివున్నాడు; కూతురు ముఖంలోకి తదేకంగా చూస్తూ!

నక్షత్రాలు ఆకాశంలో ఎంతసేపు వెలిగినాయో తెలియదు. క్రమంగా తమకాంతిని కోల్పోయి ఎలా తెలా పోసాగినాయి. ఆకాశపురంగు నీలం కలసిన తెలుపుకు తిరిగింది. సూర్యుడి తొలికిరణం నటిస్తూ వచ్చి భానో పెదాలమీద మెరిసింది. నిద్రపోతున్న భానోకు అబ్దుల్ తన పెదాలను ముద్దు పెట్టుకొన్నట్లయింది. చప్పున కండ్లు తెరచింది. కాని అక్కడ ఎవ్వరూ లేరు. నిరాశపడి లేచి నిలబడి, అక్కడినుండి వను గట్టుకు వెళ్ళిపోయింది.

కొండ కొసకు వెళ్ళి క్రిందకుచూసింది. క్రింద వెదురు పొదల్లోనుంచి పొగ మెల్లగా పైకిలేస్తున్నది. నదీజలాలపైన కూడా తెల్లని పొగ అలుముకొని వున్నది. నదిఒడ్డున నీలమణి పుష్పాలు ఏడిచేపిల్లవాడి నవ్వే కండ్లలా, మంచుకు

తడిసి, వికసించివున్నాయి. బానో తన దృష్టిని దూరంగా వున్న కొండల వరుసలమీదకు పోనిచ్చింది. కొండల వరుసలకు వెనకవున్న పంజాబు దేశం పొగ్ర కమ్మి నల్లని పొగ సమూహాంలాకనుపిస్తున్నది. బానోకు తను కన్నకల జ్ఞాపకానికి వచ్చింది...నీలమణి పుష్పం ... పంజాబు ... కావురకమ్మిన పొగ...! బానో గుండెలమీద చేతులు వేసుకొన్నది!

# 3

అబ్దుల్ కంచరిగాడిదను ఆపి వెనక్కుతిరిగి చూశాడు. ‘సాబర్’ పర్వతం మీదకు గాడిదల పొడుగాటి పంక్తి వెనుక నుంచి వస్తున్నది. పంక్తికి ముందు అబ్దుల్ వున్నాడు. ప్రతి ఒక్క గాడిదమీదా ఒకొక్క యువకుడు కూర్చొని వున్నాడు. వీళ్ళందరూ పదవక్లాసు పరీక్ష రాయడానికి రావల్పిండికి వెళుతున్నారు. అబ్దుల్ పూర్తిగా పర్వత శిఖరం మీదకు పోయాడు. శిఖరంమీదకు పోయిచూస్తే అక్కడక్కడా చీల వృక్షాలు కనుపిస్తున్నాయి. కొన్నిచోట్ల మంచు గుట్టలుపడి వున్నది. ఎదురుగా పాలంఘరికి పోయే గులకరాళ్ళ కాలిబాట వున్నది. వెనుకవైపున దట్టమైన ‘తరాటఖిల్’ అడవి...తరువాత అబ్దుల్ తన దేశపు దట్టమైన నీలి పర్వత శిఖరాలు కనుపించాయి. అబ్దుల్ తన చేతిని నుదిటిమీద పెట్టుకొని వెనక్కు తిరిగి తను దాటివచ్చిన మార్గంవైపుకు చూశాడు. బానోను విడిచి ఎంతదూరం వచ్చానో! అనుకొన్నాడు.

# 4

"బానో!"

బానో వెనక్కి తిరిగి చూసింది. తండ్రి పిలుస్తున్నాడు. బానో తన గుండెలమీదనుండి చేతిని దింపేసుకొన్నది. అతి నీరసంగా. నిరాశగా, ఉదాసీనంగా తండ్రివైపుకు నడిచింది.

కాదర్ బట్ట తన చేతిగోళ్ళను తీసివేసుకొంటూ "బానో! నీవు వుండలేకపోతే మీ అమ్మదగ్గఱకు వెళ్ళు కర్మదాద్ నిన్ను వూళ్లో దింపివస్తాడు!" అన్నాడు. తల్లిదగ్గిరకు వెళ్ళడం అనేసరికి ఆమె ముఖంలో సంతోషానికి బదులు విషాద ఛాయలు అలుముకొన్నాయి. బానో కండ్లలో కనుపించిన అయిష్టాన్ని కాదర్ బట్ట కనిపెట్టాడు. రాత్రి తల్లి కోసరం ఏడిచిన బానో, ఇప్పుడు తల్లిదగ్గిరకు పోవడానికి సుముఖంగాలేదు! చిత్రం! కాదర్ బట్ట కండ్లు క్రోధంతో రక్తవర్ణంతో మెరిశాయి! అతని వక్షస్థలం సముద్రమథనంలా పొంగిపడ సాగింది.

"వెళ్ళను నాన్నా! నేను వెళితే నీకు ఇబ్బందిగా? పూరకనే ఏడిచాను!" అన్నది బానో.

కాదర్ బట్ట మరేమీ మాట్లాడలేకపోయాడు. తల వంచుకొని "సరే, నీయిష్టమమ్మా!" అన్నాడు.

వున్నట్లుండి బానో వులిక్కిపడ్డది. లేడిలా పరుగెత్తింది. ఆమె కనురెప్పలనూ, ఎర్రని గులాబీపెదాలనూ చూస్తూ ఇలా అనుకొన్నాడు తండ్రి" అందమైన కూతురు తండ్రికి ఒక

గండ్రగొడ్డలిలాంటిది. భగవంతుడు దయచూపి, అల్లాబాక్ష్ త్వరగా డబ్బును ప్రోగుచేస్తే - పిల్లను అతని చేతిలో పెట్టి నా బాధ్యతను తీర్చేసుకొంటాను! యా ఇలాహీ! నీవే ఇకనాకు రక్షకుడవు!"

కాదర్ బట్ట ఆకాశంవైపు చూస్తూ రంపం దగ్గిరకు పోయాడు. రంపం క్రింద పొట్టులో అసంఖ్యాకంగా మంచుబిందువులు మెరుస్తున్నాయి. కాదర్ బట్ట చేతితో రాచి నీటిని తుడిచి వేశాడు తరువాత తన రెండు చేతులనిండా చల్లని పొట్టును తీసుకొన్నాడు–ఈ చల్లని రంపపుపొట్టు... క్రిందచతికిలబడి ఆ పొట్టుతో కాళ్ళను తుడుచుకోసాగాడు. చల్లని స్పర్శతో అతని కోపమంతా దిగిపోయింది. నవ్వుకొంటూ "...అరె, నేనూ ఎలాంటి అనుమానస్తుడను? అనవసరమైన విషయాలను ఆలోచిస్తున్నాను?" అనుకొన్నాడు,

# 5

యువకులందరూ 'సాబర్' పర్వతశిఖరానికి చేరుకొన్నారు. 'తరాటఖిల్' లోయ. అక్కడ దట్టమైన అడవి. పాలందరీ కాలిబాట. అక్కడ శక్తినీ, కత్తినీ, గుర్రపు స్వారినీ, ప్రేమించేవాళ్ళు వుంటారు. అక్కడ తిరిగే కొండప్రాంతపు కవులు తమ కవిత్వాల్లో అతిమృదువైన భాషను వాడుతారు. వాళ్ళ బాహువులు శక్తివంతంగా వుంటాయి. హృదయాలు నిర్భీతితో నిండివుంటాయి! యువకులందరూ శిఖరంమీద నుంచి పాలంధరీ కాలిబాటవైపుకు దిగారు. కాలిబాటకు రెండువైపులా నల్లని బండలు కనబడుతున్నాయి. అక్కడి భూమి ఎర్రగా

ష్తుంది. జొన్నా, సజ్జా కాక మరేవంటలూ పండవు. అక్కడి భూమిలాగానే అక్కడి ప్రజలుకూడా ఎర్రగా దాసిమ్మ మొగ్గల్లా వుంటారు.

యువకులు పూర్తిగా పాలంథరీ లోయను చేరుకొనే సరికి సూర్యుడు నడినెత్తికి వచ్చాడు. అది ఒక చిన్న కాలి బాట....పాములా ఒంపుతిరిగింది. యువకులంతా ఒంపుతిరుగుతున్న సమయానికి సర్దార్ అల్లాదిత్ సూబేదార్ కొడుకు అహమద్ అలీ ఒక అందమైన గుర్రంమీద కూర్చుని, ఎదురుగా వస్తున్న విద్యార్థులవైపు చూస్తున్నాడు. అహమద్ అలీ నెత్తికి ఖరీదైన టోపీని పెట్టుకొన్నాడు. నడుముకు ఒకపిస్తోలు మందు గుండ్లు వేళ్ళాడుతున్నాయి! అతన్ని చూడగానే విద్యార్థులందరూ గుర్తుపట్టారు. అందరూ "అహమద్ అలీ! అహమద్ అలీ!" అని అరుచుకొంటూ గాడిదలను పరిగెత్తించారు. అందరూ దగ్గరకుచేరుకున్న తరువాత గాడిదలను దిగి వాటిని ప్రక్కనున్న చెట్లకు కట్టివేశారు. అహమద్ అలీ అక్కడవిద్యార్థులందరికీ భోజన సౌకర్యాలను ఏర్పాటుచేశాడు. భోజనాదికాలను ముగించుకొని తిరిగి అక్కడనుండి బయులుదేరారు అందరూ!

అహమద్ అలీ తన తెల్లగుర్రాన్ని అబ్దుల్ గాడిద తోపాటు నడవసాగాడు. గాడిదా గుర్రం రెండూ మెల్లగా నడుస్తున్నదారిన. అబ్దుల్ అహమద్ అలీ మాట్లాడుకొంటున్నారు.

అబ్దుల్ అన్నాడు "నువ్వువిన్నావా? సైన్యాన్ని పంపిస్తున్నారు పన్నుల వసూలుకు!"

అహమద్ అలీ కంఠస్వరం జేసి "విన్నాను! ఈ హిందువ్రు లకు ఎటూ చావుదగ్గరకు వచ్చింది!"

"అబ్దుల్ "నాకు అసలు పరీక్షరాయడానికి కూడా వుత్సాహంలేదు"

అహమద్ అలీ "ఇక్కడ ఏ గాడిదకొడుక్కు పరీక్ష రాయాలనివుంది? ఎవ్వరికీ లేదు! ప్రతివాడికీ ఈ హిందూ రాజుని గొంతుపిసికి చంపాలని వుంది! నేను చెబుతున్నాగా, ఇక వీడిరాజ్యం కొద్దిరోజులే! కొద్దిరోజులు!"

అబ్దుల్ "నీకెలా తెలుసు కొద్దిరోజులని?"

అహమద్ అలీ పూర్తిగా అబ్దుల్ కూడదకు వంగి "మా నాన్న చెప్పాడు!" అన్నాడు.

అబ్దుల్ "నేనొక రహస్యం చెప్పనా? నేను రెసిడెంట్ బహద్దూర్‌ని కల్సుకొన్నాను." అన్నాడు.

అహమద్ అలీ కంఠంల్లో ఆనందం మెరిసింది. మెల్లగా అన్నాడు. "రెసిడెంట్ బహద్దూర్ చాల మంచివాడు. పాపం అతను మన దేశాన్ని తిరిగిమనకుఒప్పచెప్పాలని చాలాప్రయత్నం చేస్తున్నాడు. నీ కెందుకు చూస్తూవుండు. కొద్ది రోజులలో నే ఈ పాలంధరీ తిరిగి మన ఏలికక్రిందకు వచ్చేస్తుంది. డోంగరా దాస్యంనుంచి విముక్తం చెందుతుంది."

తెల్లగుర్రం తడవతడవకు తన తీవ్రగమనంతో ముం దుకు పోతున్నది, అహమదఅలీ తడవతడవకూ కళ్ళేన్ని లాగి దాన్ని గాడిదలతో సమానంగా నడిపించలేక పోతున్నాడు. అతను ఇలాఅన్నాడు. "ఇదిగో! అబ్దుల్ కొంచం ముందుకు

పోదాం పద! ఈ అడుగులో అడుగు వేసుకొంటూ —గాడిదలతోపాటు నడవడం నా వశంకాదు.

"హెడ్‌మాస్టర్‌గారు ఏమంటారో? ఈ విద్యార్థులను సరిగా నడిపే బాధ్యత నాకు ఒప్పజెప్పారు."

"నీ హెడ్‌మాస్టరూ—నీవూను! ఏడిశారు. అతనే చూసుకొంటాడు. నీవు నాతోటి వచ్చేశెయ్యి!"

అబ్దుల్ అహమద్ ఆలీ మొఖంలోకి సూటిగా చూశాడు. అహమద్ ఆలీ ముఖం ఎర్రనైంది.

"ఆఁ నాకు తెలుసు! ఏదోవినయం ఫ్రెండ్!" అబ్దుల్ నవ్వి అన్నాడు.

"తెలిసివుంటే ఇంక ఆలోచన దేనికి? రా!"

"ఎక్కడ వున్నది?"

అహమద్ ఆలీ అన్నాడు. "ఇంకా రెండు మైళ్ళు పోవాలి! అక్కడ బాట మలుపు తిరుగుతుంది. ఆ మలుపు తిరుగుడులోనే ఒక చెరువువున్నది. చెరువుఒడ్డున కూర్చుని నా కోసరం ఎదురుచూస్తూ వుంటుంది.

అబ్దుల్ తన గాడిదను ముందుకు నడిపాడు. "ఐతే పద!" అన్నాడు.

అహమద్ అలీ తన తెల్లనిగుర్రాన్ని ముందుకు నడిపాడు. ముందు తెల్లగుర్రం, తరువాత గాడిదా వరుసగా సాగాయి. వాటికి వెనుక అపారంగా ఎర్రమట్టి లేస్తున్నది. వెనుక వస్తున్న హెడ్‌మాస్టరుగారిమీద, తోటి విద్యార్థుల మీదా ఎర్రమట్టి అదేపనిగా పడుతున్నది. హెడ్‌మాస్టరుతో సహా పిల్లలందరూ ఒక్కమాటుగా అబ్దుల్‌నూ, అహమద్

అలీనీ బూతులు తిట్టసాగారు! ఇట్లాతమ కోపాన్ని తీర్చుకో సాగారు!

బాటమలుపు తిరుగుడులో. 'చీల' వృక్షపుసమూహాలు విరివిగా వున్నాయి. పచ్చని చెట్లతో ఇంపైన, ఆహ్లాదకరమైన వాతావరణం ఎటుచూసినా నడుస్తున్నది. అహమద్ దారి మధ్యలో గుర్రాన్ని ఆపి, అబ్దుల్‌ని వుద్దేశించి "ఇదిగో అబ్దుల్! నీవు ఇక్కడ నిలబడి అటూఇటూ చూస్తూవుండు. నేను క్రిందికి చెరువుదగ్గిరకు వెళ్తాను! ఎవరైనా ఇటుగా వచ్చేటట్లయితే చెరువుదగ్గిరకు వచ్చి ముందుగా నాకు తెలియచెయ్యి!" అన్నాడు. మరుక్షణంలోనే బాటకు ఎడంప్రక్కగా చెట్ల సమూహాల్లో మరుగుపడివున్న చెరువుదగ్గిరకు గుర్రాన్ని పరుగెత్తించాడు అహమద్ అలీ.

# 6

కొద్దిసేపటి తరువాత అహమద్ అలీ తిరిగివచ్చాడు. ఆతనిముఖంలో ఎప్పుడూఉన్న కళకాంతులు ఇప్పుడు లేవు. గుర్రంకూడా నీరసించి, మెల్లగా అడుగులో అడుగు వేసు కొంటూ వస్తున్నది.

"ఏమిటి విషయం?" అబ్దుల్ అడిగాడు.

"రాలేదు!"

అబ్దుల్ నవ్వాడు "రాలేదా?"

"ఈమాటు నవ్వు. చెబుతాను! తుపాకితో కాలుస్తాను!"

అబ్దుల్ మళ్ళీ నవ్వాడు. "సరే, ఇంకేం చేస్తాం? ముందుకు నడుద్దాం పద?" అన్నాడు.

"ఉ...హు! నేను రాను. దాన్నయినా చూపుతాను. లేకపోతే నేనైనా ఇక్కడ పొడుచుకు చస్తాను!"

మెల్లగా ఇద్దరూ ముందుకు సాగారు. ముందు అడవి. వెనక అడవి. మధ్యలో ఈ మట్టిదారి. దానికి రెండు వైపులా అటూ ఇటూ నల్లని కొండరాళ్ళు కాపలా సైనికుల్లా నిల బడి వున్నాయి. దారివెంట వెడుతూ అహ్మద్ ఆలీ తడవ తడవకూ క్రిందికి, చేలల్లో పశువుల్ని మేపుతున్న స్త్రీల వైపుకు చూస్తు న్నాడు. కాని అతనికి కావలసిన వనిత ఎక్కడా కనుపించడం లేదు. ముందు ఒక మలుపు తిరుగుడు వున్నది. ఆ మలుపు తిరుగుడులో తన ప్రేయసి గ్రామపు సరిహద్దులు అంతమవు తవి. ఆపైన ప్రేయసి కనిపిస్తుందన్న ఆశకూడా లేదతనికి! వుండి, వుండి తీవ్రమైన స్వరంలో ఒక ప్రేమగీతాన్ని ఆలా పించ సాగాడు. అహమద్ ఆలీ! అతని స్వరం సిప్పాలను త్రొక్కుతూ దారిలో కనుపించే ప్రతి ఒక్కవస్తువుకూ చెట్లకూ పుట్టలకూ, పశువులకూ, పశువుల్ని మేపే యువతులకూ, అం దరికీ తన దుఃఖమయ ప్రేమగాథను వినిపిస్తున్నది.

నీవు నన్ను ప్రేమించావు
కరుణించావు
నీ ప్రేమ కోసరం నా కోర్కెలు
తహతహ లాడుతున్నాయి!
అగ్నికణాలై నా లోమంటల్ని

రేపుతున్నాయి!

ఓ...నా ప్రేయసీ! ఎక్కడున్నావు?

ఓ...నా చందమామా!

అహమద్ ఆలీ స్వరం నాలుగు వైపులా చెట్లల్లో, చేలల్లో, నల్లరాతి కొండల్లో ప్రతిధ్వనించింది. చేలల్లో పశువుల్ని మేపే యువతులు తలఎత్తి ఒకమాటు అహమద్ ఆలీ వంకకు చూసి, సిగ్గుతో తలలు వంచేసుకొన్నారు; గొర్రెలూ పశువులూ ఒకమాటు చెవులు రిక్కించాయి; తిరిగి యథా ప్రకారం గరిక మేయసాగాయి. అక్కడనే మరొక చెరువున్నది. చెరువుగట్టున కాళ్ళు లోపలికి వేసి, నీళ్ళల్లో ఆడిస్తూ కూర్చున్న ఒకపశువుల్ని కాసేయువతి అహమద్ ఆలీ బాధను అర్థంచేసుకొన్నది. కారణం అతనిబాధ ఆమెంబాధ కూడా కావడమే! రెండురోజులుగా అనేకవిధాల ప్రయత్నించికూడా అనుకున్నవిధాగా తన ప్రేమికుడిని చెరువుదగ్గిర కల్సుకో లేకపోయింది ఆమె! ఆ యువతికండ్లు నీళ్ళతో నిండాయి- తెల్లనిగుర్రం, పొడవైన తురాయి-నా ప్రియుడంత అందగాడు ఈ ప్రపంచంలో మరెవ్వరూ లేరు. ఓ...ప్రియుడా! నా బాధను నీవు అర్థంచేసుకోలేవా? నేను చెప్పినట్లు నిన్ను కలుసుకోలేకపోయాను. కానీ నా హృదయం అక్కడే బాట మలుపుదగ్గిరే వుంది. ఆ చెరువులోని అలల్లోని స్పందనం నా హృదయంలోని ఆరాటమని నీవు తెల్సుకోలేదా? ఓ...విరహ గీతాన్ని ఆలాపించే గుర్రపుస్వారీ! నా సమాధానాన్ని కూడా విను!

చెరువుగట్టున కూర్చున్న పశువుల కాసే స్త్రీ దారి వైపు వీపుపెట్టి కూర్చున్నది. లేకపోతే తన ప్రియుడిపాటకు తిరుగు సమాధానాన్ని పాడడం కష్టం ఎవరైనా చూస్తారు! ఒకవైపున చూస్తారు! ఒకవైపున ప్రియుడు తన కళ్ళెదురుగా గుర్రం మీాద వెళ్ళిపోతున్నాడు. మరొకచెంపన పలకరించడానికి కూడా వీలులేకుండా తల్లీతండ్రీ ఎదురుగా వున్నారు. వాళ్ళని మభ్యపరచడం కష్టం; తన కండ్లు వెంటనే చెప్పేస్తాయి. అందువల్లే దారివైపుకు వీపుపెట్టి ప్రియుడి పాటకు సమాధానాన్ని ఇస్తున్నది. బాటసారి పాటకు తిరుగుపాడడం సమాధానాన్ని ఈయడం ఆ కొండప్రదేశాల్లో అంత తప్పుగా భావించరు అసలది ఆ కొండప్రదేశాల్లోనే బాటసార్లకు ఒంటరితనాన్ని బాపుకోవడానికి ఏకైకమార్గం! కనుకనే ప్రియుడి పాటకు తిరుగుపాట ఇలా పాడింది.

పూర్వజన్మల అదృష్టాల ఫలితంగా
 నీవు నాకు లభించావు
మన కలయిక యుగాలు; క్షణాల్లా
 గడచిపోయాయి
నీ కోసరం ఎదురు చూసిచూసి
 కండ్లు కాయలు కాశాయి
నీవు ఇచ్చిన క్షణమాత్రపు ఆ
నందం; గులాబిపువ్వై నా జీవితా
న్ని సురభితం చేసింది

ఓ... తెల్ల గుర్రపుస్వారీ! చందమామా!
కావాలంటే చెబుతున్నాను. నీకు ఇవే
నా "వీడ్కోలు!"

అహమ్మద్ అలీ ముఖం ఆనందంతో విప్పారింది. పెద్దగా అరిచాడు. "ఇదే! ఇదే! నిజంగా...ఇదే! యా అల్లా! ఇక నేను తప్పక పరీక్షప్యాసవుతాను!" అన్నాడు.

ఇక అతను అబ్దుల్ నుకూడా మరచిపోయాడు. గుర్రం మెడమీంది జూలును గట్టిగా పీకాడు. కుడికాలి మడమతో గుర్రాన్ని పిక్కల్లో తన్నాడు. గుర్రం పరుగు లంకించుకొన్నది. కొద్దిక్షణాల్లోనే మలుపుతిరిగాడు. గుర్రం పరుగు తీయడం చూసి అబ్దుల్ గాడిదకూడా పరుగు లంకించుకొన్నది.

అబ్దుల్ అనుకొన్నాడు "మరి నేనో? మరినేనూ బానో! నీవు నన్ను దీవించు—పరీక్షల్లో ప్యాసవుతాను!"

# 7

సాయంత్రంవరకూ అలాగే పర్వతశిఖరంమీంద నిలబడి దూరంగా పొగకావులలో మసకబడివున్న పంజాబువైపుకు చూస్తూ వున్నది బానో! ఉత్తరదక్షిణాలుగా పర్వతపంక్తులు వాటివెనుక అబ్దుల్ చదువు చెప్పే పట్నం చాలా పెద్ద పట్నం - దాని తరువాత విస్తృతమైన మైదానాలు కల పంజాబుదేశం! అక్కడకు అబ్దుల్ మెట్రిక్ పరీక్షకు కూర్చోవడానికి వెడతాడు. ఆ దేశం ఎంత పెద్దదో ఎంత విచిత్రమైందో, అక్కడి ప్రజలు ఎలా వుంటారోకూడా బానోకు

తెలియదు! కనీసం వూహించనుకూడా వూహించలేదు! ఆ దేశాన్నిగురించి బానో చాలా కథలను విన్నది. ఆ కథలు చాలా చిత్రంగా వుంటాయి. చలికాలంలో వెచ్చదనాలను ఇచ్చే చలిమంటల్లా వుంటాయి. బుగ్గలకు ఎరుపురంగును అద్దుతూవుంటాయి. ఆ దేశపు కథలు – అయినా బానో ఆ దేశాన్నిగురించి ఏమీ ఆలోచించలేదు. రంగులు మార్చే గులాబి మేఘాలకు వెనుక సూర్యభగవానుడు తన ప్రచండ అగ్నిజ్వాలలతో జ్వలిస్తో తనకు దాపుకు వచ్చిన ప్రతిదాన్నీ హోమంచేస్తూవుంటాడు. పాపం బానోకు ఆ విషయం తెలియదు! గొప్పపట్నం, గొప్పదేశం, అక్కడ రాజమహాల్ వుంటుంది! కచేరీవుంటుంది! జండాలువుంటాయి! ఓ— హో— చాలా గొప్పదేశం అబ్దుల్ పరీక్ష రాయడానికి వెడతాడు... కాని, ఈ రంగుల పరదాలవెనుక, ఈ రాజభవనాల వెనుకా వున్న గాథ ఏమిటో బానోకు తెలియదు! బానోలోని ఈ అమాయకతను చూసి ఎత్తయిన రాజభవనాలు నవ్వినాయి! కాని, రంగులుమార్చే గులాబీ మేఘాలు కనీసం బానో మనః స్థితిని అబ్దుల్‌కు తెలియచేయనైనా లేదు. అవును, మేఘాలు సందేశాన్ని అందచేయాలంటే ప్రేకులు కవులై వుండాలి! మరి బానోకు కవిత్వం ఏ కోశానా రాదాయె!

బానో పూర్తిగా వివశురాలైంది. అత్యంత అస్థిమితంగా అస్తమిస్తున్న సూర్యుడివంక చూస్తూ నిలబడ్డది. సూర్యుడి అస్తమయంతోపాటు ఆమె ఆశలుకూడా అస్తమించినాయి.

బానో మౌనంగా నిలబడి స్వాప్నికలోకాలలో విహ రిస్తున్నది. ఆమె ఇహలోకపు చింతననే విస్మరించింది. ఎవరు వస్తున్నారు, ఎవరు పోతున్నారూ? అనేది బొత్తిగా తెలి యడంలేదు ఆమెకు! ఎవరివో పదధ్వనులు అంతకంతకూ బానోను సమీపిస్తున్నాయి! పదధ్వనుల తాలూకు మనిషి బాగాదగ్గిరకు వచ్చాడు. బానో బుగ్గల ఎరుపులూ, పూర్ణ మైన యవ్వనాన్ని చూచి వున్మత్తుడైపోయాడు. కానీ, బానోకు ఇది ఏమీ తెలియదు!

"నువ్వు బానోవి! నిజంగానే బానోవి! బానో!" పదధ్వని తాలూకు వ్యక్తి పిలిచాడు.

బానో అటుతిరిగింది. ఆమెముఖంలో ఇంకా దూరాల మెరుపులు గోచరిస్తున్నాయి. కండ్లల్లో భావుకత తాలూకు ఆశ్చర్యం కనుపిస్తున్నది. పదధ్వని తాలూకువ్యక్తి బాగా దగ్గి రకు వచ్చి, అత్యంత కామతృష్ణతో బానో ముఖంలోకి చూడ సాగాడు. బానో వులిక్కిపడి వెనక్కి తప్పుకొన్నది. తనను తాను ప్రస్తుతానికి తెచ్చుకొంటూ "ఎవరు నువ్వు? నన్నేమి ఎరుగుదువు?" అన్నది.

"నేను శౌకత్‌ను! అల్లాదాద్ లేడూ, నీకు కాబోయే భర్త, అతని స్నేహితుడను!"

బానో ఒకమాటు తీక్షణంగా శౌకత్‌ను చూసింది. ఆమెకు శౌకత్ చాలా చెడ్డవాడుగా, దుర్మార్గుడిగా కను పించాడు. వెంటనే కండ్లు వాల్చేసుకొని "మా నాన్న అటు కంపందగ్గర వుంటాడుపొండి!" అన్నది.

శౌకత్ పూర్తిగా దగ్గరకువచ్చి బానోమీదకు వరు గుతూ "నువ్వు దారి చూపించు!" అన్నాడు.

బాగా మీదకు వరిగినప్పుడు శౌకత్‌కు బానో చాలా అందంగా ముద్దువచ్చే కోడిపెట్టలా కనుపించింది. కోడిపెట్ట లాగానే బానో రెక్కలమీద చేతితో నిమురుదాం అనిపిం పించింది అతనికి. కోడిపెట్టను ఎలాగైతే మొదట మెత్తని రెక్కల్ని నిమిరి, తరువాత మెడలువిరిచి రక్తాన్ని త్రాగుతారో అలాగే బానోనుకూడా చేస్తే బాగుండననిపించింది అతనికి. తన ఈ వూహాకు తనే జలదరించాడు శౌకత్! వెంటనే చూపుల్ని క్రిందికి దింపేసుకొన్నాడు. తరువాత తనలో తనే ఇలా అనుకొన్నాడు. "కోడి తప్పించుకుని ఎక్కడికి పోతుం దిలే!"

బానో అన్నది "సరే పదండి:"

# 8

రాత్రి భోజనాలు అయ్యాక కాదర్‌బట్ట, శౌకత్ – ఇద్దరూ ఒకచోట కూర్చుని మాట్లాడుకొంటున్నారు. శౌకత్ కాదర్‌బట్టకు పరిస్థితినంతా వివరంగా చెప్పాడు. అల్లాదాద్ చనిపోవడం, అబ్దుల్ పారిపోవడం—మొదలైన విషయాలన్నిం టినీ చెప్పాడు. బానో చాటున కూర్చొని అన్నింటినీ విన్నది.

శౌకత్ అన్నాడు "అల్లాదాద్ చనిపోతూ నాతో ఇలా అన్నాడు. "నేను ఎటూ చనిపోతున్నాను. నేను చని పోయాక నీవు బానో తండ్రి కాదర్‌బట్ట దగ్గిరకువెళ్ళు! పిల్లల

నీకు నచ్చితే మిగిలిన ఐదువందలూ ఇచ్చి నీవు పెండ్లిచేసుకో నా బదులు, నేను నిశ్చయ తాంబూలాల్లో ఏడువందలయాభై ఇచ్చాను. ఇప్పుడా హక్కును నీకు నేను అవాలీ చేస్తున్నాను" అన్నాడు శౌకత్.

కాదర్ బట్ట అన్నాడు "డబ్బుఇచ్చింది అల్లాదాద్! అతను చనిపోవడంతో అతని సంబంధంకూడా పోయింది!"

"సంబంధం పోతే డబ్బో?"

"డబ్బు అల్లాదాద్ ది...అతనితోపాటే అదిచచ్చింది."

"ఎందుకుచస్తుంది. అతను తనహక్కును నాకు అవాలీ చేశాడు. ఇదిగో కాగితం!"

కాదర్ బట్ట విల్లునామాను చేతిలోకి తీసికొన్నాడు. అటూ ఇటూ త్రిప్పిచూశాడు. "కాగితాన్ని నేను నమ్మను! నాకు నోటిమాట కావాలి. నోటిమాటను చెప్పగల అల్లాదాద్ చనిపోయాడు. ఇక నా కూతురు స్వతంత్రురాలు...!" అన్నాడు.

బానో శాంతిగా శ్వాస పీల్చుకొన్నది.

శౌకత్ కాసేపు మౌనంగా వుండి, తరువాత యిలా అన్నాడు "నా సంగతి నీకు తెలియదు. నేను రాంపుర్ పఠాన్ని !"

"ఏమో, నీవు పఠాన్ వో, మాదిగవాడివో ఎవడికి తెలుసు? కొత్తచోటికివస్తే ప్రతివాడూ పఠాన్ ననే అంటాడు. నువ్వు మా వూరివాడివి, మా దేశంవాడివి కాదు, విచారించు కుందాం అంటే! పోనీ, అదీ ఒప్పుకున్నాను. నీవు పఠాన్ వే ఇకనేం చెయ్యమంటావు చెప్పు?" అన్నాడు కాదర్ బట్ట.

"చెబుతున్నాను విను! నువ్వు అందరికన్నా ముందు నా హక్కును చెల్లించాలి! నాదగ్గిర అల్లాదాద్ రాసిఇచ్చిన వీలునామా వున్నది. నా జేబులో ఐదువందలరూపాయలు వున్నాయి. నేను బానోని పెండ్లి చేసుకో గోరు తున్నాను! నేనేం అలాంటి ఇలాంటివాడినికాదు. సర్కారు వుద్యోగిని...కొంచం ఆలోచించుకుని జాగ్రత్తగా సమాధానం యివ్వు!" అన్నాడు శౌకత్.

కాదర్ బట్ట తనస్థానాన్నించి లేచాడు. రెండుసార్లు అటూ ఇటూ పచారుచేశాడు. తరువాత శౌకత్ ముఖంలోకి పరిశీలనగాచూసి "సరె, ఐదువందలూ ఏవీ? ఇటుతే!" అన్నాడు.

బానోకు వూపిరాడలేదు.

శౌకత్ బరువైన రూపాయిాల మూటను కాదర్ బట్ట చేతికి యిచ్చాడు.

కాదర్ బట్ట అన్నాడు "నీవు ఎవరో నాకు తెలియదు. నేను ఎరుగను. అయినా నా కూతుర్ని నీకు ఇస్తున్నాను. భగవంతుడికి ఇదే యిష్టంగావును!"

బానోకు దుఃఖం పొర్లుకువచ్చింది. చవ్వున పైగుడ్డతో నోరు నొక్కేసుకున్నది.

చాలాసేపటివరకూ అలాగే నోటికి గుడ్డఅడ్డంపెట్టుకొని దుఃఖిస్తూ కూర్చున్నది బానో!

శౌకత్ అడిగాడు "పెండ్లి ఎప్పుడు జరుగుతుంది?

కాదర్ బట్ట చెప్పాడు "ఈఅడవికంట్రాక్టు వచ్చేనెలతో అయిపోతుంది. వచ్చేనెల చివర్లోగాని జ్ఞానపా ఇక్కడికిరాడు.

అతనికి అతని సరుకును వప్పగించేసి నేను యింటికి వెళ్ళిపో తాను! అప్పుడే నీ వస్తువును నీకు వప్పజెపుతాను. ఇంతకూ భగవంతుడాజ్ఞ రాసిపెట్టి వున్నది అయితే, మరొకవిషయం, పెండ్లికి అయ్యే ఖర్చుమొత్తం నీవే భరించాలి!"

"ఎందుకని?"

"అంతే భగవదాజ్ఞ!"

"అయితే ఎంతఖర్చు వుంటుందో?"

"ఏడువందలయాభై!"

శౌకత్ ఎగిరిపడ్డాడు. "ఎగతాళి బడుతున్నావా?" అడిగాడు.

"నాకు కాబోయే అల్లుడితో ఎగతాళి ఆడుతానా? అందులోనూ ముఖ్యంగా అతను రాంపుర్ మాదిగవిప్పుంటే!" కాదర్ బట్ట తనఛాతీని ఉబిస్తూ అన్నాడు.

శౌకత్ బొడ్డులోనుంచి కత్తితీశాడు. రాత్రి అంధ కారంలో కత్తి మెరపులా మెరసింది, కాని కాదర్ బట్ట తెలి విగా తప్పుకున్నాడు కత్తి బుజానికి తగిలింది. తనతో పాటు కొంత రక్తాన్నీ మాంసాన్నీ చిందించుకుంటూ పైకిలేచి రెండవ పోటు పొడవడానికి సిద్ధం అయింది. ఇంతలో బానో పెద్దగా ఏడవడంవల్ల నూరా, కర్మదార్, వలీజూ ముగ్గురూ నిద్రలేచారు. ముగ్గురు మిత్రులూ కాదర్ బట్టకు సాయంచేయడానికి వచ్చి పడ్డారు. వాళ్ళనుచూసి శౌకత్ భయపడ్డాడు. అక్కడినుండి పారిపోవడానికి మార్గాన్ని వెతుక్కోసాగాడు. కాని వాళ్ళు అతన్ని నాలుగువైపులనుంచీ ముట్టడించారు. ఎటుపోవడానికీ

వీలు లేకుండా! నలుగురూ చేతులనూ విశాలంగాజాపి క్షణ క్షణానికీ ముందుకువస్తూ అతన్ని దిగ్బంధంచేస్తున్నారు. వాళ్ళ నలుగురిమధ్యా శౌకత్ ఆకలిగొన్న తోడేలులాగా నిలబడిపోయూడు. చుట్టూవున్న నలుగురూ అత్యంత గంభీరంగా ముందుకు వస్తున్నారు. క్రూరమృగాన్ని వలవేసి పట్టడానికి వస్తున్న వేటగాళ్ళలా!

శౌకత్ పెద్దగా అరిచాడు, "మీరు నలుగురూ! నేను ఒక్కణ్ణి!"

నూరా అన్నాడు "నీదగ్గిర చాకువుంది! మాకు ఈ చేతులే!"

"ఇది మొగతనంకాదు. మా దేశంలో ఒకమనిషితో ఒకడే పోట్లాడుతాడు. నలుగురు పోట్లాడరు."

"ఎదటివాడు మనిషి అయితే ఇక్కడా అలాగేచేస్తాము!"

ఉండీ వుండీ నూరా ఒక్కమాటుగా రెండడుగులు ముందుకువేసి "సరే, వచ్చెసెయ్యి! నేను ఒక్కడినే! ఊఁ! వచ్చెసెయ్యి! కాని పారిపోబోకు! పారిపోవాలని ప్రయత్నం చేశావా? మిగిలినముగ్గురూ వెంటబడతారు; పదడుగులలోనే పట్టుకుంటారు! మేము అడవుల్లో వుండేవాళ్ళం. మృగాలను పట్టుకోవడం మాకు బాగా అలవాటు! జాగ్రత!" అన్నాడు. సన్నని పొడుగాటి తన వ్రేళ్ళనూ దీర్ఘమైన బలమైన తన బాహువులనూ శౌకత్ వైపుకు జాపాడు నూరా! నూరాను చూస్తూంటే ఈ మనిషికి చేతులేశక్తి అంతకుమించి మరేమీ లే దితనిదగ్గర అనిపిస్తుంది. నూరా దగ్గిరకు పోతున్నాడు. శౌకత్ మెరపువేగాల్తో నూరామీదకు కత్తివిసురుతున్నాడు.

మొదటి దెబ్బను తప్పుకున్నాడు నూరా! రెండవదెబ్బ అతని బుజానికి తగిలింది. రక్తం చిందింది. రక్తాన్ని చూసేసరికి నూరాకు గంగవెర్రులు ఎత్తినాయి. అధిక వేగంతో అధిక జాగరూకతతో ముందుకు నడుస్తున్నాడు. నూరా దగ్గరకు వస్తున్నకొద్దీ శౌకత్ కత్తి విసరడం తగ్గిపోతున్నది! చివరకు నూరా తన బలమైన హస్తంతో శౌకత్ ముంజేతిని పట్టుకున్నాడు. అతని చేతిలోని కత్తి క్రింద పడిపోయింది.

పొడవైన నూరే చేతివ్రేళ్ళు శౌకత్ రెండు ముంజేతులను పట్టుకున్నాయి. శౌకత్ బలమంతా అతని కత్తిలో వుంది. కత్తి జారిపోగానే అతను సగం చచ్చినట్టయి పోయాడు. అతని ముఖం ఎలాతెలా పోసాగింది. ఒళ్ళంతా చమటలు పోసింది. కనుగ్రుడ్డుల దగ్గరవున్న కత్తిదెబ్బ తాలూకు మచ్చ మరీ వచ్చగా మెరవసాగింది. తన బలాన్నంతా వుపయోగించి శౌకత్‌ను క్రిందకు పడేశాడు నూరే. అతని వ్రేళ్ళు శౌకత్ మెడచుట్టూ తిరగసాగినాయి.

కాదర్‌బట్ట పెద్దగా అరిచాడు. "వద్దు... వద్దు... నూరే...నూరే...వద్దు!"

"వద్దకపోతే ఇతను నిన్ను కత్తితో పొడుస్తాడా ?" నూరే శౌకత్ మెడచుట్టూ తన పొడవైన వ్రేళ్ళను త్రిప్పుతూ అన్నాడు.

కాదర్‌బట్ట అన్నాడు "వద్దునూరే! వద్దు... నేను ఇవ్వాల్టిరోజున వీడిచేతిలో దెబ్బతినవలసి వున్నది...అదే భగవంతుడికి ఇష్టం... నూరే, గొంతుపిసక్కు! వద్దు!"

కర్మదాద్ అన్నాడు "కాదర్‌బట్ట చెప్పినట్టు మనిషిని చంపకూడదు, పాపమే కాని, బంధువులా ఇంటికివచ్చి ప్రాణం తీయచూసేవాడు క్రూరజంతువు! క్రూరజంతువును చంపడంలో పాపం ఏమీలేదు!

నూరే అన్నాడు "నివేమీ భయపడకు కాదర్ ఒక్క విరుపులో వీడి మెడకాస్తా విరిగిపోతుంది...ఎక్కువబాధ ఏమీ ఉండదు!"

కాదర్‌బట్ట అన్నాడు "వద్దునూరే! అదిచాలాపాపం!"

నూరే శౌకత్ మెడమీదనుండి తన చేతులను తీసి వేశాడు. "నువ్వొకడివి – మహాదయకలవాడివి వచ్చావు!" అని కాదర్‌ని విదిలించి క్రిందవున్న శౌకత్‌ను ఒకసూటు తన రెండు చేతులలోనికి తీసుకొని నేలకు వేసికొట్టాడు. "కాదర్ వీడికి రెండు తగిలించమంటావా? వీడి ముంజేతులను విరగ దీయనా? ఇకముందు ఎవ్వరిమీదకూ కత్తి విసరకుండా!" అన్నాడు శౌకత్ వైపుకు తిరిగి "అదికాదురా వెధవ! మేం కాశ్మీరువాళ్ళం! మాదగ్గిర ఏంరక్తం వుంటుందని కత్తి విస రావు?" అన్నాడు నూరే.

తరువాత మళ్ళీ ఒకమాటు శౌకత్‌ను పైకిఎత్తి నేలకు వేసి కొట్టబోయాడు. కాదర్‌బట్ట అడ్డుపడ్డాడు. "నూరే, అంతపని వద్దు...అతను జాగీర్దార్ దగ్గిర నౌకరు. మనకెందుకు వదిలిపెట్టు!" అన్నాడు.

"మరి, రక్తం తీయడంలోవుండే బాధ ఏమిటో వీడికి ఎలా తెలియడం?" నూరే శౌకత్‌ను వదిలిపెడుతూ అన్నాడు.

"మన ఇంటికి బంధువుగా వచ్చాడు !" కర్మదాద్ అన్నాడు.

"అంతేకాదు. భానోను పెండ్లాడడానికి, పాపం, ఐదు వందలుకూడా తెచ్చాడు!" కాదర్ బట్ట అన్నాడు.

నూరే తన రెండుచేతులనూ పడుములమీద పెట్టు కొని నిటారుగా నిలబడి "వీడికి కాఫీ ఇప్పించమంటారా? లేక కాశ్మీర్ టీ ఇప్పించమంటారా ?" అన్నాడు శౌకత్‌ను చూపించి.

తరువాత నూరే మరొకసారి శౌకత్‌ను నేలకు వేసి కొట్టాడు. దీనితో శౌకత్ ముఖం రక్తంతో నిండిపోయింది. అతని ముక్కుల్లోనుంచీ, నోట్లోనుంచీ రక్తం స్రవించసాగింది. నూరే పెద్దగా అరిచాడు. "కాదర్ బట్ట నీ ప్రాణాన్ని రక్షించాడు. ఇక నేరుగా వెళ్ళు. మరి కొంచంసేపు ఇక్కడవుంటే — కాదర్ కూడా ఇకనిన్ను రక్షించలేడు!"

శౌకత్ అక్కడనుండిపరుగెత్తసాగాడు. పడుతున్నాడు' లేస్తున్నాడు. రొప్పుతున్నాడు. రోజుతున్నాడు. ముఖంమీది చెమటనూ రక్తాన్నీ తుడుచుకొంటున్నాడు కొంతదూరం పోయి ఆగి "నా ఐదువందలో?" అడిగాడు.

కాని తనగోల అక్కడ ఎవరూ వినిపించుకొనేవారు లేకపోవడంవల్ల తలవంచుకొని బూతులు తిట్టుకొంటూ ముందుకు పరుగెత్తాడు.

కాదర్ బట్ట నవ్వుతూ "భానో పెండ్లికి నాకు డబ్బు చాలా అవుసరం! భగవంతుడు ఈరూపంగా డబ్బుచేర్చాడు!" అన్నాడు.

మిత్రులు నలుగురూ గుడిశవైపుకు బయలుదేరారు. గుడిశలో బానో వాళ్ళకోసరం కాఫీ తయారుచేస్తున్నది. దెబ్బలకు కట్లు కట్టుకోవడానికి పసుపూ, చిన్నవుల్లిపాయలూ నూరి ఒకచోట పెట్టింది. ఇదంతాచూసి నలుగురూ ఎవరిమనస్సులో వాళ్ళు ఇలాగ అనుకొన్నారు. "బానో, చాలా తెలివికలది; ఎవడి ఇంటికి వెళుతుందో? కాని, బానోను పెండ్లి చేసుకొన్న వాడు చాలా అదృష్టవంతుడౌతాడు. వాడికి ఎంతో సేవ చేస్తుంది; బ్రతికినన్నాళ్ళూ సేవచేస్తుంది. చనిపోయాక ప్రతి రోజూ అతని సమాధిమీద దీపం పెడుతుంది. సంవత్సరానికి ఒకనాడు అతని జ్ఞాపకార్థం ఫకీర్లకు అన్నదానం చేస్తుంది. నిజంగా బానో చాలామంచిది!"

కాదర్‌బట్టు ఇలా అనుకొన్నాడు "నా బానో చాలా మంచిది. దీన్ని పెండ్లిచేసుకోదలచినవాడు. నిశ్చయానికి ఏడువందల యాభై, పెండ్లికి ఐదువందలూ - ఇవ్వాలి! అదెటూ తప్పదు. ఇప్పుడు అనుకోకుండా చేతికివచ్చిన ఈ ఏడువందలూ పెట్టి, మరొక ఎకరం పొలం కొంటాను! బానో చాలా మంచిది!"

## 9

అబ్దుల్ తన స్నేహితుడైన అహమదఆలీతో ఇలా అన్నాడు. "నా బానో చాలా అందగత్తె... అలాంటి అందగత్తె కాష్మీర్ అంతటిలో గాలించినా దొరకదు!"

"నా ప్రేయసికంటెకూడా బాగుంటుందా?" అహమద్ ఆలీ కండ్లెర్రచేశాడు.

"ఆమెను మినహాయించి. నీ ప్రేయసీ, నా ప్రేయసీ — పిల్లిద్దరూ మొత్తం కాష్మీర్ అంతట్లోకీ అందగత్తెలు!"

అహమద్ ఆలీ ముఖం వికసించింది. "నీవు నాకు ప్రాణ స్నేహితుడివి. మనం పందెం వేసుకు పరుగెత్తిద్దాం, వస్తావా?" అన్నాడు.

అబ్దుల్ కొంచం నిరాశను సూచిస్తూ "మిత్రమా! గుర్రానికీ, గాడిదకూ ఎలా పందెం" అన్నాడు.

"పరవాలేదు! రద్దూ!" అహమద్ ఆలీ తన గుర్రాన్ని పిక్కల్లో తన్నాడు.

గుర్రాన్నీ గాడిదనూ పరుగెత్తిస్తూ— ఇద్దరూ భూతియూ గ్రామాన్ని సమీపించారు. క్రింద పల్లంలో గ్రామం వుంది. అబ్దుల్, అహమద్ ఇద్దరూ పైన కొండమీాద దార్లో నిలబడి వున్నారు. క్రింద ధాన్యపు చేలల్లో రైతులు పనులు చేస్తు న్నారు. కొంతమంది రైతు పడుచులు చెరువునుండి నీళ్ళు పట్టుకు వెళుతున్నారు ఇండ్లకు. మరికొంతమంది ఖాళీకుండల్నీ, బిందెలనూ వూగించుకొంటూ చెరువుకు నీళ్ళకు వస్తున్నారు. ఒక బర్రెమీాద కాకి కూర్చుని దాని వీపును ముక్కుతో పొడుస్తున్నది. పశువుల కాపరులు తమవద్దనున్న వంగల కర్రతో పిట్టల్ని కొడుతున్నారు. ఒక యువతి ఎండుగడ్డిమీాద ఎల్లకిలా పడుకొని ఆకాశంలో, తర్లిపోతున్న మేఘాలను చూస్తున్నది; తన్మయంగా! ఆమె చాలా అందంగా వుంది. అబ్దుల్ ప్రేయసంత, అహమద్ ప్రేయసంత— అందంగా వుంది! ఇలాంటి అందగత్తెలు కాష్మీరులో వేలసంఖ్యలో వున్నారు.

అబ్దుల్ ఇలా అనుకొన్నాడు. "నా దేశపు ధరిత్రి ఎంత ప్రేమ హృదయ! ఇంత దరిద్రం, ఇంత నిరక్షరాస్యత, ఇంత నిరుద్యోగం, ఇన్ని అత్యాచారాల్లోకూడా ఈ దేశపు ఆకాశంలో అందమైన మేఘాలు విహరిస్తున్నాయి. సుందరమైన స్త్రీలు కనుపిస్తున్నారు." అబ్దుల్ దృష్టి పైకి పోయింది. అక్కడే 'లక్ష్మనపతన్' వంతెన. వంతెనకు ఇవతల అందమైన కాశ్మీర్! అవతల అపరిచిత పంజాబ్ దేశం.

అబ్దుల్ అహమద్ నిలబడివున్న చోట 'అలూంచీవృక్షం' ఒకటివున్నది. చెట్టున ఎక్కడా ఒక్క ఆకైనా లేదు. అయినా తెల్లనిపూలతో నిండి వున్నదావృక్షం. ఆ చెట్టును చూస్తూ వుంటే అబ్దుల్‌కు తన తండ్రిగడ్డం జ్ఞాపకానికివచ్చింది. తెల్లని తనతండ్రి గడ్డంక్రింద తను నిల్చున్నట్టనిపించింది అతనికి ఎక్కడలేని సంతోషం, సుఖం, శాంతీ లభించాయి.

# 10

భూతియానుండి 'లక్ష్మనపతన్' వరకూ వున్నదారి చక్కని రోడ్డులా విశాలంగా, సమతలంగా, శుభ్రంగా వున్నది. అలా వుండడానికి ఒక కారణం వుంది. కొద్ది సంవత్సరాలక్రితం ముఖ్యజాగీరు యొక్క పి.డబ్లియు.డి. శాఖలో థామ్సన్ అనే ఇంగ్లీషువాడు చీఫ్ ఇంజనీయరుగా పనిచేశాడు. అక్కడి చుట్టుపట్ల ప్రదేశాలను అన్నింటినీ చూసివచ్చి అతనొక అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. 'లక్ష్మన్‌పతన్' నుండి ఏ పెద్దపట్నం దగ్గరకైనాసరే కేవలం 15 లక్షల రూపాయిలతో మోటార్ రోడ్డు నిర్మించగలను అన్నాడు. లక్ష్మన్‌పతన్‌కు అటు వం

జాబు దేశం. అక్కడ 'సలాహా' వరకూ రైలుమార్గం వుంది. అక్కడనుండి కోహాటా వరకూ బస్‌రోడ్డు వుంది. పోతే కోహాటానుండి లక్ష్మన్‌పతన్ వరకూ వున్నమార్గం ఏరోడ్డూ లేకుండా మట్టిదారిగా వుండిపోయింది. ఆ మట్టిదారి ఒక్కరోజు ప్రయాణానికి సరిపడివున్నది. అటు పంజాబులోని ఆంగ్ల ప్రభుత్వం ఈ ఒకరోజు మట్టిమార్గాన్ని మోటారురోడ్డుగా మార్చేట్టయితే, ఇటు ముఖ్యాజాగీరులో ఏదో ఒక పెద్దపట్నంనుండీ 'లక్షుమనిపతన్' వరకూ మోటార్ రోడ్డును ముఖ్యాజాగీరు వారు వేయించేట్టయితే రెండు ప్రభుత్వాల మధ్యా రాకపోకలు నిరాఘాటంగా జరుగుతవి అని థామ్సన్‌గారి అభిప్రాయం. ఈఅభిప్రాయాన్ని రెసిడెంట్ బహద్దూర్‌గారు పూర్తిగా సమర్థించారు. పోతే, కాశ్మీరు సంస్థానం మరొకరకమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. కాశ్మీరునుండి 'వూడి' వరకూ మోటార్‌రోడ్డు వేసేట్టు, అందుకు అయ్యేఖర్చు కాశ్మీరూ, ముఖ్యాజాగీరూ సమానంగా భరించేట్టూ. అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. దీన్ని ముఖ్యాజాగీరు మహారాజైన ఆన్‌సింగ్‌గారు పూర్తిగా వ్యతిరేకిస్తూ, ముఖ్యాజాగీరు ముఖ్యపట్నం పుంఛనించీ లక్షుమన్‌పతన్ వరకూ, థామ్సన్ పర్యవేక్షణలో మోటార్‌రోడ్డు తయారుచేయబడు నని ప్రకటించారు. అతి త్వరలో పనికూడా ప్రారంభించారు. పట్నంనుంచి లక్షుమన్‌పతన్ వైపుకూ లక్షుమన్‌పతన్ వైపునుండి పట్నంవైపుకూ— రెండువైపులనుండీ రోడ్డువేయడం ప్రారంభించారు. అటు పట్నంనుంచి ఆరుమైళ్ళూ, ఇటు లక్షుమన్‌పతన్ నుండి భూతియావరకూ రోడ్డు వచ్చేసరికే 15 లక్షల రూపాయలు

అయిపోయినాయి- చీఫ్ ఇంజనీయర్ థామ్సన్ కొన్ని లక్షలు మూట కట్టుకొని స్వదేశానికి పారిపోయాడు. ॥వ॥ల॥వ॥ గట్టి మోటర్ రోడ్డు వెయ్యడానికి కనీసం యాభై లక్షలయినా అవుతవని తరువాత తెలిసింది. అందువల్ల ఇదీ ఒకందుకు మంచిదేను, మిగిలిన 3 లక్షల ఖర్చూ తప్పింది అనుకొన్నాడు మహారాజుగారు. కాకపోయినా అలా సంతృప్తి పడడం తప్ప మహారాజుగారు చేయగలిగింది ఏమీలేదు. ఇంగ్లీషువాడు దొంగగానీ, తోడుమోతుగానీ, దగాకోరు గానీ—ఎవడైనప్పటికీ వేలెట్టి చూపే ధైర్యం మహారాజుగారి దగ్గరలేదు. అందుకు కారణం స్వయంగా మహారాజుగారుకూడా ఆ దొంగల సంస్థలో ఒకడు కావడమే. అందువల్ల మహారాజుగారు ఏమీ అనకుండా నోరుమూసుకు వూరుకున్నారు. ఈ విషయం ఎక్కడా బయటపొక్కలేదు. ఇప్పుడు అబ్దుల్ అహమద్‌లు నడుస్తున్న రోడ్డు ఆ ఇంగ్లీషు ఇంజనియర్ వేసిందేను.

అక్కడక్కడా మంచి నల్లరాళ్ళ వంతెనలు కనుపిస్తున్నాయి. దూరంగా రెండుకొండల మధ్యగుంగా వుంచనది వేగంగా ప్రవహిస్తూ కనుపిస్తున్నది.

# 11

శుభ్రమైన కంకర రోడ్డును చూచేసరికి యువకులకు వుత్సాహం ఎక్కువైంది. గాడిదలను పరుగెత్తించారు. అన్నిటికంటే ముందు అహమ్మద్ ఆలీ గుర్రం పరుగిడుతున్నది. తరువాత ఠాకుర్ మాన్‌సింగ్ గుర్రం! అతని తరువాత మిగిలిన వాళ్ళ గుర్రాలూ – గాడిదలూ! ఠాకుర్ మాన్‌సింగ్ తండ్రి

జనరల్‌సింగ్ ముఖ్య జాగీరు సైనికశాఖలో వున్నతపదవిలో వున్నాడు. ఈ గుర్రాన్ని జనరల్‌సింగ్ రాజావారి గుర్రపు శాలనుంచే తీసుకొనివచ్చి ఇచ్చాడు కొడుక్కు, పదవక్లాసు పరీక్ష రాయడానికి వెళుతున్నాడనే ఆనందంతో ఇచ్చాడు. అహమద్ ఆలీ తండ్రి మొదట ఇంగ్లీషు ప్రభుత్వపు సైనికశాఖలో ఒక చిన్న ఉద్యోగి. క్రమేణా పైకి పాకుతూ పాకుతూ సూబేదార్ పదవిని అలంకరించాడు. సూబేదార్ పదవినుంచి పెన్‌షన్ పుచ్చుకొని పాలంధరిలోని స్వగృహానికి వచ్చేశాడు. ఆయనగారిపేరు జాన్ మొహమ్మద్ జాన్. పొట్టిగా, ఎర్రగా, నల్లనిమీసాలతో బలిష్టుడైన వ్యక్తి అతను! డబ్బు అధికంగా లేకపోయినా, ఊహలు మాత్రం బాగా అధికంగా వున్నాయి. కనుక చీఫ్ ఇంజనీయర్ థామ్సన్ నిర్మించ దలచిన మోటారు రోడ్డు తాలూకు కంట్రాక్టు జాన్ మొహమ్మద్‌జాన్‌కు వచ్చింది. ఈ కంట్రాక్టుతో జాన్ మొహమ్మద్‌జాన్ లక్షాధికారిఅయ్యాడని వినికిడి! కొంతమంది ఇంగ్లీషువాడు మంచివాడు, సూబేదార్‌గారి సాంగత్యంవల్లనే ఈ దుర్బుద్ధి పుట్టింది. మొత్తం డబ్బును ఇద్దరూ కలిసి కొట్టేశారు అంటారు. ఏమైనా కానీ, సూబేదార్ మొహమ్మద్ జాన్ కొడుకు అహమ్మదలీ, తెల్ల గుర్రం రాజావారి గుర్రపుశాల గుర్రాలకు ఏ విధంగానూ తీసిపోదు!

రెండుగుర్రాలకూ పందెం పడ్డది. రెండూ పరుగు తీస్తున్నాయి ఒకసారి అహమదలీ గుర్రం రెండడుగులు ముందుకు వేస్తుంది. మరొకసారి మాన్‌సింగ్ గుర్రం! రెండుగుర్రాలూ ఈ విధంగా పందాలు వేసుకొని 'లఛమన్‌పతన్' మునిసిపల్

ఆఫీసువరకూ పరుగెత్తాయి. అక్కడనుండి వంతెనను చేరు కొనే లోపు అహమ్మద్ ఆలీ గుర్రమే పదడుగులు ముందు న్నది. ఇది చూసి విద్యార్థుల్లో వున్న ముసల్మాను యువ కులు పెద్దగా చప్పట్లు కొట్టి నవ్వసాగారు. హిందూ యువ కులు వివశంగా లోపల్లోపలే మాడిపడ్డారు.

ఠాకుర్ మాన్‌సింగ్ ఇలా అన్నాడు. "నీ గుర్రం ముందుపోవడంలో గొప్పేముంది? దానికీ దారి బాగా తెలుసు. ఎన్నోసార్లు తిరిగిందాయె! అదీకాక మీ దేశమాయె!"

అహమద్ ఆలీ అన్నాడు. "ఏం, నీ గుర్రం తక్కువా? సర్కారు గుర్రం! ఎప్పుడూ ఈ దార్లన తిరుగుతూనే వుంటుంది!"

మాన్‌సింగ్ అన్నాడు "అయినా, నా గుర్రం గడ్డి గాదం, తిని బ్రతుకుంది. నీదలా కాదే, ఇంగ్లీషువారి తిండ్లు తింటుంది. మాంసం ఆపి! దాణాలు మేస్తుంది! అలాంటప్పుడు ఎందుకు గెలవదు?"

మాన్‌సింగ్ అన్నమాట అహమద్ ఆలీలో బాగా పని చేసింది. తన తండ్రిని హేళనచేస్తున్నాడని తెలుసుకొన్నాడు. అతనిముఖం క్రోధంతో కుంకం పూసినట్టు ఎర్రనైంది. "ఏ గుర్రమైనా గడ్డే తింటుంది, మాంసం ఏం తినదు. ఓటమికి కారణం గుర్రాన్ని తోలేవాళ్ళుగాని, గుర్రాలు కాదు! నీకు మా ముసల్మానులు అంటే ఏమిటో ఇంకా తెలియదు. ఇప్పుడు మనిద్దరం గుర్రాన్ని మార్చుకొన్నా మళ్ళా నేనే గెలుస్తాను. నీవు ఓడిపోతావు. మళ్ళీ ముస్లిమే గెలుస్తాడు' హిందువు ఓడిపోతాడు!"

మాన్‌సింగ్ తన ఛాతీని ఒకమాటు విరుచుకొన్నాడు. డోంగరా, రసపుత్రులు మీపలంధరీని తల్లకిందులుగా ఓడించి నప్పుడు మీ ప్రతాపం ఏమైంది? కొద్దిమంది రసపుత్రులు పలంధరీలోని ఒక్కొక్క కిల్లానూ పేరు చెప్పి కొట్టేస్తూ వుంటే, మీ ముసల్మానులు చేతులు ముడుచుకు కూర్చు న్నారేం?" అనడిగాడు.

శాన్‌సింగ్ అందుకొన్నాడు "ఏయ్! అహమ్మద్ ఆలీ! ఇప్పటికీ మీ పాలంధరీమీద డోంగరా ప్రభుత్వమే! మాడే! మర్చిపోకు!" అన్నాడు.

సర్దార్ సింగ్ అందుకొన్నాడు. "ఏయ్! ఎప్పటికైనా సరే, మా డోంగరా రాజ్యం ముందు మీరు తలలు వంచ వలసిందే! నేను జాన్‌మహమ్మద్ జాన్‌కొడుకునికదా, అను కొంటున్నావేమో, అదంతా పనికిరాదు ఇక్కడ!"

అహమద్ ఆలీ కోపంతో పిస్టల్ బయటికి తీశాడు. సరీగా అదే సమయానికి హెడ్‌మాస్టర్ వచ్చి అహమ్మద్‌ను ఆపేశాడు. హెడ్‌మాస్టరు పంజాబు నివాసి, పేరు గులామ్ సర్వర్ కాదియాని! లావాటి కండద్దాలు, సన్నని బక్కపలు చని శరీరం! బీదతనంతో కలసి ఒకరకం మంచితనం, నమ్రతా అతని ముఖంలో కనుపిస్తూవుంటుంది! అతనికి తన స్కూలు పిల్లలంటే చాలా ప్రేమ. ముస్లిమ్ యువకులమీద ప్రత్యే కాభిమానం, సహానుభూతి కలిగివుంటాడు. ముస్లిం మతాన్ని సర్ సైయ్యద్ అభిప్రాయాల ప్రకారం మార్చాలని అతని వుద్దేశ్యం! రాజ్యంలో రావలసిన అభివృద్ధి నియమపూర్వకం

గానే వుండాలని అతని అభిప్రాయం! కనుక ఇటు హిందువులూ అటు ముస్లిములూ - ఉభయులూ సమాన గౌరవాల్తో చూస్తుంటారతన్ని. లిబరల్ అభిప్రాయాలు కలవాడు కావడం వల్ల తన వునికికి ఎలాంటి ప్రమాదమూ లేకుండా కాపాడు కుంటూ వుంటాడు.

గులామ్ సర్వర్ ఒక్క అడుగు ముందుకుపోయి అహమ్మద్ ఆలీ చేతుల్లో నుంచి పిస్టల్ లాక్కొని "ఇది మీనాన్న గారి పిస్టల్ కదూ?" అన్నాడు.

అహమ్మద్ ఆలీ తలవంచుకొని "అవునండి!" అన్నాడు.

"మరి నువ్వెందుకు తెచ్చావు?"

అహమ్మద్ ఆలీ సమాధానం ఇవ్వలేదు.

"ఈ పిస్టల్, ఈ తోటాలూ - ఇవన్నీ మీ నాన్న గారివి, వీటిని నీవు వేసుకు తిరగడానికి వీలులేదు. అసలు నీ వుద్దేశ్యం ఏమిటి? రావల్‌పిండిలో మమ్మల్నందరినీ పోలీస్ స్టేషన్‌లో కూర్చోబెడదాం అనా?"

అహమ్మద్ ఆలీ "అదంతా నాకు తెలియదు. నేను ఎప్పుడూ మానాన్న పిస్టల్‌ను దగ్గిరపెట్టుకు తిరుగుతూ వుంటాను!" అన్నాడు.

గులామ్ సర్వర్ అన్నాడు. "మన దేశం విషయం వేరూ, ఇక్కడి విషయం వేరూ! మన దేశంలో లైసెన్సు లేకుండా పిస్టల్ దగ్గిర వుంచుకొనవచ్చు! ఇక్కడ అలాకాదు. ఏడేళ్ళు జైల్లో కుక్కుతారు!"

అహమద్ ఆలీ మరేమీ మాట్లాడలేదు. గులామ్‌సర్వర్ అతనిదగ్గిరవున్న తోటాలనుకూడా లాక్కున్నాడు. పిస్టల్‌నూ,

తోటాలనూ మునిసిపల్ అధికారికి వప్పచెబుతూ "వీటిని జాన్‌మహామద్‌జాన్‌గార్కి చేర్చండి!" అని తరువాత యువ కుల వైపు చూసి "ఇకమీదట ఎవరైనా ఇలా పోట్లాడు కున్నారంటే వాళ్ళను వరీక్షల్లో కూర్చోనివ్వను!" అన్నాడు.

# 12

లఖమన్‌వతన్ దగ్గరనుండి కోహాటావరకూ వున్న ప్రదేశం ఒకరకంగా నిర్జన ప్రదేశం అని చెప్పవచ్చు! అక్కడ ముఖ్య జాగీర్దార్లోనూ, పంజాబులోను దొంగతనం, ఖూనీలూ-దోపిడీలూచేసిన నేరస్తులు దాక్కుంటూవుంటారు. వీళ్ళు అవ కాశాన్ని చూసిచుట్టువట్లవున్న గ్రామాల్లోనూ పట్నాల్లోనూ దోపిడీలు చేస్తూ ఇక్కడ దాక్కుంటూ వుంటారు. ఇక్కడ వంటరిగా ప్రయాణం చేయడం చాలాప్రమాదం. దారి వంకర టింకరగా వున్నది. ఎండవివరీతం, మంచినీళ్ళకొలనులు చాలా తక్కువ! ఎక్కడా పచ్చదనం కనుపించదు.

ఎండకు యువకులు సొమ్మసిలిపోతున్నారు. పోన్‌కనుమ దగ్గర వీళ్ళకు రెండు మానవశవాలు కనుపించినాయి. అది దొంగలుచేసినవని, దోచుకొని చివరకు చంపేశారు వాళ్ళని! పంచాల్‌దగ్గరకు చేరుకొనేసరికి ప్రొద్దు కృంకింది. కాని, గమ్యాన్ని చేరుకొనేవరకూ ఎక్కడా ఆగకూడదనుకు న్నారు. యువకులందరూ ఏకకంఠంతో "కోహాటా చేరుకొనే వరకూ ఎక్కడా ఆగం, రాత్రంతా నడవలసివచ్చినాసరే!" అన్నారు. రాత్రి పన్నెండు గంటలకల్లా కోహాటా చేరుకు న్నారు. రహదారిబంగళాలో మకాం చేశారు. ఉదయాన్నే

హెడ్‌మాస్టర్ గులాం సర్వర్ రెండు లారీలను తెప్పించాడు. అందరూ 'సాహోలా' వరకూ లారీల్లో ప్రయాణం చేశారు. వాళ్ళు ఇదే కార్లను చూడడం! వాళ్ళకు లారీలు పెట్రోలు తాగే గుర్రాల్లా వున్నాయి! ఈ విచిత్రమైన గుర్రాన్ని చూసి వాళ్ళు ఎంతో ఆశ్చర్యపడిపోయారు. ఇంతవరకూ వాళ్ళు ఈ గుర్రాలను ఫోటోల్లో చూశారు. ఇవ్వాళ స్వయంగా ఎక్కే అదృష్టం కలిగింది! 'సాహాలా'లో మొదటగా రైలునెక్కారు. ఒక్క నల్లనిగుర్రం వరుసగా ఇండ్లను పేర్చుకొని తనవెంట లాక్కుపోతున్నది. ఎంత చిత్రం! వీటిని చూస్తూంటే యువకు లకు తమలోవున్న పురాతన అభిప్రాయాలు తొలగిపోయాయి. అంతవరకూ వాళ్ళు 15 శతాబ్దంలో వున్నారు. కాని ఈ రైళ్ళనూ, పెట్రోల్ తాగి పరుగెత్తే ఇనుపగుర్రాలనూ చూస్తూ వుంటే వాళ్ళల్లో ఏదో నూతనమైన పరివర్తన జరుగుతున్నది. అంధకార ప్రాయం అయిన 15వ శతాబ్దంలోనుంచి దివ్య తేజోవంతమైన 20వ శతాబ్దంలోకి అడుగుపెడుతున్నారు.

రాత్రి బండికి, యువకులు 'సలాహా' స్టేషన్‌నుండి రావల్‌పిండికి బయలుదేరారు. మూడవతరగతి రైలుపెట్టెలో ఒకళ్ళకు ఒకళ్ళు అతుక్కొని గొర్రెలమందలా కూర్చున్నారు అందరూ! ఒకప్పుడు రైలుపెట్టెలోని ఎలక్ట్రిక్ లైట్లనూ, మరొకప్పుడు బయటిదృశ్యాలనూ ఆశ్చర్యంగా చూస్తు న్నారు యువకులు! ప్రయాణం అంతదూరం కాదు. లారీలో ఎముకలు విరిగిన యువకులు ఇప్పుడు కొంచం హాయిని అనుభ విస్తున్నారు. చాలామంది రైతుల కొంపలు రైలుపెట్టెలకంటే పెద్దవిగా వుండవు. అందువల్లే యువకులు చాలా ఆశ్చర్యంగా

రైలుపెట్టెను చూస్తున్నారు. ఇంగ్లీషువాడు ఎంత గొప్పవాడు! ఎలాంటి యిండ్లను కట్టాడు! ఆహా...ఆహా...!

# 13

రావల్పిండికి వెళ్ళాక హెడ్మాష్టర్ గులామ్ సర్వర్ తన విద్యార్థులందరినీ రాజా బజారులోవున్న 'లోకల్ ఫుంఛ్ హౌస్'లో విడిది దింపాడు. ఇక్కడ ముఖ్య జాగీరుకు సంబంధించిన రెండు అతిథిగృహాలువున్నాయి. ఒకటి సివిల్ లైన్సులో వుంది. అక్కడ రాజావారు, వారి మిత్రులూ, అతిథులూ దిగుతుంటారు. రెండవది రాజాబజార్ చౌక్‌లో వున్నది. ఇక్కడి పరిసరం నిమ్నతరగతికి చెందినది! గోనెపట్టాలతో కప్పిన అతి పురాతన దుకాణాలు – వాటిలోనుంచి "బంగాళా దుంపలు, అరటిపండ్లు" అనే కేకలు రాత్రింబగళ్ళూ వినిపిస్తుంటాయి. కార్లూ, బండ్లూ సైకిళ్ళూ నిరంతరం రొదపెడుతూ తిరుగుతూవుంటాయి. పట్నంఅంతా ఎలక్ట్రిక్ లైట్ల వెలుగులో మునిగితేలుతున్నది. అక్కడ ప్రతివాడూ సూటూ, బూటూ వేసుకొని మహారాజులా కనుపిస్తున్నాడు. రాత్రిపూట పట్నం దేవలోకంలా వుంది.

అరెరె... ఎంత పెద్దపట్నం! మనపట్నం దీనిముందు పల్లెటూరికంటే అన్యాయం!" అబ్దుల్ అహమ్మద్ ఆలీతో అన్నాడు.

అహమ్మద్ ఆలీ అన్నాడు "మరేమనుకొన్నావు? అసలు నీవు ఇంతవరకూ ఏం చూశావు? మానాన్నగారు లాహోరును గురించి చెపుతూ వుంటారు. లాహోరులో ఈ

కొసను బయలుదేరితే, ఆ కొసను చేరుకునేసరికి, కనీసం రెండు రోజులు పడుతుందుట!"

"రావల్పిండికూడా అలాంటిదే!"

"కాని, లాహోరంత పెద్దదికాదు"

"ఐతే పరీక్షలు అయ్యాక ఒకమాటు లాహోరు వెళ్ళి వద్దాం?"

"ఎట్లా వెళ్తాం? డబ్బుకావద్దూ? లాహోరు చాలాదూరం చాలాడబ్బు కావాలి టిక్సు! (టిక్కెట్టు) కావద్దు ?

"మాష్టర్‌గారు టెక్స అనవసరంగా తీసుకొన్నారు. మనని ఎవ్వరూ అడగలేదు"

"నువ్వో ఒట్టి అమాయకుడివిరా అబ్దుల్ అదికాదోయ్ రావల్పిండి స్టేషన్‌లో, బయటికివస్తూ, హెడ్‌మాష్టర్‌గారు టెక్స లెక్కపెట్టి ఇవ్వాలా? నీవు మర్చిపోయావు ?"

"ఐతేమాత్రం ఏం? మనం టెక్స తీసుకోనవద్దు. ఊరకనే ఎక్కి కూర్చుందాము ఇక లాహోరు స్టేషన్ వస్తుందనగా దూకి పరుగెత్తుదాం!"

"ఈ బండ్లు - గాడిద లనుకొన్నావా, వెళ్తుండగా దూకడానికి?"

"మరైతే లాహోరు చూడడానికి ఇంకే మార్గమూ లేదా ?"

అహమ్మదలీ వుదాసీనంగా తలవూపాడు. "మా నాన్నగారు నాకుకూడా డబ్బు ఇవ్వలేదు. ఇస్తే నేను వెళ్ళివచ్చే వాడినే కాని, ఏంచేస్తాం? రావల్పిండినే చూద్దాం! రావల్పిండి కూడా ఏమంత తక్కువది కాదులే"

"ఇక్కడ ఏం వుంటున్నాయి చూడ్డానికి?"

అహమ్మదలీ అన్నాడు. "నేను అందరికీ చెప్పాను - శేర్ అలీ, జగజీత్, శాదరే. గుల్లే, మోహన్‌సింగ్, దాద్ - అందరికీ చెప్పాను. ఇవ్వాళ సాయంత్రం భోగంబజారుకు వెళ్ళాం పాటవినవచ్చును"

అబ్దుల్ అంతటినీ విచిత్రంగా చూస్తున్నాడు. అతనికి అహమ్మదలీ సాహసాన్ని చూస్తుంటే ఆశ్చర్యం వేస్తున్నది. అహమ్మదలీ ఈ పంజాబులో ఒక విచిత్రమైన బజారుకు వెళ్తూం టాడు. అక్కడ బియ్యం, ఉప్పూ, పుస్తకాలూ, గుడ్డలూ. ఇలాంటివి ఏవీ అమ్మరు. ఒఠి ఆడవాళ్ళను మాత్రం అమ్ము తుంటారు. అక్కడి ఆడవాళ్ళు చాలా అందంగా వుంటారనీ, వాళ్ళు మహావిలువైన వస్త్రాలను ధరిస్తూ వుంటారనీ - ఇది వరకే వినివున్నాడు అబ్దుల్. అలాంటి బజారునీ, ఆడవాళ్ళనీ చూడాలని అతనికి ఎన్నో రోజులుగా కోర్కెవుంది. అబ్దుల్ తీవ్రమైన ఆవేశంతో అహమ్మదలీ చేయి పుచ్చుకొని, "నన్నూ తీసుకుపో, నేనూ ఆ బజారు చూస్తాను!" అన్నాడు.

## 14

రాత్రిసమయం. భోగంబజారు బాగా సందడిగా వుంది. పూలు అమ్మేవాళ్ళు పూలూ, దండలూ అమ్ముతున్నారు, తాగివున్న రసికులు నిల్చునే గోడలమీద వుచ్చలు పోస్తు న్నారు. ప్రసిద్ధ పుర్షాకవులు 'దాగ్' 'మీర్'ల కవిత్వాలు ప్రతిఇంట్లోనుంచీ వినిపిస్తున్నాయి. మాంసం వుడికిన ఘాటైన --ాపవ ముక్కలను పగుల గొట్టేస్తున్నది. ఒకచోట కోళ్ళను

కాలుస్తున్నారు. వేరొకచోట ఎవడో రసికుడు నడిబజార్లో ప్రేయసి ఇస్తున్న ముద్దును ముందుకువంగి తీసుకొంటున్నాడు. మరొకటోట కొంతమంది నవనాగరికపు యువకులు వీళ్ళను చూసి కేకలు వేయడం ప్రారంభించారు. "అగేయ్! కొండ ఎలుకలురోయ్ పరీక్షలు రాయడానికి వచ్చినట్టున్నారు!" ఇది విని జగజీత్, అహమ్మద్, అబ్దుల్, దాద్ – వీళ్ళంతా కొట్లాటకు దిగారు. కాని, కాదరు వీళ్ళను శాంతపరిచాడు.

అహమ్మద్ఆలీ బజారంతా తిరిగి ఒకఇంటిని సెలక్టు చేశాడు. అందరూవచ్చిన ఆ ఇంట్లోకిపోయారు. ఒకరూపాయి ఇచ్చి కాసేపు పాటవిన్నారు. తరువాత మరొకఇంటికిపోయారు. తరువాత మరొకఇంటికి! ఈ విధంగా అహమ్మద్ఆలీ వాళ్ళను వేసుకొని, ఒకదాని తరువాత ఒకటిగా ఆ ఇళ్ళనూ ఎక్కి-దిగారు. రాత్రి పూర్తిగా తనసిగ్గును విడిచేసుకొన్నది. నడిరాత్రి! వీళ్ళుకూడా అభ్యస్తులయారు. బేరం ఆడడం ప్రారంభించారు. దగ్గిర డబ్బు లేకపోవడంవల్ల అవసరమైన డాబుసర్లను ప్రదర్శించసాగారు. రెండుమూడు చోట్ల దెబ్బలు తినే వరకూ వచ్చింది వ్యవహారం.

ఆ యిండ్లల్లోకి వెళ్ళేటప్పుడు మొదట అబ్దుల్ చాలా వుత్సాహంగా వున్నాడు. ఎంత అందమైన నీలలోహితకాంతి! ఎలాంటి తివాచీలు! ఎంతవిలువైన సోఫాలూ! రెసిడెంట్ బహద్దూరు ఇంట్లో తను సరిగా ఇలాంటివే చూశాడు.

ఇలా ఎర్రని ముఖాలకు తెల్లని పౌడర్లు కొట్టుకొన్న ఆడవాళ్ళను తన దేశంలో ఎన్నడూ చూడలేదు అబ్దుల్! ఈ

ఆడవాళ్ళకళ్ళూ, వళ్ళూ ఎలా మెరుస్తూవుంటయ్యి! చూపులు ఎంత వేడిగా వుంటాయి! అయినా అబ్దుల్ ఒక ఇంటినించీ మరొక ఇంటికి ఎక్కి దిగీ విసిగిపోయాడు. ప్రతిఇంట్లోనూ దాదాపుగా అందరూ తనకాశ్మీరునుంచి వచ్చినవాళ్ళే అక్కడక్కడా పంజాబీ, పఠానీ వాళ్ళు వున్నారు. అయినా బహు అల్పం! మొత్తం సంఖ్యలోచూస్తే తనదేశంవాళ్ళే ఎక్కువమందివున్నారు. భూతియా, వలందరీ, గోరావా, మాందర్, హారినీ, వూడి, శ్రీనగర్, జమ్మూ మొదలైన అనేక ప్రాంతాలనుంచి వీళ్ళువచ్చారు. పైన ఉదహరించిన ప్రతిచోటా రైతులు బీదవాళ్ళు, వస్తులతో జీవితాలు వెళ్ళబోస్తూఉంటారు. పాపం ఈహారిణాక్షులుఒక్కగోధుమగింజకోసరం, ఒక్కగజంగుడ్డకోసరంకాపురంతమసౌభాగ్యాన్నంతా చెరుపుకొని ,అత్తింటినీ; పుట్టింటినీ విడచి—ఇక్కడికివచ్చారు.“నూరాంబేగమా! రేశ్మాంమిన్ రానీ”అబ్దుల్ వాళ్ళపేర్లను లెక్కపెట్టాడు. అందరూ తనదేశంవాళ్ళే. తనకు తల్లి, చెల్లెలు, అక్క, ప్రేయసీ అయినకాశ్మీరుస్త్రీ ఇక్కడ కేవలం వ్యభిచారిగా మాత్రం నిలిచింది. నడకలో, కట్టులో, బొట్టులో ఒకరకమైన తెచ్చిపెట్టుకొన్న వెకిలితనం, వికృతస్వభావం గోచరిస్తున్నది వీరందరిలోనూ! తన అందమైన దేశాన్ని ఈ గతికిలాగిన డోంగరా ప్రభుత్వం మీద ఘోరమైన ద్వేషం ఉప్పొంగింది అబ్దుల్ హృదయంలో. తన దేశంమీద అధికారాన్ని చెలాయిస్తున్న పంజాబీలమీద చెప్పరాని క్రోధం పుట్టుకువచ్చింది అతనికి! ముసల్మానుల అభివృద్ధిని నిరోధిస్తున్న సమస్తహిందువులనూ సర్వనాశనం చెయ్యాలన్నంతే ఉద్రేకం కలిగిందతనికి. ఆ క్షణానే అతనొక

ఆదర్శాన్ని నిర్మించుకొన్నాడు. తనొక ముస్లిమ్ సైన్యాన్ని సమకూర్చి, దానిద్వారా తమఅభివృద్ధిని విరోధిస్తున్న హిందువుల మీందా, డోంగరాలమీందా, పంజాబీలమీందా యుద్ధంచేయాలను కొన్నాడు. వారందరినీ ఏరిఏరి చిత్రవధ చెయ్యాలనుకొన్నాడు. అబ్దుల్ శరీరం కంపించసాగింది. అప్పటికే ఐదారిండ్లు తిరిగాడు. మొదలకుండా వెళ్ళి బజారులో ఒకప్రక్కన మౌనంగా నిలబడ్డారు. ఇంతలో అపరిచితుడు వచ్చి అతని బుజంమీంద చెయ్యివేసి ఇలా అన్నాడు "మిత్రమా! నిజం చెప్పు! నీకు కూడా కాశ్మీరు పిల్లే నచ్చుతుంది కదూ?— పిల్ల—అహా—మహా బాగుంటారు. ఎర్రగా, పొట్టిగా, తియ్యగా, సీమరేగిలా వుంటారు! పంజాబువాళ్ళా? ఒఠిగయ్యాళిముండలు!"

అబ్దుల్ కోపంతో అతనిచేతిని బుజంమీందనుండి అవతలికి నెట్టేశాడు. అతనిదగ్గిర ఘాటైన సారావాసన కొడుతున్నది.

అపరిచితుడైన ఆ త్రాగుబోతు రెండవచేతినికూడా అబ్దుల్ బుజంమీంద పెట్టాడు. "ఎందువల్లే మిత్రులందరూ కాశ్మీరు పిల్లల్ని కోరుకుంటూవుంటారు. అసలు రహస్యం ఒకటి వుంది. కాశ్మీరు పిల్లలు రూపాయి, మహాఅయితే రెండురూపాయిల్లో వచ్చేస్తారు. ఇక పఠానీ, లేక, పంజాబీ స్త్రీలను కదిలించామా? ఐదురూపాయిలకు తక్కువ మాట్లాడనే మాట్లాడరు! ఔనా, మిత్రమా?" అన్నాడు.

ఆ అపరచిత త్రాగుబోతు అబ్దుల్‌ని కావలించుకొన్నాడు. అబ్దుల్‌కు వూపిరాడలేదు. విసురుగా అవతలికి

నెట్టాడతన్ని, తాగుబోతు క్రింద పడబోయ్యాడు. కాని తట్టుకున్నాడు "నువ్వా, కొండఎలుకలా వున్నావు! ఏం విషయం? ఎందుకు ఇక్కడ నిలబడ్డావు? చెల్లెల్ని తార్చడానికివచ్చావా? ఏదీ నీ చెల్లెలు ? ఎక్కడ వుంది?" అన్నాడు.

అబ్దుల్ ఒక గుద్దుగుద్దాడతన్ని! అతను తూలాడు కానీ క్రిందపడలేదు. రెండుచేతులనూ ముందుకు జాపుతూ ఇలా అన్నాడు "నేను పంజాబీ పైల్వాన్ను! ఇలాంటి గుద్దులు ఎన్నో రోజూ అభ్యాసంకోసం నాశిష్యుల చేత గుద్దించుకొంటూ వుంటాను. హా...హా...హా...నన్ను ఏమనుకొంటున్నావు? నీ చెల్లెలు ఎక్కడ వుందో చెప్పు ? తీసుకుపో నన్ను."

అబ్దుల్‌కు ఎక్కడలేని బలమూ సాహసమూ వచ్చింది. గబగబా నాలుగు గుద్దులు గుద్దాడు "ఇది మారాంది, ఇది బేగమ్ంది, రేష్మాంది - ఊ తీసికో! ఇదిగో ఇది కాష్మీరును అవమానపరిచినందుకు - ఊ తీసికో!" అన్నాడు.

"అరేయి, నువ్వు కాష్మీరువాడివిరా ?" పహిల్వాన్ పెద్దగా అరిచాడు.

"అవును నేను కాష్మీరువాడిని. మానాన్న కాష్మీరువాడు. మా వంశం రెండువేల సంవత్సరాలనుంచీ కాష్మీరు గడ్డమీద వుంటున్నది!" అంటూ మరొక గుద్దు గుద్దాడు అబ్దుల్.

అపరచిత త్రాగుబోతుకు అబ్దుల్ గుద్దులు దున్నపోతు మీద వర్షం కురిసినట్టుగా వున్నాయి. అతను జేబులోనుంచి

సీసా నొకదాన్ని తీసి నోటికి అందించుకొంటూ "నువ్వు కాష్మీరువాడివి ఐతే, నేను సిలోన్ విస్కీ నెంబర్ వన్‌ను!" అని క్రిందపడ్డాడు వెల్లకిలా!

# 15

అబ్దుల్ భోగం బజారు దాటి చాలాదూరం వచ్చాడు. అయినా అతనికి ఇంకా కోపం శాంతించలేదు. అందువల్లే నడకలోని తీవ్రతను ఏమాత్రం తగ్గించకుండా తలవంచుకొని వెళ్ళిపోతున్నాడు. వూహాలూ — వాస్తవికతా ఈరెండూ కలసి అతని మస్తిష్కాన్ని గందరగోళపరుస్తున్నాయి. ఎత్తయిన భవ్యభవనాల్లో అతనికి తన దేశంలోని వంటపాలాలు కనుపిస్తున్నాయి. నవ్వుతూ బజార్న నడుస్తున్న మానవ ఆకారాల్లో అతనిని మానవ శరీరాల్తో నిర్మించిన వంతెన కనుపిస్తున్నది. పొడవైన అద్దాల బీరువాల్లో వున్న గుడ్డల తానుల మీాద కొరడాదెబ్బల చారలు కనుపిస్తున్నాయి. హోటళ్ళల్లో నవ్వుతూ విందులను ఆరగిస్తున్న వాళ్ళ ముఖాల్లో కాగాన్ నదిప్రవహిస్తూ కనుపిస్తున్నది. తీవ్రస్వరంలో మాట్లాడే పంజాబీ భాషలో అతనికి తుపాకీల పేలుడుశబ్దం వినిపిస్తున్నది. అబ్దుల్ వీటినంటినీచూస్తూ, వూహిస్తూ త్వరత్వరగా బజార్ల వెంట వస్తున్నాడు.

చాలాసేపటివరకూ అబ్దుల్ మౌనంగా తలవంచుకు నడిచాడు. ఎటు నడుస్తున్నాడో, ఎంతసేపటినుంచీ నడుస్తున్నాడో అతనికే తెలియదు. చాలాదూరం వెళ్ళాక బజార్లల్లో లైట్లు ఆరినట్టూ, భవనాలు పలుచబడ్డట్టూ అనిపించింది అత

నికి ! క్రమంగా తను పట్టణాన్ని పూర్తిగాదాటి కాలిబాటను నడుస్తున్నానని తెలుసుకున్నాడు. దారికి రెండువైపులా విస్తృతమైన వృక్షాలు వున్నాయి. తనాదారిన వంటరిగా నడుస్తున్నాడు. అబ్దుల్ ఒకమాటు ఆకాశంవంక చూశాడు! ఎంత విశాలం నక్షత్రాలు వింతకాంతిగా వెలుగుతున్నాయి. అతనికి ఏదో తెలియని భయం వేసింది. దగ్గరలోవున్న ఒక మైలురాయిమీద చతికిలపడ్డాడు. దానికి ప్రక్కనే జొన్నచేను. అందులోనుంచి తడిమన్ను వాసనవస్తున్నది. జనశూన్యత, ఒంటరితనం, జొన్నచేలోనుంచివచ్చే తడిమన్ను వాసన అతడిని కొంత శాంతచిత్తుడినిచేసినాయి. కొద్దిసేపటి తరువాత అతను చప్పునలేచి తను కూర్చున్న మైలురాయివంక చూశాడు. అది రావల్పిండినుండి శ్రీనగరుకు పోయేదారి ! అదేదారిన ముక్కుకు సూటిగా పోదామా ? అనుకొన్నాడు. తనదేశానికి బానోదగ్గరకు, తన చెల్లెలు రజీదగ్గరకు పోదామా అనుకొన్నాడు; కాని తనచెల్లెలు ఎక్కడ వున్నది? ఏ పరిస్థితిలో వున్నది? అసలు వున్నదో లేదో? తెలియదు !

అబ్దుల్ చాలా అలిసిపోయాడు. ఇప్పుడు శ్రీనగరుకు నడవడం అసంభవం. కనుక వెనక్కుతిరిగి పట్నంవైపుకు నడిచాడు కాళ్ళీడ్చుకుంటూ.

## 16

చాలా ప్రొద్దుపోయాక వెతుక్కొంటూ రాజాబజారులోని తన మకాంలోకి చేరుకొన్నాడు అబ్దుల్. అందరూ నిద్రపోతున్నారు. ఇంకా కొంతమంది మకాం చేరుకోలేదు.

తనప్రక్కన దగ్గరగా ఎవరో యువకుడు నిండా ముసుగుతన్ని పడుకొని వున్నాడు. అబ్దుల్ అతన్ని బుజం తట్టిలేపుతూ "ఇక్కడ నా చోట్లో పడుకొన్నావేం? నీ ప్రక్కమీదకు వెళ్ళు" అన్నాడు.

నిద్రపోతున్న యువకుడు లేచి కూర్చున్నాడు. చీకట్లో అతనిముఖం సరిగా కనుపించడంలేదు. అతను హాద్దు కొలుచు కొంటూ" నువ్వు వచ్చావా! నీకోసరమే ఇంతసేపటిదాకా ఎదురుచూచాను" అన్నాడు.

"ఎవరు నువ్వు?"

"నేను నీకు అన్నను. గులాం మహమద్‌ను!"

కొంతసేపటివరకూ అబ్దుల్ మౌనంగావుండిపోయాడు. అతను కూడా అలాగే మౌనంగా అబ్దుల్‌వంక చూస్తూ వుండిపోయాడు. కొద్దిసేపు గడిచాక అబ్దుల్ అన్నని పూర్తిగా పోల్చుకొన్నాడు. అమాంతం అన్నను కౌవలించుకొన్నాడు. ఒక వేడి నిట్టూర్పు అతని గుండెలను చీల్చుకొని బయటికి వచ్చింది. అతని కండ్లు అశ్రుపూరితాలు అయినాయి. అబ్దుల్ దుఃఖిస్తూ "నాన్నని రాజాకర్మ అలీ చంపేశాడు. రజ్జీని పోలీసులు పట్టుకుపోయారు. ఇప్పుడు ఎక్కడవుందోకూడా తెలియదు. ఫజల్‌నికూడా పట్టుకుపోయారు!" అన్నాడు.

"నాకు అంతా తెలుసు! నేను పత్రికల్లో చదివాను!" అన్నాడు గులాం మహమద్.

"పత్రికల్లోనా? ఇక్కడ పత్రికల్లో వేశారా?"

"అన్నిపత్రికల్లోనూ కాదు. ప్రత్యేకం మన పత్రికల్లోనే వేస్తారు !"

"మన పత్రికలనడంలో అన్నగారి అభిప్రాయం ఏమిటో అడుగుదామనుకున్నాడు అబ్దుల్! కాని, ఇంకా అడగవలసిన ప్రశ్నలు అనేకం వున్నాయి! ఎన్నో సంవత్సరాల తరువాత ఆశలు వదులుకొన్న అన్న కనుపించాడు. ఇన్నాళ్ళు ఎక్కడవున్నాడో? ఇవన్నీ అడగవలసిన ప్రశ్నలు"

"నేను ఇక్కడ వున్నానని నీకెలా తెలిసింది ?"

"బాగానే! నీవు ఎక్కడవుండేదీ, ఏంచేస్తుండేదీ, ఎప్పటికప్పుడు నాకు వార్తలు తెలుస్తుంటాయి. మా మనుషులు అన్నీ తెలియచేస్తుంటారు. నీవు పరీక్ష రాయడానికి వస్తావని నాకు ముందే తెలుసు.

"అదిసరే, ఇన్నాళ్ళనుంచీ ఎక్కడవున్నావు ?"

గులామ్‌మహమ్మద్ మెల్లగా తన కష్టగాథను వినిపించాడు. అతను యింటినుంచి పారిపోయినప్పుడు మనిషి చాలా బలంగా వుండేవాడు. కనుక మొదటగా ఒక కట్టెలఅడితీలో కట్టెలు కొట్టడానికి కుదిరాడు. తరువాత ఒక బొగ్గుల దుకాణంలో పనికి కుదిరాడు. అక్కడినుండి ఒక కూరగాయల కొట్లో పనికి కుదిరాడు. అప్పటికి అతనికి రావల్పిండిమీాద విసుగు పుట్టింది. అక్కడినుండి లాహోరు పోదాంఅని టిక్కెట్టు లేకుండా రైల్లో వెళుతూండగా వజీరాబాద్ దగ్గిర టిక్కెట్టు కలెక్టర్ అతన్ని దింపేశాడు. అక్కడ తను పదిరోజులు రిమాండ్‌లోవున్నాడు. తరువాత టిక్కెట్టులేకుండా ప్రయాణిం

చేసిన అపరాధం క్రింద మూడు నెల్లు జైలు వేశారు. శిక్ష ముగిశాక వజీరాబాద్‌లోనే కత్తులు తయారుచేసే ఖార్ఖా నాలో పనికి కుదిరాడు. అక్కడి పనివాళ్ళందరూ ముస్లిములు. యజమాని హిందువు! మంచి ధనవంతుడు. అక్కడి పనివా ళ్ళందరూ జీతాలు చాలవని సమ్మె చేశారు. ఆ హిందూ యజమాని పోలీసులసాయంతో సమ్మెను విచ్ఛినం చేయడానికి వచ్చాడు. పనివాళ్ళకు కోపంవచ్చి యజమానిని చచ్చేట్టు బాదారు. ఆ సందర్భంలో మళ్ళీ ఒకమాటు సంవత్సరంపాటు జైలుశిక్ష వేశారు. జైలునుంచి నేరుగా లాహోరు పోయాడు. అక్కడ ఒక రాగి పాత్రలను తయారుచేసే ఫ్యాక్ట రీలో పనికి కుదిరాడు. అక్కడ పనివాళ్ళందరూ ముస్లిములు. యజమాని హిందువు. ఒకసారి జీతాల తగ్గింపు విషయంలో పోట్లాటవచ్చి యజమానిని దూది ఏకినట్టు ఏకారు. ఈసారి మూడేళ్ళు జైలు పడ్డది. ఈసారి జైలుకు పోవడం అతనికి చాలా ఉపయోగించింది. ఇక్కడ అతనికి మౌలానాహబీబ్ అహమ్మద్‌గారి పరిచయం లభించింది. వారు రాజకీయ ఖైదీలు జైలులో ఉన్నారు. వారినీ అతన్నీ వంటపనికి పెట్టారా జైల్లో! జైల్లో మౌలానాహబీబ్‌గారి మాటకు ఎదురులేదు. జైలు అధికారి సూపరింటెండెంట్ కూడా వారి భావాల్తో ఏకీభవించేవారే. ఇద్దరికీ హిందువులంటే ద్వేషం! ఆ మూడేండ్ల జైలు కాలం లోనూ గులామ్‌మహమ్మద్ చాలా చదువుకొన్నాడు. ఇప్ప టికీ చదువుతున్నాడు! "అంజుమన్, ఖుందామా-ఉల్-ముస

ల్మాన్"కు ఉపాధ్యాయుడు. అనేకచోట్ల లెక్చర్లు ఇస్తూంటాడు. రేపు సాయంత్రం రావల్‌పిండిలో లెక్చర్ యిస్తాడు.

"లెక్చర్ అంటే-మా స్కూల్లో ఇస్తూంటాము. అదేనా ?" అబ్దుల్ అడిగాడు.

మహమ్మద్ నవ్వి "కాదు. లెక్చర్ అంటే అదికాదు. లెక్చర్‌లో కొంచం గరమ్‌మసాలా కలవాలి; అప్పుడే అది లెక్చర్ అనిపించుకొంటుంది. తిట్లూ, ఎత్తిపొడుపులూ, అబద్ధాలూ, మెత్తదనం, ఉన్నత, నిప్పూ నీరూ, వెన్నెలా, చలీ, అన్నీ కలిస్తే లెక్చర్‌గా తయారవుతుంది! చాలా విచిత్రమైన వస్తువులే! నువ్వూ వినటానికి వస్తావా ? నేను ఇక్కడనుండి రేపు నిన్ను వెంటతీసుకుపోతాను. బహుశా రేపు నేను అరెస్టు కావచ్చు!

"ఎందుకు ?"

"నేనీ లెక్చర్‌ని - కాశ్మీర్ మహారాజుగారికి వ్యతిరేకంగా ఇస్తున్నాను. డోంగరా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక పెద్ద ఉద్యమాన్ని లేవదీస్తున్నాను!"

"భలే మంచిపని! మరైతే నేనుకూడా ఒక లెక్చర్ చెబుతాను!"

"అప్పుడేకాదు. బాగా చదువు ఇంకా చదువు...!"

"పదోక్లాసు తరువాత ఏం చదవనూ ? మనకు అసలు కాలేజీలేలేవుగా!"

"నువ్వు కాష్మీర్‌లో వుండొద్దు! పంజాబు వచ్చెయ్యి నేను చదివిస్తాను!"

"నేను ఎన్నటికీ పంజాబు రాను. ఇక్కడివాళ్ళు మనల్ని ద్వేషిస్తారు. కుక్కల్నిచూసినట్టు... ఎలుకల్ని చూసినట్టు చూస్తారు!"

"అది సరికాదు. అందరు పంజాబీలూ అలావుండరు. ముఖ్యంగా పంజాబీ ముసల్మానులు మనమంటే ఎంతో సానుభూతిని చూపుతారు. కాష్మీరు ముసల్మానుల కోసరం వేలకు వేలు రూపాయిలు చందా ఇస్తున్నారు. వార్తాపత్రికలు కూడా మనతరఫునే వున్నాయి. అంతెందుకూ, ఇంగ్లీ వాళ్ళు కూడా మనతో కలిసిపోయారు. వాళ్ళ 'సివిల్ ఎడ్మినిస్ట్రి గజట్' కాష్మీరు ముసల్మానుల స్వాతంత్ర్యాన్ని గురించి రాస్తున్నది. నిన్న ఆ పత్రిక మహారాజావార్ని సింహాసనం మీాదనుంచి దింపేయడం అవసరం అని రాసింది" అన్నాడు మహామద్.

"ఆఁ" అబ్దుల్ ఆనందాన్ని పట్టలేకపోయాడు.

"అవును. నీవు పూరకే చూస్తావుండు...ఈ దుర్మార్గుల ఆటకట్టే రోజులు వచ్చినవి! కాశ్మీరు మొత్తంలో ఒక్క హిందువు కనుపించినా నాపేరు గులాం మహామ్మద్ కాదు!" గులాం మహామద్ చాలాకోపంగా అన్నాడు", ఎక్కడ చూసినా వీళ్ళే, ఎక్కడచూసినా ఈహిందువులే అధికారాన్ని చేపట్టుకు కూర్చున్నారు. బజార్లో, ఆఫీసుల్లో, పత్రికాలయాల్లో, ప్రభుత్వంలో, సైన్యంలో ఎక్కడచూచినా వీళ్లే! పాపం ముస్లిములను పలకరించేవాళ్ళే లేరు!"

"అట్లాచేస్తే చాలా బాగుంటుంది! అంతెందుకు మన విషయం చూడు. కాశ్మీరులో ప్రతి గొప్పవుద్యోగంలోనూ హిందువులే! ముస్లిము ఎక్కడా కనుపించడు. అథవా ఎక్కడైనా ఒకడు కనుపించినా, వాడు కాశ్మీరు ముస్లిము అయి వుండడు; పంజాబు ముస్లిము అయివుంటాడు!" అన్నాడు అబ్దుల్.

"పంజాబూ కాశ్మీరూ అనే బేధం ఏమీలేదు అబ్దుల్. వున్నదంతా హిందూ ముస్లిము అనే బేధమే."

"ఎందుకు లేదు? వున్నది! నువ్వు ఇక్కడికివస్తే కట్టెలు కొట్టుకోవడమూ? పంజాబీలు మనదేశానికివస్తే ముఖ్యమంత్రులు కావడమూ? ఇది బేధం కదూ?"

"అరె...నీకు అసలు ఏమీ తెలియదురా! నీవు ఒట్టి మూర్ఖుడవు. పంజాబు ముస్లిములే సాయపడకపోతే మనం అసలు డోంగరా రాజ్యాన్ని నాశనంచెయ్యనేలేము. వీళ్ళ ఒక్కళ్ళదేకాదు; ఇంగ్లీషువారి సాయంకూడా కావాలి. జైల్లోవుండగా హబీబ్‌గారు నాకు ఇదే చెబుతుండేవారు... కాని, ఇప్పుడు హిందువులూ – ఇంగ్లీషువారూ ఏదో సంధి కుదుర్చుకొన్నారుట!" అని కొంచం ఆగి ఈవిధంగా అన్నాడు గులాం మహమ్మద్. "ఈ సంధులన్నీ నిష్ప్రయోజనం! నీకెందుకు, నీవు చూస్తూవుండు. వచ్చే ఆరునెలల్లోనూ అంజుమనేఖుదాం – వుల్ – ముసల్‌మీన్" పంజాబూ – కాష్మీరులో వున్న మొత్తం జైళ్ళను దేశభక్తులతో నింపేస్తుంది. అప్పుడు కాష్మీర్ మహారాజు తనంత తనే దిగి

వస్తాడు. ఆ తరువాత మన కాశ్మీరులో మన ప్రభుత్వం వుంటుంది...మన ముస్లిములి!"

"ఓరి, భగవంతుడా!" అబ్దుల్ మెల్లగా అన్నాడు.

కొంతసేపటివరకూ ఇద్దరు అన్నదమ్ములూ మౌనంగా వుండిపోయారు. వారి మనోవీధుల్లో, భవిష్యత్తులో రాబోయే తమ ప్రభుత్వం చిందులు వేస్తున్నది.

అబ్దుల్ అడిగాడు "అప్పుడు నీవు మంత్రివి అవుతావా?"

"అవును. నేను మంత్రినౌతాను!" గులాం మహమ్మద్ అన్నాడు.

"ఆ నీవూ మంత్రివి కా!"

"తరువాత మనం మనవూళ్ళో ఒక పెద్దమేడ కట్టించుకొంటాము కదూ? నంబర్‌దార్ మేడకంటేకూడా పెద్దది, కౌనా?" అబ్దుల్ అడిగాడు.

"ఔను!"

"పొలాలు కొనుక్కుంటాం?"

"అవును!"

"నేను పూంఛ పట్నంలో బజార్లల్లో నడుస్తూవుంటే... ప్రజలు వంగివంగి నమస్కరిస్తారు!"

"ఎందుకు నమస్కరించరు? నమస్కరించక పోతే లండీ కొడుకుల్ని జైళ్ళల్లో తొయ్యం?"

అబ్దుల్ నవ్వాడు. అన్నగారిచేతిని గట్టిగా పుచ్చుకొని "జైల్లో బాధలు పెడతారా?" అడిగాడు.

"అవును, పెదతాదు!"

అబ్దుల్ మెల్లగా అన్నాడు "అయినా ఫరవాలేదు... నేను అన్నీ సహిస్తాను!"

# 17

రెండవరోజు సాయంత్రం అబ్దుల్ తిరిగి బసకురాలేదు. మూడవరోజు ఉదయం "విప్లవం" అనే దినపత్రికలో పెద్ద పెద్ద అక్షరాలతో క్రింది ప్రకటన ప్రకటించబడ్డది.

"కాశ్మీర్ సత్యాగ్రహుల అరెస్టు."

అంజుమనే ఖుదాం వుల్ - ముసల్మాన్ అధ్యక్షులు మౌలానా హబీబ్‌గారూ, ఉపాధ్యక్షులు మౌలానా గులాం మొహమ్మద్ గారూ వారి సోదరుడు అబ్దుల్ అరెస్టు చెయ్యబడ్డారు. సింధుసభను పోలీసులు లాఠీలతో బాదారు. "డోంగరా రాజ్యం నశించాలి" అన్న వారందరినీ అరెస్టుచేశారు. కాశ్మీర్ సత్యాగ్రహులు జిందాబాద్!

# 18

న్యాయస్థానంలో గులాం మొహమ్మద్‌కు మూడు సంవత్సరాలు కఠినశిక్ష విధించబడ్డది. అబ్దుల్‌కు ఆరు నెల్లు శిక్ష విధించబడ్డది, మౌలానా హబీబ్‌గారికి సంవత్సరం మూడు నెల్లు శిక్ష పడ్డది. న్యాయస్థానం మౌలానా హబీబ్‌గారు వున్నత వర్గానికి చెందినవారు కావడం వల్లనూ, వారికి సమాజంలో మంచి పలుకుబడి వుండడం వల్లనూ, వారిపట్ల జాగ్రత్తగా

వ్యవహరించ వలసినదని సిఫారసు చేసింది. పోతే మిగిలినవారి పట్ల సాధారణ అపరాధుల్లా!

## 19

రావల్‌పిండిలో అబ్దుల్ అరెస్టయినరోజునే ఇతర అనేక పట్టణాల్లో అరెస్టులూ, లాఠీచార్జీలు జరిగినాయి. వజీరాబాద్, లామోసా, లాహోర్, అమృత్‌సర్, స్యాల్‌కోట్, జమ్మూ, శ్రీనగర్, కాశ్మీర్ మొదలైన అనేకచోట్ల ఎంతోమంది ముస్లిమ్ సత్యాగ్రహులు అరెస్టయ్యారు. ఆంగ్ల ప్రభుత్వపు పత్రిక "సివిల్ అండ్ మిలిటరీ గజెట్" పెద్దపెద్ద శీర్షికలతో పై విషయాలను ప్రకటిస్తూ కాశ్మీర్ మహారాజును సింహాసనాన్ని దిగవలసినదని కూడా వ్రాసింది. హిందువుల పత్రికలు ఈ ఉద్యమాన్ని ఘోరంగా వ్యతిరేకించాయి. మహారాజుగారి తరఫున ప్రత్యేక సంచికలను ప్రకటించాయి. ఈ ఉద్యమాన్ని అణచవలసిందిగా ఆంగ్లప్రభుత్వాన్ని కోరాయి ఫలితంగా పంజాబులో "అంజుమనే ఖుదామ్ వుల్ మసబ్ మిాంస్"లో చేరడానికి ఎంతోమంది దేశభక్తులు (రజాకార్లు) ముందుకు వచ్చారు. హిందువుల తిట్లూ, విమర్శలూ ఎక్కువైనకొద్దీ, ముస్లిముల్లో ఆవేశం ఎక్కువకాసాగింది. ఒక్క మూడు నెలల్లో ముప్పయి వేలమంది ముస్లిములు డోంగరా ప్రభుత్వాన్ని వ్యతిరేకించి జైళ్ళకు వెళ్ళారు.

# పదవ అధ్యాయం

నెగడులో కట్టెలు మండుతున్నాయి. గది తలుపులకూ కిటికీలకూ ఆకుపచ్చని కర్టెన్లు వేళ్ళాడుతున్నాయి ఒక అందమైన మేజాబల్లముందు కూర్చుని A. D. C. ఠాకుర్ నైన్‌హాల్ సింగ్ ఠాకుర్ టికాక్కమన్ మోహన్‌సింగ్, చౌధరీ సజన దేవ్‌లు 'కట్ థ్రోట్' ఆడుతున్నారు. మధ్యమధ్య వాళ్ళు ఆటను ఆపి తమకు కొద్దిదూరంలో కూర్చునివున్న రాజకుమారుడు సంగ్రామసింగ్ వైపు చూస్తున్నారు. రాజకుమారుడు సంగ్రామ సింగ్ ఒక ఉత్తమమైన సచిత్ర ఆంగ్లప్రచురణ 'అలిఫ్ లైలా' ప్రతిని చూస్తున్నాడు. దానిఖరీదు రెండువేల రూపాయిలు. ప్రతిపుటలోనూ అందమైన స్త్రీల నగ్నచిత్రాలు వున్నాయి! అయినా రాజకుమారుడి మనస్సు ఎందుకనో ఆ పుస్తకంలో లగ్నం కావడంలేదు. ఇంతకుక్రితం ఎన్నోసార్లు ఆ చిత్రాల్ని తను చూశాడు. అందువల్ల కొన్నిపుటల్ని తిరగేసిన తరువాత అతనికి అప్రయత్నంగా ఆవలింత వచ్చింది. ఒకమాటు దీర్ఘంగా ఆవలించి కాళ్ళను జాపి నెగటి పై భాగంలో పెట్టుకొన్నాడు. కొద్దిక్షణాల తరువాత నెగటివేడి అతని అందమైన ఇంగ్లీష్ పాదరక్షలను దాటి మెత్తని మేజోళ్ళ లోపలవున్న పాదాలను స్పర్శించింది. అతనికి ఎక్కడలేని శాంతీ లభించింది! కాని, ఆ శాంతి ఎక్కువసేపు నిలవలేదు. రెండుక్షణాల తరు

వాత అతనికి ఆ ఉష్ణస్పర్శమీద కూడా విరక్తి కలిగింది. కాళ్ళను నెగటిమీదనుంచి క్రిందకు దించేశాడు. కిటికీకివున్న ఆకుపచ్చ కర్టెన్లను తొలగించి బయటి మంచురాలే దృశ్యాన్ని చూస్తూ కూర్చున్నాడు. మళ్ళీ రెండుక్షణాల తరువాత అతనిచూపులు మంచుమీదనుంచి కూడా మళ్ళీ తన చేతినవున్న గడియారం మీదకు పోయాయి. చాలా టయి మయింది. అయినా మాలీ రాలేదు ఇంతవరకూ! రాజకుమారు డికి కొద్దిదూరంలో కూర్చునివున్న ఎ. డి. సి. లు ముగ్గురికీ రాజకుమారుడి ప్రస్తుతపు మానసికస్థితి అవగతమే! కాని వారేమి చేయగలరు ?

రాజకుమార్ సంగ్రామసింగ్ వంశవృక్షం అతి ప్రాచీన మైనది. దానివయస్సు నాలుగువేల సంవత్సరాలు. ఈ వంశ వృక్షంలోని మొత్తం శాఖలూ జీవితంలో కేవలం నాలుగు సార్లు మాత్రమే స్మరించబడతాయి. ఎందువల్ల అంటే ఈ వృక్షం మరి అంత పెద్దదాయె! పుట్టుకసందర్భంలో ఒకమాటు ఈ వంశవృక్షాన్ని స్మరిస్తారు. రాజ్యపట్టాభిషేక సమయంలో మూడవమాటు స్మరిస్తారు. ఇక నాల్గవమాటు; ఇహలోకపు యాత్రను ముగించినప్పుడు; స్మరిస్తారు. తరువాత ఈ నూతన నుడుకూడా ఆ వృక్షంలోని ఒకశాఖ యై ఇదే క్రమంలో స్మరింపబడుతూవుంటాడు.

రాజకుమారుడు సంగ్రామసింగ్‌కు ఇంతవరకు వంశ వృక్షాన్ని ఒకేమాటు స్మరింపబడ్డది. అంటే సంగ్రామసింగ్ ఇంకా అవివాహితుడు! అతడికి పుట్టుకసమయంలో తను సూర్యవంశీయుడనీ, మహారాజుననీ తెలియకపోయినా పెద్దవా

డవుతున్న కొద్దీ చుట్టుపట్ల వున్న దాసదాసీజనాలూ— ఇతరులూ అతని చెవిదగ్గిర ఇల్లుకట్టుకొని "నీవు సూర్యపుత్రుడివి. నీవు భగవంతుడి కుమారుడివి. నీవు మహారాజుకొడుకువి!" అని తెలియచేశారు. క్రమేణా అతను దీన్ని నూటికి నూరుపాళ్ళూ సత్యం అనుకొన్నాడు. తను సూర్యపుత్రుడు! తను భగవంతుడి కొడుకు! తను మహారాజు కొడుకు! తను ఈ రాజ్యానికి వారసుడు. ఎర్రగా బుర్రగా వున్నాడు. సూర్యుడిలా మెరసిపోతూ అందంగా వున్నాడు. లక్షలకొలది ప్రజల ప్రాణాలకు తనుప్రభువు. వాళ్ళప్రాణాలుతనచేతిలోవున్నాయి! అజ్మీరు చీఫ్ కాలేజీలో చదువుతున్నాడు. తన మాటను కాదనే సాహసం మొత్తందేశంలో ఎవ్వడికీ లేదు! అలాంటివ్వాడు తను భగవంతుడికొడుకు ఎందుకుకాదు? ఈ మాలీ— ఇంతవరకూ ఎందుకు రాలేదు? రాజకుమార్ సంగ్రామసింగ్‌కు కోపం అధికం అయింది. ఉన్నతమైన అతని ఫాలం ముడతలు పడ్డది. పొడవైన సన్నని మెడను త్రిప్పి, వాకిటికి, కట్టిన పచ్చని కర్టెన్లను వైపుకుచూశాడు. కర్టెన్లు నానుకొని మాలీ నిలబడివున్నది. నల్లగా మెరుస్తున్న వేటకు వుపయుక్తమైన పాదరక్షలూ. తెల్లని జోధపురి పైజామా, తెల్లని వున్నికోటు, నెత్తిన పారిస్ పామస్‌లోని కేరాకుల్‌టోపి, చెవులకు వజ్రాలు పొదిగిన ఆభరణాలూ, కండ్లల్లో మెరిసే నీలాల తీక్షణమైన కాంతులు! ఇన్ని విశేషాణాలతోటీ వాకిట్లో నిలబడివున్నది మాలీ. కర్నల్ డిక్ కూతురు మాలీ! మాలీ చేతిలో చిన్న హంటర్ ఒకటున్నది. రాజకుమార్ సంగ్రామసింగ్ వైపుచూసి నవ్వుతున్నది!

ఎ. డి. సి లు మెల్లగా పేకముక్కల్ని ఒకమూలకు నెట్టి, బయటికి నడిచారు.

రాజకుమారుడి ముఖం విప్పారింది. అతను తనస్థానం నుండి లేచి ముందుకు రెండడుగులు వేసి చేతిని అందించాడు మాలీకి. మాలీ పేముబెత్తంలా వంగి రాజకుమారుడిచేతుల్లో వాలిపోయింది.

రాజకుమారుడు మాలీబంగారపు వెంట్రుకలను నిమురుతూ "ఇంత ఆలస్యం చేశావేం? రెండుగంటలుగా నీకోసరం ఎదురుచూస్తున్నాను!" అన్నాడు.

మాలీ నవ్వుతూ "నేనెలా వున్నాను?" అనడిగింది.

రాజకుమారుడు ఒక్కక్షణం మౌనంగా వుండిపోయాడు. తరువాత అలిఫ్‌లైలా ప్రతిని తెరచి చూపుతూ "ఇందులోని చిత్రాలు ఏవీ నీకు సరిపోవు!" అన్నాడు.

మాలీ అన్నది "బయటికి షికారు వెళ్ళివద్దాం పద!"

"ఈ మంచులోనా?"

"గుర్రాల్ని వేసుకువెళ్దాం!" అంటూ మాలీ రాజకుమారుడిచేతుల్లోనుంచి విడివడి కిటికీదగ్గరకు పోయింది. కిటికీకి వున్న తెరను మెల్లగా తొలగించి బయటికి తొంగిచూసింది. బయట మంచు విస్తారంగా కురుస్తోంది. చల్లనిచురుకైనగాలి మంచుసుద్దలనుమోసుకువస్తున్నది. మాలీ బుగ్గలమీాదా, చంపలమీాదా మంచుసుద్దలు అతుకుతున్నాయి. కేరాకుల్ టోపీ మంచుతుంపరలతో నిండిపోయింది.

మాలీ చప్పున వెనక్కు తిరిగి "ఇవ్వాళే ప్రథమంగా మంచు కురుస్తున్నది. నీకు షికారుకు పోవాలనీ. తిరగాలనీ అనిపించడంలా?" అడిగింది రాజకుమారుడిని.

"సరే, పద!" రాజకుమారుడు తలవూపి, దగ్గరలో వున్న గంటను ప్రయోగించాడు. సజన్ దేవుడు లోపలకు వచ్చాడు.

రాజకుమారుడు చాలా చనువుగా "సజన్! నేనూ, మాలీ కొంచం షికారుకు వెళుతున్నాము!" అన్నాడు.

"ఎటు వెళ్ళుతారు?" సజన్ దేవుడు అడిగాడు.

"ఎటు వెళ్ళుతాము?" రాజకుమారుడు మాలీని ప్రశ్నించాడు.

మాలీ కోపంతో పెదాలు కొరుక్కున్నది. రాజకుమారుడి ఈ అస్వతంత్రైను చూస్తే ఆమెకు ఒళ్ళుమంట! ఎక్కడికి వెళ్ళడానికికూడా వీలులేదా? వెడితే మందీ సిబ్బందీ వెంట అనివార్యంగా వుండవలసిందేనా? ఇంతఇరకాటంగా షికారుకు వెడితే ఏం ఆనందం తగలడి చస్తుంది?

మాలీ అన్నది "మీరు ఎవ్వరితోటీ చెప్పకుండా షికారుకు రాగలిగితే రండి...లేకపోతే విరమించుకోండి; నేను రాను!"

రాజకుమారుడు కొంచం గాభరాపడ్డాడు. "మాలీ! ఇందులో నేను చెయ్యగలిగింది ఏమున్నది? ఇది రాజ్యాంగ నియమం...చెప్పకుండా వెళ్ళడానికి వీలులేదు.

సజన్ దేవ్ అందుకొన్నాడు. "దారిలో ఏదైనా ప్రమాదం సంభవిస్తుంది అనుకోండి, అప్పుడేం చేసేట్టు?" అన్నాడు.

మాలీ తనచేతిలోని కొరడాను బల్లమీదకు విసురుగా కొట్టి సజన్ దేవుని ఉద్దేశించి "ప్రమాదాలు సంభవించవు–ఏమీ సంభవించవు! సరే, నేను వంటరిగానే వెళుతున్నాను. రాజకుమారుడిని నీఖైదులో వుంచుకో!" అన్నది హేళనగా

"ఖైదా?" రాజకుమారుడు సంగ్రామసింగ్ ఆశ్చర్యంతో మాలీ మాటలనే పునరుచ్చరించాడు.

"ఖైదుగాక మరి ఏమిటయ్యా? సాధారణ ప్రజల్లా నీవూ షికారు వెళ్ళకూడదా? రెండువందల గజాలు అటూ, ఇటూ సశస్త్రులైన సైనికులు వుండాల్నా! నాకు వద్దుబాబూ ఈషికారు!" మాలీ అన్నది.

మాలీ మరొకమాటు కొరడాను విసిరింది టేబుల్ మీదకు. కొరడా వంపులు తిరిగింది.

రాజకుమారుడు సజ్జనదేవ్ వైపుకు చూచాడు. సజ్జన్ దేవ్ రాజకుమారునివైపు చూశాడు. తరువాత రాజకుమారుడు మాలీ చేతిని గట్టిగా పట్టుకొని "సరే, పద! వంటరిగానే వస్తాను. నువ్వు...నేను...ఇద్దరమే! సరా? ఇదిగో సజ్జన్! ఎవ్వరికీ తెలియకూడదు! ఏం మాలీ అన్నాడు.

## 2

మాలీ రాజావారి గుర్రపుశాలనుండి తనకోసరం తెల్లని షైలట్ గుర్రాన్ని తెప్పించుకొన్నది. రాజకుమారుడు తన

మామూలు ప్రకారం నల్లని రూవక్ అనే గుర్రాన్ని తెప్పించుకొన్నాడు. మాలీ తన గుర్రాన్ని స్త్రీలు కూర్చోవడానికి వీలుగా వుండడానికి 'జీన్'ని తొడిగించింది. గుర్రం సిద్ధం అయ్యాక ఎగిరి ఎక్కి కూర్చున్నది. మాలీ ఇలా గుర్రం మీద ఎగిరి కూర్చోవడాన్ని చూసి రాజకుమారుడు మెల్లగా మంద హాసాన్ని చేశాడు. తరువాత తన గుర్రాన్ని మడమతో తట్టి ముందుకు సాగనిచ్చాడు. ఇద్దరూ గుర్రాల్ని తోలుకొని గుర్రపుశాల మైదానంలోనుండి రెసిడెంసీ భవనం వైపుకు సాగి పోయారు. ఇద్దరూ సరసన మెల్లిగా సాగిపోతున్నారు. రాజ కుమారుడు మౌనంగా మాలీ చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు. తెల్లని వున్నికోటులోనుంచి మాలీ ముఖం చాలా అందంగా చిన్నదిగా, రబ్బరుబొమ్మ ముఖంలా కనుపిస్తున్నది, తెల్లని గుర్రం. తెల్లని మంచూ - భూమ్యాకాశాలను కప్పి వేసిన ఈ తెల్లదనంలో రాజకుమారుడూ, మాలీ అలాగ చేతిలో చేతులు వేసుకొని, గుర్రాలమీద కూర్చుని పయనించడం ఎంతో అందంగావుంది! రాజకుమారుడు మౌనంగా ఆలోచించసాగాడు. "మాలీ ఎంత విలక్షణమైనది? తన జీవితంలోకి ఎంతోమంది స్త్రీలు వచ్చారు. కాని వాళ్ళంతా వట్టి మట్టిసుద్దలు! శవాలు! మాంసపుముద్దలు! మాలీ అలాంటిది కాదు; అగ్నిశిఖ! ఇప్పటికి ఎంతోమంది స్త్రీలు రాజకుమారుడి శయనాగారంలోకి వచ్చారు. ఎలా తల వంచుకొని గొర్రెల్లా వచ్చారో, అలానే తల వంచుకొని గొర్రెల్లా వెళ్ళిపోయారు. వాళ్ళల్లో కొంతమంది సిగ్గును అభినయించినా, కొంతమంది హావభావ ప్రకటనను గావించినా, అవన్నీ క్షణి

కాలు మాత్రమే! తుదిపర్యవసానం గొర్రెలా తలవంచుకుని బయటికి నడవడమే! ఈ అనుభవంతో రాజకుమారుడు కొన్ని స్థిరమైన నిర్ణయాలను చేసుకొన్నాడు. పురుషుడు ఎప్పటికీ పురుషుడే! స్త్రీ గొర్రె! పురుషుడి ఆజ్ఞలను శిరసా వహించడమే స్త్రీలలోని ముఖ్యలక్షణం! ఈ ముఖ్యలక్షణం! రాజవంశపు స్త్రీలనుండి సామాన్యరైతు స్త్రీలవరకూ ఒకే రకంగా హెచ్చుతగ్గులు లేకుండా కనుపిస్తూవుంటుంది! స్త్రీలకూ గొర్రెలకూ ఏమీ భేదంలేదు, అతను పుస్తకాల్లో ప్రేమను గురించి చదివాడు. తనుకూడా ప్రేమించడానికి ప్రయత్నం చేశాడు. కొంతమంది స్త్రీలు తనను ప్రేమించేట్టు వివశుడినికూడా చేశారు. అతను ఎంతో ఆత్రంగా ప్రేమను వెతుక్కుంటూ ఎదుటిస్త్రీ కండ్లలోకి చూచేవాడు. ఆకండ్లలో ఎంత వెతికినా ప్రేమ కనుపించేదికాదు. విస్తృతమైన శూన్య మైదానంలో తలవంచుకొని నిలబడిన గొర్రె కనుపించేది. దీంతో రాజకుమారుడు విసిగిపోయాడు. "ప్రేమ ఎక్కడా సంభవంకాదు. ప్రేమ వట్టి కల్పన, మోసం! ప్రేమ కవుల కవిత్వాలలోనూ, కామశాస్త్ర ఉద్గ్రంథాల్లోనూ తప్ప మరె క్కడా వుండదు" అనే నిర్ణయానికి వచ్చారు.

కాని మాలీ పరిచయంతో రాజకుమారుడి పై అభి ప్రాయంలో మార్పురాసాగింది. అతని నమ్మకం సడలింది. పురుషుడి ఆజ్ఞలను శిరసావహించ కుండా, అత నితో సరిసమానంగా వ్యవహరించే స్త్రీ కూడా వుంటుందా? సంభవమా? మిత్రుడిలా అనునయించి, శత్రువులా పోట్లాడి, ప్రేయసిలా మృదువుగావుండి, సమయంవస్తే తన్నుతాను

రక్షించుకోగల స్త్రీకూడా వుంటుందా? మాలీ సరిగా అలాంటి స్త్రీయే! నిర్భీతి, నిర్భయం, నిశ్శంక ఈమెలోని ముఖ్య విశేషణాలు! ఈమెదృష్టిలో రాజకుమార్ సంగ్రామ సింగ్ ఒట్టి సంగ్రామసింగ్ మాత్రమే! సంగ్రామసింగ్ ఇంత వరకూ కామశాస్త్రాలను ఎన్నింటినో చదివాడు. మాలీని చూచిన తరువాత అవన్నీ స్త్రీలకోసరం కాదు, గొర్రెల కోసరం రాసినవి అనిపించిందతనికి! నిజమైన ఆశయం మాలీయే! ఈ ఆధునిక యుగం ఆమెలోనూ; ఆమె ఈ ఆధునిక యుగంలోనూ ప్రతిఫలిస్తూ కనుపిస్తూ వున్నారు. మాలీ తీక్షణమైన చూపులనూ నునుపైన శరీరపు వంపులనూ చూస్తూవుంటే, రైళ్ళూ, కార్లూ, విమానాలూ ఉద్భవించిన ఈ యుగంలోని ఈ స్త్రీని జయించడం అసంభవం అనిపించేది అతనికి! తన కామశాస్త్ర పరిచయం ఇక్కడ ఎందుకూ పనికిరాదని దృఢమైంది. మాలీ కండ్లల్లో అగ్నికణాలు వున్నాయ్. పువ్వులు వున్నాయ్. ముత్యాలు వున్నాయ్. కన్నీళ్ళు వున్నాయ్ చిరునవ్వులు వున్నాయ్. మంచు సుద్దలున్నాయ్ కాని, గొర్రెలుమాత్రం లేవు! మాలీని గురించి ఇలా స్పష్టమైన పరిచయాన్ని పొందడంతో సంగ్రామసింగ్ హృదయంలో చిరకాలంగా గూడుకట్టుకొనివున్న 'అహం' ఒక్కమాటుగా దులిపివేసినట్లై పోయింది. అతను అతి సామాన్య మానవుడిలా మాలీముందు నిలబడి ప్రేమభిక్షను యాచించాడు. ఆక్షణాన అతని హృదయం మునుదెన్నడూ స్పందించనంత తీవ్రవేగాల్తో స్పందించింది! ప్రేమను అర్థిస్తూ వివశంగా కన్నీళ్ళను కార్చాడు, కాని మాలీ ఒప్పుకోనలేదు.

మాలీ సంగ్రామసింగ్‌తో ఆడింది. ఎగిరింది. దూకింది. నాట్యం చేసింది. గుర్రపుస్వారీ చేసింది. ఎన్ని చేసినా ఇద్దరిమధ్య వున్నా దూరం దూరంగానే వుండిపోయింది. ఆమె ప్రేమ అతనికి లభ్యంకాలేదు! సంగ్రామసింగ్ ప్రతిసారీ తన బాహువుల్లోకి తీసుకోవడానికి ప్రయత్నించేవాడు. మాలీ ప్రతిసారీ వ్యంగ్య పూర్ణమైన చిరునవ్వు నొకదాన్ని విసరి తప్పించుకుపోయేది. ఆ వ్యంగ్యహాసం సంగ్రామసింగ్‌లో తీరని అలజడిని కలిగించేది! ఈ వ్యంగ్యానికి అర్థం ఏమిటి ?

కాని ఇవ్వాళ మాలీ వ్యంగ్యపూర్ణమైన చిరునవ్వును విసరలేదు. మౌనంగా రాజకుమారుడి చేతిలో చెయ్యివేసి ముందుకు సాగిపోతున్నది. మంచుతోనిండిన దృశ్యాలను చూస్తూ! దగ్గరకు పోయినకొలదీ మంచుతో కప్పబడ్డ దృశ్యాలు విస్పష్ట మౌతున్నాయి. మార్గం అతి నిర్మానుష్యంగా వుంది. ఎక్కడా ఒకపక్షిగాని కనుపించడంలేదు. రెసిడెంసి భవనంముందు వుండే కావలా దర్వాన్‌కూడా ఇవ్వాళ తన డ్యూటీలోలేడు- వాళ్ళు ఇద్దరే దారిన ఒంటరిగా వెడుతు న్నారు. సి. ఐ. డి శాఖకాని ఎవ్వరూ లేరు వెంట! మాలీ కోటుమీద మంచు నిండిపోతున్నది. సంగ్రామసింగ్ మెల్లగా మాలీ కోటుమీదనుంచి మంచుసుద్దలను క్రిందకు రాల్చాడు. కాలరు మీదనుండి మంచు రాలి గుర్రపు వీపుమీద పడ్డది. మాలీ గుర్రపు వీపును నిమురుతూ "ఈ దృశ్యం అంతా మా ఐర్లండును జ్ఞప్తికి తెస్తున్నది!" అన్నది.

సంగ్రామసింగ్ కోపాన్ని అణచుకొంటూ "నాన్న గారు విదేశాలకు పంపించమంటే, పంపించడంలేదు. ప్రతీసారీ త్రోసిపుచ్చేస్తున్నారు!" అన్నాడు.

మాలీ అన్నది "ఈ రాచరికపు కైదులోనుంచి బయట పడితేగాని నీకు ప్రపంచం ఎలావున్నదో తెలియదు!"

"నాకు నువ్వేచాలు, మరేమీ వద్దు! ప్రపంచం ఎలా వుందో తెలియకపోయినా ఫరవాలేదు!"

పైమాటలను సంగ్రామసింగ్ హృదయస్ఫూర్తిగా అన్నాడు. మాలీకి అతనిమీద ప్రేమ ఉప్పొంగింది. వస్తుతహా రాజకుమారుడు మంచివాడే, చుట్టూచేరిన గ్రహాలు అతన్ని చెడగొడుతున్నాయి అనుకొన్నది మాలీ. సంగ్రామసింగ్‌లో తన పరిచయానికి వచ్చినప్పటినుండి చిత్రమైనమార్పు జరుగుతూ వచ్చిన విషయంకూడా మాలీకి తెలియకపోలేదు. అతని స్వరంలో నడకలో, మాటలో అన్నిట్లోనూ మార్పు జరిగింది. విచిత్రమైన నిస్సహాయత, వ్యాకులతా ద్యోతకం అవుతున్నవి.

రెసిడెన్సీ భవనాన్ని దాటి ముందుకు వచ్చారు. రాజకుమారుడి మాటకు ఏమీ సమాధానాన్ని ఈయలేదు. మంత్రిగారి సురమ్య భవనాన్నికూడా మౌనంగానే దాటేశారు. మంత్రిగారి భవనం దారికి అటుప్రక్కన ఎత్తైన ప్రదేశంలో కట్టబడ్డది ఇటుప్రక్కన ఒకచెరువు. ఈ దారి చెరువుమీదగా వెళ్ళి దూరపుకొండల్లో అదృశ్యమౌతుంది. చెరువుదగ్గిర మాలీ గుర్రాన్ని ఆపింది.

"ఎందుకూ?" సంగ్రామ్ అడిగాడు.

"చెరువును చూచేసరికి నాకు దాహం వేసింది," మాలీ అన్నది.

"ఈ మంచులోనా?"

"అవును"

"అయినా, ఈ నీళ్ళు ఎల్లా తాగుతావు? ఇది ఎరుకల వాళ్ళ చెరువు. చాలా అసహ్యంగావుంటారు వాళ్ళు. వాళ్ళంతా ఇక్కడినుంచే నీళ్ళు పట్టుకుపోవడం!"

"ఇది ఎరుకల వాళ్ళ చెరువని నీ కెల్లా తెలుసు?"

అతని జ్ఞాపకాలపొరలు తిరగబడ్డాయి. ఒకమాటు తను ఇటునుంచి వెళుతూ ఒక ఎరుకలపిల్లను చూచాడు. చాలా అందమైనపిల్ల. ఈ చెరువులో నీళ్ళు పట్టుకుపోవడాన్ని తను చూచాడు. తరువాత ఎన్నోసార్లు ఆ అమ్మాయిని చూడడానికి తనీదారిన వెళ్ళాడు. కాని, చివరకు ఆఅమ్మాయి కూడా గొర్రె అని తేలిపోయింది. తరువాత ఆ దారిన నడవడం మానుకొన్నాడు. సంవత్సరాలు గడచిపోయినాయి. మళ్ళీ ఇవ్వాళ నడుస్తున్నాడు తనాదారిన! ఈ విషయాన్ని తను మాలీకి చెప్పలేదు! ఈ వెనకటి జీవితాన్ని తల్చుకొంటే సిగ్గు, లజ్జా కలుగుతున్నాయి. మాటని తప్పిస్తూ "ఇక్కడి నీళ్ళు మనం తాగకూడదు. నిషేధం. మహలుకు వెళ్దాంపద. అక్కడ రాజసరోవరంలో నీళ్ళు త్రాగవచ్చును," అన్నాడు.

"అట్లాకాదు. నేను ఈ చెరువు నీళ్ళు త్రాగుతాను. మివ్వూ తాగాలి!"

"మొండిపట్టు పట్టకు, పద!"

"మొదలు నువ్వు గుర్రం దిగుతావా? కొరడా విస రనా ?"

రాజకుమారుడు గుర్రాన్నిదిగి అటూఇటూ చూసి "కాని, ఎలా తాగేట్టు? ఒక్క గ్లాసయినాలేదే?" అన్నాడు.

"గ్లాసులు లేకపోతేఏం? గుర్రాల్లా నీళ్ళల్లో మూతులు పెట్టి తాగుదాం! ధప...ధప...ధప...!" మాలీ నవ్వింది.

"వద్దు...ఎవరైనా చూస్తారు!" సంగ్రామ్ అభ్యంత రాన్ని చెప్పాడు.

"ఎవరు చూస్తారు? చూడనీ! ఇంత భయపడతావేం? ఇంత భయస్తుడివి ఇక నువ్వేం రాజ్యాం చేస్తావు? ఎవరైనా చూస్తారయ్యా, చూస్తే ఏమనుకుంటారు? రాజుకొడుకు గుర్రంలా నీళ్ళు తాగుతున్నాడు అనుకొంటారు. అంతేగా? బస్, నీ భయంకాస్తా ఎగిరిపోతుంది. ఇన్, నేను మహారాజు కొడుకునీ, చక్రవర్తి కొడుకునీ అని గర్వపడేరోజులు పోయి నాయి. ఇప్పుడా గర్వాలు గానీ, అభిమానాలుగానీ ఏమీ పనికిరావు. నావరకు నన్నుచూడు. నేనొక కర్నల్ కూతు రుని. పాతిక సంవత్సరాల క్రితం మా నాన్న చెప్పులు కుట్టే వాడుట...! అంటే చెప్పులుకుట్టే మాదిగవాడి కూతుర్నన్న మాట. ఐతే ఏం? నిజంచెప్పు...నీ రాజమహాల్లో నాలాంటి అందగత్తెలు ఎవరైనా వున్నారా?"

సంగ్రామసింగ్ మాలీవైపు చూశాడు. ఆమె చూపు లోనూ, జుట్టు వంపుల్లోనూ, స్వరంలోనూ ఒక విధమైన

తీవ్రాకర్షణ గోచరించినది రాజకుమారుడికి. అలాంటి ఆకర్షణ రాజమహాలు స్త్రీలల్లో ఎవ్వరిలోనూ అతను చూడలేదు. అతడు అన్నాడు "నేను చెప్పలేను. నీవు నాకు చాలా క్రొత్తగా కనుపిస్తున్నావు. ఏవో క్రొత్త లోకాలలోనుంచి నాకోసం ఎగిరివచ్చినట్లుగా కనుపిస్తున్నావు నిన్ను చూస్తూ వుంటే నామనస్సు ఎందుకనో విపరీతంగా వ్యాకులపడుతున్నది. ఒక్కొక్కసారి నీవు ఎలా వచ్చావో అలాగే తిరిగి వెళ్ళిపోతే బాగుండను కొంటాను!"

"అదే జరుగుతుంది!"

"నా వుద్దేశ్యం నీవు వెళ్ళిపోవాలని కాదు."

"నీ వుద్దేశ్యాలన్నీ నాకు బాగా తెలుసుగానీ. మొదట నాకు నీళ్ళు తెచ్చిపెట్టు!"

"ఎట్లా తాగించను?" అంటూ రాజకుమారుడు వ్యాకులమైన చూపులతో నాలుగువైపులా చూశాడు. ఇంతలో అతనికి ఏదో క్రొత్త స్ఫురింపు తట్టింది ఒకటి. ముందుకు నడచి దోసెడతో నీళ్ళు తీసుకొన్నాడు.

మాలీ ముందుకు వంగి రాజకుమారుడి దోసిడలోని నీళ్ళను త్రాగింది. మాలీ పెదాలు రాజకుమారుడి వేళ్ళను తాకాయి. ఈ పెదాల స్పర్శ రాజకుమారుడిలో విద్యుత్ స్పర్శలా పనిచేసింది, అతనిచేతులు వణికాయి. దోసెడలోని నీళ్ళు క్రిందకు తొణికాయి. మాలీ కొంటెగా రాజకుమారుడి వైపు చూస్తూ దోసెడను ఖాళీచేసింది. తరువాత రాజకుమారుడు రెండవసారి దోసెడ నింపాడు. అలాగే మూడవ

సారి, నాల్గవసారి! మొట్టమొదటగా మాలీచేత శంపైన్ త్రాగించినప్పటికంటే అధిక ఆనందం పొందాడు రాజకుమారుడు! వజ్రాలహారాన్ని కానుకగా ఇచ్చినప్పుడుకూడా ఇంత ఆనందాన్ని అనుభవించలేదతను. చెరువులోని ప్రతిచిన్న నీటిబొట్టూ ప్రేమగీతాల్ని ఆలాపిస్తున్నట్టుగా వున్నదివ్వాళ. చిన్ని చిన్ని అలలు ప్రేమగీతాలను ఆలాపిస్తూ అతని మునివేళ్ళను తాకుతున్నాయి. అతని వేళ్ళు మృదువుగా మాలీ పెదాలను తాకుతున్నాయి. ఇది అతి నూతనానుభవం అతనికి! పెదాలను పెదాలు తాకడం, ముద్దుపెట్టుకోవడం అనుభవంలోని విషయం. కాని పెదాలను మునివేళ్ళుతాకడం... క్రొత్త! ఒక్కసారిగా వేయిముద్దులు పెట్టుకొన్నట్టయింది. మాలీ సదా ఇలాగే నీరు త్రాగుతుంటే, ఈ తూచెరువు ఎప్పుడూ ఇలాగే ఎండకూడా నిండుగావుంటే, మంచు ఇలాగే కురుస్తూవుంటే; ఎంత బాగుండు ననుకొన్నా డతను! కాని, ఐదవ గోసెహకో మాలీ నీరు త్రాగడం ఆపేసింది. ఒకమాటు సంగ్రామసింగ్ వంక ఓరగా చూచి లేచి నిలబడ్డది.

"మాలీ అడిగింది "ఏమిటిది? ముఖాన చెమట పోస్తున్నదేం? వేడి చేసిందా?"

"నాకూ దాహం వేస్తున్నది!"

"ఐతే రా. దోసెహతో నీళ్ళు త్రాగిస్తాను!"

"వద్దు...వద్దు!" సంగ్రామన్‌సింగ్ కొంచం గాభరా పడ్డాడు.

తరువాత అతను గుర్రంలా మెడవంచి నీళ్ళుత్రాగ సాగాడు.

మాలీ నవ్వును ఆపుకోలేకపోతున్నది.

మంచు మెల్లగా కురుస్తున్నది. దానికి రెండువైపులా శ్వేతవృక్షాలు వున్నాయి. ఎదురుగా ప్రాచీనమైన కిల్లా కను పిస్తున్నది. దాని శిఖరాలూ, బురుజులూ, ద్వారాలూ—అన్నీ మంచుతో కప్పబడి తెల్లగా కనుపిస్తున్నాయి! ఎత్తయిన దిబ్బమీద పురాతనమైన కోట నిద్రిస్తున్నది. మొదటి బురుజు దగ్గిర నిలబెట్టిన ఫిరంగి మంచుతో కప్పబడి తెల్లనయింది. అంతా తెలుపు...ఇది దేవలోకం! ఇందులోకి సంగ్రామ సింగూ, మాలీ తిరుగుతూ వచ్చిపడ్డట్టుగా వుంది. మాలీ తన గుర్రపునడకను తగ్గించింది. మెల్లగా ఖిల్లాదగ్గిరకు వచ్చి గుర్రాన్ని ఆపింది.

"ఎంత అందమైన కిల్లా! ఐరిష్ కిల్లాలా వుంది!"

రాజకుమారుడు మౌనంగా వుండిపోయాడు. ఖిల్లాను చూస్తూవుంటే అతనికి ఒ విధమైన గర్వం కలుగుతున్నది. ఇది తన ఖిల్లా! పూర్తిగా తనది! పిత్రార్జితం!! దీన్ని ముస్లిం రాజులదగ్గిరనుంచి తన పూర్వీకులు యుద్ధం చేసి జయించారు, మరి ముస్లిములకు పూర్వంఖిల్లాల్లో ఎవరుండేవారో? అప్పుడు కూడా ఒకనాడు ఇలాగే మంచుకురిసి వుండవచ్చు, ఇలాగే ఆ రాజకుమారుడు మరొక రాజకుమారితో కలసి తనఖిల్లా వద్దకు షికారుకు వచ్చివుండవచ్చు. తన ఖిల్లానీ, తన రాజ్యాన్నీ, మన్నూమిన్నునీ ఏకం చేస్తున్న మంచుని

చూస్తూ తన ప్రక్కనేవున్న రాజకుమారి చేతులను పుచ్చుకొని "చెప్పు! నీవు నా రాణీవవుతావా?" అని అడిగివుండవచ్చు!

సంగ్రామసింగ్ ధైర్యంచేసి మనస్సులో మాటను అడిగేశాడు.

మాలీ వ్యంగ్య పూర్ణమైన దృక్కుల్తో సంగ్రామసింగ్ వైపు చూసింది. తన చూపుడు వేలును చిత్రంగా ఆడిస్తూ "నేను రాజకుమారుడిని పెండ్లి చేసుకోవడంకన్న, చెప్పులు కుట్టే మాదిగవాడిని పెండ్లి చేసుకోవడానికి ఎక్కువగా ఇష్ట పడతాను!" అన్నది.

"ఎందువల్ల?" సంగ్రామసింగ్ గంభీరంగా ప్రశ్నించాడు.

కాని మాలీ అతని ప్రశ్నకు ఏవిధమైన సమాధానాన్నీ ఈయకుండానే తోటవైపుకు గుర్రాన్ని నడిపింది. రాజకుమారుడు ఆమెవెనుక తనూ గుర్రాన్ని నడిపాడు. మాలీ గుర్రాన్ని పరుగెత్తించసాగింది. మంచులో గుర్రాన్ని పరుగెత్తించడం చాలా ప్రమాదం! గుర్రానికీ ఘాతుకమూ ఇద్దరికీ ప్రాణాపాయం! రాజకుమారుడు పెద్దగా అరిచి మాలీని వారించాడు. గుర్రాన్ని పరుగెత్తించవద్దన్నాడు. కాని మాలీ వినిపించుకోలేదు. పిచ్చిఎత్తినట్టు గుర్రాన్ని పరుగెత్తించసాగింది. విధిలేక సంగ్రామ్‌కూడా మాలీ వెనుకనే తన గుర్రాన్ని పరుగెత్తించాడు "పిచ్చిపిల్ల" అనుకొన్నాడు మనస్సులోనే! మాలీ తీవ్రవేగంతో గుర్రాన్ని పరుగెత్తించుకొంటూ తోటను

దాటింది. క్షణకాలంలో తోటలోని చెట్లన్నీ తెల్లని మంచు వస్త్రాలను ధరించి ఆమె కండ్ల ముందునుంచి అదృశ్యమైనాయి. నీళ్ళుచిమ్మే జాజులు నవ్వుతూ కనుపించి మాయమయినాయి. వినాయకుడి గుడి దర్వాజా తృటిలో దిగబడ్డని. గుడి ద్వారం దగ్గిర ఇద్దరు సిపాయీలు నిలబడివున్నారు. మాలీ ఇలా పోవ డాన్ని చూసి చకితులయ్యారు. సంగ్రామసింగ్ కూడా సిపాయీ లను దాటాడు. మాలీ ఇంకా వేగంగా ముందుకు పోతున్నది. తెల్ల గుర్రం చాలా పొగరుపోతుది త్వరలో కలుసుకోకపోతే ప్రమాదం! చివరకు 'రూపక్' అతి సాహసాన్ని ప్రదర్శించి మైలర్‌ని కలుసుకొన్నది. అయినా మాలీ గుర్రాన్ని ఆప లేదు. తోల్తూనే వున్నది. నదివంతెన దాటారు. దానిమ్మ గుబుర్లను దాటారు. వాటి తరువాత దానికి ప్రక్కనే ఒక చెరువు. చెరువు పూర్తిగా మంచుతో కప్పబడి వున్నది. పైమంచు స్ఫటికంలా మెరుస్తున్నది. దాన్ని చూడగానే మాలీ చప్పున గుర్రాన్ని ఆపి క్రిందకు దిగింది. గుర్రపు జీనుకు కట్టివున్న స్కేట్సును విప్పింది.

"ఏం చేస్తున్నావు? ఇది 'రింకీ' కాదు. మంచు కొంచం పలుచగావున్నచోట కాలువడ్డదా, క్రిందకు నీళ్ళల్లోకి వెళ్ళి పోతావు!" అన్నాడు సంగ్రామసింగ్.

మాలీ సంగ్రామసింగ్ మాటను వినిపించుకోకుండా స్కేట్సును ధరించి చెరువులోకిపోయి నాట్యం చేయసాగింది. నాట్యం చేస్తూనే కోటునుకూడా విప్పేసింది.

తెల్లని టోపీ, తెల్లని ట్రవుజర్, ట్రవుజర్ క్రింద మెరుస్తున్న స్కేట్స్! వలయంగా తిరుగుతున్నది. వలయంలో

నుంచి విడిపడుతున్నది. చివరకు మాలీ మంచుతో కప్పబడ్డ బంతిలా తయారైంది. గుండ్రని ఆకారం – భూమ్యాకాశాలు కలిసేచోట క్షితిజం–దగ్గిర నాట్యం చేస్తోంది. నాట్యం చేస్తూ చేస్తూ రాజకుమారుడితో ఇలా అన్నది మాలీ "చూడు! ఇది ఇంటర్ మేజో నృత్యం! ఇక్కడ సంగీతం లేదు. అయితేం ఇది అంబుర్ మేజోయే! ఆమె స్వరం గాలిలో రెక్కలుకట్టుకు వాలింది. ఆమె కాళ్ళు పూవులతో నిండిన తరుశాఖల్లా గాలిలో ఎగిరి నాట్యంచేసి తిరిగి మంచుమీదకు పడుతున్నాయి. సంగ్రామ్ ఇలా ఆలోచించాడు. "ఇది ఇంటర్ మేజో! ఇక్కడ సంగీతం లేదు. కాదు వున్నది. ఆకాశమే పెద్ద పియానో! భూమేడప్! నాట్యగత్తె కాళ్ళకు పావురపు రెక్కలున్నాయి! ఒక కాలు ఎక్కుపెట్టిన బాణంలా ముందుకు చాచివుంది. రెండవకాలు చెరువుమధ్యలో గుండ్రని వలయాన్ని తయారు చేస్తూ క్షితిజంలో ఎగిరే పక్షిని స్ఫురణకు తెచ్చినది. ఒక మాటు బాణంలా దూసుకుపోయేది. మరొకమాటు మృదువైన చిరునవ్వులా విస్తరించేది. మొదట రేఖలు... రేఖల్లో వలయాలు...వలయాల్లో పుష్పాలు...పుష్పాలు నాట్య చేస్తున్నాయి!" సంగ్రామసింగ్ విభ్రాంతుడై చూస్తున్నాడు. వుండి వుండీ అకస్మాత్తుగా మాలీవచ్చి అతనిముందు నిలబడ్డది.

"తెలిసిందా?" మాలీ అడిగింది.

"తెలిసింది!"

"ఏమిటి?"

"ఇది ఇంటర్ మేజో!"

మాలీ అనుకొన్నది. "నీకు ఇంకా తెలియదు. ఇది ఇంటర్ మేజో కాదు, జీవితసంగీతం యవ్వననాట్యం, ప్రేమజ్వాల నాలుగువేల సంవత్సరాలనుంచీ, ఇక్కడ ఇలాగే మంచు కురుస్తున్నది. ఈ చిన్న చీలవృక్షాల మాటున దాగివున్న ఈ చెరువులో ఇలాగే మంచుగడ్డ కడుతున్నది. నీవు ఇవ్వాళ ఈ నృత్యం చూశావు. కాని ఇంతవరకూ ఎప్పుడైనా స్వయంగా కూడా చేశావా! మరెవరికైనా ఈ నృత్యం చెయ్యడానికి అవకాశం యిచ్చావా? నాలుగువేల సంవత్సరాలనుంచీ నీ వేం చేస్తున్నావు? గుర్రాల్ని పరుగెత్తిస్తూ, ప్రజల్ని దోచుకుంటూ గొర్రెల్ని తోలుతూవున్నావ్! ప్రేమ ఎంతమాధుర్యంగా వుంటుందో, ఆకాశం ఎంత నీలంగావుందో, మంచు ఎంత తెల్లగా వుందో — వీటిని ఒక్కమారైనా చూశావా? ఆలోచించావా? లేదు ఎలాంటి డివి నువ్వు! నన్ను కాకుండా చెప్పులుకుట్టే ఐరిష్‌వాడిని ఎందుకు పెండ్లి చేసుకొంటావని నన్ను ప్రశ్నిస్తున్నావు!"

ఇంటర్ మేజో!

సంగ్రామసింగ్‌కు ముఖం మాడిపోయింది. ఎవరో నిప్పుకొరివిని ముఖాన విసిరికొట్టినట్టుగా వుంది. అతను మాలీవంక చూశాడు. ఆమె పెదాలు గాఢారుణిమంగా వున్నాయి. నేత్రాలు క్రోధంతో నిండివున్నాయి. బుగ్గలు నిప్పుకణువుల్లా వున్నాయి.

ఇంజర్ మేజో!

సంగ్రామసింగ్ తలవంచుకొన్నాడు. అతను మెల్లగా తన 'లాంగ్‌బూటును విప్పాడు. దగ్గిరకుపోయి నవ్వుతూ

మాలీతో ఇలా అన్నాడు. "మాలీ, నీవు నా కోసరం తెచ్చిన రెండవ స్కేట్సు ఇటు తే! నేను కాళ్ళకు కట్టుకొంటాను."

మాలీ సమాధానం కోసం ఎదురుచూడకుండానే అతను గుర్రపు జీనునుండి స్కేట్సును విప్పుకొని కాళ్ళకు కట్టుకొన్నాడు. చేతుల్ని పైకి ఎత్తాడు.

మాలీ నవ్వుతూ సంగ్రామ్ చేతిని పట్టుకొన్నది.

సంగ్రామసింగ్ అన్నాడు. "ఇప్పుడు ఇంటర్ మేజో వద్దు, సింపనీకూడా వద్దు, కన్ చేటోకూడా వద్దు...ఇప్పుడు మెల్లగా మత్తుగా, మృదువుగా వుండే నృత్యం ఏదైనా చేద్దాం! మృదువుగా వుండేది!" అంటూ అతను ప్రేమగా తన చేతులను మాలీ నడుము చుట్టూ వేశాడు.

మాలీ అన్నది "నీకు చాలా అందమైన నృత్యం, మెల్లని నృత్యం, శీతాకోకచిలుక, ఒకపువ్వుమీదనుంచి, మరొకపువ్వుమీదకువాలుతుందే! అలాంటినృత్యంనేర్పుతాను. ఎందుచేతనంటే, నాలుగు వేల సంవత్సరాల తరువాత ఇవ్వాళ నీ కాళ్ళు ప్రథమంగా నృత్యం చెయ్యడానికి తయారు అవుతున్నాయి!"

సంగ్రామ్ అన్నాడు, "ఉ! హు! అలాంటిది వద్దు! ఒక శీతాకోకచిలుక ఒక పువ్వుమీద నృత్యం చేస్తుందే అలాంటిది చెప్పు!"

మాలీ నవ్వింది. పైమాట మాలీకి నచ్చింది.

ఇద్దరూ నృత్యం చెయ్యసాగారు. మంచు కురవడం ఆగలేదు. చీల వృక్షాలక్రింద వున్న బైలర్ గుర్రం, నల్లగుర్రం వైపు చూసి సకిలించింది.

# 3

షాలీ రాజకుమారుడితో తిరగడానికి వెళ్ళిన తరువాత చిత్రమైన నిరాశా, వ్యాకులతలు సజన్ దేవుణ్ణి ఆవహించినాయి. అతను టిక్కామన్ మోహన్‌సింగ్ నైనిహాల్‌సింగ్‌లతో చీట్లాడుతున్నాడు. ఆటలో ఒక్కొ ముక్కని మొండికి పడుతున్నాడు. ప్రతికక్షులు గెలచినప్పుడు మండి పడుతున్నాడు విసుక్కుంటున్నాడు. ఇతనిలా విసుక్కోవడం మొండిపట్టు పట్టడం—మొదలైనవాటికి కారణం ఏమిటో ప్రతికక్షులకు తెలుసును, అందువల్ల వాళ్ళు ఇతన్ని మరీ వుడికిస్తున్నారు. సజన్ దేవుడికికూడా ప్రతికక్షులు ఇలాగ తనను వుడికించడానికి కారణం ఏమిటో తెలుసును. అంతేకాదు షాలీ రాజకుమారుడికోసరం వచ్చిందనీ, అతనితోటి వెళ్ళుతుందని కూడా అతనికి తెలుసు. తెలిసివుండికూడా మనిషి వుద్రేక పడిపోయాడు. ఆడుతున్నవాడల్లా విసుగ్గా పేకముక్కల్ని అవతలపారేసి లేచి నిలబడ్డాడు. ఇతను లేచి నిలబడగానే టిక్కామన్ మోహన్‌సింగ్. నైనిహాల్‌సింగ్‌లు నవ్వడం మొదలు పెట్టారు, సజన్ దేవుడు వాళ్ళ నవ్వులను వినిపించుకోకుండా "కాష్మీరు టైమ్స్" పత్రికను చూడసాగాడు. కాష్మీరుకు సంబంధించిన సత్యాగ్రహం పంజాబులో చాలా తీవ్రంగా సాగుతోంది. ఇక్కడ సంస్థానంలోకూడా బాగా అలజడిగా వుంది, సత్యాగ్రహాలూ, అరెస్టులూ జోరుగాసాగుతున్నాయి. కాని "కాష్మీరు టైమ్స్" ఈ విషయాన్ని అతి నిర్లక్ష్యంగా

చివరి పేజీలో చివరి కాలంలో వేసింది. సజన్ దేవ్ పత్రికను క్రిందపడేశాడు. ఈ మంచులో రాజకుమారుడూ షాలీ ఎక్కడికి పోయివుంటారు? అతని ఆలోచనలు అగ్నిమయమయినాయి. అతడు తన వ్యాకులతను కప్పిపుచ్చుకోలేకపోతున్నాడు. తన పంట్లాం జేబుల్లో చేతులు వేసుకొని అస్థిమితంగా మెత్తని తివాచీలమీద ఇటూ అటూ పచారు చేయసాగాడు సజన్ దేవుడు.

టిక్కా మన్ మోహన్‌సింగ్ పత్రికతో విసురుకొంటూ "సజన్! అబ్బ ఎంత వేడిగా వుంది! ఇట్లా మంచుకురుస్తున్నా ఏమి టీ వేడి!" అన్నాడు వ్యంగ్యంగా.

సజన్ దేవుడు ఏమీ మాట్లాడలేదు.

నైనిహాల్ సింగ్ అన్నాడు. "పాపం! సజన్‌కు కాశ్మీర్ సరిపడలేదు. ఇక్కడ ఆరునెల్లు మంచుకురుస్తుంది. మూడు నెల్లు ఆకురాలుతుంది. ఇకపోతే మిగిలేవి మూడునెల్లు! ఈ మూడునెలల్లోనే ఏమైనా ఆనందం అనుభవిస్తే అనుభవించాలి! ఇందులోనూ మరెవరైనా ఈ ఆనందాన్ని కొట్టేస్తే ఎలా భరించడం? ముఖ్యాంగా క్రికెట్ క్లబ్‌కు ఏకైకనాయకుడైన సజన్ భరించగలడా?"

టిక్కా మన్ మోహన్‌సింగ్ పెద్దగా నవ్వాడు.

సజన్ టిక్కావైపూ నైనిహాల్ వైపూ క్రోధంగా చూశాడు.

మన్ మోహన్ సింగ్ అన్నాడు "రాజకుమారుడి నౌకరీలో సమానత అనేది వుండదన్న విషయం సజన్‌కు తట్టవ.

లేదు. ఇది లాహోరు క్రికెట్ క్లబ్ కాదు. ఇది రాజకుమారుడి మహాలు. అక్కడి నియమాలు ఇక్కడ చెల్లవు! గవర్నమెంట్ కాలేజీలో చదివిన ప్రసిద్ధుడైన ఆటగాడు లాహోరు క్రికెట్‌క్లబ్బులో ఆదరం పొందితే పొందవచ్చును. కాని రాజమహాల్లో అలా జరగదు. ఇక్కడ క్రికెట్, బంతీ అన్నీ రాజకుమారుడివే! ఓటమి నీ వంతూ గెలుపు రాజకుమారుడి వంతు...ఇక్కడ ఇదే నియమం! ఇలాంటి ఆట ఆడడానికి కొంచం విశాలమైన హృదయం కావాలి!"

"అలాంటి ఆట ఆడడంవల్ల ప్రయోజనం ఏమిటి?" సజన్ అడిగాడు.

నైనిహాల్ అన్నాడు "ఆ స్థానంలో స్థానం దొరుకుతుంది. ఐదువందల రూపాయీల జీతం దొరుకుతుంది. రాజకుమారుల సరసన భోజనంచేసే అదృష్టం దొరుకుతుంది. ఇంకా...చక్కని... ఆడది... ఆడది... ఇంకేం కావాలి... ఇంకేం కావాలి!"

సజన్ "ఎంగిలి తిండి, ఎంగిలి పానీయం, ఎంగిలి ఆడది...అంతా ఎంగిలి, సెకండ్ హేండు!" అన్నాడు.

టిక్కా అన్నాడు "ఈ ఎంగిలితిండే దొరక్కపోతే నీవు ఏమైవుండేవాడివో ఆలోచించుకో! ఒక వట్టి బి.ఏ., ప్యాసయిన క్రికెట్ ఆటగాడివి! అతికష్టంమీద ఏ రైల్వేకంపెనీలోనో క్లర్కుపోస్టు దొరికేది. నీకీ హోదాని ఇచ్చినందుకు రాజకుమారుడికి కృతజ్ఞుడవై వుండక కృతఘ్నతను ప్రకటిస్తున్నావు. ప్రేమలో రాజకుమారుడితో పోటీ పడుతున్నావు!"

"అవును! ప్రేమలో అందరూ ఒకటే, పోటీ ఎందుకు పడకూడదు?" సజన్ అన్నాడు.

నైనిహాల్‌సింగ్ కోపంగా అన్నాడు "నీవేమిటి గుడ్డి వాడివవుతున్నావా సజన్? మాలీ తన యజమానికి యజమానురాలు! నువ్వో? దాసుడివి! ఏం చూసుకొని...?"

మధ్యలోనే ఆపి "ఈ వ్యత్యాసాలు పోతాయి. మనుషులందరూ ఒకటవుతారు. ప్రేమలో, వ్యాపారంలో, విద్యలో, సంస్కృతిలో పనిలో..."

"ఇది కవిత్వం! మనుషులందరూ ఎన్నటికీ ఒకటి కారు!"

ఒకవిధంగా అవుతారు!" నైనిహాల్ సింగ్ అన్నాడు "నీవు చెప్పినట్టు మానవులందరూ ఒకటవుతారు! కాని, పశువులూ మానవులూ మాత్రం ఒకటి కాదు. మనప్రజలు పశువులకంటెకూడా హీనం! వాళ్ళ నివాసాలూ, తిండి, గుడ్డలూ, సంస్కారాలూ, వీళ్ళకన్నా అడవిలోవుండే జంతువులు వెయ్యిరెట్లు నయం! అయితే ఒకటడుగుతాను చెప్పు... మాలీ ఒక కాశ్మీరు మూర్ఖరైతును ప్రేమించగలదా?"

"ప్రేమించలేదు!"

"ఐతే నిన్నుకూడా ప్రేమించలేదు. ఆ రైతుకూ నీకూ ఎంత వ్యత్యాసం వుందో, నీకూ రాజకుమారుడికికూడా అంతే వ్యత్యాసం వుంది!"

"ఏ దృష్టిలో?"

"రూపాయల దృష్టిలో!"

“రూపాయలు !”

సజన్ ఏమీ మాట్లాడలేదు!

“అవును, గూపాయలూ, హోదా” టక్కా అన్నాడు. అతను సూర్యపుత్రుడు. నీవో సామాన్య మానవుడివి! అతనికి నాలుగు వేల సంవత్సరాల వంశవృక్షం వుంది; నీకు నీ ముత్తాత ఎక్కడినుంచి వచ్చాడో తెలియదు. అతను నాలుగు వేల సంవత్సరాలనుంచీ ఈ భూమిని పాలిస్తూవున్నాడు. నువ్వో నాలుగు వేల సంవత్సరాలనుంచీ పాలింపబడుతూ వున్నావు! అట్లాంటి నీవు ఇవ్వాళ రాకుమారుడితో పోటీపడుతున్నావు. కాని నీపోటీ నెగ్గదు. వ్యతిరేకులను మేము నవ్వుల్తో నలము. చర్మం వలుస్తాము. నువ్వు చూస్తూనే వున్నావుగా, రైతులు వ్యతిరేకిస్తే ఏంచేస్తామో! అంతే నువ్వూ!”

సజన్ దేవుడి పెదాలు వణకసాగినాయి, అతను మౌనంగా తలవంచుకుని కిటికీ దగ్గరకుపోయి మంచుతుంపరలను చూస్తూ వుండిపోయాడు, అతను టక్కా మన్‌మోహన్‌సింగ్ నైహాల్‌సింగుల వైపు వీపుపెట్టి నిలబడి వున్నాడు. వీరిద్దరూ రాజకుమారుడి ఏ. డి. సి. లు దూరపు బంధువులు కూడాను. పంజాబులో వారికి చిన్నచిన్న జాగీర్లుకూడా వున్నాయి. రాజకుమారుకు ఇక్కడ వీళ్ళమీద ఏ విధంగానైతే అధికారాన్ని చలాయిస్తూ ఉంటాడో వీళ్ళూ తమ జాగీర్లల్లో అలాగే అధికారాన్ని చలాయిస్తూ వుంటారు. ఈ అధికారపు వితరణ పై వర్గాలనుంచి బయలుదేరి చివరకు ప్రజల దగ్గరకుపోయి ఆగుతుంది. ఇవ్వాళ సజన్‌కు ఈఅధికారమనేది తన నగ్నరూపంలో

కనుపించింది. కాలేజీలో అతనొక గొప్ప ఆటగాడు. నిర్ల క్ష్యంగా తిరుగుతూ వుండేవాడు. ఎఫ్. ఎ. వరకూ అతను రావల్పిండిలో గార్డన్ కాలేజీలో చదివాడు. అతని తండ్రి మంచి డబ్బుకలవాడు. ఓరియంటల్ ఇన్సూరెన్సు కంపెనీలో మంచి వుద్యోగంలో వుండేవాడు. ఆస్తిపాస్తులు కూడా బాగావున్నాయి. సజన్ ఆటలోనూ, చదువులోనూ బాగా చురుకుగావుండేవాడు. అందుచేత ఎఫ్.ఎ. పాస్ కాగానే లాహోరు గవర్నమెంటు కాలేజీలో సీటు దొరికింది. కాలేజీ క్రికెట్ టీముకు ఇతను కెప్టెన్ అయ్యాడు. ఎమ్. సి. సి. కి పోటీగా ఆడాడు. 60 పరుగులు తీశాడు. ఇతని ఫోటోలు పత్రికల్లో ప్రకటించారు. ఆడపిల్లలు ఫోటోలు తీసుకొన్నారు. లాహోరులోని ప్రముఖమైన క్రికెట్ క్లబ్ ఇతన్ని తన మెంబర్ గా చేర్చుకొన్నది. ఈ క్లబ్బుమెంబర్లు ఉత్తర భారతంలోని పెద్ద రాజాలూ మహారాజులూనూ! చాలా కొద్దిరోజులలో సజన్ వాళ్ళల్లో కలిసిపోయాడు. తన పరిధిలో అతనొక చిన్న హీరోగా తయారయ్యాడు. ఇతనిచుట్టూ పొగడ్తలవాళ్ళు గుమి గూడారు. ఎన్నో పెండ్లి సంబంధాలు వచ్చినాయి. తిరస్క రించేశాడు. ఇతని ప్రముఖ ప్రేయసుల్లో ఒక ఆంగ్లోఇండియన్ లేడీ, ఒక అపభ్రంశ రాజకుమారికూడా వున్నారు. పాశ్చాత్య డాన్సులో అందెవేసిన చెయ్యి. సారాయి తాగుతాడు. కవి త్వం అన్నా, సంగీతమన్నా ఎక్కువ మమత్వం కనుబరుస్తాడు. పగలంతా నిద్రపోతాడు. రాత్రంతా మేలుకొంటాడు. తండ్రితో సంబంధం డబ్బు అవసరం వచ్చినప్పుడు మాత్రమే. గడచిన యుద్ధంలో అన్ని ప్రాంతాలకన్నా పంజాబు దేశం

ఎక్కువగా పాల్గొన్నది. సైనికులుగా ఎక్కువమంది యువకులు పంజాబునుంచే వెళ్ళారు. ఈ కారణంచేత యుద్ధసామగ్రులకు ట్రక్కులు అన్య ప్రాంతంకంటే పంజాబుకే ఎక్కువగా లభించాయి. ఎక్కువ లాభాన్ని పొందిందికూడా పంజాబుకేను. ఈ అధిక లాభాలకారణంగా పంజాబీ మధ్యతరగతి యువకుల్లో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది. కొద్ది కాలంపాటు నత్తు త్రాల్లా మెరవసాగారు. యుద్ధం పుణ్యమా అంటూ యువకుల జేబులుమాత్రం నిండాయి. కాని, బుర్రలు ఎండిపోయాయి. అందువల్లే వీళ్ళకు కర్నల్ స్లింప్, మహారాజా మోతీచంద్ మొదలైన వాళ్ళతో సంబంధాలు కలిశాయి. ఈ రకమైన వర్ణ సంకరపుజాతి మొదటి యుద్ధకాలంలో పుట్టింది. రెండవ యుద్ధ కాలంలో నశించింది. పోతే దీనిగుర్తుగా దుర్గంధం మాత్రం సమాజంలో మిగిలిపోయింది. సజన్‌దేవు ఈ జాతిలోవాడే! పైకివచ్చాడు. ఈ జాతికి సంబంధించిన అనేక విశేషణాలు ఇతనిలో వున్నాయి. ఎందుకు వుండవు? ఇతనిలో కోపం, నెకిలితనంతో పాటు ఒకరకమైన వ్యాకులత కూడా కనుపిస్తూ వుంటుంది. తనమీదా, తన చుట్టూవున్న వాతావరణం మీదా అతనికి తగని అసంతృప్తి! ఎందుకో అతనికే తెలియదు. చిన్నతనంలోనే ఇతనొక అమ్మాయిని ప్రేమించాడు. కాని వాళ్ళు బీదవాళ్ళుకావడంవల్ల ఇతని తండ్రి ఏవిధంగానూ ఆ అమ్మాయిని కోడలుగా స్వీకరించడానికి ఒప్పుకొనలేదు. అప్పుడు తన హృదయంలోని పచ్చని గరికక్రింద అసంఖ్యాకంగా ముళ్ళు వున్నాయని తెలుసుకొన్నాడు. వహాలీని ప్రేమిస్తే రాజకుమారుడు ఎలా నిర్దయుగా తన హృదయంమీద వజ్ర

పాత్రాన్ని కాపిస్తాడో అనేది ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది ఇతనికి. ఇప్పటివరకూ అతనిలో వచ్చిన మార్పులను బట్టి ఒక్క మెట్టు మాత్రమే పైకి ఎక్కగలిగాడు. ధనికా బీదా వ్యత్యాసాలు ఎప్పుడూ వుండేవే! కాని ప్రేమలో మాత్రం ఈ వ్యత్యాసం ఉండకూడదు...హా...హా...హా...!

కిటికీలోనుంచి మంచు కురిసే దృశ్యం కనుపిస్తున్నది. సజన దేవుడు ఈ దృశ్యాన్నుండి కూడా త్వరగానే విసిగిపోయాడు. అతను కిటికీలను మూసి నెగడు దగ్గరకువచ్చి కూర్చొని "వుమర్ ఖయ్యామ్" ప్రయివేట్ సంస్కరణని తీసుకున్నాడు. ఇది "అలీఫ్ లైలా" కంటెకూడా ఘనమైనది. దీన్ని ప్రత్యేకం పనిపాటలు అధికతవల్ల, తమ పురుషత్వాన్ని కోల్పోయిన వృద్ధరాజులకోసరం, తయారుచేశారు. ఒకా మన్ మోహన్ సింగ్ అతనుకుర్చీ దగ్గరకువెళ్ళి నిలబడి "ఈ పుస్తకం కాగితాలు తిప్పుతూ వుంటే నీకు ఆనందంగా వున్నట్టు వున్నది?" అన్నాడు.

సజన్ దేవుడు విసుగ్గా పుస్తకాన్ని మూసేశాడు.

నైనిహాల్ సింగ్ అన్నాడు "ఈసారి పెద్ద రాజావారు ఆజ్ఞయిస్తే ఇంగ్లండుకన్నా ముందు రాజకుమారుడిని ఇరాన్ తీసుకువెళదాం! వుమర్ ఖయ్యాం దేశాన్ని చూద్దాం!"

మన్ మోహన్ "ఇరాన్ లో ఏముంది? క్రితం యుద్ధంలో మా అన్నయ్య రాజావారితో ఇరాన్ వెళ్ళాడు. అక్కడ రెండేళ్ళు వున్నాడు. రెండేళ్ళల్లో ఆరు పెండ్లిళ్ళు చేసుకొన్నాడు.

"ఆరు పెండ్లిళ్ళా?"

"అవును, అతను ప్రతినాలుగునెల్లకూ ఒక కొత్త ఇరానీ స్త్రీని పెండ్లి చేసుకొనేవాడు. చాలా త్వరగా ఇరానీ స్త్రీలతో అసంతృప్తి చెందాడు!"

నైనిహాల్ అన్నాడు "నిజంగానే పెండ్లిలో ఏముంది? ఆడదాన్ని బలవంతంచేసి అనుభవించినప్పుడే మజా!"

మన్‌మోహన్‌సింగ్ కోపంగా అన్నాడు. "అదేంకాదు నీవు ప్రతి విషయాన్నీ ఆ కొసకు లాక్కుపోతావు. మా అన్నయ్య చెబుతూండేవాడుగా, ఇరాన్‌లోకూడా ప్రజలుమన జాగీరులోలాగానే దరిద్రులూ—మూర్ఖులూ, నిరక్షరాస్యులూ. ఈ ఉమర్‌ఖయామ్ రచన ఇది ఒక స్వకపోల కల్పితము. దీనిలోవున్న ఏ ఒక్కటీ ఇరాన్‌లో కనుపించవు. ఇరాన్ అంటే నా అన్నకు మహా కోపం! దొంగముండా కొడుకులు సర్వం అబద్ధం రాశారు. చిత్రాల్లో ఒకరకం, అసలుస్థితి మరొకరకం! అంటూ వుండేవాడు!"

నైనిహాల్‌సింగ్ పెద్దగా నవ్వుతూ "చిత్రాల్లో మన కాశ్మీరు మాత్రం చెడ్డగా వుందా? ప్రజలు ఈ చిత్రాలను చూసే గాడిదల్లా పరుగెత్తుకువస్తారు. ఇక్కడికి వచ్చి నదీతీరాల ప్రక్కన ఎండకు ఎండిన స్త్రీలను అనుభవించి వెళ్ళిపోతారు...హి...హి...హి...!" అన్నాడు.

"షటప్" సజన్‌దేవుడు క్రోధంతో అరిచాడు. "మరొక విషయాన్ని మాట్లాడు! ఎప్పుడు చూసినా, ఆడది సారాయి! సారాయి ఆడది! అంతకు మించి మరొక విషయం

వుండదు. ఇదీకాక జీహుజూర్ ! జీ సర్కార్! ఇవేఎల్లవున్నాయ్. మనమేం మనుషులం కాదా! కుక్కలమా? ఇక్కడ కాశ్మీర్‌లో వుండే లక్షల మనుషులు స్త్రీ పురుషులు కారా? వీళ్ళందరూ అమ్ముడుపోయే చెక్కబొమ్మలా? మానాన్ని అమ్ముకునే వాళ్ళేనా? వీళ్ళ హృదయాల్లో తమ పిల్లలనుగురించి ప్రేమ వుండదా? తన స్త్రీలమీద పవిత్ర గౌరవభావం వుండదా? తమ చెల్లెళ్ళమీదా, అక్కలమీదా ఆదరణ వుండదా? నే నీ మూర్ఖాన్ని ఒప్పుకోను!"

నైసిహాల్‌సింగ్ అన్నాడు "అదికాదోయ్! నువ్వు చదువుకున్న మూర్ఖుల్లా మాట్లాడబోకు! నా అనుభవాన్ని బట్టి, నాకు తెలిసినంతవరకూ, దరిద్రులకు గౌరవ మర్యాద లంటూ ఏమీ వుండవు. గౌరవంగానీ, మర్యాదలుగానీ అవి మనవరకే, ఠాకూర్ల వరకే, రాజులవరకే పరిమితం! మిగిలినవాళ్ళంతా, ప్రజలంతా. మనకు వచ్చిసరకులాంటివారు. మనం ఎలా వుపయోగించుకొంటే వాళ్ళు అలా వుపయోగపడతారు. పైపెచ్చు మనకు వుపయోగపడడంలో వాళ్ళకు ఒకరకంఅయిన ఆనందం, తృప్తి ననుభవిస్తారు!"

టికా అన్నాడు "ఇక్కడేకాదు. అన్నిచోట్లా అంతే! మా పెద్దన్న చెబుతున్నాడు, ఇరాన్‌లోకూడా అంతేట!"

సజన్ అడిగాడు "మీా పెద్దన్న ఏంచేస్తున్నాడు?"

"పోలీసు సూపరింటెండెంట్!"

సజన్ నవ్వాడు "నువ్వు అతని మాటల్ని నమ్ము తున్నావా? పోలీసువాళ్ళను నమ్మినంత మూర్ఖుడు మరొకడుండడు!"

"మా అన్నను నిందించకు, నేను ఠాకుర్‌ని!"

"నేను పంజాబీని" సజన్ అన్నాడు.

"పంజాబీల అమ్మల్ని!"

"ఠాకుర్‌ల అక్కల్ని!"

ఒక్కొక్కమన్ మోహన్‌సింగ్, సజన్‌దేవులు ఇద్దరూ కలియబడ్డారు. నైన్‌పాల్‌సింగ్ ఇద్దర్నీ విడదీస్తూ ఇలా అన్నాడు. "మీ ఇద్దరి అబ్బల... అరె! మీ రిద్దరూ రాజకుమారుడి ఎ. డి. సి. లా, లేక పెంపుడు కోళ్ళా? రాజకుమారుడు గనక ఈ స్థితిలో మీ ఇద్దర్నీ చూడడం జరిగిందా, నౌకరీనించి తీసివేస్తాడు - మీ ఇద్దర్నే కాదు మీతోపాటు నన్నుకూడా! ఏమిటీ మూర్ఖం? సజన్‌దేవ్‌గారూ! మీరు మాలీని ప్రేమిస్తున్నారు. రాజకుమారుడిమీద మీకు ఈర్ష్యగా వుంది. ఆ ఈర్ష్యనీ, కోపాన్నీ మన్‌మోహన్‌సింగ్ మీద చూపిస్తే ప్రయోజన మేమిటండీ? ఈ మన్‌మోహన్‌సింగ్ రాజవంశీయుడనికూడా ఆలోచించలేదే మీరు! ఇంతకృతఘ్నతా? తిన్నఇంటి వాసాలు లెఖ్ఖపెట్టడమా? మరి నీ విషయ మేమిటి మన్‌మోహన్‌సింగ్? నీ విలా చేతులుమడిచి కలియబడడం రాజకుమారుడుచూస్తే ఏమంటాడు? నువ్వు రాజబంధువువా? లేక మాలమాదిగల సంతానానివా? సిగ్గులేకుండా..."

సజన్ దేవుడు మన్ మోహన్ సింగ్ ఇద్దరూ సిగ్గుపడి, వెనక్కు తగ్గి చెరిఒక కుర్చీలోనూ కూర్చున్నారు.

"అలా కాదు. నేను చూస్తూవుండగానే మీరు ఇద్దరూ కరస్పర్శ చేసుకొనండి. లేకపోతే మీ ఇద్దరి మీదా రిపోర్టు చేస్తాను ఊ! అట్లా! అది కాదు. మనం అధికారులం. మనమే ఇలా పల్లెటూరి వాళ్ళలా పోట్లాడుకుంటే ఇక రాజ్యాలు ఏలి నట్లే!"

ఇంతలో ఒక దర్వాన్ వచ్చి "జమాదార్ ఠాకుర్ శాహన్ సింగ్ వచ్చాడు. లోపలికి రాకోరుతున్నాడు" అన్నాడు.

"పంపించు" నైనిహాల్ సింగ్ అన్నాడు.

దర్వాన్ శాహన్ సింగ్ ను వెంటపెట్టుకొని వచ్చాడు. అతనితోపాటు రజ్జీకూడా లోపలకు ప్రవేశించింది. రజ్జీ నూతన వస్త్రాలు ధరించి వున్నది. శాహన్ సింగ్ సైనికవందనం చేశాడు. అతని ముఖంమీద స్వేదబిందువులు కనిపిస్తున్నాయి. అతని వాలకం గజ్జికుక్కనుబోలి అశాంతిగా, వ్యాకులంగా వున్నది. అతని ఎర్రని ముఖం మరీ ఎర్రనై, ఏడుస్తున్నట్టుగా చిత్రమైన బలహీనతను ప్రదర్శిస్తున్నది. వాలకాన్నిబట్టి అతను ఇలా అంటున్నట్టుగా వుంది. "నేను ఏ తొత్తుకొడుకుముందూ, గాడిదకొడుకుముందూ, తలవంచడానికి, జీహాఁ అనటానికి రాలేదు. నేను, ఠాకుర్ ని, జమాదార్ ని, రసపుత్రుడను, కాని ఏం చెయ్యను? మీరు నాకంటే పైహోదాలో వున్నారు. కనుక మీముందు తలఒంచక తప్పదు. జీహాఁ అనక తప్పదు!

కాని దీనికి ప్రతిక్రియ నేను వీళ్ళకు చేయలేకపోవచ్చు మరెవరి కైనా చేసి కసి తీర్చుకొంటాను. ఓరి తొత్తుకొడుకుల్లారా! నన్ను ఎంత చులకనగా చూస్తున్నారురా!"

"ఏమిటి విశేషాలు జమాదార్?" మన్‌మోహన్‌సింగ్ అడిగాడు.

"ఏమీలేదు హుజూర్! ఈ కోడిపెట్టని చిన్నదొరగారి కోసరం తెచ్చాను!" ఠాకుర్ కాహన్‌సింగ్ రజ్జీని చూపుతూ అన్నాడు.

ముగ్గురు ఏ. డి. సి లూ తడవతడవకూ రజ్జీవంక చూస్తున్నారు, ఆమె కాళ్ళూ నడుములూ, పిక్కలూ, తడివి చూస్తున్నట్టుగా, ఈమె ఎంత అందంగా ఉంది. ఎంత మృదువుగా, మెత్తగా వుంటుంది, అని చూస్తున్నట్టుగా వున్నాయి వాళ్ళచూపులు! ఆ చూపులు అలాంటి నీచమైనవి సిగ్గుమాలినవి - రజ్జీ మౌనంగా వుండచుట్టుకుపోయి నిలబడింది. ఏ స్పర్శా లేకుండా!

"కోడిపెట్ట బాగుంది!" టిక్కా మూలిగాడు.

"మంచిసరుకు తెచ్చావోయ్ జమాదార్!" సైనిహాల్ అన్నాడు

ఠాకుర్ కాహన్‌సింగ్ కొంత సంతసించాడు. కాని కొంత తనమీద తనకే కోపం వచ్చింది. అన్నాడు "హుజూర్! ఈ పిట్టకోసరం ఎన్నిబాధలు పడవలసివచ్చిందనుకొన్నారు! మొదట దీనిమీద రాజా కర్మఆలీ కన్నేశాడు. అతను గాయపడ్డ తరువాత, ఈమె నా చేతిలో పడ్డది. రాజాకర్మఆలీ

నైతే తప్పించుకొన్నది కాని, నానుండి తప్పించుకోలేక పోయింది. దీన్ని చూస్తూనే మనదేశం మొత్తంలో ఇలాంటి వాళ్ళు చాలా అరుదుగా వుంటారనీ, ఇలాంటిదాన్ని చిన్న దొరగారికి తప్పక, కానుకగా యివ్వాలనీ, అనుకొన్నాను. కాని, ఇది తన ప్రియుడితో పారిపోయింది. చాలారోజులు వెతికిన తరువాతగాని దొరకలేదు!"

"ప్రియుడి పేరు ఏమిటి ?" సజన్ దేవుడు అడిగాడు.

"ఆ గాడిదకొడుకు పేరు ఫజల్! చాలా కష్టపెట్టాడు వాడు. వీళ్ళను ఇద్దరినీ జాగీర్ లో ప్రాంతంనుండిపట్టుకువచ్చాను. ఫజల్ ను ఇక్కడికి తెచ్చి జైల్లో వేశాము. అటు రాజాకర్మ ఆలీ దెబ్బలుతగిలి అస్వస్థతగా వున్నాడు. సరే, చిన్నదొర గారివద్దకు తీసుకుపోదాం సంతోషపడతారు. రెండుసంవత్స రాలనుంచీ నాకు ప్రమోషన్ కూడా ఆగిపోయింది అనుకొన్నాడు!"

"మంచిపని చేశారు. వుంచి పో! నీ తరఫున రాజకుమారుడికి మేము వప్పగిస్తాము!" టిక్కా అన్నాడు.

"అట్లాగేనండి... కాని జాగ్రత్తండి. నేను కూడా ముట్టుకోలేదు!"

నైనిహాల్ సింగ్ చిరునవ్వు నవ్వాడు.

ఠాకుర్ కాహన్ సింగ్ కూడా నవ్వాడు. "అవునండి... ఎక్కడైనా ఇది రాజకుమారుడిదాకా పోకుండా మధ్యలోనే గుటక పడిపోతుందేమోనని నాభయం. రెండేళ్ళనుంచీ నా ప్రమోషన్ ఆగిపోయింది. కొంచం జ్ఞాపకం వుంచుకోండి హుజూర్!"

నైనిహాల్‌సింగ్ అన్నాడు "దీన్ని గురించి నీవేమీ చింతించకు. జాగ్రత్తగా రాజకుమారుడికి నచ్చచెబుతాం! నీవు మా కులంవాడి ఠాకుర్‌వి. నీకు అన్యాయం చేస్తామా?"

తరువాత నైనిహాల్‌సింగ్ ఏమీ మాట్లాడలేకపోయాడు. దూరాన్నుంచి మాలీ రాజకుమారుడు ఇద్దరూ కలసి నవ్వే నవ్వులు వినిపించసాగాయి. వాళ్ళు ఇటే వస్తున్నారు. విషయం చాలా ఇరుకునపడ్డది. ముగ్గురు ఎ.డి.సి లూ, ఒక సైనికాధికారి అందమైన యువతి...అందరూ ఒకేగదిలో వున్నారు. గదికి ఒకటే తలుపు. ఎటూ తప్పుకోవడానికి వీలులేదు. రాజకుమారుడు మాలీ ఇటే వస్తున్నారు! విషయం పూర్తిగా ఇరకాటంలో పడ్డది. మహాలులోకి కోడిపెట్టలు రావడం సహజమే! కానుకలు యివ్వడం పుచ్చుకోవడంకూడా సహజమే. అయితే ఆ యివ్వడానికీ పుచ్చుకోవడానికి ఒకపద్ధతి వుంటుంది! ఇలాగనా ? అంతా సర్వనాశనం అయింది! రాజకుమారుడు మాలీల నవ్వులు రానురానూ దగ్గిరకువచ్చాయి. చివరకు గదిలో ప్రవేశించాయి.

జమాదార్ ఠాకుర్ శాహన్‌సింగు దర్వాజావైపుకు వంగి "జయ దేవా!" అన్నాడు.

టిక్కా మన్‌మోహన్‌సింగ్.

ఠాకుర్ నైనిహాల్‌సింగు.

చౌధరీ సజన్‌దేవ్...

ముగ్గురూ తలుపువైపుకువంగి అన్నారు "జయ దేవా!"

రాజకుమార్ సంగ్రామసింగు మాలీతోపాటు నవ్వుతూ లోపలకు ప్రవేశించాడు. ఒక్కసారిగా అతని నవ్వు ఆగి పోయింది. రజ్జీవంక చూడసాగా డతను.

మాలీ రజ్జీ ఒకరిని ఒకరు చూచుకొనసాగారు.

"ఈమె ఎవరు?" మాలీ అడిగింది.

ఎవ్వరూ మాట్లాడలేదు.

మాలీ రజ్జీవైపు రెండడుగులు ముందుకు వేసి, పరీక్షగా చూడసాగింది ఆమెను.

సజన్ దేవుడు ఈ ఇద్దరి స్త్రీల సౌందర్యాన్ని తన మనస్సులోనే తులతూ చుకొంటున్నాడు. ఇద్దరు స్త్రీలూ ఆర్య రక్త సంబంధీకులే! అయినా రజ్జీలోని శరీరఛాయ మాలీలో కనుపించదు. రజ్జీపెదాలు పల్చగా వున్నాయి. మాలీపెదాలు ముద్దుగా వంపుగా వున్నాయి. ఎత్తయిన మాలీ ముక్కు సగానికి కోసినట్టుగా గాలిలో సమాప్తం అయింది. ఆ ముక్కును చూస్తూవుంటే మాలీని తయారుచేసేప్పుడు బ్రహ్మదేవుడికి ముక్కు దగ్గిరకు వచ్చేసరికి సామగ్రి అయిపోయి వుండవచ్చుననిపిస్తుంది. రజ్జీ ముక్కు అలా కాదు. బాగా కొనదేలిన అసిధారను జ్ఞప్తికి తెస్తున్నది. మాలీ గడ్డం వంపుగా అర్ధచంద్రాకారంగా వుంది. రజ్జీ గడ్డం గుండ్రంగావుంది. మాలీకి బుగ్గలు లోతుగా సొట్టపడివున్నాయి. రజ్జీకి మాంసంతో నిండి నిగనిగలాడుతున్నాయి. రజ్జీముఖం గుండ్రంగా, అమాయికంగా, జీవితానుభవం ఏమాత్రమూలేని పసిపిల్లల ముఖంలా వుంది. మాలీ కండ్లలో స్ఫూర్తి, వివేకం కనుపిస్తున్నాయి. రజ్జీ

కండ్లల్లో విశ్వాసపు ప్రగాఢఛాయలూ త్యాగయుక్తమైన తేజస్సూ కనిపిస్తున్నాయి. ఇదేకాకుండా బాధల్లో కలిగే సమయస్ఫూర్తి, వివేకం గోచరిస్తున్నాయి. మాలీ మెరపుతీగలా వుంది. రజ్జీ వికసించిన పూలగుత్తి! చివరకు సజన్‌కు ఇలా అనుపించింది" వాళ్ళిద్దరికీ పోట్లాటవస్తే, రజ్జీ మాలీని చిత్తు చేస్తుంది!" అనుకొన్నాడు. బలిష్టమైన రజ్జీ చేతులను చూశాడు సజన్. రజ్జీలో బలమూ వుంది. మృదుత్వమూ వుంది. కాని, మాలీ తెలివికలది. రజ్జీతో ఎప్పటికీ కలబడే పరిస్థితులను కల్పించుకోదు. మనొక్క విషయం, బౌద్ధికంగా రజ్జీమీద మాలీయే గెలుస్తుంది!

మాలీ అడిగింది "ఈమె ఇక్కడికి ఎందుకు వచ్చింది?"

ఎవ్వరూ మాట్లాడలేదు.

రాజకుమార్ సంగ్రామ్‌సింగ్ ఇలా అన్నాడు. "చెప్పండి! అసలు విషయం ఏమిటి? ఎవ్వరూ మాట్లాడరేం?"

సైనిహాల్‌సింగ్ అన్నాడు "హుజూర్, ఈమె తమతో ఏమో విన్నవించుకోడానికి వచ్చింది!"

"ఏం చెప్పుకోవాలి?" మాలీ అడిగింది.

అందరూ జమాదార్ వైపు చూడసాగారు.

జమాదారు భయంతో తొట్రుపడుతున్నాడు.

మాలీ జమాదార్‌ను వుద్దేశించి "నువ్వు ముందు ఇక్కడినుంచి వెళ్ళు! ఊ! వెళ్ళు!"

జమాదార్ కొన్ని క్షణాలవరకూ అటూ ఇటూ చూశాడు. తరువాత తలవంచుకొని వెళ్ళిపోయాడు.

సజన్ దేవ్ వైపుకు తిరిగి "ఈ అమ్మాయిని మహాలు బయట విడిచిపెట్టు, వాళ్ళ ఇంటికి పోవడానికి కావలసిన దారి ఖర్చు ఇప్పించు!" అన్నది మాలీ.

రాజకుమారుడు సంగ్రామ్‌సింగ్ సజన్ దేవుడి వైపు సాంకేతికంగా చూశాడు. సజన్ దేవుడు "సరే, మంచిది!" అని రజ్జీ వైపుకు తిరిగి "పద!" అన్నాడు.

రజ్జీ ముందుకు నడిచింది. మాలీని సమీపించి మాలీ మెడచుట్టూ చేతులు వేసి అందరూ చూస్తుండగా ఆమెను ముద్దుపెట్టుకొన్నది. అనంతరం త్వరత్వరగా బయటికి నడిచింది. మాలీ రాజకుమారుడి వైపు చూడసాగింది. ఆశ్చర్యం, బాధా, కోపం, సంతోషం అన్నీ కనుపిస్తున్నాయి ఆ చూపుల్లో!

రాజకుమారుడు చేయిపుచ్చుకొని అన్నాడు "రా! భోజనం తయారుగా వుంటుంది!"

మాలీ చేయి విడిపించుకొంటూ "నన్ను ముట్టుకోకు. నీవు ఒక కసాయివాడిలా వున్నావు!" అన్నది.

రాజకుమారుడు చిరునవ్వు నవ్వుతూ తిరిగి ఆమె చేతిని పుచ్చుకొన్నాడు. ఈమారు మాలీ చేయి విడిపించుకొనలేదు.

సజన్ దేవుడు గదినించి బయటికి వెళ్ళిపోయాడు.

# 4

రాజకుమారుడి మీద ఈర్ష్య, రజ్జీమీద సానుభూతి ప్రదర్శించేట్టుగా చేసింది సజన్ దేవుణ్ణి. సజన్ దేవుడు దారి బత్తెంగా రజ్జీకి షరాబుదగ్గిర మూడురూపాయలు ఇప్పించాడు.

తరువాత భోజనం పెట్టించి, రాజభవనపు ఒక గదిలో కూర్చుని ఆమె కష్ట గాథనంతా విన్నాడు. పూర్తిగా విన్న తరువాత అతనికి సశరీరమైన రజస్థానంలో ఒతిబాధలూ కన్నీళ్ళూ కను పించసాగాయి. తరువాత అతనికి గోమతిని గురించిన స్మరణ కలిగింది. ఒకప్పుడు తనను పెండ్లి చేసుకోవడానికి వచ్చిన గోమతి టీకరీ శాహాముదాద్‌లో ఒక వ్యాపారస్తుడిని పెండ్లి చేసుకొని చివరకు ఎలాంటి దుర్గతిపాలైందో విన్నాడు. అతడు కొన్ని క్షణాలు మౌనాన్ని వహించాడు. ఆమె ఈ స్థితికి తనెంత వరకూ కారకుడినో అని ఆలోచించసాగాడు. తరువాత ఆమె వ్యక్తిత్వాన్ని, అందాన్ని, మధురమైన స్వరాన్ని ఆమె తన ప్రేమను నిష్కపటంగా అర్పించడానికి పడ్డ ఆతురతను జ్ఞాపకం చేసుకోసాగాడు. ఒకమాటు ఆమె తనకోసరం పరోటాల్ని కాల్చుకువచ్చింది. కాని వెన్నటోనిస్తుతినే ఈయువకుడికి ఆమె అలా పరోటాల్ని కాల్చుకు రావడం ఏమాత్రమూ నచ్చ లేదు. ఇవ్వాళ ఆ పరోటాల్లోని మృదువైన ఆమె హస్త స్పర్శలు జ్ఞప్తికివస్తున్నాయి సజన్ దేవుడికి! “ఎంత పిచ్చివాడని ఆనాడు మృదుస్పర్శలను సుఖమైనవిగా భావించి, కాల తన్నాను” అనుకొన్నాడు. మరొకసారి గోమతి సజన్ దేవుడు చదువుకొంటుండగా అతని వెనకనే కుర్చీని ఆనుకొని నిలబడి అతడి బుజాలను పట్టుకొన్నది. అతను వెనుదిరిగి చూడగానే లేడిలాపరుగెత్తుకుపోయింది. అతనికి అప్పట్లో ఈగోమతియొక్క ఈ చేష్టకూడా ఏమీ నచ్చలేదు. ఇప్పుడవే చేష్టలు అతనికి ఎంతో స్పృహణీయమైనవిగా కనుపిస్తున్నాయి. ఆ అమా యిక క్రియల్లో “ప్రేమ” తన పరిపూర్ణస్థితిలో కనుపిస్తున్నది.

మానవుడు తనకంటె ముందు జరిగేదాన్ని సంపూర్ణంగా ఎన్నటికీ చూడలేడు. కొంతభాగాన్ని విడిచి పెట్టేస్తాడు. కొంత భాగం ఆలోచిడచడం కోసరం గు వంగా వుంటుంది. కొంత భాగం క్రియ సంపూర్ణంగా జరిగిపోతేగాని అర్థంకాదు. పోతే మానవుడు తన కండ్లతో చూడగలిగింది అత్యల్పం! అప్పు డప్పుడూ గానం సమాప్తి అయిపోయిన తరువాత దానిలోని మాధుర్యం అనుభూతికి వస్తుంది. చెట్టునుంచి ఆకు క్రిందికి రాలిన తరువాతగాని దాని మర్మరధ్వని వినిపించదు. ప్రేమ సమాప్తం అయిన తరువాతగాని, దానిలోని బాధ హృదయ మనే శూన్యాకాశంలో అంధచకోరంలా తిరుగుతూ ప్రతిధ్వని చేయదు. అలాంటి స్థితిలో మానవుడు నిరాశగా చేతులు నలుపుకొంటూ. "ఇప్పుడేంకాను? ఇప్పుడేంకాను?" అను కొంటాడు.

సజన్ దేవుడు ఇప్పుడు సరిగా పైనుదహరించిన స్థితిలోనే వున్నాడు.

అతను గోమతిని గురించి అనేక ప్రశ్నలు వేశాడు. సమాధానాల్ని విన్నాడు. సమాధానాల్ని ఇస్తున్న రజ్జికి ఆశ్చర్యం ఎక్కువ అవుతున్నది. చివరకు అడిగింది.

"గోమతి మీకు ఏం అవుతుంది ?"

సజన్ దేవుడు లేచి పచారు చేయసాగాడు. అతడు పై ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. నిజంగానే ఆమె తనకు ఏమౌతుంది? తనకేకాదు! ఎవరికిమాత్రం ఏమౌతుంది? తన కుటుంబానికి, కులానికి ఏమౌతుంది? థానేదారు హాశమత్

అల్లాబేగ్‌కు ఏమౌతుంది?— గోమతికూడా మనిషే! ఆమె తల్లి, భార్యా, ప్రేయసి, సోదరి - కాని ఈ సమాజంలోని అపరాధు లందరూ కలసి ఆమె నా గతికి ఈడిచారు.

గోమతి తనకు ఏమౌతుందో చెప్పలేక మౌనంగా పచార్లు చేయసాగాడు సజన్ దేవుడు.

రజ్జీ అన్నది "నాకు తెలిసింది!"

అవును రజ్జీకి ఎందుకు తెలియదు? రజ్జీ స్త్రీ! ప్రేమ మొదట స్త్రీల హృదయంలో మంద్రస్థాయిలో పాడే సంగీతంలా మొలకెత్తుతుంది. తరువాత పువ్వెత్తున పొంగుతుంది. రజ్జీకి ఎందుకు తెలియదు? స్త్రీల హృదయాల్లో మొలకెత్తే ఆ అపూర్వ ప్రేమసంగీతంలో ఎవ్వరూకూడా, ఏ సంగీత విద్వాంసుడుకూడా పోటీ చేయలేడు. అంత వున్నతంగా వుత్తమంగా పాడలేడు!

సజన దేవుడి కనుకొలకులనుండి రెండు కన్నీటి బిందువులు రాలినాయి.

"నే వెళ్ళనా? ఇక?" రజ్జీ అడిగింది.

సజన్ అన్నాడు "పద... నిన్ను మహల్ దాటించి వస్తాను. రాజరికపు ముసుగులో వున్న ఈ భోగంకొంపలో ఉన్నంతసేపూ నీ శీలానికి ముప్పు తప్పదు!"

మహలును దాటి బయటికి వచ్చిన తరువాత రజ్జీతో ఠాకుర్ కాహాన్‌సింగ్ ఇలా అన్నాడు. "రాజమహల్లో నీ శీలం చెడకుండా ఎన్నటికీ వుండదు. ఎటూ చెడుతుంది నీవు గనుక

రాజకుమారుడికి ఇష్టంగా ప్రవర్తించి మెప్పించావా? బహుశా ఫజల్‌ని వదలవచ్చును!-" అన్నాడు.

"ఊ! ఐతే!" సజన్ అన్నాడు.

రజ్జీ చాలాసేపు తల వంచుకు నిలబడి మునికాళ్ళతో మట్టిని పెళ్ళగిస్తూ వున్నది. చాలాసేపు గడిచిన తరువాత తల ఎత్తి "ఏం బాబూ! మా పరిస్థితిలో మార్పు ఏమీ రాదా?" అనడిగింది.

ఈ ప్రశ్నకు రజ్జీ ఆలోచించుకొని, అడగాలని అడగలేదు. అకస్మాత్తుగా ఉన్నట్టుండి అడిగింది. ఈ ప్రశ్న తీవ్ర వేగంతో తుపాకీగుండులా సజన్ దేవుడి హృదయంలోనుంచి దూసుకుపోయింది. ఈ ప్రశ్నకర్త మౌనం వహించిన తరువాత కూడా చాలాసేపటి వరకూ సజన్ దేవుడి చెవుల్లో పైప్రశ్న తాలూకు ప్రతిధ్వని వినపిస్తూనే వున్నది - దూరంగా ఎవరో తుపాకీ పేల్చినట్టయింది! ఈ ప్రతిధ్వని చాలాసేపటివరకూ వినిపించవచ్చును - అనుకొన్నాడు సజన్.

రజ్జీ వేసిన ప్రశ్నకు అతనేమీ సమాధానం ఈయలేదు. అసలా ప్రశ్నకు ఏం సమాధానం ఇవ్వడానికి వీలుంటుందో అతనికి తోచలేదు. అతను ఆత్రంగా రజ్జీని ఇంటికి వెళ్ళమని తను మహాలు లోపలికి వెళ్ళిపోయాడు.

# 5

చాలా వ్యాకులమైన అసమంజస మనస్థితిలో సజన్ దేవుడు మహాలులోకి ప్రవేశించాడు. ఆ సమయంలో రాజకుమారుడు భోజనాన్ని ముగించుకొని పొగత్రాగే గదిలో

కూర్చునివున్నాడు, అతను వదులైన నీలపు పువ్వుల జాకెట్‌ని వేసుకొని వున్నాడు. దీపగుచ్ఛంలోంచి వివిధరకాల కాంతులూ గదిలోకి వసుచుకొంటున్నాయి. ఆ రకరకాల కాంతుల్లో రాజకుమారుడి వుంగరాల్లోని బహుమూల్యమైన రాళ్ళు ధగధగా మెరిసిపోతూ వున్నాయి. ఆ సమయంలో రాజకుమారుడు ఒక తియ్యని నిద్రమగతలో కండ్లుమూసుకొని వున్నాడు. ఇవ్వాళ చాలా సుదినం! మాలీతో కొంచం ఎక్కువ చొరవగా మాట్లాడడం జరిగింది. భోజనంకూడా బాగుంది. ఇక్కడి భోజనపదార్థాలు ఏవీ ఎన్నడూ నచ్చని మాలీకి కూడా భోజనం బాగుంది. ఈజీచైర్‌లో పడుకొని వున్న రాజకుమారుడు కాళ్ళు తివాచీకి రాస్తూ కుర్చీకి ఒరుంచుకుపోయాడు. ఈ కుర్చీ చాలా వసతి అయినది. దీనిలో ఏదైనా కొరత వున్నదంటే; మృదువైన మాలీ చేతుల స్పర్శ ఒక్కటే. అంతే వివస్త్రంగా వున్న మాలీ వక్షస్థలం ఎంత ఉజ్వలంగా తెల్లగావుంది! ఆ వుజ్వలాన్ని చూస్తూవుంటే ఈపృథ్వికే నూతన ప్రభాతం సంప్రాప్తం కానున్నదా ? అని పించింది. ఇలాంటి సమయంలో ఎవరైనా ఒక కమ్మని పద్యాన్ని వినిపిస్తే?—ఉమర్ ఖయ్యాముని వినిపిస్తే? లేకపోతే దాగ్‌ని వినిపిస్తే? ఒక అందమైన పద్యం-కవిత్వం – నిద్రవచ్చే ట్టు! కళ్ళు మూతలు పడేట్టు! వినిపిస్తే !!

రాజకుమారుడు మెల్లగా కండ్లుతెరచి సిగరెట్ దమ్ము వదులుతూ సజన దేవుడిని అడిగాడు.

“సజన్ ఏదీ? ఒకమంచి కవిత్వాన్ని వినిపించు!”

సజన్ దేవుడు ఏమీ మాట్లాడలేదు. అతని ముఖం ముడతలు పడ్డది. ఒకప్రక్కన కూర్చుని పేకముక్కలను పరుస్తున్నాడు బల్లమీద.

ఔక్కా మన్‌మోహన్‌సింగ్ నవ్వుతూ వ్యంగ్యంగా అన్నాడు. "మీరు ఎవరికి చెబుతున్నారండీ? సజన్ దేవుడు, ఇప్పుడు యిక్కడ లేడు!"

"ఎక్కడ వున్నాడేమిటి?" రాజకుమారుడు అడిగాడు.

"అతనిప్పుడు ఒక అమ్మాయితో, కాల్పనిక గుర్రానెక్కి వెళుతున్నాడు!"

"ఎవరా అమ్మాయి?"

"ఆ అమ్మాయి యిప్పటికి బహుశ రెసిడెన్సీభవనాన్ని చేరుకొని వుంటుంది!"

"వకాలీ ఏనా?" సంగ్రామ్‌సింగ్ అడిగాడు.

సజన్‌దేవుడు పేకముక్కలు విసురుగా మేజామీద పారేసి "షటప్!" అన్నాడు. అనడానికయితే అన్నాడుగాని అన్నతరువాత నాలుక కొరుక్కున్నాడు. కాని నోరుజారిన తరువాత నాలిక కొరుక్కొని ప్రయోజనం ఏమిటి?"

సంగ్రామసింగ్ ముఖంలో ఒక్కసారిగా రక్తం విరిగిపోయింది. క్రమేణా అతనిముఖంలో క్రోధఛాయలు కనుపించసాగినాయి. అతను వణుకుతూ ఈజీచైరులోనుంచి లేచి నిలబడ్డాడు. అతని జీవితంలో నేటివరకూ ఎవ్వరూ షటప్ అనలేదు. ఇవ్వాళ అతను సజన్‌దేవుడిని బాగా "షట్‌అప్" చేస్తాడు!"

టిక్కా మన్‌మోహన్‌సింగ్ ఠాకూర్ నైనిహాల్‌సింగ్ కూడా రాజకుమారుడి దగ్గిరకు వచ్చి నిలబడ్డారు.

సజన్‌దేవుడు కుర్చీలోనుంచి లేచి కూర్చున్నాడు.

మన్‌మోహన్‌సింగ్ అన్నాడు "సజన్‌దేవు! క్షమాపణ వేడుకొంటావా ?"

సజన్‌దేవుడు మౌనంగా వున్నాడు.

సంగ్రామసింగ్ అన్నాడు "క్షమించబడదు !"

నైనిహాల్ అన్నాడు "తప్పుచేసికూడా ఏమిటోయ్ బింకం !"

సంగ్రామసింగ్ అన్నాడు "మాలీ పీడి ముఖాన్ని ఉమ్మేయనుకూడా వుమ్మేయడు !"

సజన్ మౌనంగా వున్నాడు.

మన్‌మోహన్‌సింగ్ ఈ సదవకాశాన్ని పూరక పోనివ్వదలుచుకోలేదు. "విశ్వాసఘాతుకుడా, కుక్కా, పంజాబీ ! రాజకుమారుడి వుప్పూ, పులుసూ తింటూ రాజకుమారుడినే వంచిస్తావుగా !"

సజన్‌దేవుడు ఇక మెదలక వూరుకోలేకపోయాడు. అతని శరీరం అంతా కోపంతో వుడికిపోయింది. "బయటికిరా ! నీ టిక్కా శాహీనంతా వదలిస్తాను ! టిక్కా ప్రభు తను అరేయి ! దొంగరా ! ఒళ్ళు చీల్చేస్తాను !" సజన్‌దేవుడు అరిచాడు.

ఇలా అంటూనే సజన్ బయటికి పోవడానికి రెండడుగులు ముందుకు వేశాడు. రాజకుమారుడుకూడా రెండడుగులు

ముందుకు వేసి సజన్ దేవుడి చంపలమీద విసురుగా రెండు దెబ్బలు కొట్టాడు. తరువాత తన ఇద్దరు ఏ. డి. సి. లవైపు చూసి "వీడిని రాజమహల్లోని పోలీసు అధికారికి వప్పచెప్పు! వీడికి ముఖానికి రంగుపూసి, గాడిదమీద కూర్చోబెట్టి, వూరంతాతిప్పి వూరిబయట వదిలిపెట్టమని చెప్పు!" అన్నాడు

తిరిగి సజన్వైపు తిరిగి "వెనకటిస్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని ఈ మాత్రపు శిక్షను యిస్తున్నాను. లేకపోతే నిలువునా చర్మం వలిపించేవాడిని. వెనుకటి స్నేహాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని అంతేకాదు. ఇక్కడికి నేను నిన్ను తెచ్చాను. నీవు పరదేశివి! అందుకని-క్షమించి!" అన్నాడు.

ఇంతలో ఒకొక్క మన్మోహనసింగ్ పోలీసు అధికారిని తీసుకొనివచ్చాడు. పోలీసు అధికారి వెంట ఇద్దరు పోలీసులు కూడా వున్నారు. వాళ్ళు సజన్ దేవుడిని పట్టుకుతీసుకుపోయారు

# 6

ఆ రోజున మంచు అధికంగా కురవడంవల్ల వూరేగింపు జరగలేదు. తప్పెటలు మ్రోగలేదు. సజన్ దేవుడి ముఖాన్ని రంగుపులిమి గాడిదమీద కూర్చోబెట్టి వూరంతా త్రిప్పలేదు. కాని, రెండవరోజున సూర్యభగవానుడి దర్శనం జరిగింది. మంచులో కప్పబడ్డ తెల్లని భవనాలమీద సూర్యకిరణాలు మెరుస్తూ జారిపోయినాయి- దానితోపాటు సజన్ దేవుడి ముఖానికి రంగుపూసి, గాడిదమీద కూర్చోబెట్టి వూరేగించారు కూడాను! పిల్లలకు ఇది చాలా ఆనందదాయకమైన

విషయం! పిల్లలు అరుస్తూ, కేకలు వేస్తూ గాడిదతోపాటు గుంపులు గూడారు. మధ్య మధ్య గాడిదమీద వూరేగే అవరాధికి, గురిచూసి ఒకొక్కరాయి విసిరేవారుకూడాను.

# 7

రాజమహాలు ఉపరికక్షంనుండి రాజకుమార్ సంగ్రామ్ సింగ్, చెక్కా మన్‌మోహన్‌సింగ్ కూడా ఈ వినోదకరమైన దృశ్యాన్ని చూశారు. నవ్వి నవ్వి వారికి కడుపులోనొప్పి పుట్టసాగింది.

గాడిద వూరేగింపు రాజమహాల్ దాటి అఖరోట్ చెట్ల బజారుకు పోయింది. అక్కడినుండి మంత్రిగారి మందిరాన్ని దాటి రెసిడెన్సీ భవనంవైపుకు పోయింది.

తప్పెటగోలనువిని రెసిడెంసీలోని చాలామంది ప్రజలు బజారులోకి వచ్చారు చూడడానికి! మాలీ, ఆమె తండ్రి కర్నల్‌డిక్ కూడా బయటికి వచ్చారు. అదిచూచి మాలీకి చాలా కోపం వచ్చింది. ఊరేగింపునూ తప్పెటలనూ ఆపివేయించింది.

మాలీ గాడిదముందుకు పోయి నిలబడ్డది. ముఖానికి రంగు పులమబడి గాడిదమీద వూరేగిస్తున్న ఆ వ్యక్తిని గుర్తించింది. సిపాయీలను అడిగింది. "ఎవరితను ఇతనేం తప్పుచేశాడు?"

ముఖానికి రంగు పులమబడిన వ్యక్తి మాట్లాడలేదు.

ఒక సిపాయి ఇలా అన్నాడు "ఇతడు సజన్ దేవుడు! రాజకుమారుల ఎ. డి. సి. ఇతడు రాజకుమారుల్ని ధిక్కరించాడు!"

మాలీ అడిగింది "ఏం ధిక్కరించాడు? ఇంత నీచమైన శిక్ష విధించడానికి ఏమిటా అపరాధం, ఇతడు చేసినది?"

సిపాయీలు ఏమీ మాట్లాడలేదు.

మాలీ తీక్షణంగా అన్నది "ఏమిటి ఇతడి అపరాధం? చెప్పండి?"

ఒక సిపాయి భయంగా సమాధానం ఇచ్చాడు. "అమ్మగారూ! మాకేమీ తెలియదండి, మాకు ఇచ్చిన ఆజ్ఞ ఇది! మేము పాలిస్తున్నాము!"

మాలీ మండిపడ్డది "ఇతడిని గాడిదమీదనుంచి దింపండి. కట్లువిప్పండి!"

ఎవ్వరూ తమ స్థానాలనుండి కదలలేదు.

"విప్పండి! నేను చెబుతున్నాను విప్పండి! వినపడడంలా?"

తండ్రి మాలీని వారించాడు "నీవు అనవసరమైన విషయాల్లో చిక్కుకోకు!"

మాలీ దృఢంగా అన్నది "లేదు డాడీ! ఏమిటీ అన్యాయం? ఏమిటీ అసభ్యత? నేనీ అసభ్యతను భరించలేను. పాపం, ఇతడిని వదిలిపెట్టనివ్వు!"

కర్నల్ సిపాయీలకు ఆజ్ఞ ఇచ్చాడు. "ఇతన్ని వదలండి! నేను చెబుతున్నాను, వదలండి!"

సిపాయీలు భయపడుతూ, వివశులై సజన్ దేవుడిని గాడిదమీదనుండి దింపారు.

సజన్ దేవుడు మాలీకి ఎదురుగా నిలబడి వున్నాడు.

మాలీ అతడిని ప్రశ్నించింది. "నువ్వే ఏం అపరాధం చేశావ్?"

"నేను నిన్ను ప్రేమించాను!" సజన్ దేవుడు అన్నాడు.

మాలీ ఆశ్చర్యానికి మేరలేదు తెరచిననోరు తెరచి నట్టే వుండిపోయింది. నల్లరంగు పులమబడ్డ సజన్ ముఖంవైపు ఒకమాటు చూచింది. అతడి వంటిమీది గుడ్డలు చీలికలుగా చిరిగిపోయినాయి. శరీరం రోడ్లమీది మట్టితోటీ రక్తంతోటీ మిశ్రితమై వెగటైన రంగుల్ని ప్రతిఫలిస్తోంది. ముఖంమీది గాఢ శ్యామల వర్ణంలో పండ్లూ కండ్లూ మాత్రం తెల్లగా భయంకరంగా మెరుస్తున్నాయి. మాలీ హృదయంలో దయా ద్వేషం-ఈ రెండుభావాలు జంటగా పొడచూపినాయి. ఏమీ మాట్లాడలేక మౌనంగా, తలవంచుకుని రెసిడెంసీ భవనంలోకి వెళ్ళిపోయింది. కర్నల్ డిక్ కూడా ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

సిపాయీలు మళ్ళీ సజన్ దేవుని గాడిదమీద కూర్చో పెట్టారు. తప్పెటలు వాయించుకొంటూ ముందుకు నడిచారు.

రాత్రి పదిగంటలకు పెరేడ్ గ్రౌండ్ లో ఫిరంగి మ్రోగింది. తప్పెటలు ఆగాయి. సిపాయీలు సజన్ దేవుడిని గాడిదమీదనుండి దించారు. అప్పటికి వారు పట్నాన్ని దాటి నదిపైన వున్న చెక్కవంతెన మీదకు వచ్చి చేరారు. సిపా

యీాలు సజన్ దేవుడిని వంతెనకు అటువైపున విడిచి, పట్టణం నుండి బయటికి నెట్టారు. వాళ్ళు తిరిగి పట్నంలోకి వెళ్ళి పోయారు.

# 8

సజన్ దేవుడు మెల్లగా నదికి అటువైపునవున్న కాలి బాటన నడవసాగాడు. అతని నడక మహా తూలుడుగా వుంది. తను నడుస్తున్నట్టు కాకుండా ఎవరో ముందుకు నెడుతున్నట్టుగా నడుస్తున్నాడు. అతని హృదయం భావశూన్యంగా వుంది. తను ఎలా నడుస్తున్నాడో అతనికే తెలియదు. కొంత దూరంపోయాక ఒక చిన్నవంతెన వచ్చింది. వంతెన దాటిన తరువాత పెద్ద 'చనార్' వృక్షం ఒకటివున్నది. సజన్ దేవుడు ఆ వృక్షపు మొదట్లో కూర్చుండిపోయాడు.

చనార్ వృక్షపు చల్లదనం అతని శరీరాన్ని పులికింప జేసింది. అతనిశరీరం స్వల్పంగా కంపించింది. అతను చవ్వున మనలోకంలోకి వచ్చి పరిసరాల్ని కలయచూశాడు. పరిసరమంతా మసగ్గా, నిర్మానుష్యంగా వుంది. దూరంగావున్న రాజభవనాల దీపాలు ఆరిపోయాయి. పరిసరం అత్యంత మౌనంగా వుంది. సజన్ దేవుడి హృదయంకూడా మౌనంగా వుంది. పరిసరం మంచుతో నిండివుంది. సజన్ దేవుడి హృదయం కూడా "శోకసంతప్తత" అనే మంచుతో నిండివుంది. అతని భావాలు మంచులా చల్లబడి నిస్పందమైనాయి. ప్రకృతి అతనిలో తాదాత్మ్యతను పొందింది. అతను ప్రకృతిలో ఏకం అయ్యాడు. అతని హృదయం గాయాలతో, దెబ్బలతో క్షత

విస్తృతమైనది. అయినా అతనుమౌనంగా, నిశ్చలంగావున్నాడు. అతనికి తను ఒక బ్రహ్మాండమైన శూన్యంలో అంతర్భాగం అయినట్టుగా వుంది.

కొద్దిసేపు గడిచాక అతనిచెవులకు మెల్లని అడుగుల శబ్దం వినిపించింది. క్రమేణా దగ్గరకు వచ్చిందా శబ్దం. ఎవరో మృదువుగా తన భుజాన్ని స్పర్శించినట్టు అయింది. సజన్‌దేవుడు వెనక్కు తిరిగిచూశాడు. తనను ఎక్కించి వూరంతా త్రిప్పిన గాడిద అది! ఆ నోరులేని జంతువును తన ముట్టెను సజన్‌దేవుడి భుజానికి ఆనించింది. దాని వెచ్చని, తడిశ్వాసలు సజన్‌దేవుడి చంపలకు తగలసాగినాయి. ఈ వెచ్చని చల్లని స్పర్శలతో అతని శరీరంలోనూ, మస్తిష్కం లోనూ సంచలనం, సంస్పందనా కలగసాగింది. శరీరబాధలు అతనికి స్పష్టంగా అనుభూతికి వచ్చినాయి. అతని అవయవా లన్నీ నొప్పులు పుట్టసాగినాయి. ఇక్కడ దెబ్బతగిలింది... ఇక్కడనుండి రక్తం స్రవించింది; హృదయం ఇక్కడ పగి లింది!! ఇలా తన దెబ్బలనూ, పగుళ్ళనూ చూచుకొన్నా డతను. అతను ఎంత ప్రయత్నించినా ఆగకుండా అతనికండ్లు చమర్చినాయి. పసిపిల్లవాడిలాగా గాడిదమెడను వాటేసు కొని భోరున ఏడిచాడు! కన్నీళ్ళు అతని నల్లనిరంగు వేసిన ముఖాన్ని కడుగుతూ చంపలక్రింద జారినాయి. గాడిదను వాటేసుకు ఏడవడాన్ని చూస్తే ఎవరో దుఃఖితుడు తన ప్రియ స్నేహితుడిని వాటేసుకొని విలపిస్తున్నాడేమో ననిపిస్తున్నది!

నోరులేని గాడిద నిర్వికారంగా నిలబడివున్నది. చనార్ వృక్షపు ఆకులు మెల్ల మెల్లగా కదలసాగినాయి. నదీజలాలు

రాళ్ళకు తగిలి ఆక్రందిస్తున్నాయి. ఇంతలో కిల్లాలోని దీపాలు కూడా ఆర్పేశారు. నలుమూలలు గాఢాంధకారం! అంత విశాలమైన అంధకారంలోను మంచుగలప్రదేశాలు మెరుస్తూ తెల్లగా కనుపిస్తున్నాయి. ఈ సువిశాలభూవలయంలో కొంత ప్రదేశం నలుపూ, కొంతప్రదేశం తెలుపూలాగా వుంది. నలుపూ, తెలుపూ, ఈ రెండూ ప్రత్యేకం వేరువేరుగా వున్నాయి. ఈ రెండూ కలవు! సజనదేవుడి బుర్రలో ఒక వూహా మెరసింది. నలుపూ, తెలుపూ! ఇవి ఎన్నటికీ ఏకం కావు! అసంభవం!! ఇకతను తన దేశం పోవడం అసంభవం కాదు అనిపించింది! తనకు గతజీవితంతోటి పూర్తిగా సంబంధాలు తెగిపోయినాయి. ఒకనూతన జీవితంతో సంబంధాలు కలిశాయి. తను ఇన్నాళ్ళు అంధకారంలో వున్నాడు. ఇప్పుడు వెలుగులోకి వచ్చాడు. ఇక మళ్ళీ తిరిగి ఆ అంధకారంలోకి పోలేడు. అంతేకాదు ఆ అంధకారాన్ని శాశ్వతంగా దూరంచెయ్యడం తన కర్తవ్యం! అందుకు ఎక్కడెక్కడ వున్న శ్వేతఖండాల్నీ వెతకాలి. ఏకం చెయ్యాలి! వెలుగుని విస్తృతం చెయ్యాలి! అంధకారాన్ని తిరోముఖం పట్టించాలి! అందుకు చాలా పరిశ్రమ అవసరం! శ్వేదం, అశ్రువులు, గవోష్ణశ్వాసలు, విశ్వాసం, బుద్ధివికాసం – వీటన్నింటితోటీ ప్రయత్నం చెయ్యాలి! ఏమైనా కానీ ఇక అతను తన దేశం పోలేడు. తన ఇంటికిపోలేడు. తను క్రొత్తయింటినీ, క్రొత్త దశాన్నీ వెతుక్కోవాలి!

కొద్దిసేపటి తరువాత అతనిముఖంలో అకస్మాత్తుగా సంతోషచ్ఛాయలు మెరిశాయి. తను ఎదురుచూస్తున్న మహా

త్త్ర విషయం ఏదో తృటికాలంలో సంభవం అయినట్టు ఆనం దించాడు. లేచి నిలబడ్డాడు. మెల్లగా టీకరీ శాహామురాద్ వైపుకు నడిచాడు. అతడి నూతన కార్యక్షేత్రం కొరకు!

# 9

కాలిబాటన పరుచుకొనివున్న మంచువంక ఒకమాటు చూశాడు సజన్ దేవ్. అతనికి తనరంగు పులిమిన ముఖం జ్ఞాప కానికి వచ్చింది. మంచును రెండుచేతులనిండా తీసుకొని ముఖా నికి వేసి రుద్దుకొనసాగాడతను. తెల్లనిమంచు అతనిముఖం మీది నలుపును (మాలిన్యాన్ని) పోగొట్టింది. ముఖంమీది దే కాదు. హృదయంలోని మాలిన్యంకూడా కడిగినట్టుపోయింది. మాలిన్యం పోవడంతోనే వెనకటి సజన్ దేవుడి స్థానంలో ఒక నూతనమైన వుజ్వలమైన సజన్ దేవుడు ఉద్భవించాడు!

ముఖం శుభ్రం చేసుకొని తన సహచరి అయిన గాడి దనుచూసి "రా! సాంచూ!" అని గాడిదను పిలిచి ముందుకు నడిచాడు అతను!"

# 10

"ఈ ఖిల్లా లోపల పన్నెండు బావు లున్నాయి!" సంగ్రామ్‌సింగ్ మాలీతో అన్నాడు.

రెండు జాముల అనంతరము చాలాసేపటినుండి సంగ్రామ సింగు, మాలీ–ఇద్దరూ ఈఖిల్లాలో తిరుగుతున్నారు. మాలీ ఖిల్లా

లోపలవున్న వివిధస్థానాలనూ ఫోటోలు తీసుకుంటూన్నది కూడాను! ఆమెగారి జేబుకెమేరా చాలా నిర్లక్ష్యంగా ఫోటో తీసుకొంటూన్నట్టు కనుపిస్తూనే తీవ్రమైన వేగంతో ఫోటోలను తీసుకొంటున్నది.

మాలీ సంగ్రామసింగును అడిగింది "పన్నెండుబావులా నీళ్ళని?"

"నీళ్ళవికాదు. ధనంవి!"

"నాకు అర్థం కాలేదు!"

సంగ్రామసింగు వివరించాడు "ఈ పన్నెండు బావుల్లో లెక్కలేనంత ధనరాపడి మూలుగుతున్నది!"

"అబద్దం!"

"అబద్ధంకాదు. నిజం! మా నాన్నగారు నాకు స్వయంగా చెప్పారు!"

"మీ నాన్నగారు చూశారా?"

"చూడలేదు. మా నాన్నగారికి వారి నాన్నగారు చెప్పారుట."

"అవును. ఇక నాకు తెలిసింది. వారికి, వారి నాన్నగారు, వారికి వారి నాన్నగారు చెప్పారు ఔనా? అయితే ఇంత వరకూ వీటిని ఏ మూర్ఖుడూ త్రవ్వించి చూడలేదా?"

"లేదు"

మాలీ విరగబడి నవ్వింది.

"అరె...మీరా రసపుత్రులుకూడా ఎంత అమాయకులయ్యా! అదికాదు. నే అనేది త్రవ్వించి చూడండి. వీటిల్లో

ఆస్తులకు బదులు శతృవుల అస్థికలే వున్నాయేమో, అవి కాక మరేమీ లేవేమో చూడండి !"

రాజకుమార్ సంగ్రామసింగు గొప్ప విశ్వాసాన్ని కలుగచేస్తూ "నిజం వీటిల్లో ధనంవుంది !"

"అవునులే ! ఆస్తులు !" మాలీ రాజకుమారుడిని ఉడికిస్తూ అన్నది.

రాజకుమారుడికి కోపం వచ్చింది. కావాలంటే నీకు రేపే ఈ బావులను త్రవ్వించి చూపిస్తాను ! అన్నాడు. ఆ బావులు అనేక తరాలనుండి త్రవ్వించబడనివి అయినప్పటికీ !

"అయితే, రేపు నీవు వీటిని ఎలా త్రవ్వించగలవు ?"

"నేను నాన్నగారికి చెబుతాను !"

"నాన్నగారు ఒప్పుకోకపోతే ?"

"నేను ఒప్పిస్తాను !"

"ఎలా త్రవ్వించగలవు? నలుగురు బ్రాహ్మణులు వచ్చి ఇప్పటివరకూ సాంప్రదాయ సిద్ధంగా వస్తున్నదని ఈ బావులను త్రవ్వించకూడదు." అన్నారా? ఇక మీ నాన్నగారు ఠకీమని ఆగిపోతారు. అసలు ఈ బావులను ఇంతవరకూ త్రవ్వించక పోవడానికికూడా ఇలాంటిదే ఏదో ఒక మూర్ఖమైన కారణం ఆధారమై వుంటుంది ?"

"ఈసారి అలాకాదు. తప్పకుండా ఈ బావులను త్రవ్విస్తాను !"

"సరే. చూస్తానుగా !"

"మరి వీటిని త్రవ్విస్తే నాకేమిస్తావు? సంగ్రామసింగు మాలీ పెదాలవైపు చూస్తూ ప్రశ్నించాడు.

మాలీ పెదాలమీద ఒక చిరునవ్వు మెరసింది.

"నీ కీ బావుల్లోవున్న ఆస్తులు దొరుకుతాయి. వుంటే లేకపోతే అస్తికలేగతి!"

సంగ్రామసింగు మాలీకి బాగా దగ్గరకు పోయాడు. మాలీ సంగ్రామసింగు చెయ్యి పుచ్చుకొని ఆజ్ఞాపిస్తున్న స్వరంలో "పద, నన్నా గదిలోకి తీసుకుపద, దాన్ని చూడాలి! దానిలో నేనా, బ్రాహ్మణకుర్రవాడిని ఒకడిని ప్రాణాలతో పూడ్చిపెట్టారట!" అని అడిగింది.

"నీ కెలా తెల్సింది?"

"ప్రపంచానికంతా తెలియగా నాకెందుకు తెలియదు? మొద్దాబ్బాయి!"

మాలీ తనను మొద్దబ్బాయి అన్నందుకు రాజకుమారుడు చాలా సంతోషపడ్డాడు. ఇద్దరూ పైఅంతస్తులను చూడడానికి మెట్లు ఎక్కారు.

# 11

పగలంతా వాళ్ళు అలాగ ఖిల్లామీద తిరిగారు. ఈఖిల్లా లోపల ఇంతవరకు ఇంగ్లీషువాళ్ళ పాదం పడలేదు. ఈ ఖిల్లాను లోపలకుపోయి చూస్తున్న ఆంగ్ల యువతుల్లో ప్రప్రథమ యువతి మాలీ! అందువల్లే ఆమెలో ఉత్సుకత అధికంగా వున్నది. ఖిల్లాలోవున్న రక్షణగృహాలు, దాసీజనాల విడిది గృహాలు సొరంగాలూ, కందకాలూ, బావులు వలలు కిటికీలు,

శిక్షాగృహాలూ, జైళ్ళూ, దండనగృహాలూ, న్యాయస్థానాలూ మహారాజుగారి విశ్రాంతి భవనం, రాణీల భవనాలు, గుళ్ళూ, గోపురాలు, చెరువులూ—అన్నింటినీ పరిశీలనగా చూసింది మాలీ! ఈ ఖిల్లాకూడా యితర జాగీర్దార్ల ఖిల్లాలాగానే క్రింద విస్తృతంగా వుండి పైకి పోయినకొలది వలయాకారంగా తిరుగుతూ చివరకు గోపురాకారంతో అంతం అవుతుంది. ఈ విధంగా కట్టడంవల్ల బయటగోడ లోపలి ప్రతిచిన్న వస్తువునూ చుట్టూముట్టివుంటుంది. బయటి ప్రహారీని దాటాక లోపల ఒక వరండా తగులుతున్నది. ఇక్కడినుండి ఖిల్లాయొక్క రెండవ అంతస్తు ప్రారంభం అవుతుంది; శత్రువు ఒక వేళ మొదటి దర్వాజాను ఛేదించినప్పటికీ లోపలి ఈ రెండవ అంతస్తును దాటడం దుస్సాధ్యం! మాలీ సంగ్రామ్ ఇద్దరూ ఖిల్లా లోపలకు పోతున్నారు. లోపలికి పోయినకొద్ది ఖిల్లా చిన్నది అవుతున్నట్టూ, అంతకంతకూ ఎత్తునకు పోతున్నట్టూ కనుపిస్తున్నది. ఈ ఖిల్లాలోకి వెళుతూవుంటే మాలీకి పురాతన యుద్ధాలు జ్ఞప్తికి వస్తున్నాయి. ఇలా తిరిగి తిరిగీ చీకటిపడే సమయానికి ఇద్దరూ ఖిల్లాయొక్క చిట్టచివరి గుండ్రనిగదిలోకి చేరారు.

## 12

గుండ్రనిగదికి నాలుగువైపులఅద్దాల కిటికీలు వున్నాయి. కిటికీలకు సమీపంలోనే దీపగుచ్ఛాలు వేలాడుతున్నాయి. ప్రస్తుతం కిటికీల తలుపులు వేసివున్నాయి. వాటి రంగు రంగుల

అద్దాలకు తగిలి వికీర్ణమౌతున్న. దీపగుచ్ఛపు కాంతి గదిలో ఇంద్రధనస్సులా, కాంతుల్ని వెదజల్లుతున్నది.

మాలీకి ఈ గది బాగా నచ్చింది. నాలుగువైపులా తిరిగి గది నంతా చూచింది. పురాతనమైన అద్దాలనూ, చిత్రాలనూ అన్నింటినీ పరిశీలనగా చూసింది. ఈ గది నూటికి నూరుపాళ్ళూ ఆసియా సంస్కృతికి ప్రతిబింబం! ఈగదిలో క్రొత్తది కాని, ఆధునిక నాగరికతకు సంబంధించినది కాని ఒక్క వస్తువు లేదు. మాలీకి తను వెనక్కి నడిచి, 0వ శతాబ్దంనుండి 1వ శతాబ్దానికి చేరుకున్నట్టనిపించింది. తను ఇరవయ్యో శతాబ్దంలో విమానాల్లో ప్రయాణంచేసే అయిరిష్ యువతి కానట్టూ, రెండువేల సంవత్సరాల క్రితం పట్టువస్త్రాల్లో మునిగి, అత్తరు పూసుకొని వేణీబంధంలో గులాబీలను తురుముకొని కాళ్ళకు పారాణి పెట్టుకొని "ఘల్లు ఘల్లు" మంటూ అటూ ఇటూ తిరుగుతున్న రాజకుమారినేమోనని అనుకొన్నది. తనను ఎవరో రాజకుమారుడు కత్తులతో, బల్లాలతో ఘోరంగా యుద్ధంచేసి జయించి ఇక్కడికి తెచ్చాడనుకొన్నది. ఒక్క క్షణకాలం మాలీకి తను ఓడిపోతానేమో ననిపించింది. రెండు చేతులనూ వణుకుతూన్న తన గుండెలమీద పెట్టుకొన్నది.

అదేక్షణాన రాజకుమారుడి చేతులు తనను చుట్టుకొంటున్నట్టూ; తను రాజకుమారుడి బాహుపాశంలో బంధింపబడి పోతున్నట్టూ తెల్సుకొన్నది మాలీ! మెల్లగా జాగ్రత్తగా తనను రాజకుమారుడి బాహుపాశంనుండి కాపాడుకుని కిటికీదగ్గిరకు వెళ్ళి నిలబడి తలుపుతెరచి క్రిందికి తొంగి చూసింది.

రాజకుమారుడు అన్నాడు "మాలీ! నీకు తెలుసా? నేను నీ ప్రేమ కోరుతున్నాను."

చాలాసేపటి తరువాత దీర్ఘంగా శ్వాసతీసుకొని "నీవు నా ప్రేమను కోరుతున్నావా? లేక నన్ను జయించాలను కొంటున్నావా?" అని అడిగింది మాలీ!

పురుషుడి ప్రేమలో 'విజేత' భావం తప్పకుండా వుంటుం దని రాజకుమారుడు ఒప్పుకొన్నాడు.

మాలీ అన్నది. "అది పురాతనయుగపు ప్రేమ. చేతితో నూలు వడుక్కునే రోజులనాటి ప్రేమ అది. కాని, ఇది ప్లాష్టిక్ యుగం!"

రాజకుమారుడు అన్నాడు. "మా దేశంలో ఇప్పటికీ చేతితో నూలు వడుకుతారు!"

అందువల్లే నీవు నాతో ఒకబానిసతో వ్యవహరించినట్టు వ్యవహరిస్తున్నావు. కాకపోతే, దుర్లభమైన బానిసతో వ్యవహ రిస్తున్నట్టు ప్రత్యేకతను కనబరుస్తున్నావు—మొత్తానికి బాని సతోలాగే వ్యవహరిస్తున్నావు. ఎప్పటికయినా జయించవచ్చు. తప్పక జయించవచ్చు అనుకొంటున్నావు."

రాజకుమారుడు పెదాలు కొరుక్కొన్నాడు.

మాలీ అన్నది "మీ పరిసరం, జీవితం చాలా అంద మైనవి. అయినప్పటికీ నే నా అందాన్ని ఒప్పుకోను. కారణం మీరు ఇంకా మొదటి శతాబ్దంలో వున్నారు! దాన్నే పూజి స్తున్నారు!"

"నేను నిన్ను పూజిస్తున్నాను!"

"నువ్వు అబద్ధం ఆడుతున్నావు. నీ హృదయాన్ని తడిమి చూసుకో! నీవు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా? పురుషుడు స్త్రీని బానిసగా చూచే నీచభావన నీలో లేదా? స్త్రీని పురుషుడు విలాసాలను కూర్చే యంత్రంగా నీవు చూడడం లేదా? స్త్రీ ఒక పుష్పం కోసి సువాసనను పీల్చి, ఆనందించి, వాడిపోయిన తరువాత అవతల పారేసి, మరొక పుష్పాన్ని కోసుకుంటారు. ఇలాంటి స్వభావం నీలో లేదా? ఆలోచించు! నీ ప్రేమలో నాకు ఇంతకన్నా వున్నతమైన స్థానమేమైనా వుందా? నిజం చెప్పు?"

రాజకుమారుడు మౌనంగా వుండిపోయాడు. మాలీ నిజం చెబుతున్నది. ఎక్కువగా తర్కిస్తే తన ప్రేమలోని యదార్ధరూపం బయట పడుతుందేమోనని అతని భయం.

"మా ఐర్లెండులో కూడా ఇలాంటి పాతకిల్లాలు చాలా వున్నాయి. కాని ఇప్పుడవన్నీ పాడుబడిపోయినాయి. ఎవరూ వుండడంలేదు వాటిల్లో." క్షణం ఆగి "ఔను యీ పాతకిల్లా కూడా పాడువడి పోతుంది. ఎవ్వరూ వుండరు!" అన్నది మాలీ.

# 13

రాజకుమారుడు మాలీ ఇద్దరూ మౌనంగా కిటికీల్లో నుంచి బయటికి చూస్తున్నారు. దూరంగా పలంధరీ పర్వత పంక్తుల వెనుక సూర్యాస్తమయం అవుతున్నది. మంచు కొండల అగ్రభాగాల్ని సూర్యభగవానుని తుది కిరణాలు తెల్లగా మెరిసిపోతున్నాయి. చూస్తూవుండగానే సూర్యుడు అస్తమించాడు. తుది కిరణాల వెలుగు మాయం అయింది.

మాలీ గాభరాపడ్డది. ఆసియాలో రాత్రి చాలా త్వరగా వ్యాపిస్తుంది. ఐర్లాండులో అలాకాదు, సూర్యాస్తమయం అయిన చాలాసేపటివరకూ వెలుగు లోకంమీద వ్యాపించి వుంటుంది. మాలీ వెనక్కు తిరిగి రాజకుమారుడివంక చూచింది, అతను కన్నీళ్ళు కారుస్తున్నాడు.

మాలీ రాజకుమారుడి కన్నీళ్ళకు ఏమాత్రం సానుభూతిని చూపకుండా "పద నన్ను మా భవనందగ్గిర విడచి వద్దువుగాని!" అన్నది.

అప్పటికి చాలాసేపటినుండి రాజకుమారుడు మాలీకి వెనుక నిలబడివున్నాడు. అంతసేపుగా అతను తనఅంతరాన్ని వెతుక్కుంటున్నాడు. తన హృదయాన్ని తడువుకొంటున్నాడు. ఏమిటీ తను క్రొత్తరకంగా 20 వశతాబ్దానికి తగినట్టుగా ప్రేమించగలడా? సందిగ్ధస్థితిలోపడ్డాడు రాజకుమారుడు. అదే స్థితిలో వుండిపోయాడు. మాలీకి ఏమీ సమాధానం ఈయలేదు.

"అయితే నీవు తీసుకుపోవన్నమాట?" మాలీ సమాధానానికి ఎదురుచూడకుండా ముందుకు నడిచింది.

రాజకుమారుడామెను అనుసరించాడు.

# 14

రాత్రి భోజనసమయంలో మాలీ తనతండ్రితో మాట్లాడుతున్నది.

కర్నల్ అడిగాడు "ఫోటోలు అన్నీ తీసుకున్నావా?"
షాలీ అలసటగా సమాధానాన్ని ఇచ్చింది. "ఆఁ"
"ఖిల్లాలోని ముఖ్య స్థలాలన్నింటికీ."
"ఆఁ"
"మరిబావులో?"
"వాటిని త్రవ్విస్తారు!"

కర్నల్‌డిక్ చాలా ప్రేమార్ద్రంగా తన కూతురి శిరాన్ని నిమిరి "ఇక, నీవు నిద్రపో అమ్మా! చాలా అలిసి పోయావు!" అన్నాడు.

---

# పదకొండవ అధ్యాయం

సూబేదార్ జాన్ మహ్మద్ జాన్ అబ్దుల్‌తో ఇలా అన్నాడు. "ఇవ్వాళ రాత్రికి, జరనైల్‌సింగ్ కమాండార్ కోటను ముట్టడిద్దాం సిద్ధంగా వుండు"

అబ్దుల్ జైలునుండి విడుదలయ్యాక అంజుమనే ఖుదామ్ వుల్ ముసల్మీన్ ఆజ్ఞ ప్రకారము, జాన్ మొహమ్మద్ జాన్ వద్దకు, పలంధరీ వచ్చాడు. అదే సంవత్సరములో అటు పంజాబులో అరెష్టులు తీవ్రంగా సాగుతున్నాయి. ఇటు సరిహద్దు ప్రాంతం అయిన పలంధరీలో జాన్ మొహమ్మద్ జాన్ డోంగరా రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటును లేవదీశాడు. పలంధరీలోని ముస్లిమ్ యువకులందరూ తుపాకులు తీసుకొని ఉత్సాహంగా ముందుకు వచ్చారు. ఆ ప్రాంతం సైనిక ప్రాంతం గావడంవల్ల అక్కడి ముస్లిం యువకులకు ఆయుధాలు తేలికగా లభించాయి. తిరుగుబాటుదార్ల ధాటికి తట్టుకోలేక వూర్లూ, పోలీస్ స్టేషన్‌లూ ఎక్కడికక్కడ ఖాళీ అయిపోతున్నాయి,

పలంధరీ పట్నంలో హిందూ వైశ్యులవి రెండు దుకాణాలు వున్నాయి. ఒకతను డోంగరా రాజ్యాన్ని సమర్థిస్తూ వుంటాడు. కనుక ప్రాణాలను రక్షించుకొని, అక్కడినుండి ఒక అర్థరాత్రిపూట పారిపోవల్సి వచ్చింది. రెండవ అతను

కొంతధనాన్ని ఇచ్చి, జాన్‌ముహమ్మద్‌జాన్‌తో సంధిచేసుకొని. అతని నాయకత్వాన్ని స్వీకరించాడు! పలంధరీకి దిగువన పరిపంటలు అధికంగా పండుతాయి. అక్కడ అంతా హిందూ ఖత్రీ వంశీయులు. వారు ఒక మాత్రానికి ఓటమిని స్వీకరించ లేదు. మూడురోజుల వరకూ ఉభయ పక్షాలకు యుద్ధం జరిగింది. హిందూ ఖత్రీలకు నాయకుడు జిందారామ్ అతను ఆరడుగుల ఆజానుబాహుడు. బలిష్టుడు. బలానికి తగినట్టుగానే అందగాడు. అతనికూతురు శకుంతల. అతనిలాగానే కూతురూ భార్యాకూడ అందమైనవాళ్లు. భార్యామీద జాన్‌ముహమ్మద్ జాన్ ఇదివరకే కన్ను వేశాడు. కూతురు శకుంతలమీద అహమ్మద్‌ఆలీ కన్ను వేశాడు!—

మూడురోజుల యుద్ధానంతరం జివిందారామ్ రణభూమిలో మృతినొందడం అతని భార్యాని జాన్‌మహమద్ జాన్, కూతుర్ని అహమద్ ఆలీ, నికాకట్టుకోవడమూ జరిగింది. దీనితో అక్కడి హిందువుల్లో ఘోరమైన కలవరం బయలుదేరింది. మొత్తం హిందువులందరూ ఇండ్లూ వాకిళ్ళూ వదలి పరారయ్యారు. ఈ హిందువుల్లో ఎక్కువమంది పంజాబీలు అన్యప్రదేశంనుండి ఇక్కడికి వచ్చి స్థిరపడిపోయారు. స్థానిక నివాసులైన సిక్ఖులకూ, బ్రాహ్మణులకూ ఈ సందర్భంలో ఏమాత్రం హానీ కలుగనీయలేదు. బ్రాహ్మణులు అక్కడి ఆది నివాసులు. ముస్లిములకంటె పూర్వంనుంచీ వారు కాశ్మీరులో నివసిస్తున్నారు. అయినప్పటికీ భయంవల్లా, ఆదుర్దావల్లా, అనేక గ్రామాలలోని బ్రాహ్మణులూ, సిక్ఖులూకూడా ఇండ్లు వాకిండ్లను వదిలి పరారయ్యారు. రెప్పపాటు కాలంలో

వూళ్ళకువూళ్ళు ఖాళీ అయిపోతున్నాయి. హిందువులందరూ తమ సామాన్లను బండ్లమీదా, గాడిదలమీదా వేసుకొని పట్టణంవైపుకు బయలుదేరుతున్నారు. ఖాళీ అయిన వూళ్ళను ముస్లిములు ఆక్రమించుకొని విజయోత్సవాలను జరుపుతున్నారు. ఈవిజయోత్సవాలలో, వూళ్లో మిగిలివున్న ఒకరిద్దరు హిందులనూ, ముస్లిము మతంలోకి మారుస్తున్నారు. పల్లెల్లో ఇంత పెద్దఎత్తున హడావిడి ఎన్నడూ జరగలేదు. ఇదంతా చూచి ముస్లిం యువకులు వుత్సాహంతో పొంగిపోతున్నారు. ఎంత అయినా నష్టం హిందూ ఖత్రీలకు జరిగినట్టుగా, సిఖ్ఖులకు గానీ, బ్రాహ్మణులకుగానీ జరగలేదు. అందుకు కారణం ఒక టుంది, శిఖులూ, బ్రాహ్మణులూ అక్కడి ముస్లిముల్లాగానే సామాన్య కుటుంబీకులూ రైతులూ, వారికి తమ సంసారం గడవగా వెనక దాపుకు ఆస్తి అంటూ ఏమీ వుండదు!

మరొక విషయం, ఇది వుద్యమపు ప్రథమ స్థితి. అందువల్ల ఏది ఎలా జరుగుతుందో, ఏది ఎలా జరగాల్నో ఎవ్వరికీ నిర్ణయాలు లేవు. చాలామందికి ఒక వినోదంగావున్నది. ఇతర మతస్థులను ముస్లిములను చేయడమే వుద్యమ ప్రధాన కర్తవ్యం అని తలుస్తున్నారు. అందువల్లే పారిపోతున్న హిందువులనూ, సిఖ్ఖులనూ ఎవ్వరూ హింసించలేదు. దారిలో కూడా ఎక్కడా కొట్లాటలు జరగలేదు. సిఖ్ఖులూ హిందువులూ ఇలా పారిపోవడాన్ని చూచి ముస్లిములు నవ్వుకొని చప్పట్లుకొట్టి ఆనందించేవారు. అక్కడక్కడా చెదురుగా హత్యలు జరిగినాయి. స్త్రీల అపహరణమాత్రం పెద్దమోతాదులో జరిగింది. అందువల్ల హిందువులు మామూలుదార్లను

వదలి, అడవులగుండా పట్నానికి పోతున్నారు. ఈ విధంగా కొద్దిరోజులలోనే పలంఘిరి ప్రాంతం అంతటిలోనూ జాన్ మహామద్ జాన్‌గారి జండా ఎగరసాగింది. పోతే బ్రహ్మపురం, జరనైల్‌సింగ్ కోట, దాని చుట్టుపట్ల వున్న ప్రదేశంమాత్రం స్వతంత్రంగా వున్నాయి. ఈకోట రసపుత్రులవి ఈరసపుత్రులు రాజా గులాబ్‌సింగ్ సమయంలో ఈ కోటను ప్రాణాలొడ్డి పోరాడి జయించుకొన్నారు. ఇప్పటికికూడా ఈ కోటలో జరనైల్‌సింగ్ తండ్రి వృద్ధుడు పూర్ణసింగ్ వున్నాడు. అతడు ఎన్నో యుద్ధాలను తనకండ్లతో చూశాడు. వృద్ధాప్యంలోనూ పూర్ణసింగ్ తన మొత్తం పరివారంతో కోటలో కూర్చుని యుద్ధం ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూస్తున్నాడు. కోటలో తన కుటుంబపువారు నలభైమంది వున్నారు. నౌకర్లూ చాకళ్ళూ మొత్తం కలిసి నూటపాతిక మంది. వున్నారు. కోటలో మూడు పాతఫిరంగులు వున్నాయి. మహారాజా రణజీత్‌సింగు కాలంనాటివి. నాటు తుపాకులు చాలా వున్నాయి. క్రితం సంవత్సరం కమాన్‌దార్ పట్నం నుండి శెలవుమీద తనకోటకు వచ్చేప్పుడు అక్కడినుండి చాలా తుపాకులనూ, ఫిరంగులనూ, రైఫిళ్ళనూ, దొంగిలించుకొని వచ్చి తనకోటలో పడేసుకొన్నాడు. పట్నంలో రాజావారి శస్త్రాగారం కమాన్‌దార్ అజమాయిషీలోనే వుంటుంది. గనుక ఈ దొంగతనం బయటపడలేదు. ఇటు జాన్ మహామద్ జాన్‌కు కూడా ఈ విషయం తెలియదు. కోటలో తలతిరిగిన హిందువులు పదిమంది, తుప్పుపట్టిన తుపాకులు నాలుగూ వుంటాయని అతని అంచనా!

ముట్టడికి అంతా సిద్ధంచేసుకొని జాన్‌మహామద్ అబ్దుల్‌నుపిలచి ఇలా అన్నాడు. "ఇవ్వాళ రాత్రి కోటమీద ముట్టడి, సిద్ధంగా వుండు!"

"నా వంతు పనులు ఏమిటి?" అబ్దుల్ అడిగాడు.

జాన్‌మహామద్‌జాన్ కోటపటాన్ని ముందుపరిచి "ఎదురునుంచి నా కొడుకు అహామద్‌ఆలీ ముట్టడిచేస్తాడు. వెనకవైపునుంచి నీవు. ఉత్తరదిశనుండి నేను దక్షిణదిశనుండి మా బాబాయి ఖాన్‌గుల్‌ఖాన్ తన గుర్రపు రౌతులతో ముట్టడి చేస్తాడు. ఎందువల్ల అంటే దక్షిణదిశన కోటగోడలు చాలా క్రిందికి వున్నాయి. వీలైతే గుర్రాలతో సహా కోటలోకి పోవచ్చు!" అన్నాడు.

"ఎంతమంది యువకులను ఇస్తారు?"

"మొత్తం ముట్టడికి రెండువందలమంది యువకులు వుంటారు. పోతే కొండకు క్రింద, డోళ్ళు తప్పెటలూ వాయించి, గోల చెయ్యడానికి ఒక నలభైమంది వస్తారు. చుట్టుపట్ల వున్న వూళ్ళన్నింటికీ కబురుపెట్టాను. ఐదారువేలమంది అల్లరిచేయడానికి రావచ్చు రెండువేలమంది, కాగడాలు వెలిగించి పట్టుకునుంచుంటారు కొండక్రింద. ఈ కాగడాలనూ మోతలనూ విని, మొదటిదెబ్బకే లొంగిపోతారు కోటలోవారు!"

"యుద్ధంకంటే కోటను ముట్టడిస్తే లోపలివాళ్ళని బయటికి రానీయకపోతే, వాళ్ళే చస్తారుగా ఆకలితో?"

"కోటలో ఎప్పుడు రెండుమూడునెల్ల ఆహారపదార్థాలు వుంటాయి. ఇన్నాళ్ళు ముట్టడిని నిలపడంసంభవం కాదు. మనమే చస్తాము! కనుక ఇతర వుపాయం ఏమీ వని

చేయడు. పైగా కోటలో ఊధంసింగు వున్నాడు. వాడూ ఒక మూర్ఖుడు. సామాన్యంగా ఓటమిని ఒప్పుకోడు. యుద్ధం చెయ్యాల్సిందే !"

"కాఫిర్ !" అబ్దుల్ ద్వేషంగా అన్నాడు.

# 2

సూర్యాస్తమయం అయ్యాక అహమద్ ఆలీ అస్త్రశస్త్రాలతో సుసజ్జితుడై అబ్దుల్ దగ్గరకు వచ్చి "సిద్ధమేనా ?" అనడిగాడు.

అబ్దుల్ రైఫల్ బుజాన పెట్టుకొని "ఆఁ" అన్నాడు.

అహమద్ అలీ ముఖాన కుంకుమబొట్టు మెరసింది. అబ్దుల్ కంటబడ్డది.

"ఇదేమిటి ?" అబ్దుల్ అడిగాడు.

"శకుంతల బలవంతంగా పెట్టింది ?"

"బలవంతంగానా ?" అబ్దుల్ సూటిగా అడిగాడు.

అహమ్మదలీ ఏమీ మాట్లాడలేదు. అతను మానసికంగా చాలా బాధపడుతున్నాడు. తలఎత్తి అబ్దుల్ ముఖంలోకి కూడా చూడలేకపోయాడు.

అబ్దుల్ రెండడుగులు ముందుకువేసి, అతని నుదుటిమీది కుంకుమబొట్టును చెరిపేశాడు. అహమద్ అలీ అబ్దుల్‌ని అడ్డగించాడు కూడాను. కాని, అబ్దుల్ ఒక్కవూపుతో బొట్టును చెరిపేశాడు. వెనక కుంకుమబొట్టు వున్న స్థానంలో ఇప్పుడు ఎర్రనిమచ్చ మాత్రం మిగిలింది అహమదలీ ముఖాన

స్వేదం క్రమ్మింది. అతను ఏమీ మాట్లాడకుండా ముందుకు నడిచాడు వాకిట్లోనించి.

ఇద్దరు మిత్రులూ గుర్రాలను ఎక్కి బ్రహ్మపురం వైపుకు నడిచారు. జాన్ మహమ్మద్ జాన్ హృదయమే వెళ్ళాడు. తగిన ఏర్పాట్లు చేసుకోవడానికి వెళ్తూవెళ్తూ వీళ్ళని రాత్రి పది గంటలలోపు చేరుకోమన్నాడు. అక్కడికి.

# 3

ఆ రోజు రాత్రి చాలా చీకటిగా వుంది. అహమ్మద్ ఆలీ, అబ్దుల్ ఇద్దరూ బ్రహ్మపురం వైపు గుర్రాలమీద వెళ్తున్నారు. అంతచీకట్లో వాళ్ళ ఆకారాలు పోల్చుకోలేని రెండు నల్లని మచ్చలుగా మాత్రం కనుపిస్తున్నాయి. కొంత దూరం వెళ్ళాక అహమ్మద్ ఆలీ ఇలా అన్నాడు "నా కా అమ్మాయిమీద ప్రేమ కుదిరింది!"

«ఆ హిందూ పిల్లమీదనా ?» అబ్దుల్ కటువైన స్వరంలో అడిగాడు.

అహమ్మద్ ఆలీ చెప్పాకు పోతున్నాడు. "నీకు తెలియదు. వెనక నేను 'చక్' గ్రామం మీందగా ప్రయాణం చేసే టప్పుడు దీన్ని చూడడానికి రోజల్లా ఆ గ్రామంలో వుండి పోయేవాడిని. కంటికి కనుపిస్తేచాలు అనుకొనేవాడిని అప్పట్లో. ఇది ఒకప్పుడు నాది, నా స్వంతం అవుతుంది, అనే విషయం నా వూహాలకు కూడా అందని విషయం. కారణం స్పష్టమేను అది హిందువు. నేను ముస్లిముని! అదికాక అపూర్వ సౌందర్యవతి కావడంవల్ల పలుకరించడానికి కూడా సాహసం చాలేది

కాదు. అది బిందె తీసుకొని నదికి నీళ్ళకు వచ్చినప్పుడు నేను గుర్రాన్నిదిగి ఒక ప్రక్కన నిలబడి, పూరకే చూస్తూ వుండే వాణ్ణి. నీళ్ళు తీసుకొని వెళ్ళిపోయేది అది. దాని చమర్చిన విశాలమైన కనురెప్పలను చూస్తూవుంటే నా హృదయం తీవ్రంగా స్పందిస్తూ ఉండేది. 'ఈ సౌందర్యవతి నాదయితే ఎంత బాగుంటుందో?' అనుకొంటూ వుండేవాడిని.

"నీవు ఇంకొక ఆమెను ఎవరినైనా కూడా ప్రేమించావుగా?"

"అదా? దాని విషయం అడక్కు! మనిషికి తను కోరింది లభించినప్పుడు మనస్సును మరొకదాని మీదికి మరల్చు కొనవలసి వస్తుంది!"

"మరి ఇప్పుడో!"

"ఇప్పుడు నేను మరొక దానివంక చూడాల్సిన పనే ముంది? శకుంతల నాదయింది. బలవంతంగా తెచ్చి పెండ్లి చేసుకొన్నాను. శకుంతల నన్ను ఎంతగా ప్రేమిస్తుందో నీవు అర్థంచేసుకోలేవు....హిందూస్త్రీలు నిజంగా విశ్వాసపాత్రులు!"

"నాలుగురోజులు పోతే జంధ్యంవేసుకొని దేవాలయానికి పోయి పూజలుకూడా చేస్తావు!" అబ్దుల్ కోపం, వ్యంగ్యం కల్సిన స్వరంలో అన్నాడు.

"అదికాదు పరిస్థితి!" అహమ్మద్ ఆలీ చెప్పుకుపోతున్నాడు దానిపట్ల ఎంత అన్యాయం, అత్యాచారం జరిగిందో ఆలోచించు! తండ్రి యుద్ధంలో చనిపోయాడు. నేనిలా దార్ఢ్యంగా తనను లేవనెత్తుకు పోయాను. పెండ్లి చేసికొని భార్య

లాగా చూస్తున్నాననేది వేరే విషయం. అయినా తల్లిదం
డ్రుల మీాది మమకారం, మతంమీాది ప్రేమ ధావదుకదా!
మొదట కొన్నాళ్ళపాటు నాతో చాలా కోపంగా వుండేవి.
క్రమంగా శాంతపడ్డది. ఇప్పుడు నేను వస్తూఉంటే ఈ కుంకు
మను ముఖాన పెట్టి కండ్లనిండా నీళ్ళు పెట్టుకొని "ఇక నీవే
నాకు దిక్కు! నీకు ఏమైనా కీడు జరిగితే నేను ఎందుకూ కొర
గాని దాన్ని అయిపోతాను. సర్వనాశనం అయిపోతాను."
అన్నది.

రెండు క్షణాలు ఆగి మళ్ళీ చెప్పసాగాడు.

"ఇప్పుడు నేను బయలుదేరగానే ఒక పళ్ళెంలో
దీపాన్ని వెలిగించుకొని వచ్చి, కుంకుమా అక్షతలూ కలిసిన
ఈ బొట్టును నా ముఖాన పెట్టి ఆ దీపాన్ని నా ముఖంచుట్టూ
తిప్పింది. అప్పుడు నాకు అది ఎంతో బాగున్నదనిపించింది.
అంతేకాదు, ఆ క్షణాన్నుంచీ నా అభిప్రాయాలు మారాయి.
వెనకటి మన అభిప్రాయాలూ, తప్పుడివీ - అర్ధరహితమైనవీ
అనిపిస్తున్నాయి!"

"ఓహో! ఇప్పుడు నేను తెలుసుకొన్నాను."

"ఇంతవరకూ నేనే తెలుసుకోలేదు. అలాంటప్పుడు
నువ్వెలా తెలుసుకోగలవు? మొత్తానికి, ఈ మొత్తం కార్య
కలపాల్లో ఎక్కడో పెద్దలోపం ఉంది."

"ఆ హిందూస్త్రీ నిన్ను పాడుచేస్తున్నది. నిన్ను హిందు
వును చేసేస్తున్నది?"

"లేదు. అబ్దుల్ లేదు! నిజంగా నేను ఇంతవరకూ హిం
దువును కాలేదు. ముస్లిముని, డోంగరా రాజ్యానికి పూర్తి

వ్యతిరేకిని. కావాలంటే ఆ రాజ్య పతనానికి నా ప్రాణాన్నైనా ఇచ్చేస్తాను. కాని, చాలా క్రొత్తవూహ - మున్నెన్నడూ రాని వూహ - ఒకటి తడుతున్నది. మనం జరిపే ఈ వుద్యమంలో ఏదో పెద్ద పొరపాటు వుంది!"

"ఏం పొరపాటుంది? నీకు కోటమీద ముట్టడి చేయడం ఇష్టంలేదా?"

"వున్నది! మనస్ఫూర్తిగా కోరుతున్నాను. రసపుత్రులు ఎలాగైతే మన కోటల్ని జయించారో అలాగే మనంకూడా వాళ్ళ కోటల్ని జయించాలి! తప్పక జయించాలి!"

"మరి అయితే హిందువుల్ని ముస్లిములను చేయడం నీకు ఇష్టంలేదా?"

"ఎందుకులేదు. వున్నది. కానీ..."

"కానీ, గీనీ ఏమీలేదు. నేను స్పష్టంగా అడుగుతాను ఒక విషయం చెప్పు, ఇలాంటి పరిస్థితిలో నీవు శకుంతలను ఎత్తుకువచ్చేవాడివా, కాదా?"

"ఎందుకు ఎత్తుకురాను. ఎత్తుకువస్తాను. నా ప్రేమ కోసరం నేను ఎత్తుకువస్తాను. అంతేకాని దొంగసొమ్ములా వాళ్ళను చూడను. వెనక నేను హిందూ బాలికలను దొంగ సొమ్ముగా భావించేవాడిని. ఇప్పుడలా చేయను! హిందూ బాలిక లేకాదు. ఆడపిల్లలు ఎవరైనా గౌరవించదగినవారే. వాళ్ళని అగౌరవించడం మనల్ని మనం అగౌరవించుకోవడమే!

"నీకు తెలుసా, నాకు ఒక చెల్లెలు వుండేది! ఆమె పేరు రజ్జీ!"

అహమ్మద్ ఆలీ ఏమీ మాట్లాడలేదు. అబ్దుల్‌కు తన చెల్లి తనతండ్రి శవము పోలీసుల అసభ్యపు కూతలూ అన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. అతని నరాలు వుబికాయి. మాట్లాడకుండా గుర్రాన్ని తోలుకుని ముందుకు పోయాడు. అహమ్మద్ ఆలీ వెనక కేకలువేస్తూ వసుగెత్తాడు. కానీ రెండుక్రోసుల తరువాత అతన్ని కల్సుకొన్నాడు.

"నా మాటలకు కోపం వచ్చిందా?" అహమ్మద్ ఆలీ అడిగాడు.

"ఇందులో నీ తప్పేమీ లేదు" అబ్దుల్ అన్నాడు.

"సరే, ఇక మాటల్ని మర్చిపో, యుద్ధపు విషయాలను మాట్లాడుకొందాము. ఈ యుద్ధంలో జరనైల్‌సింగ్ వస్తాడు. వాడితో పోట్లాడవచ్చు! ఆరోజు భూాతియానుండి పతన్‌వరకూ గుర్రపు పందెం...జ్ఞాపకం వుందా?"

"అవును, హెడ్‌మాష్టర్‌గారు నీ రివాల్వర్ కూడా లక్కొని అధికారులకు యిచ్చారు!"

"ఆ పగని యివ్వాళ తీర్చుకొంటాను."

ఇంతలో నాలుగువైపులనుండీ గుర్రపు సకిలింపులు వినిపించసాగినాయి. ఇద్దరూ తను గుర్రాలను క్రిందవున్న చీల వృక్షాలమాటున నిలిపారు.

కొద్దిసేపటి తరువాత యాత్రికుల గుంపొకటి అటునుంచి వచ్చింది. అందరికంటేముందు ఒక బ్రాహ్మణ యువకుడు తన భార్యను కంచరగాడిదమీాద కూర్చోపెట్టుకొని, చేతిలో దివిటీ పట్టుకొని వెళుతున్నాడు. తరువాత ఇద్దరు సిక్ఖులువచ్చారు.

వాళ్ళచేతుల్లో నాటు తుపాకులు వున్నాయి. అయినా వాళ్ళ ముఖాలు భయంతో వివర్ణం అయిపోతున్నాయి. వాళ్ళ తరువాత సామానులతో నిండిన రెండుమూడు గాడిదలు పోయినాయి, గాడిదల అనంతరం ఒక వృద్ధురాలు తావళం త్రిప్పుతూ కనుపించింది. ఒక వయస్కుస్త్రీ తన పసిబిడ్డకు పాలను యిస్తూ రామనామం జపిస్తున్నది. వారి తరువాత చిట్ట చివర్న, ఒక బ్రాహ్మణయువతి వచ్చింది. ఆమె సరసన ఒక ముస్లిమ్ యువకుడు కూర్చుని వున్నాడు. ఇద్దరూ ప్రేమికుల్లా వున్నారు. వియోగానికి సంబంధించిన విషాదం ఇద్దరి ముఖా లలోనూ కనుపిస్తున్నది.

ఆ బ్రాహ్మణ యువతి తన ముస్లిం ప్రియుణ్ని మెల్లగా అడిగింది. "గుల్లా! మమ్మల్ని పైవూరుదాకా పంపించి, నీవు తిరిగి వెనక్కి వచ్చేస్తావా ?"

దివిటీ పట్టుకొన్న ముస్లిం ప్రియుడిపేరు గుల్లా! గుల్లా సమాధానం ఇవ్వకముందే గుంపువారి ముందునుంచి దాటి దూరంగా పోయింది. అహమ్మద్ ఆలీ గుల్లా ఇచ్చిన సమాధా నాన్నయితే వినలేకపోయాడు, గాని ఆ బ్రాహ్మణయువతి దీనవదనం, శకుంతలను జ్ఞప్తికితెస్తూ అతని గుండెల్లో సూదిలా గుచ్చుకోసాగింది ఆమె అడిగిన ఒక్కమాటా వేయిమాటలై అతని చెవుల్లో ప్రతిధ్వనించసాగింది. "నీవు తిరిగి వెనక్కి వచ్చేస్తావా ?" "నీవు తిరిగి వెనక్కి వచ్చేస్తావా !"

ఏమిటీ అన్యాయం? ప్రేమ ప్రేమగా మనగలగలేదా? ప్రేమకు హిందూ, ముస్లిం సిక్ఖు ఈ విభేదా లేమిటి? గుల్లే

సమాధానం ఏం యిస్తాడు ? ముందు ఊరువరకూ చేర్చి రావలసిన దేనా అతను ?

అహమ్మద్ ఆలీని దారి పొడుగునా పై ప్రశ్నలు వేధించినవి. అబ్దుల్‌కు బ్రాహ్మణయువతిలో తనసోదరి రజ్జీ కనుపించింది.

ఇద్దరూ బ్రహ్మపురం చేరుకున్నారు.

జాన్ముహమ్మద్‌జాన్ జేబులోనుంచి గడియారంతీసి టైం చూశాడు. పదికి పదినిమిషాలు తక్కువ !

అబ్దుల్ అడిగాడు "యువకులు అందరూ వచ్చారా?"

జాన్‌మహమ్మద్‌జాన్ విజయగర్వంతో నవ్వాడు. మూడువందలమంది యువకులు ఆయుధాలతో సిద్ధంగా వున్నారు. వాళ్ళను చూసేసరికి అబ్దుల్ రక్తం ఉప్పొంగింది. అబ్దుల్ తనగుర్రంమీదనుండే అరిచాడు "అల్లా హో అక్బర్"

యువకులు "అల్లా హో అక్బర్ !"

సరిగా అదే సమయానికి క్రింద డోళ్ళూ తప్పెటలూ మోగినాయి. కోట నలువైపులనుండీ కొద్దిసేపటిలోనే తప్పెట మోతలు మిన్నుముట్ట సాగినాయి. ఆ గాఢాంధకారంలో యువకులందరూ కాగడాలతో కొండపైకి ఎగబ్రాకసాగారు. జాన్‌మహమ్మద్‌జాన్ బల్లెం నొకదాన్ని పుచ్చుకొని అరుస్తున్నాడు "కోట అదిగో ! వచ్చేసింది !"

అబ్దుల్ అరిచాడు "అల్లా హో అక్బర్ !"

ఇంతలోనే ఇద్దరు గుర్రపు కాతులు యువకుల్ని చీల్చుకొని ముందుకువచ్చారు. వాళ్ళని అబ్దుల్ గుర్తుపట్టాడు. ఒకడు

హాశమత్ అల్లాబీన్! రెండవవాడు శౌకత్!

అశమత్ ముందుకువచ్చి ఇలా అన్నాడు "సర్దార్‌జీ కోటవిషం చూడడానికిముందు ఈబ్రిహ్మపురం గ్రామాన్ని నేలమట్టంచేస్తే?"

శౌకత్ అందుకున్నాడు "సరదార్‌జీ! మీరు అజ్ఞ ఇవ్వడం ఆలస్యం! ఈబ్రాహ్మణుల గ్రామాన్ని వూదిపారేస్తాము!"

వేలగొంతులు అందుకున్నాయి. "వూదెయ్యండి! కాఫిర్లను నాశనం చెయ్యండి! హిందువులను నాశనం చెయ్యండి!"

జాన్‌మహమ్మద్‌జాన్ తనచేతిలోని బల్లేన్ని పైకి ఎత్తాడు. కేకలు తగ్గిపోయాయి. అందరూ మౌనాన్ని వహించారు.

"అది అసంభవం!" జాన్‌మహమ్మద్‌జాన్ చెప్ప సాగాడు.

అహమ్మద్ ఆలీకి అంతవరకూ గొంతులో వుండలా చుట్టుకున్నదేదో విడిపడిపోయింది.

"బ్రిహ్మపుర్ బ్రాహ్మణులు ఇక్కడ వేలసంవత్సరాల నుండీ వుంటున్నారు. పైగా వారు, ముస్లిము నాయకత్వాన్ని అంగీకరించారు. వారు మనలాగానే రైతులు. వారిప్రాణాలకు ఎట్టి అపాయమూ జరగదని వాగ్దానం చేశాను. కనుక వారి జోలికి ఎవ్వరూ పోకూడదు. నాఆజ్ఞను తిరస్కరించి ఎవడైనా బ్రిహ్మపుర్ బ్రాహ్మణులవైపు కన్నెత్తి చూశాడా? ఇదిగో!

ఈబల్లెంతోనే వాడికండ్లు పీకేస్తాను!" జాన్‌మహమ్మద్‌జాన్ అన్నాడు.

శౌకత్ పెదాలు కొరుక్కుని కత్తిని వరలో పెట్టేశాడు.

"మనశత్రువులు బ్రిహ్మాపుర్ బ్రాహ్మణులు కాదు. ఆ ఎదురుగావున్నకోట! కొండమీదవున్న ఆకోట మనశత్రువు! మన ఈ ముస్లింభూమిలో ముల్లులా వున్నది. మొదట దాన్ని వూడపెరకడం మనకర్తవ్యం! అప్పుడుగాని ముస్లింమాతం సర్వతోముఖంగా అభివృద్ధి నొందదు!"

"జాన్‌ముహమ్మద్‌జాన్ జిందాబాద్!"

"అహమ్మదలీ జిందాబాద్!"

"ముస్లింరాజ్యం జిందాబాద్!"

"ముస్లింయువకులారా! అదిగో కోట!"

హాశమత్ అల్లాదీన్ తలవంచుకొని దివిటీలవైపు చూస్తూ "సర్దారువారిఆజ్ఞ మనకు శిరోధార్యం! యువకుల్లారా! కోటను జయిద్దాం! అందుకుకావాలంటే పునరక్తాన్ని ధారపోద్దాం!" అన్నాడు.

"అల్లాహో అక్బర్!"

వందల వేలసంఖ్యలో దివిటీలు కోటవైపునడునసాగినై. కాని, విస్తృతమైన ఆ కోటముందు ఈదివిటీల వెలుగు అతిస్వల్పం అనుపిస్తున్నది. ఒక చిన్న వెలుగు నలుమూలలా అలుముకోగా నిర్భయముగా నిలబడ్డ రాక్షసుడిలా వుంది ఆ కోట!

కోటలో ఏమాత్రిమూ వెలుగులేదు గోడలమీాదగాని గోపురాలమీాదగాని, ఎక్కడా సైకుల అలికిడి కనుపించడం లేదు.

"ఇక ఇప్పుడు ఏంచేస్తేట్లు?" అబ్దుల్ అహమ్మద్ అలీని అడిగాడు.

"ఇప్పుడు, కిర్రిందవున్న వేలకొలది పిజలు, దిబిటీలను వెలిగించి, తప్పెటలను మోగిరించి, కోటలోనివాళ్ళను భయ భాిరంతులను, చేస్తూవుంటారు. ఇటు మూడువందలమంది యువకులూ, నలుమూలలనుండి కోటను హస్తగతంచేసు కొంటారు అంటే శారీరక, మానసిక—ఈరెండు వైపులనుండి దెబ్బకొడుతున్నామన్నమాట! నావుద్దేశ్యంలో యుద్ధంచాలా కొద్దిగా జరుగుతుంది. కోటలో వాళ్ళదగ్గిర పాతఫిరంగులూ, నాటుతుపాకులూతప్ప మరేమీాలేవు. మనదిగ్గిర అధునాతన ఆయుధాలు వున్నాయి. అసలు నన్నడిగితే యుద్ధం జరగదు. వాళ్లు లొంగివస్తారు. ఒకవేళ జరిగినా పూరకనే గెలుస్తాము!"

"వుపాయం చాలా బాగావుంది. కాని" అబ్దుల్ అన్నాడు.

"కాని, ఏమిటి?" సరదారు అన్నాడు.

"ఏమీాలేదు సర్దార్ జీ" అబ్దుల్ తప్పుకొన్నాడు.

సర్దార్ జాన్ముహమ్మద్ జాన్ యువకుల నందరినీ మూడు భాగాలుగా విభజించాడు. తరువాత ముందుకు నడవ డానికి ఆజ్ఞ ఇచ్చాడు. ముస్లిం యువకులు కోటను నలువైపుల నుండి ఆక్రమించుకోవడానికి ముందుకు సాగుతున్నారు. మధ్య

మధ్య యువకులు తుపాకులను పేలుస్తున్నారు కూడాను, కాని పైనుండి ఏ విధమైన సమాధానమూ రావడంలేదు. "భయపడ్డారు! కోడిపిల్లల్లా దాక్కున్నారు. కాని కొంచం ఆగితే ఈ దాక్కున్న వాళ్ళను ఒక్కొక్కళ్ళనూ బయటికి లాగి చంపుతామో! చూద్దురుగాని!" ముస్లిం సర్దార్ ఒకతను అన్నాడు.

"ఎంతవరకూ దాక్కుంటారో చూద్దాం" అహమ్మద్ ఆలీ కోపంతో అరిచాడు.

"సర్దార్‌జీ! ఎంత తన్నుకున్నా వాళ్ళు గెలవడం సున్న! మనదగ్గిర రైఫిళ్ళు వున్నాయి. వాళ్ళదగ్గిరో నాటు తుపాకులు ఏం గెలుస్తారు?"

పైకి ఎక్కుతున్న జాన్‌ముహమ్మద్‌జాన్ ఆగి "అయ్యో! మనదగ్గిర ఒక్క విమానం వున్నట్లయితే ఎంత బాగుండేది? ఒక్క బాంబింగ్‌తో వ్యవహారం పూర్తయ్యేది!" అన్నాడు.

"లేనిదాని కోసరం విచారించకండి" అహమ్మదలీ అన్నాడు.

అప్పటికి కోటకు అతి సమీపానికి వచ్చారు. కోటకు రెండువందల గజాల దూరంలో తన యువకుల్ని ఆగిపోవలసిందిగా ఆజ్ఞ ఇచ్చాడు జాన్‌ముహమ్మద్‌జాన్.

"విరోధి చాలా తెలివికలవాడు. మీరు ముందుకు చాలా జాగ్రత్తగా పోవాలి. రాళ్ళనీ, పొదల్నీ చాటు చేసుకోనండి. నాలుగువైపులా పొంచుకు పోండి" జాన్‌ముహమ్మద్ జాన్ అన్నాడు.

కోటకు మరికొంచం సమీపానికి చేరారు. రెండువందల గజాల దూరం నూటయాభై గజాల్లోకి వచ్చింది. కొండ క్రింద గోల ఎక్కువయింది. కింద డోళ్ళు వాయించే వాళ్ళు తమ యువకులు కొండను ఇలా సమీపించడం చూసి మరీ వుత్సాహంగా డోళ్ళు వాయించేస్తున్నారు. కాగడాలు పట్టుకొన్న ప్రజలు తమ వుత్సాహాన్ని ఆపుకోలేక కొండపయికి ఎక్కడం ప్రారంభించారు.

యువకులు మరొక యాభైగజాలు ముదుంకుపోయారు.

కోట నిశ్శబ్దంగా వుంది!

చిట్టచివరిసారిగా యువకులు పెద్దగా అరిచారు. "అల్లా హో అక్బర్!"

సరిగా అదే సమయాన పైనించి తుపాకీగుండ్ల వర్షం ప్రారంభం అయింది. రెండు మిషన్ గన్నుల క్రాస్ ఫైరింగ్‌తో పైకి ఎక్కుతున్న ముస్లిం యువకులు చీమల్లా మాడిపోయారు!

పాత ఫిరంగుల స్థానాన్ని మిషిన్‌గన్నులు ఆక్రమించి నాటుతుపాకుల స్థానాన్ని ఆటోమాటిక్ రైఫిళ్ళు ఆక్ర మించినాయి ముస్లిం యువకులు చీమల్లా నేలకు వరిగిపో తున్నారు. మృత్యు ఆక్రందనలతో కొండ ప్రతిధ్వనిస్తున్నది.

"వాళ్ళదగ్గర మిషన్ గన్‌లు వున్నాయి!"

"ఆటోమాటిక్ రైఫిళ్ళు ఉన్నాయి!"

"బాంబులు వున్నాయి!"

"వెనుగెత్తండి! వెనుగెత్తండి!"

"ఆగండి! ఆగండి!"

"పరుగెత్తండి, పరుగెత్తండి! క్రాస్ ఫైరింగులో బ్రతకడం కష్టం."

జాన్ మొహమ్మద్ జాన్ అరిచాడు "పిరికి పందల్లారా! ఆగండి!!"

# 4

యువకులు ఓడిపోయారు. కాళ్ళకు బుద్ధి చెప్పారు. ఎవరికి ఎటు దారి దొరికితే అటు పరుగెత్తారు. దివిటీల వెలుగు క్షీణించింది; ఎంతో కష్టంమీద చేర్చిన ఈ దివిటీలు చూస్తూ వుండగానే చెల్లా చెదరైనవి. ఎంతో శ్రమించి అంధకారాన్ని పారద్రోలడానికి ఒక నూతన సూర్యుడిని సృష్టించారు. కాని చూస్తూ వుండగానే ఆ సూర్యుడుపటాపంచ లయ్యాడు. అంధకారం పూర్వ పద్ధతిలోనే మిగిలివున్నది. అబ్దుల్ దెబ్బతిన్న అహమ్మద్ ఆలీని వీపున వేసుకొని కొండ క్రిందిభాగంలో నడుస్తూ యోచిస్తున్నాడు. సూర్యుడు ఎందుకు పటాపంచలు అయ్యాడు? ఏదో లోపం వుంది. నిజంగా వుంది! జాన్ మహమ్మద్ ఖాన్ ఏడీ? ఆయన ప్రోగుచేసిన యువకులు ఏరి? అల్లా బేగ్. శౌకత్,—వీరిద్దరూ ఇక్కడ ఏం చేస్తున్నారు? ఇలా ఆలోచిస్తూ అబ్దుల్ ముందుకు నడిచాడు. బ్రహ్మపురి దగ్గరకు వచ్చేసరికి ఆ గ్రామం తగలబడుతూ అగ్నిమయమై కనుపించింది

అహమ్మద్ ఆలీ మూలుగుతూ "ఇది మంచిపనికాదు. మన ఆజ్ఞను తిరస్కరించారు వాళ్ళు!" అన్నాడు.

అబ్దుల్ అన్నాడు "మనవాళ్ళు. ముస్లిములు, తమ ఓటమికి ప్రతీకారం చేశారు!"

అహమ్మద్ అలీ అన్నాడు "నిజమైన ముస్లిము ఎన్నటికీ అలా చేయడు! యా అల్లా! ఎంత బాధ!

"భయపడకు ఒకమాటు శకుంతలని చూశావా. బాధంతా పోతుంది. బ్రతుకుతావు!"

అబ్దుల్ దారిన నడుస్తున్నాడు. అది వెనుకటి దారేను! వచ్చేప్పుడు ఎంతో సంతోషంగా, వుత్సాహంగా వున్నారు. ఇప్పుడెంత శోకంలో వున్నారు. అతనికి గుల్లే జ్ఞాపకానికి వచ్చాడు. తను చూసిన మొత్తంగుంపు జ్ఞాపకానికి వచ్చింది. వాళ్ళ పాలిపోయిన ముఖాలు స్ఫురణకు వచ్చాయి! అతని గుండెలు గతుక్కుమన్నాయి. ఒక్క క్షణం అలాగే నిలబడి పోయాడు.

ఈ ఒక్కక్షణంలో అహమ్మద్ అలీ కొంచం తృప్తిగా శ్వాస పీల్చాడు. అబ్దుల్ నడక చాలించినప్పుడు అతనికి కొంత హాయిగా వుంటుంది. క్షణంతరువాత అబ్దుల్ తిరిగి నడవసాగాడు. అహమదలీ బాధతో మూలగసాగాడు.

అహమ్మదలీని త్వరగా ఇల్లు చేర్చాలని తొందరలో అడ్డదారిన 'చక్' గ్రామాన్ని చేరుకొన్నాడు అబ్దుల్. కాలవ వడ్డున కొద్దిసేపు నిలబడ్డా డతను.

అక్కడే అబ్దుల్ ఒక దివిటీపట్టుకొన్న యువకుడిని చూశాడు. ఆ యువకుడు ఎత్తయిన బండమీాద నిలబడి తన

చివిటీ ప్రతిబింబాన్ని కాలువ నీళ్ళల్లో నిర్విరామంగా చూస్తు న్నాడు. అబ్దుల్ అతన్ని వెళ్ళి కలుసుకున్నాను, ఆ వ్యక్తి గుల్లా!

"ఏమిటి చూస్తున్నావు? అబ్దుల్ అడిగాడు.

గుల్లా వులిక్కిపడ్డాడు. అబ్దుల్ బుజాన దెబ్బతిన్న సైనికుడు వుండటం చూసి గుల్లా చప్పున దిగ్గరకు వచ్చి "ఏమి టీ యువకుడు కోటముట్టడిలో దెబ్బతిన్నాడా?" అనడి గాడు.

"అవును. నీకెలా తెల్సింది?" అబ్దుల్ అడిగాడు.

"ఇటనుండి చాలామంది ముస్లిములు వెళ్ళారు!"

అబ్దుల్ ఏమీ మాట్లాడలేదు.

"ఈసారి యుద్ధంలో మనం తప్పక గెలుస్తాము. ముస్లిము ఎన్నటికీ యుద్ధంఅంటే భయపడడు. అలా భయ పడేది హిందువు!" గుల్లా అన్నాడు.

"నువ్వు ఎక్కడినుండి వస్తున్నావు?" అబ్దుల్ అడి గాడు.

గుల్లా అన్నాడు "నేను వేరేపనిమీద వెళ్ళాను. ఇలా ముట్టడి జరుగుతుందని నాకు తెలియదు. తెలిస్తే నేనూ ఈమతయుద్ధంలో మీతోపాటు పాల్గొనేవాడిని. సరే, నేను వెళ్ళుతున్నాను. అల్లా మీమిత్రుడికి త్వరగా న్యాయం చేస్తాడు!" గుల్లా తలవంచుకొని వెళ్ళిపోయాడు త్వరత్వరగా అశాంతిగా!

గుల్లా అలా ఎందుకు అశాంతిగా త్వరత్వరగా వెళ్ళాడో అబ్దుల్‌కు తెలుసును. గుల్లా అబద్ధం చెప్పాడు.

అందువల్లే అలా వెళ్ళాడు. గుల్లా అసలు ఎందుకు అబద్ధం చెప్పాలి? తను కొంతమందికి ప్రాణరక్షణ చేశాడు. అది మంచిపనే! తనమంచిని ఎందుకని బయటపెట్టుకో లేదు? ఎన్నాళ్ళుగా మంచి మరుగునపడి వుంటుంది? ఎన్నాళ్ళుగా ప్రియుడు ప్రేయసిని దిగవిడచి విషాదంగా తిరిగివస్తుంటాడు?

అబ్దుల్ అహమ్మదలీని మోసుకొని కాలువదాటడానికి దిగాడు, నీళ్ళు నడుములవరకూ వచ్చినాయి. ఇంతవరకూ అహమ్మద్ అలీకూడా అబ్దుల్ లాగానే ఆలోచిస్తున్నాడు. చివరకు ఇలా అడిగాడు. "అబ్దుల్! గుల్లా తన ప్రేమను బహిర్గతంచేసి నిజం చెప్పితే!"

అబ్దుల్ చాలా కటువుగా "నిజం చెబితేనా? నిన్ను అమాంతం కాలువనీళ్ళల్లో ముంచేస్తాను!" అన్నాడు. అతని ముఖం ద్వేషంతో వికృతమైంది.

చీకటిలో మెరుపులా బాధతో మూలిగే అహమదలీ ముఖంలో ఒక్కక్షణం చిరునవ్వు కనుపించింది. మరుక్షణమే అతను తిరిగి బాధతో మూలగసాగాడు.

## 5

సర్ థామస్ ఎంగ్ హజ్బెండ్ డిక్ ను అడిగాడు "ఆ బావుల విషయం ఏమైంది?"

"బావులు అలాగే వున్నాయి. కాని వాటిలోని సామగ్రిలను తీయించి లాహోరు పంపించాము" డిక్ చెప్పాడు.

"ఏమాత్రం ఖరీదు చేస్తాయి!"

డిక్ వివరంగా "నాలుగుకోట్ల రూపాయలఖరీదు చేయ వచ్చును. నగలూ, జవహర్లూ మొత్తం అంతే! కొన్ని కంబళ్ళూ శివాచీలు వున్నాయి. ఇంకా, వాటిని ఇక్కడే వేలంవెడతాము. అనుకున్నంత లభించలేదు!" అన్నాడు.

సర్ థామస్, కర్నల్ డిక్ ఇద్దరూ రెసిడెన్సీ భవనపు తోటలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఒక పొదరింట రెండు కుర్చీలు వేసి వున్నాయి. ఇద్దరూ ఆకుర్చీలలో కూర్చుని వున్నారు. వారిచుట్టూ ద్రాక్షతీగెలు చుట్టుకొని వున్నాయి. ద్రాక్షఆకుల సందుగుండా సూర్యకాంతి చారలుగా పడు తోంది ఆప్రదేశం అంతటిలోను. అక్కడక్కడా ద్రాక్ష గుత్తులు వేళ్ళాడు తున్నాయి.

కర్నల్ డిక్ ముందుకువంగి ద్రాక్షగుత్తి నొకదాన్ని కోసి ముక్కాలిపీటమీద పెట్టాడు.

సర్ థామస్ అన్నాడు "నాలుగుకోట్లకోసరం మహా రాజుతో ఏం పోట్లాట పెట్టుకొంటాము. ఒక యాభై అరవై కోట్లు దొరుకుతా యేమో సగం తీసుకొని ఈ జాగీరును స్వాయత్తం చేద్దాం అనుకొన్నాను! ఇది చాలా కొద్ది మొత్తం!"

"ఊ!" ద్రాక్ష తినసాగాడు డిక్.

"సంగ్రామసింగుతో కొంచం జాగ్రత్తగా వ్యవహరిం చాలి! షాలీ అతనితో ఎక్కువగా తిరుగుతున్నది!"

"షాలీకి ఏమీ ఫరవాలే... అతనే జాగ్రత్తపడవలసి వుంటుంది!"

"షాలీ తెలివిగల పిల్ల!"

"జమాయత్ ఖాన్ ఎక్కడ వున్నాడు!" డిక్ అడిగాడు.

"థామస్ కనుబొమలు ముడిచి "నీకు అతని పేరెలా తెలిసింది?" అనడిగాడు.

డిక్ చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"అతడు కొట్లాట రేపడానికి వూదా వెళ్లాడు!" థామస్ చెప్పాడు.

"సలందీ ఎలా వుంది?"

"బాగానే వుంది!"

"మరి బానా ప్రాంతం?"

"అదీ బాగానే వుంది. నాలుగు ప్రాంతాల్లోనూ వుద్యమం తీవ్రదశలో ఉన్నది. అక్కడి హిందువులూ, శిఖ్ఖులూ అటు ముస్లిం మతాన్నయినా స్వీకరించాలి, లేదా! ఈపట్నానికి వలసఅయినా వచ్చేశెయ్యాలి! ఇప్పటివరకూ చాలా దళాలు వలస వచ్చేశాయి ఇక్కడికి! ఈ దళాల కారణంగా ఇక్కడ పట్నంలో కూడా హిందూ ముస్లిముల మధ్య పోట్లాటలు ప్రారంభం అయినాయి!"

"అన్నిచోట్లా పరిస్థితులు ఇలాగే ఉండవచ్చు!" డిక్ పండ్లను తింటూ అన్నాడు.

క్షణం ఆగి తిరిగి అడిగాడు. "ఇక్కడ జైలునుండి కూడా చాలామంది ఖైదీలు పరారయ్యారుట?"

థామస్ వేరుగా ఆలోచిస్తున్నాడు. "మాలీ జాగ్రత్త!" అన్నాడు.

డిక్ లేచి నిలబడి "భయపడకు. మాలీ సంగ్రామ సింగునూ పెండ్లి చేసుకోదు! నిన్నూ పెండ్లి చేసుకోదు!" అన్నాడు.

థామస్ కుర్చీనుండి ఒక్కసారి ఎగిరిపడ్డాడు. సమాధానం కోసరం తడుముకొంటూవుండగా డిక్ "సోలాంగ్!" అనేసి వెళ్ళిపోయాడు.

---

# పన్నెండవ అధ్యాయం

జైల్లోనుంచి పరారయిన పాతికమంది ఖైదీలలో ఫజల్, మంజూర్, మాలవీలుకూడా వున్నారు! పాపం వృద్ధుడైన మాలవీకి ఇలా దొంగతనంగా జైలునుండి తప్పించుకు పరుగెత్తడం ఇష్టంలేదు. కాని, ఫజలూ, మంజూరూ, అతన్ని బలవంతాన లాక్కువచ్చారు. మొదటిరాత్రంతా అడవుల లోనూ, పొదలలోనూ గడిపేశారు. రెండవరోజు కనేతర్ కొండల్లో వుండిపోయారు. మూడవరోజు ఆ కొండల్ని దాటి ముస్లిం ప్రాంతాలకు వచ్చారు. ఇక్కడ కాగాన్‌నది అధిక విస్తృతమై "పుంఛ్ బర్మా" అనే నదిలో కలుస్తుంది. ఇక్కడి భూమి సారవంతమైంది కావడంవల్ల నదీతీరంలోని లంకల్లో అనేక గ్రామాలు వెలశినాయి. ఖనేతర్ కొండల్లోనుంచి చూస్తే ఈ గ్రామాలు బొమ్మరిళ్ళలా కనుపిస్తాయి. పుంఛ్‌నది వద్దనుండి హిందూ కాందిశీకుల గుంపొకటి ఖనేతర్ కొండల వైపు, పట్నానికి వస్తున్నది. ఈ గుంపు ఒక కొస కొండల దగ్గరకు చేరింది. మరొకకొస ఇంకా నది వద్దున ముస్లిం ప్రాంతాల మధ్యలోనే వున్నది!

"దాదాపు ఎనిమిదివేలమంది వుంటారు!" ఫజల్ అన్నాడు.

"ఇంకా ఎక్కువ వుంటాయి!" మాలవీ అన్నాడు.

"ఇది తర్కానికి సమయంకాదు. ముందు హిందువుల గుంపులు – వెనుక జైలుకోట్లు!" మంజూర్ అన్నాడు.

ఫజల్ ఒక తుంగ వృక్షం వైపు చూపుతూ "ఈ చెట్టు మీద ఎక్కి కూర్చుందాము రండి! ఎవ్వరూ అనుమానించరు. గుంపులు వెళ్ళిపోయాక దిగుదాము!" అన్నాడు.

ఫజలూ మంజూరూ సాయంచేసి ముసలి మాలవీని చెట్టు ఎక్కించారు. క్షణకాలంలో ముగ్గురూ తుంగవృక్షపు దట్టమైన శాఖల్లో అదృశ్యులయారు. హిందువుల గుంపు చెట్టు క్రిందనుండి పోసాగింది.

సాయంత్రానికిగాని వాళ్ళకు క్రిందికి దిగడానికి అవకాశం దొరకలేదు. పగలంతా ఈ విధంగా చెట్టుమీద వుండిపోవడంతో వారి అవయవాలు బాధపెట్టసాగినాయి. చివరకు ముసలి మాలవీ శోకాలుతియ్యసాగాడు. కాని మంజూరు అతని నోట్లో గుడ్డలు కుక్కి ఏడుపు బయటికి వినపడకుండా చేశాడు. గుంపులు పోయాక ముగ్గురూ చెట్టుమీదనుండి దిగి దగ్గరలో వున్న గ్రామంలోకి పోయారు. ముగ్గురూ మొదట ఇంట్లోకి పోయారు. అది పాడుపడ్డది. ఇంట్లో ఎవ్వరూ లేరు. క్రిందినేల కూడా త్రవ్వి పాడుచేయబడ్డది.

"దొంగలంజకొడుకులు పొయ్యిలమట్టికూడా త్రవ్వుకు పోయారు!" ఫజల్ క్రోధంతో అరిచాడు.

ఒక చిన్న కాలువను దాటిన తరువాత మరొక ఇల్లు కనుపించింది. తలుపులు తెరచివున్నాయి. ఫజల్ లోపలకు

అడుగుపెట్టేసరికి ఒక కుక్క అరుస్తూవచ్చి అతని కాళ్ళను చుట్టవేసుకొన్నది. కాని అతను ఒక్కతన్ను తన్ని అవతలికి నెట్టేశాడు కుక్కను.

ఆ ఇంట్లోనూ ఏమీ దొరుకలేదు. కాకపోతే రక్తమూ సారాయీ కలసిన వాసన కొడుతున్న ఒక పాత దుప్పటీ, స్థంభానికి కట్టివేయబడి వాడలిపోతున్న ఒక మేక దొరికాయి.

ఫజల్ మేక చళ్ళను చేత్తో తాకి "మౌలవీగారూ! పాడిమేక!" అన్నాడు. ఇలా అంటూనే అతను తన నోట్లోకి పాలను పిండుకోసాగాడు.

మౌలవీ అన్నాడు "నేను ముసలివాడిని, పైగా నీకంటే ఎక్కువ ఆకల్లో వున్నాను!"

"సరే, నీవే త్రాగు ముందు! అలాకాదు అసలు దీన్ని నీవెంటే అట్టేపెట్టుకో!"

తాడు విప్పి మేకను మౌలవీ చేతికి అందించాడు.

మౌలవీ అడ్డంగా తల త్రిప్పి "ఇది దొంగసొత్తు!" అన్నాడు.

ఫజల్ అన్నాడు "అదే, దీన్ని నీవు తీసుకోకపోతే రాత్రికి దొంగలు వచ్చి ఎటూ పట్టుకుపోతారు. నేను చెబుతున్నాను విను; మేక చాలా వుత్తమజాతికి చెందినది, మాంసం కూడా బాగావుంటుంది!"

మౌలవీ మళ్ళీ తల అడ్డంగా త్రిప్పాడు.

"సరే నీకు వద్దకపోతే నేనే వెంటపట్టుకు వస్తాను!"

ఫజల్ మేకను పుచ్చుకొని ముందుకు నడిచాడు. మూలవీ మంజూర్‌లు అతన్ని అనుసరించారు. తరువాత ఇల్లు లోపలనుండి గడియవేయబడి వున్నది.

ఫజల్ పెద్దగా అరిచాడు "ప్రాణాలు దక్కించుకోవాలనుకొంటే తలుపుతియ్యి!"

ఎవ్వరూ తలుపు తెరువలేదు.

"తలుపు తెరుస్తావా, బ్రతికిపోతావు! లేదా ప్రాణాలు తీసేస్తాను!" ఫజల్ మళ్ళీ అరిచాడు.

అప్పటికీ తలుపు తెరువబడలేదు.

ఫజల్ మంజూర్ ఇద్దరూ కలిసి దర్వాజాను విరగ్గొట్టారు. ఒక రెక్క లోపలకు పడ్డది. రెండవరెక్క అక్కడే వుండి వూగిసలాడుతున్నది.

ఫజల్ మంజూర్‌లు ఒకవైపుకు నిలబడ్డారు.

"ఎవరు ఇంట్లో వున్నది? బయటికి రండి!" ఫజల్ అరిచాడు.

ఏమీ సమాధానం లేదు.

ఫజల్ మంజూరూ ఇద్దరూ జాగ్రత్తగా ఒక్కొక్క అడుగు వేసుకొంటూ ఇంట్లోకి పోయారు. ఇల్లంతా చీకటిగా వుంది. ఫజల్ అగ్గిపుల్ల గీశాడు. అగ్గిపుల్ల వెలుగులో నట్టింట ఒక చాపపరిచి కనుపించింది. ఆ ఒక్కక్షణంలోనే పెద్ద ఆక్రందన ఒకటి, ఎవరో ఎక్కిళ్ళు పెడుతున్న శబ్దాలూ వినిపించాయి. తిరిగి నిశ్శబ్దం! ఇల్లంతా చీకటి!

ఫజల్ రెండవ వుల్లి గీశాడు. చావకు దగ్గరలో ఒక మంచం. దానిలో ఒక ముసల్ది, ఆక్రందిస్తున్నది ఆమె కాళ్ళ దగ్గరే ఒక యువతి కూర్చుని ఎక్కెళ్ళు పెడుతున్నది.

ఫజల్ అడిగాడు "మీరు ఎందుకు పారిపోలేదు ?"

"ఊళ్ళోవాళ్ళు పారిపోయేప్పుడు నేను అడవికి పుల్లలకు వెళ్ళాను. వాళ్ళు మాకోసరం ఆగలేదు!" యువతి చెప్పింది.

"నీ పేరేమిటి ?"

"భాగా !"

"భాగా ఏమిటి ? భాగకౌర్ అనో, భాగదేవి అనో వుండాలి."

"భాగ్‌కౌర్ !"

"కొంచం లేచి ఇటు వెలుగులోకి రా !"

యువతి లేవలేదు.

ఫజల్ దాష్టీకం చేశాడు.

"లే ముండ !"

యువతి హఠానంగా లేచి ఫజల్ దగ్గరకు వచ్చింది. ఫజల్ ఆమెను వెలుగులో చూశాడు. భాగ్‌కౌర్ అందమైన యువతి. బంగారపు రంగు. బుగ్గలమీద ఎరుపు, ఉషఃకాంతులను జ్ఞప్తికి తెస్తున్నది.

"వాళ్ళు నిన్ను వదిలి వెళ్ళారా ?" ఫజల్ ప్రశ్నించాడు.

యువతి తల వంచుకున్నది. కండ్లు చెమర్చాయి.

"ఐతే, మా వెంట వస్తావా?" ఫజల్ రెక్క పుచ్చుకున్నాడు.

యువతి చేతిని విడిపించుకొని ముసలిదాని దగ్గరకు పరుగెత్తింది. వెనకటిలాగానే మంచంచివర కూర్చున్నది.

"ముసలమ్మ నీ కేమౌతుంది?" ఫజిల్ అడిగాడు.

"అమ్మమ్మ!"

"ఈమె ఇంక ఎక్కువసేపు బ్రతుకదు. కొద్దిక్షణాలే! నీవు ఎంతసేపని ఈ శవాన్ని కాచుకుక్కూర్చుంటావు?" ఫజల్ అడిగాడు.

యువతి ఏమీ సమాధానం ఈయలేదు. ఫజల్ ఆమె చేయిపట్టుకొని "మాతో వచ్చేశెయ్యి. నిన్ను మీవాళ్ళ దగ్గరకు చేరుస్తాను!" అన్నాడు.

భాగ్ కౌర్ కండ్లల్లో ఆశ మెరసింది. ఆమె కండ్లు పెద్దవిచేసుకొని ఫజల్ ముఖంలోకి చూసింది. ఆ ముఖంలో ఆమెకు ఏమికనుపించిందో? నిరాశతో తలదించుకొని "అబద్ధం చెబుతున్నావు?" అన్నది.

ఫజల్ నవ్వుతూ "అబద్ధంకాక, నిజం అనుకొన్నావా? ఎట్లాగయినా నీవు మా వెంట రాకతప్పదు!" అన్నాడు.

"అలాచేయకు అది పాపం!" మాలవీ అన్నాడు.

మంజూర్ అన్నాడు "మాలవీగారు చెప్పింది నిజం!"

"ఏం నిజం, వల్లకాటి నిజం! జైల్లోతిన్న కొరడా దెబ్బలిన్ని మర్చిపోయారా? కొయ్యబండలను? నూనెలో నాన్చిన కొరడాలు వీపులమీద 'ఛళ్ళు'మన్నాయి. అవి? రక్త

నా గుండెలమీదుగా నడిచింది-ఇవన్నీ మర్చిపోయారా?" ఫజల్ అడిగాడు.

మంజూర్ "అందులో ఈఅమ్మాయి దోషం ఏముంది? ఈ అమ్మాయి నీకు చేసిన అపకారం ఏమిటి?" అన్నాడు.

"నేనుమాత్రం ఈ అమ్మాయికి ఏం అపకారం చేస్తున్నాను? ఇక్కడే వుంటే అడవిజంతువులు చంపివేయడమో, దొంగలు ఎత్తుకుపోవడమో జరుగుతుంది! ఇలాంటి అందమైన వస్తువు ఈ ప్రదేశాల్లో వుండతగదు "మళ్ళీ భాగ్‌కౌర్ చేతిని గట్టిగా పుచ్చుకొని "ఊఁ పద!" అన్నాడు ఫజల్.

భాగ్‌కౌర్ ఈమాటు ఫజల్ పట్టును విడిపించుకొనలేకపోయింది కొనవూపిరితో వున్న తన అమ్మమ్మవంక ఆఖరుసారిగా చూసింది.

ఆమెను రెక్క పుచ్చుకొని ఈడ్చుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు ఫజల్. అతని ఒకచేతిలో మేకవుంది. రెండవ చేతిలో భాగ్‌కౌర్ వుంది. మేకను వహాలవీ చేతిలోకి ఇచ్చాడు భాగ్‌కౌర్‌ను పశువును తోలుకుపోయినట్టు తోలుకుపోసాగాడు.

భాగ్‌కౌర్ కొద్దిదూరం వాళ్ళతోపాటు నడచి, మెల్లగా చెయ్యి విడిపించుకొని, అడవివైపు పరుగెత్తింది. కాని వెంటనే ఫజల్ పట్టివేశాడు. అత నా అమ్మాయిని మెడ పట్టుకు వంచి నాలుగు గుద్దులు గుద్దాడు. తరువాత భాగ్‌కౌర్ పరుగెత్తే ప్రయత్నాన్ని విరమించుకొన్నది.

తరువాత వున్న రెండు మూడిండ్లలోనూ చాలా కొద్ది సామాను మాత్రం దొరికింది. ముఖమల్ బాస్కట్ ఒకటి

దీన్ని ఏ యువకుడికో పెండ్లికో అత్తవారు పెట్టివుంటారు. పాపం! అతను గాభరాలో మర్చిపోయి వుంటాడు సైనిక దుస్తులు కొన్ని దొరికాయి. ఒక ఇంట్లో పాతికసేర్ల మంచి సన్నబియ్యం దొరికాయి ఒకఇంటి తెల్లని గోడమీద ఇలా వ్రాసివున్నది.

"ముస్లిములారా! మీ అమ్మల్ని...!"

ఫజల్ మంజూర్‌ను అడిగాడు. "ఏమిటి ఇక్కడ రాసి వుంది?"

మంజూర్ "తిట్టు" అన్నాడు.

ఫజల్ "చదివి వినిపించు" అని అడిగాడు

మంజూర్ చదివాడు "ముస్లిములారా! మీ అమ్మల్ని...!"

ఫజల్ ముఖం కందగడ్డ అయింది. అతడు గోడమీద శాంద్రించి వుమ్మేశాడు. తరువాత అతనికి ఒక క్రొత్త వూహ తట్టింది. నేలమీద అటూ ఇటూ చూశాడు. ఒక బొగ్గుముక్క కనుపించింది. మంజూర్ చేతికిస్తూ "దాన్ని చెరుపు. ఇలా రాయి హిందువులారా! మీ అమ్మల్ని...!" అన్నాడు.

ఫజల్ చెప్పినట్టు మంజూర్ మొదటి తిట్టును తుడిచి దానికింద ఇలా వ్రాశాడు. "హిందువులారా! మీ అమ్మల్ని...!"

తరువాత ఇద్దరూ గోడవైపు చూసి పకాపకా నవ్వసాగారు.

ఇంతలో భాగ్‌కౌర్‌కు ఆ ఇంట్లో ఏమిటో కనుపించింది. వెంటనే ఆమె ఎగిరిదూకి లోపలికి పోయింది. ఒక్క త్రుటికాలం ఫజల్ మౌనంగా చూస్తూ వుండిపోయాడు మరు నిమిషంలోనే తనూ ఇంట్లోకి పరుగెత్తాడు. అది రెండుగదుల ఇల్లు. భాగ్‌కౌర్ ముందుగదిలోనుంచి వెనకగదిలోకి పోయింది. ఫజల్‌కూడా ఆమెను అనుసరించాడు

రెండవగది చాలా శుభ్రంగా విశాలంగా వుంది. రెండు కిటికీలు వున్నాయి. ఒక తలుపు అటునించి కూడా వుంది. ఆ వాకిలిగుండా, కాగాన్‌నది పర్వతపంక్తుల దృశ్యాలు మనోహరంగా కనుపిస్తున్నాయి.

గదిలో అగరువత్తులు ఇంకా కాల్తూ వున్నాయి. వాటి సువాసన గదిని పూర్తిగా అలుముకొన్నది. దీన్నిబట్టి ఎవరో ఇప్పుడే, అగరువత్తులు వెలిగించి వెళ్ళారని తెలుస్తున్నది.

గదిలో ఒకమూల చిన్న దేవుడి మందిరం వుంది. దానిలో పవిత్రమైన "గురుగ్రంథం సాహెబ్" తెరవబడి వున్నది. ఆ గ్రంథానికి దిగువన కొద్దిదూరంలో ఒక గ్లాసు బోర్లా పడివున్నది. ఆ గది మొత్తంలో ఈ గ్లాసు ఒక్కటి మినహా అవ్యవస్థితంగా వున్నవస్తువు మరొకటి లేదు. ముందుకు నడవబోయి ఫజల్ ఆగిపోయాడు.

భాగ్‌కౌర్ పరుగెత్తుకుంటూ పోయి, గురుగ్రంథ సాహెబ్ దగ్గిర తలవొంచి ప్రార్థన చేస్తున్నది. రెండుచేతులూ జోడించింది. నీళ్ళు నిండిన కళ్ళలో తన దౌర్భాగ్యాన్ని విన్నవించుకొంటున్నది — ప్రార్థనరూపంలో !

అలా ప్రార్థిస్తున్న భాగ్‌కౌర్ ఫజల్ హృదయంలో విచిత్రమైన ప్రభావాన్ని కలుగజేసింది. అతను మౌనంగా తన స్థానంలో నిలబడిపోయాడు. అతనికాళ్ళు ముందుకు సాగలేదు. ఫజల్ వెనుక మంజూరూ, మాలవీ నిలబడి వున్నారు. ఫజల్ వెనక్కి తిరిగి చూశాడు ఆశ్చర్యం! మాలవీ తన రెండు చేతులలోనూ కండ్లు మూసుకుని దేవుడిని ప్రార్థిస్తున్నాడు.

ప్రార్థన అయిపోయింది. భాగ్‌కౌర్ చాలా శాంతంగా బోర్లా పడివున్న గ్లాసును వెల్లకిలా పెట్టింది. గురుగ్రంథ సాహెబ్ మీద పట్టువస్త్రాన్ని ఒకదాన్ని కప్పింది. తరువాత అతి ప్రశాంతంగా ఫజల్ దగ్గిరకు వచ్చేసింది. ఇప్పు డామెలో ఏ విధమైన బాధగానీ, దుఃఖం గానీ కనుపించడంలేదు.

## 2

దారిన చాలా సేపటివరకూ ఫజల్ మౌనంగానే నడిచాడు. అతని మస్తిష్కంమీద నిర్మలమైన పవిత్రమైన ఆ గది ప్రభావం బాగా పడ్డది మాలవీ, మంజూర్, భాగ్‌కౌర్‌లు కూడా మౌనంగానే నడిచారు.

"నీవు ఇక ఈ పిల్లను విడిచిపెట్టేస్తావుకదా! అనుకొన్నాను!" మాలవీ అన్నాడు.

"నేనూ అలాగే అనుకొన్నాను!" మంజూర్ అన్నాడు.

"మీరు ఇద్దరూ మెదలకుండా వుండండి. ఇది నాస్వంత విషయం." ఫజల్ అన్నాడు.

చీకటిపడ్డ తరువాత కూడా వాళ్ళు చాలాసేపు నడిచారు. దారిలో అమన్‌కోట అనే గ్రామం తగిలింది. ఈ గ్రామంలోకూడా ఎవ్వరూ లేరు. "ఈ రాత్రి ఇక్కడే గడిపేద్దాము." మంజూర్ అన్నాడు.

"నీకేం పిచ్చెక్కిందా? ఇక్కడ పడుకుంటే రాత్రికి దొంగలువచ్చి వళ్ళు పచ్చడిచేస్తారు. కొంచెం ముందుకు, కొండపయికి పోదాం పదండి!" అని ఫజల్ అన్నాడు.

"ఏం, దొంగలు ఎందుకు వస్తారు?" మాలవీ అడిగాడు.

"దొంగలు బయటనుండి రారు. చుట్టుపట్ల వున్న ముస్లిములే వస్తారు. ఇక్కడినుండి హిందువులు లేచి పోవడం చూచివుంటారు. తప్పకుండా వస్తారు. అప్పుడు ఈ పిల్ల కోసరమైనా మనకూ, వాళ్ళకూ కొట్లాట జరుగుతుంది!" ఫజల్ అన్నాడు.

ఫజల్ చెప్పింది యదార్థమే! మరి కొంచం పైకిపోయి దారి తప్పించి ఒక సెలయేరు ఒడ్డున బసచేశారు. ఫజల్ మేక పాలను త్రాగివున్నాడు. జొన్నరొట్టెలు చేసేపనిని భాగ్‌కౌర్‌కు వప్పచెప్పారు.

మంజూరూ, మాలవీ బాగా అలసిపోయారు. ముందు వారికి భోజనం పెట్టడం జరిగింది. భోజనం చెయ్యగానే పడి నిద్రపోయారు.

భాగ్‌కౌర్ ఫజల్ నిమిత్తం రొట్టెలు చేస్తున్నది. ఫజల్ ఆమె ప్రక్కనే కూర్చుని వున్నాడు.

పొయ్యిలో చితుకులు మండుతున్నాయి. వాటిమంటల్లో భాగ్ కౌర్ ముఖం నైరాశ్యంతో నిండినట్లున్నది. జొన్నలను బండ మీదనూరి రొట్టెలు తయారు చేసేప్పుడు ఆమెకు గతరాత్రి కళ్ళకు కట్టినట్టు జ్ఞాపకానికి వచ్చింది. గతరాత్రి ఇదేసమయా నికి తను, తన అన్న షేర్‌సింగ్‌కూ, తండ్రి దిలేర్‌సింగ్‌కూ, తల్లి జైకౌర్‌కూ రొట్టెలు చేసి పెడుతున్నది. చెల్లెలు కమ్మో కూరలో నంజుకోను వెన్నపూసను వేయుమంటున్నది. తండ్రి ప్రేమగా తల నిమురుతూ "మా అమ్మను మహారాజుకు ఇచ్చి చేస్తాను!" అన్నాడు తనను గురించి.

కాని, ఇవ్వాళ ఆమె శోభనపు రాత్రి. ఈ విధంగా దారి ప్రక్కన, చెట్టుక్రింద మేళతాళాలు లేకుండా 'జుల్మ' అనే నూతన వస్త్రాలను ధరించి ప్రత్యక్షమైంది.

క్రింద గ్రామంలో కాగడాలు కనుపించసాగినాయి. అరుపులూ, కేకలూ వినిపిస్తున్నాయి.

భాగ్‌కౌర్ రొట్టెలు కాలుస్తూనే మౌనంగా కన్నీరు కార్చసాగింది. కన్నీరు చంపలమీదగా కారిపోతున్నది. ఇం తలో గ్రామంలోని అరుపులూ, కేకలూ మిన్ను ముట్టినాయి. దివిటీల వెలుగులు అధికం అయి, రానురాను మంటల రూపాన్ని దాల్చసాగినాయి. మంటలు నాలుకలు చాచి గ్రామాలను దహించివేస్తున్నాయి. ముస్లిములు గ్రామాలను తగుల పెడుతున్నారని అనుకొన్నాడు ఫజల్.

భాగ్‌కౌర్ మౌనంగా రొట్టెను ఫజల్‌ముందు పెట్టింది. ఫజల్ ఆమె చేతిని పుచ్చుకొని "నాతోపాటు నీవూ తిను!" అన్నాడు.

భాగ్‌కౌర్ ఫజల్‌తోపాటు తనూ రొట్టెను తినసాగింది. ఇంతవరకూ ఆమె ఎన్నడూ ముస్లిముతో కలసి భోజనం చేయ లేదు. అందువల్ల మొదటి నాలుగుముక్కలూ అదోవిధంగా వున్నాయి. అయినా నడకతో అలసి, ఆకలిగా ఉండడంవల్ల దుఃఖాన్నీ, క్రోధాన్నీ అణచుకొంటూనే చాలా రొట్టెలను తినేసింది!

ఫజల్ ఆమెవైపు చూసి నవ్వుతున్నాడు. వివశత్వం ఆమె అందాన్ని ఇనుమడింపచేసింది. భోజనానంతరం ఫజల్ ఒకవైపున కంబళీ మరొకవైపు కోటూ పరచి, కోటుమీద తను పడుకున్నాడు. కంబళీమీద కౌర్‌ను పడుకోమన్నాడు.

భాగ్‌కౌర్ మారుమాటలాడకుండా కంబళీమీద పడు కొన్నది. ఆమె మనసులో కానికి ఏమాత్రమూ సంబంధంలేకుండా ఉన్నది. ఆమె శరీరం, మనస్సూ, రెండూ ఏమాత్రమూ సంబం ధం లేని రెండు ప్రత్యేకపదార్థాలుగా ఉన్నాయి. ఈ రెంటిలో దేనిమీదా ఆమె అధికారం సాగడంలేదు. మౌనంగా కండ్లు మూసుకొన్నది.

క్రిందవూళ్ళో దివిటీలు వెలుగుతున్నాయి. ఆరు తున్నాయి. ఇవ్వాళ శోభనపురాత్రి...ఓరి దుర్మార్గుల్లారా! వెలిగించండి, సన్నాయీలను వాయించండి! ఆపండి! చల్లా ర్పండి! మంగళహారతున్ని పాడండి!!

క్రిందనుంచి పెద్దగా కేకలు వినిపించినాయి. ఫజల్ భాగ్ కౌర్ చేతిని తనచేతిలోకి తీసుకొన్నాడు. ఆమెచేయి మంచులా చల్లపడిపోయింది. ఫజల్ కరస్పర్శతో ఆమె వళ్ళంతా చీమలు పాకినట్టయింది. అతనామెను తన వడిలోకి లాక్కు—

న్నాడు. తడిసిన ఆమె కనురెప్పలను ముద్దుపెట్టుకొన్నాడు. వణికే ఆమె పెదాలను చుంబించాడు. భాగ్‌కౌర్ పెదాలు తేనెలా తియ్యగా వున్నాయి. ఆ తియ్యదనం అతనిలో తీరని దావాగ్నిని రేపింది. అతను ఇసకలోకి జొచ్చుకుపోయే సముద్రపు అలలా ఆమెమీదకు ఒరిగాడు. అదేసమయాన అతని మెడమీద ఎవరో చురుకైన కత్తిని ఉంచినట్టయింది. ఎవరో మెల్లగా, కాని తీక్షణమైన స్వరంలో "ఆమెను వదిలిపెట్టు! లేకపోతే ప్రాణాలను గోల్పోతావు!" అన్నారు.

ఫజల్ ఒక్కక్షణం మౌనంగావుండిపోయాడు. మెల్లగా భాగ్‌కౌర్‌ను విడిచిపెట్టాడు.

తరువాత అతని మెడమీదనుండి కత్తి తొలగించబడ్డది. అతను తలత్రిప్పి చూశాడు. ఒకవైపున మంజూర్ కత్తి పుచ్చుకు నిలబడివున్నాడు. మరొకవైపున మాలీ లావుపాటి కర్ర నొకదాన్ని పుచ్చుకు నిలబడివున్నాడు.

---

# పదమూడవ అధ్యాయం

సజన్ దేవుడు బధియానీ గ్రామంవరకూ సురక్షితం గానే చేరాడు. కాని అక్కడికివచ్చి "గాజియానీ ఇస్లామ్" కు దొరికిపోయాడు. 'గాజియానీ ఇస్లామ్' అనేది క్రొత్తపార్టీ. దీని జన్మదాత జహామత్ అలీఖాన్! ఇతను జంగా, పవాడా గ్రామాల్లో దీన్ని సృష్టించాడు. ఈఉద్యమం మొదలైనతరు వాత ప్రాంతం అంతటిలోనూ గందరగోళాలు బయలుదేరి నాయి. ఈగందరగోళాలుకూడా విచిత్రమైనవి! మొదట్లో ఈసంస్థ లక్ష్యం డోంగరారాజ్యాన్ని నాశనం చేయడమే! కాని రానురాను డోంగరారాజ్యం హిందువులకు పర్యాయ వాచకపదంగా యెంచి ఎక్కడ హిందువులు కనుపిస్తే అక్కడ వాళ్ళను మరమ్మతు చేయసాగారు ఈసంస్థ సభ్యులు! జంగా పడవా ప్రాంతంనుండి బహుత్వరగా కాఫిర్లను తరిమివేసి ఇతరప్రాంతాలను శుభ్రం చెయ్యడానికి వాయువేగంతో వచ్చేశాడు జహామత్ అలీఖాన్! జంగాపవాడా తరువాత అతను నిర్ణయించుకొన్నది బధియానీ, టీకరీ, శాహామురాద్, సక్కడ్, మొదలైన గ్రామాలు! ఈగ్రామాల్లో రాజాకర్మఅలీ చాలా తెలివిగా వ్యవహరించాడు. ముందుగా తనుకూడా జహామత్ అలీఖాన్ను అనుసరించి 'గాజియానే ఇస్లాం' సంస్థకు

నూతనశాఖ నొకదాన్ని ఈప్రాంతంలో తెరిచాడు. అటు జమాయత్ ఆలీ బయలు దేరినప్పుడే ఇటు రాజాకర్మఆలీకూడా తనజాగీరునుండీ బయలు దేరాడు. ఉభయులూ, బధియానీలో కలుసుకున్నారు! అక్కడే రాజకర్మఅలీ, జమాయత్ అలీ-వీరిద్దరూ ఈసంస్థకు శాశ్వతనాయకులుగా ఎన్నుకోబడ్డాడు. ఇక్కడే సజన్ దేవుడు దారితప్పి పట్టుపడ్డాడు.

అతడు పట్టుబడగానే చంపేసేవారే, కాని కొంచెం చదువుకొన్నవాడుగా, పరదేశస్తుగా కనుపించడంవల్ల వెంటనే చంపటమూ, లేక ఉదయం తమనాయకుల దగ్గిరకు తీసుక పోయివారిఆజ్ఞను తీసుకొని చంపడమూ ? అని ఆలోచించారు. 'గాజియానేముస్లిం' సభ్యులు! చివరకు ఉదయం నాయకుల అనుమతి తీసుకునే చంపడం ఉచితమనే నిర్ణయానికి వచ్చారు.

ఆరాత్రింతా సజన్ దేవుడిని పశువులకొట్లో బంధించి వుంచారు. మరునాటి వుదయం కాగాన్‌నది ఒడ్డుకు తీసుకు పోయారు. అక్కడ జమాయత్ ఆలీ, రాజాకర్మఅలీ ఉదయం నుంచే సిద్ధం!

కాగాన్ నదిఒడ్డున విశాలమైన ప్రదేశంలో 'గాజ యానే ఇస్లాం' సభ్యులు గుంపులుగా కూర్చుని వున్నారు. కొంతమంది స్నానాలు చేస్తున్నారు. కొంతమంది బట్టలు ఉతుక్కొంటున్నారు. కొంతమంది గడ్డాలూ, తలలూ క్షవరం చేయించుకుంటున్నారు. ఒకచోట మేకల్ని కోస్తున్నారు. మరొకచోట పెద్ద పెద్ద హండాలను పొయ్యిలమీదకు ఎక్కిస్తున్నారు. మధ్య మధ్యన వందా యాభై మంది స్త్రీలూ,

పురుషులూ పిల్లలూ గుంపులుగా తలలు వంచుకు కూర్చున్నారు. వీరంతా గ్రామాల్లోంచి పట్టుకురాబడ్డ హిందువులు! వీరంతా రైతులూ వ్యాపారస్తులును! ఒక యాభైమంది పోలీసులు వీరందరికీ కాపలా కాస్తున్నారు. అందరిలోనూ భయోద్విగ్నత స్పష్టంగా కనుపిస్తున్నది. వాళ్ళల్లో వాళ్ళు గుసగుసా ఏమేమో చెప్పుకుంటున్నారు "ఇవ్వాళ అందరినీ నిలువునా చంపుతారు" అంటున్నాడు ఒకడు. "లేదు. అందర్నీ ముస్లిముల్ని చేస్తారు" అంటున్నాడు ఒకడు, మరొకడు "ఆడవాళ్ళనీ, పిల్లల్నీ విడిచిపెడతారు" అంటున్నాడు ఇంకొకడు "ఎవ్వర్నీ విడువరు" అంటున్నాడు. ఈ విధముగా మనిషికొక మాట మాట్లాడుతున్నారు. భయంమాత్రం అందరిలోనూ సమానంగా వున్నది.

రాజా కర్మఅలీ గుడారంముందు రెండు కుర్చీలలో ఒకదానిలో జహామత్ అలీ కూర్చుని వున్నారు. అదేసమయానముగ్గురు 'గాజీయానే యిస్లాం' సభ్యులు సజన్‌దేవుడిని వారిముందుకు తీసుకువచ్చారు.

"కాఫిర్‌వా?" జహామత్ అలీ విపరీతం అయినద్వేషంతో ప్రశ్నించాడు.

"అవును!" సజన్‌దేవుడు తల వూపాడు.

"ఎక్కడినుండి వచ్చావు?"

"పట్నంనుండి!"

"అక్కడ ఏం చేస్తుండేవాడివి?"

"రాజకుమారుడి ఎ. డి. సి. ని !"

జహామత్ ఒక్కసారిగా కుర్చీలోనుండి ఎగిరిపడ్డాడు. కాని వెంటనే స్థిమితపడ్డాడు, ఇదిచూసి కర్మఆలీ చిరునవ్వు నవ్వాడు.

రాజా కర్మఆలీ "నువ్వు అక్కడినుండి ఎందుకు వచ్చేశావు ?"

"నేను రాలేదు నన్ను వెళ్ళకొట్టారు. ముఖానికి మసి పూసి గాడిదమీద వూరేగించి, బయటికి నెట్టారు !"

జహామత్, రాజాకర్మఆలీ-ఇద్దరూ పెద్దగా నవ్వారు.

"విశ్వాసఘాతకుడికి ఇది చక్కని శిక్ష !" కర్మఆలీ అన్నాడు.

"కాదు విశ్వాసఘాతకుడిని కాల్చి చంపాలి?" జహామత్ అన్నాడు.

"నువ్వు ఏంనేరం చేశావు ?" కర్మఆలీ అడిగాడు.

సజన్ దేవుడు ఏమీ మాట్లాడలేదు.

"ఇక్కడికి ఎందుకువచ్చావు ?"

"టేకరీ శాహాము రాద్ వెళుతూ..."

"అక్కడికి ఎందుకు వెళుతున్నావ్ ?"

సజన్ దేవుడు ఏమీ మాట్లాడలేదు.

"మాట్లాడవేం ? అక్కడ మీ అమ్మ వున్నదా ?" జహామత్ అడిగాడు.

"అక్కడొక స్త్రీ వున్నది. ఆమెను చూడకుండా నేను పంజాబుకు వెళ్ళలేను"

"ముస్లిం స్త్రీయా ?" కర్మఆలీ అడిగాడు.

"కాదు. ఆమె హిందూ స్త్రీ. ఇప్పుడామె బ్రతికిలేదు!"

"మరయితే ఎవర్ని చూడటానికి వెళుతున్నావు ?" జహామత్ అడిగాడు.

"ఆమెను చూడడానికే !"

"అదెలా సంభవం ? నీకేం పిచ్చి ఎక్కలేదుకదా ?" జహామత్ అన్నాడు.

సజన్‌దేవుడు నవ్వి,

"నీ వీ నదిఒడ్డున ఇంతమంది రైతులను, హిందువులను ఎందుకు ప్రోగుపెట్టావో నేను అర్థం చేసుకోలేను. అలాగే నీవు నా మాటల్నికూడా అర్థంచేసుకోలేవు... ఐతే ఏం ? వీళ్ళని వూరగాయ వేస్తావా ?"

ఈమాట కర్మఆలీకి కొంత నచ్చింది. అతను కొద్దిగా మెత్తపడి ఇలా అన్నాడు "ఈ కుర్చీమీద కూర్చో !"

సజన్‌దేవుడు కుర్చీమీద కూర్చున్నాడు. అతడు కుర్చీమీద కూర్చోగానే ముస్లిములందరూ అతనిచుట్టూ పోగయ్యారు. విషయం ఏమిటో ? రాజాకర్మఆలీ ఒక కాఫిర్‌కు కుర్చీ యిచ్చాడు కూర్చోవడానికి ! వీళ్ళమాటలు వినపడేట్టుగా కొంచం దూరంలో ముస్లిములు ప్రోగుపడ్డారు.

కర్మఆలీ సజన్‌దేవుడిని అడిగాడు "నీ ఉద్దేశ్యంలో మేము పొరపాటు చేస్తున్నామంటావా !"

సజన్‌దేవుడు ఏదో మాట్లాడబోతూవుండగా జహామహత్ ఆలీ ఎగిరిపడ్డాడు. "అవును. అవును. మేము వాళ్ళంద

రినీ పూరగాయవేస్తాం! మీూహు అర్ధరాత్రి మిషన్‌గనులతో మమ్ముల్ని చంపలా? దాని మొత్తానికి ఒక్కసారే మేము పగతీర్చుకొంటాము. మేము డోంగరా రాజ్యానికి దెబ్బకు దెబ్బ కొడతాం!"

"ఎక్కడ ఉన్నది డోంగరా రాజ్యం? ఈబీదరైతులు, తల్లులూ పిల్లలూ వీళ్ళా డోంగరా రాజ్యం? పొలం దున్నే ఈ రైతుల చేతులు నీలాగ డోంగరా రాజ్యానికి వంగి సలాం చెయ్యలేదా? అధిక పన్నులను చెల్లించలేదా? శిస్తులను చెల్లించలేదా? అక్కచెల్లెండ్ల మానాల్ని బలి ఇవ్వలేదా? వెట్టి చాకిరీ చేయలేదా? నీలాగే వీళ్ళుకూడా డోంగరా రాజ్యం క్రింద బాధలు పడలేదా? వీళ్ళ ఆస్తుల్ని జప్తుచెయ్యలేదా? వీళ్ళ ఇండ్లనూ పశువుల్ని వేలాం వెయ్యలేదా? డోంగరా రాజ్యాన్ని నాశనంచెయ్యడానికి ఇదా మార్గం! నీవు స్వయంగా నీ రైతులను నీ సోదరులను చంపుకుంటున్నావు!" అన్నాడు సజన్ దేవుడు

"బాగుంది! బాగుంది! ఇతను నిజం చెబుతున్నాడు!" అన్నారు చాలామంది గాజియానే ఇస్లాం వాలంటీయర్లు.

"ఏం బాగుంది? నా తలకాయ బాగుంది! ఇత నసలు ప్రభుత్వపు ఏజంటులా వున్నాడు! అక్కడ రాజకుమారుడి ఎ. డి.సి. ట! ఇక్కడికి రావలసిన అవసరం ఏంవచ్చిందో అడుగు? ఎవరో చచ్చిన స్త్రీని కల్సుకోవడానికి వచ్చాడుట. అర్థం వున్న మాటేనా?" కర్మఆలీ అన్నాడు.

"వీడిని నిలువునా పాతిపెట్టాలి!"

"నిలువుగా పాతిపెట్టండి. లేక అడ్డంగా పాతిపెట్టండి. నేను చెప్పేది మాత్రం యథార్థం! మీరు తప్పుత్రోవను నడుస్తున్నారు. మీ చేత్తో మీ కండ్లనే పొడుచుకుంటు న్నారు. వేలసంవత్సరాలనుండి కలసి అన్నదమ్ముల్లా వుంటున్న కాశ్మీరు రైతులను చీలుస్తున్నారు. హిందూ, ముస్లిం అనే విభేదాన్ని రేపుతున్నారు. మీ ఉద్యమం తప్పుదారి నడుస్తు న్నది. కనుక ఇది ఎక్కువరోజులు మనగలగలేదు."

"నిజం! నిజం చెబుతున్నాడు!" ఒక ముస్లిమ్ రైతు లేచి నిలబడి అరిచాడు.

"ఏం నిజం చెబుతున్నాడురా? నీ తలకాయి! వీడు సి.ఐ.డి రా!" జమాయత్ ఆలీ అన్నాడు.

అమ్‌దాద్ అనే రైతు ఇలా అన్నాడు "అతను చెప్పేది నిజం! ఇదే చెప్పడానికి నేను ఇక్కడికి వచ్చాను. కాని సరిగా చెప్పలేకపోయాను. జమాయత్ భాయీ! బాలక్ రామ్ శాస్త్రి-తాత తండ్రుల దగ్గరనుండి మా యింటిప్రక్కన ఉంటున్నాడు. అతను నాకు శత్రువు ఎలా అవుతాడో తెలి యడంలేదు! అతను నాలాగానే రైతు. స్థితిలో నా కంటే దరి ద్రుడు కూడాను. అతని కూతురూ, నా కూతురు బాల్య మిత్రులు! మా ఇద్దరికీ పుష్కలంగా శత్రువులు ఉన్నారు కాని మేమిద్దరం మాత్రం ఒకరికి ఒకరం శత్రువులం కాదు. మాకు మీరాషా శత్రువు పటవారీ శత్రువు. తాసీల్దార్ శత్రువు. థానేదార్ శత్రువు. అందరినీ మించి ఈ రాజా కర్మ కాలీ గొప్పశత్రువు మాకు! ఇతను మా టీకరీ నివాసి అయిన ఒక

సాలెవాని కూతురి శీలాన్ని చెరిచాడు. ఆ అమ్మాయి హిందువా ? భాయీ జహామత్ ! కొంచం ఆలోచించు ! నా మాటల మీద విశ్వాసం చాలకపోతే ఇదిగో రజ్జీనే అడుగు!" అంటూ రజ్జీని ముందుకు లాగాడు.

రైతులు చుట్టూ మూగారు. వాళ్ళల్లో ఆవేశం కను పిస్తున్నది. రాజాకర్మ ఆలీకి చమట పోస్తున్నది.

"రజ్జీ అన్నది "భాయీ జహామత్ ! నువ్వు బీదల పాలిటి దేవుడిలాంటివాడివి. సుమ్ములను స్వతంత్రులను చెయ్యా లని దీక్ష బూనావు. అందుకు ఇల్లిల్లూ తిరిగావు. అట్లాంటి నీవు, ఇవ్వాళ ఈ దొంగరా రాజ్యపు తొత్తుఅయిన ఈ కర్మ ఆలీ సరసన, నా శీలాన్ని చెరచిన ఈ కర్మఆలీ సరసన కూర్చు న్నావంటే చాలా విచారంగా ఉన్నది !"

"అన్యాయం ! అన్యాయం ! అసలీ జాగీర్దారును పట్టు కోండి ! వీడే మనకు శత్రువు !" అనేక కేకలు బయలు దేరినవి.

పరిస్థితులు చెయ్యిజారడాన్ని గమనించి జహామత్ లేచి నిలబడి వుపన్యసించడం ప్రారంభించాడు.

"గాజియానే ఇస్లాం సభ్యులారా! ముస్లింలారా ! ఇవ్వాళ చాలా విపరీతంఅయిన పరిస్థితులు వచ్చిపడ్డాయి. కానీ...శత్రువు చాలా తెలివైనవాడు. మనతో మనకే పోట్లా టలు పెట్టి, ద్వేషాలు తెచ్చి తప్పుకోవాలని చూస్తున్నాడు. రాజా కర్మఆలీ జాగిర్దార్ అన్నమాట నిజమే ! కాని అతనొక

ముస్లిం సోదరుడన్నమాట మర్చిపోకండి! వెనకటిలాంటి పాపాలు ఇక చెయ్యనని అతను శపథం చేశాడు. భాయీ కర్మఆలీ! ఇదిగో మన ముస్లిం సమాజం అంతా ఇక్కడే వుంది. నీవు చెప్పదల్చుకున్నది ఏమిటో నేరుగా చెప్పు!"

రాజా కర్మఆలీ లేచి నిలబడి కన్నీళ్ళు పెట్టుకొంటూ ఇలా అన్నాడు. "నేను శపథంచేసి చెబుతున్నాను. భగవంతుడి ముందు ప్రమాణంచేసి చెబుతున్నాను; వెనుకటి పాపాలను క్షమించమని వేడుకుంటున్నాను. వెనుక నేను ఏమో చేశానేది పోనివ్వండి. ఇక నేను మీకు సేవకుడిని. ఇస్లాం మతం శ్రేయస్సుకోసం, ఇస్లాం సమాజం కోసం నా సర్వస్వం త్యాగం చేస్తాను. నా జాగీరుని, ధనాన్ని, సర్వ సంపదల్ని, ఇస్లాం మతంకోసం అర్పిస్తాను. నేటినుండి నేను జాగీర్దారును కాదు. ఇస్లాం మత సేవకుడిని, మీ అందరి సేవకుడిని! ఇక రజ్జీ విషయం అంటారా? అప్పుడు నన్ను కామం అంధుడినిచేసింది. ఇప్పుడు కళ్లు తెరిచాను. ఇక రజ్జీ నాకు సోదరితో సమానం. ఇక అలాంటి పాపం నా వల్ల భవిష్యత్తులో జరిగేట్టయితే మీరు ఏ శిక్ష విధిస్తే దానికి నేను బద్ధుడను.

జమాయత్ ఆలీ అరిచాడు. "రాజా కర్మఆలీ జిందాబాద్!"

జమాయత్ ఆలీ అన్నాడు "ఆ దరిద్రుడు, సజన్ దేవుడు ఏడీ? కథ అంతా అడ్డం తిప్పాడు!"

"కాని నీ వుపన్యాసం సరిచేసింది. ఏం వుపన్యాసం ఇస్తావు! ఎదురులేదు." రాజా కర్మఆలీ అన్నాడు.

"అదికాదు, ఇప్పుడా వెధవను సఫా చెయ్యాలి. లేక పోతే మళ్ళీ ఏదో ఒకగొడవ లేపుతాడు." జహామత్ ఆలీ అన్నాడు.

"వద్దు! ఇప్పుడలా చేయడం బాగుండదు. బండి ఎటూ పాటున పడ్డదనుకో! అయినా రైతులు ఇంకా శాంత పడలేదు. ఈ వ్యవహారాన్ని ఇప్పటికి ఇలాగేవుంచి మిగిలిన వ్యవ హారాలు చూడు! అదిమంచిది!" కర్మఆలీ అన్నాడు.

"నా ఉద్దేశ్యం అందరినీ సఫా చేసేద్దామనే వున్నది. జాగావడావాలో నేను అదేపని చేశాను!" జహామత్ అన్నాడు.

కర్మఆలీ "ఇవ్వాళ జరిగిన విషయాల్ని బట్టి అలా చేయడం మంచిదికాదేమోనని ఆలోచిస్తున్నాను. వీళ్ళందరినీ ముస్లిమతంలో చేర్చేద్దాం. అలా చేరడానికి అందరూ ఒప్పు కొంటారు!" అన్నాడు

"సరే, అదే చేద్దాం. కాని నాకుమాత్రం ఇలా ఇంత మందిని విడిచిపెట్టాలని లేదు. అయినా పరిస్థితుల ప్రభావం అలాగే వ్యవహరిద్దాం."

"ఐతే నీవు సామూహికంగా అందరికీ చెప్పేశెయ్యి! డోళ్ళు కొట్టించు. పహిలవీలను పిలిపించు!"

కొద్దిసేపట్లో డోళ్ళు మ్రోగసాగినాయి. ముస్లిము లం దరూ ఒకచోట ప్రోగుపడసాగారు. జహామత్ ఆలీ తన ఉప న్యాసం ద్వారా ఇప్పుడు ఏం చెయ్యాలో వారికి విశదపరి

చాడు. "ముస్లిములారా! మనం వీరులం! కనుక మనకంటే బలహీనులను హింసించు! వాళ్ళ ప్రాణాలను తియ్యి! ఇవ్వాళ ప్రతి ముస్లిముకూ ప్రధాన కర్తవ్యం ఏమిటంటే, ఈ నది ఒడ్డున కూర్చున్న హిందువుల వద్దకు ప్రతిఒక్కడూ వెళ్ళాలి. వారిని ముస్లింమతం స్వీకరించేట్లుగా చెయ్యాలి! స్వీకరించి మనలో చేరిన వాళ్ళను ఆనందంగా చేర్చుకొందాం! లేనివాళ్ళను విడిచిపెట్టేద్దాం."

"విడిచి పెట్టేస్తాం! విడిచి పెట్టి ఏంచేస్తాం?"

"ఇంకా ఏం చేసే దేముంది. ముస్లిమ్ మతాన్ని స్వీకరించని కాఫిర్లకు శిక్ష యమపురికి చేర్చడమే"

"అవును. అలాంటి కాఫిర్‌కు చావే శిక్ష." గుంపులో నుంచి ఉద్రేకపూరితమైన కేకలు వచ్చినాయి. అందరూ చాలా ఉద్రేకంగా వున్నారు. గాజియానే ఇస్లాం సభ్యులు వ్యతిరేకించిన కాఫిర్లను చంపడానికి సిద్ధంగా వున్నారు. కాని, ఒక్కక్షణంలో వాతావరణం అంతా మారిపోయింది. అక్కడ వున్న కాఫిర్లందరూ మతం మార్పిడికి ఒప్పుకున్నారు. భయం తీరి ప్రతివాళ్ళలోనూ ఉత్సాహం పొంగులు వారసాగింది. ఆడ వాళ్ళు నవ్వుతూ, పేల్తూ పెద్దపెద్ద గుండిగలతో అన్నాలు వండుతున్నారు. పిల్లలు ఎగురుతున్నారు. కొంతమంది వండిన వరి అన్నాన్ని ప్రజలకు పంచుతున్నారు. మీరాషా ఇప్పుడు మీర్ జాఫర్ అయ్యాడు. గుల్ ఇప్పుడు చాలా సంతోషంగా వుంది. ఆమె గర్భవతి! తల వంచుకుని "రేపు మహాలవీని పిలి

పించి మనం ఇద్దరం నికా కట్టుకొందాం. నా కొడుక్కు నేను "కాయం ఆలీ" అని పేరు పెట్టుకొంటాను." అన్నది.

"బాగుంది. మరికొడుకు కాకుండా కూతురు పుడితే సదాబహార్ అని పేరు పెట్టుకొందాం!" మీరాషా అన్నాడు.

బాలక్‌రాం బహదూర్‌ఖాన్ అయ్యాడు. అతని పెండ్లాం ఆశా, ఆయుషా అయింది. ఆమె ఒక గుండిగలో నుండి మాంసం కూరనూ పలావ్‌నూ తెచ్చి బాలక్‌రాం ముందు పెట్టి "ఇదిగో, తిను" అన్నది.

బహదూర్‌ఖాన్ ముక్కు మూసుకొని "రామ, రామా! ఏం పని ఇది? మనం బ్రాహ్మణ సంతానం!" అన్నాడు.

"నీవు తింటే తిను, లేకపోతే నేను తినేస్తాను. రాత్రి నుండి మాంసం తినాలని నోరూరుతున్నది. కాని భగవంతుడు ఏమంటాడోనని ఆలోచించాను. ఇప్పుడు మన భగవంతుడే మారిపోయాడు. ఇంకేమిటి?"

బాలక్‌రాం మాంసం వైపుకు చెయ్యిచాచి "నిజం చెబుతున్నావు! ఇంక మనకేమిటి భయం?" అన్నాడు.

మిశర్ కొడుకు భీకూ. అతని పేరు ఇప్పుడు అష్ఫాక్‌గా మారిపోయింది. తమ ఇంటిదగ్గిర పిల్ల జరీనాతో అంటున్నాడు. "ఇంకేం? ఆటంకాలన్నీ దూరం అయ్యాయి. ఇక మనం నికాకట్టుకుందామా, చెప్పు?"

జరీనా ముక్కుమీద వేలువేసుకొని అన్నది "పోవోయ్ భీకూ! నీకు ఇంకా నమాజు చదవడమైనా రాదు!" అన్నది.

ఒక చిన్న కుర్రవాడు వచ్చి అమ్‌దాద్ కాళ్ళను చుట్ట వేసుకొని "అమ్‌దాద్ కకా్కయి! అమ్‌దాద్ కకా్కయి! మా నాన్ననికూడా ముసల్మానుని చెయ్యవూ? అందరూ ముసల్మానులయి పొయ్యారు. మానాన్నని ఎవ్వరూ ముసల్మానుని చెయ్యడం లేదు!" అన్నాడు.

కుర్రవాడి తండ్రి దర్శన్. విశ్వబ్రాహ్మణుడు. చుట్టుపట్ల గ్రామాల్లో అతనిలాంటి బంగారపు పనివాడు ఎవ్వడూ లేడు. ఇంతవరకూ అతన్నెవ్వరూ ముస్లిముని చెయ్యలేదు.

"ఏమోయ్ దర్శన్! నువ్వింకా కాఫిర్‌గానే వున్నావు?" అమ్‌దాద్ అడిగాడు.

"నన్ను ఎవ్వరూ ముసల్మానుని చెయ్యడంలేదోయ్!"

"ఎందుకనీ?"

దర్శన్ అన్నాడు "నేను మొదట్లోనే మాలవీలకు చెప్పి వుంచాను. నన్ను గనక ముసల్మానుని చేశారా, ఇక నేను మీ ఇళ్ళల్లో వస్తువుల్ని సరిగా చేయను అన్నాను. ఎవ్వరూ నాదగ్గిరకుకూడా రావడంలేదు!"

అమ్‌దాద్, దర్శన్ ఇద్దరూ నవ్వసాగారు.

"ఇక మాలవీలందరూ నన్ను తమ మతంలోకి చేర్చుకోక పోవడానికి కారణం, నాకేదో ఘోరమైన రోగంవుందని, పదిమందికీ చెప్పారు!" అన్నాడు సుదర్శన్.

అమ్దాద్ కుర్రవాడిని అనునయిస్తూ "పోనీలే! మీనాన్న హిందువుగానే వుంటాడులే! వుండనివ్వు!" అన్నాడు.

కుర్రవాడు మొండిపట్టు వేశాడు. "అట్లాకాదు కకాయి. అందరూ ముసల్మానులయ్యారు. మా నాన్నను ఎవ్వరూ చెయ్యలేదు ఏం? మా అయ్య ఏం తప్పుచేశాడు? పోనీ నీవైనా ముసల్మానుని చెయ్యి కకాయి!"

అమ్దాద్ అన్నాడు "చూడవోయి! పీడికోసరమైనా పేరుమార్చుకో! ఎందుకీ మొండిపట్టు? చుట్టుపట్ల గ్రామాలన్నీ మారిపోయాయి. నీవు ఒక్కడివి హిందువుగా వుంటే మంచి నీళ్ళు పోసే దిక్కు కూడా వుండదు." అంటూ దర్శన్ నెత్తిన చెయ్యిపెట్టి "ఊ ఏం పేరు పెట్టమంటావో చెప్పు?" అన్నాడు.

"యూసుఫ్!"

అమ్దాద్ అతని నెత్తినుండి చెయ్యి తీసివేసి "ఛస్, ముఖంనిండా మసూచకపు మచ్చలు వున్నాయి. పేరుమాత్రం యూసఫ్!" అన్నాడు.

గుడారం బయట కూర్చున్న జమాయత్ ఆలీ కర్మ ఆలీతో ఇలా అన్నాడు "సమస్య చక్కగా పరిష్కారం అయింది!"

కర్మ ఆలీ అన్నాడు "కాని నాకు బాధగా వున్న విషయం; ఒక్క వెధవా ఎదురుతిరిగి నిలబడలేదేమా అని! ఇద్దరు ముగ్గురు సాహుకార్లు ఎదురుతిరుగుతారేమో, కొంత

ఆ స్త్రీ, డబ్బూ, ఐదారుగురు యువతులూ దొరుకుతారనుకొన్నాను. గాజియానే ఇస్లాం సవ్యంగా వ్యవహరిస్తే మన నోట్లో కరక్కాయే!"

జహామత్ అన్నాడు "అరె, హిందువులు చాలా తెలివి గలవాళ్ళు! అందుకనే మొత్తాన్ని సఫాచేద్దాం అన్నాను. చూడు అందరూ ఎలా భద్రంగా తప్పుకొన్నారో! ఒక్కొక్క పేరు మార్చుకొన్నారు. మిగిలింది అంతా యథా ప్రకారం వుండిపోయింది అదే ఇల్లూ, అదే భూమీ, అదే వూరూ! వీళ్ళను జంగాపడావాలో చేసినట్టు తుడిచి వెయ్యాలి."

కర్మ ఆలీ అన్నాడు. "సరే, మహాజాబధియానీ హిందువులు ఇంకా మిగిలివున్నారు. సుందర్‌శాహా, మిశర్, మిశ్రానీ – మొత్తం పదిపన్నెడుమంది వున్నారు. రేపు వాళ్ళ వంతు వస్తుందిగా!"

జహామత్ "మిస్‌రానీ కూతుళ్ళు చాలా అందగత్తెలు అటగా?"

కర్మ ఆలీ లొట్టలేస్తూ "వాళ్ళు ఆడవాళ్ళుకాదు. హంసలు! ఒకదానిపేరు గంగ. రెండవదానిపేరు సరస్వతి. పెద్దదాన్ని నీవు తీసుకో, చిన్నదాన్ని నాకు ఇవ్వు." అన్నాడు.

"అలాకాదు పెద్దదాన్ని నీవుతీసుకో, చిన్నదాన్ని నాకు ఇవ్వు. ఇష్టమేనా?" జహామత్ ఆలీ అన్నాడు.

"సరే, అది రేపుచూడవచ్చుగానీ, అసలు ఇది జరగడం ఎలాగా అని నా ఆలోచన! మహాజాబధియానీలో వుండే

ముసల్మానులందరూ ఆ పిల్లలమీద అభిమానంగా వుంటా రటగా !"

"భగవదానుగ్రహం వుంటే అన్నీ జరుగుతవి. మొదటే చెబుతున్నాను. నేను చిన్నదాన్ని తీసుకొంటాను!"

"పెద్దది చిన్నదానికంటే అందగత్తెట."

"ఐతే నువ్వే తీసుకో."

"సరే, సరే, ఇప్పటినుండీ పోట్లాట ఎందుకులే ! రేపటి విషయం కద."

"అట్లాకాదు; ఇప్పుడే నిర్ణయం అయిపోవాలి. రేపు అందరి ఎదురుగా మనం పోట్లాడుకోవడం బాగుంటుందా ?" జహామత్ అన్నాడు.

"నేనొక వుపాయం చెబుతాను."

"ఏమిటది ?"

"లాటరీ వేద్దాం."

"ఎట్లా ?"

"ఒక కాగితం ముక్కమీద గంగపేరు రాయడం. మరొక కాగితం ముక్కమీద సరస్వతిపేరు రాయడం! ఈ రెండింటినీ వుండచుట్టి ఒకటికాగితపుచుట్టల్లో కలపడం, ఇద్దరం వరసగా కాగితాల్ని తీయడం మొదటగా ఎవరిచేతికి పేరున్న కాగితం వస్తుందో, వాళ్ళ కా పేరున్న పిల్ల మిగిలినవాడికి రెండో పిల్ల."

"రెండుపేర్లూ ఒకడికే దొరికితే ?"

"మరీ అంత ఆశకుపోకు."

"సరే లాటరీ వెయ్యి."

లాటరీ వేశారు.

గంగ కరముఆలీకీ, సరస్వతి జహామత్ ఆలికి పోయారు.

జహామత్ ఆలీకి ఈ లాటరీపద్ధతి నచ్చలేదు. రేపు పిల్లల్ని చూసి నిర్ణయించుకో వచ్చునులే అనుకొన్నాడు. భగవదానుగ్రహం సరిగా వుంటే ఈ అడ్డంకికూడా తొలగి పోవచ్చును అనుకొన్నాడు.

రాత్రి కాకముందే నూతన ముస్లిములందరూ తమతమ ఇండ్లకు వెళ్ళిపోయారు.

రాత్రి కాగానే నదీ తీరాన్నంతటినీ జాగ్రత్తగా కావలా కాయసాగారు గాజియూనే ఇస్లాం సభ్యులు.

సిపాయీలు గుంపులుకూడి పాటలు పాడుతున్నారు. చంద్రోదయం అయింది.

జహామత్ అలీఖాన్‌కు తన భార్య జ్ఞాపకానికి వచ్చింది. పూర్వాచారాన్ని అనుసరించి ఇప్పుడు ఆమె అతని తండ్రి దగ్గర వుంటుంది. "యా అల్లా! కొడుకు ఎప్పటికి పెద్దవాడు అవుతాడో?" అనుకొన్నాడతను.

రాజాకర్మఅలీ ఇలాగ ఆలోచించాడు. ఇప్పటికి ఐదు వేలమంది సైనికులు తనదగ్గిర ప్రోగయ్యాడు. వీళ్ళే పదివేల మంది అయితే నేరుగా రాజధానిమీదనే యుద్ధానికి పోతాడు. అప్పుడు తను మొత్తం దేశానికే రాజు అయిపోతాడు. తన దెబ్బకు ఎదురు వుండదు. అప్పుడు రజ్జీని జుట్టుపట్టుకొని

లాకు రావచ్చు. ఇప్పుడు రాజా ఆన్‌సింగు సంగ్రామసింగులూ వుంటున్న దివ్యభవనం తినదైపోతుంది!"

రాజాశర్మఆలీకి మెత్తని పక్కమీదకూడా నిద్రపట్టడం లేదు. రకరకాలైన కలలూ వస్తున్నాయి.

బయట నదివద్దున గాజియానే ఇస్లాం సభ్యులు రాళ్ళను ఆనుకొని నిద్రపోతున్నారు. వాళ్ళమీద వెన్నెల మెరుస్తున్నది.

సజన్ దేవుడు నదివద్దునుంచి అమ్‌దాద్ సాయంతో తప్పించు పోగలిగాడు. కాని దారి బొత్తిగా తెలియకపోయిన కారణంగా తిరిగి పట్టుపడ్డాడు. కొంతమంది గాజియానే ఇస్లాం సభ్యులు అతన్ని పట్టుకొనివచ్చి మహాజాబధియానీ గ్రామపు ఖైదీలువున్న కొట్టులో వేశారు.



# పద్ధానుగవ అధ్యాయం

రాజా ఆన్‌సింగ్ నదిఒడ్డున ఉన్న తన దివ్యభవనంలో కర్నల్ డిక్‌కూ, మాలీకీ, సర్ థామస్‌కూ ఒక విందుచేశాడు. కొద్దిరోజులుగా రాజాఆన్‌సింగ్, ఇంగ్లీషు పత్రిక సివిల్ అండ్ మిలట్రీ గజట్‌లో కాశ్మీరు మహారాజుగారు సింహాసనాన్ని త్యజించనున్నారనే వార్తను, చదువుతున్నాడు. ఆ వార్తల కారణంగానే ఈ విందు జరగవలసివచ్చింది.

భోజనం అయ్యాక సంగ్రామసింగ్ మాలీని వెంట తీసుకొని షికారుకు వెళ్ళాడు. మిగిలిన అతిథులతో రాజా ఆన్‌సింగ్ ధూమపానకక్షంలోకి వచ్చి కూర్చున్నాడు.

రాజా ఆన్‌సింగ్ కర్నల్ డిక్ సిగార్‌ను స్వయంగా ముట్టించాడు. తరువాత ముగ్గురూ ఈజీచైర్లలో ఒరిగారు. మంచి భోజనం, మంచి సారాయం, మంచిగార్లనూ-కాలుస్తూ ఒక రకం అయిన మత్తులో, సంతృప్తిలో సంభాషణ ఉపక్రమించారు.

కర్నల్ "ఏమిటిది? కాశ్మీర్ మహారాజావార్ని సింహాసనంమీదనుంచి దింపివేస్తారుటగా! సివిల్ అండ్ మిలట్రీ గజట్ ప్రకటించింది!" అన్నాడు.

రాజా "కర్నల్‌గారూ! ఇంగ్లీషు సర్కారువారికి ట్రోకలాంటిది ఆపత్రిక! అది ప్రకటించినదానిలో ఏమాత్రమూ సత్యం వుండకపోదు!' అన్నాడు.

"మీరలా ఇంగ్లీషు సర్కారుకు తోక-అనడం నాకు ఏమీ బాగుండలేదు. కాకపోయినా మీ కేమిటి బాధ ?"

"బాధ వేరే ఏముంది. ఇవ్వాళ ఆయనను ఊసబీకారు. రేపునన్ను వూడబీకుతారు !"

కర్నల్ "మీకలా జరగదు !" అన్నాడు.

థామస్ అందుకున్నాడు "రాజాసాహెబ్! కొంచం ఆలోచించండి ; కాశ్మీరు మహారాజుగారు, అనేక క్లిష్టసమయాల్లో మా మాటలను తిరస్కరించి వ్యతిరేకంగా ప్రవర్తించాడు. ఉత్తమమైన మా సలహాలను కాలదన్నారు. మహారాజా గులాబ్‌సింగ్‌తో పంజాబ్ హిందువులను రాజ్యాంగంలోకి చేరనివ్వమని చెప్పాము. వారు మా మాటలను పాటించకుండాఅన్ని వున్నతపదవుల్లోనూ పంజాబ్ హిందువుల్ని నియమించారు.

ఆన్‌సింగ్ అన్నాడు. "కాని మహారాజా హారిసింగ్ పచ్చాక. అదంతా మార్చివేశాడుకదా ?"

"నిజమే! అయితే ఆ మార్చింది ఎప్పుడు ? రాజకీయ సంబంధమైన ప్రతిపనికీ ఒక టైమంటూవుంది! సమయం దాటిపోయాక ఎంత తన్నుకున్నా ఏమీ ప్రయోజనం వుండదు. మహారాజా హారిసింగ్ మా మాట అనుసరించాడు. కాని చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టయింది!"

కర్నల్ డిక్ పొగవదులుతూ "గుల్మార్గా విషయంలో చూడండి! ఇంగ్లీషు ప్రభుత్వం ఎన్నోసార్లు గుల్మార్గాలో సైనిక స్థావరాలను నెలకొల్పడానికి అవకాశాన్ని ఈయవలసిందని కోరింది. లేకపోతే పూర్తిగా గుల్మార్గాను వదిలిపెట్టమన్నది. మేము తగిన ప్రతిఫలాన్ని ఈయడానికి సిద్ధంగా ఉన్నాము. కాని, మహారాజుగారు వప్పుకోలేదు. అదికాక, గిలిగిట్ విషయం చూడండి, ఆఫ్గనిస్తాన్, టిబెట్, రష్యా అన్ని దేశాల సరిహద్దులూ అక్కడ కలుస్తాయి. అలాంటిచోట మహారాజుగారు ఏం రాజ్యం చెయ్యగలరు? మాకు వదలమన్నాము. కాని, వినలేదు!" అన్నాడు.

రాజా అన్‌సింగ్ అన్నాడు "కాని నేనలాంటిది ఏమీ చెయ్యలేదు. ఇంగ్లీషు ప్రభుత్వాన్ని భక్తిశ్రద్ధలతో అనుసరిస్తున్నాను గదా? క్రితం యుద్ధంలో నేను ఇచ్చినంతమంది సైనికుల్ని మన ఏ జాగీరూ ఇవ్వలేదు. ఒక్క 'సదర్' నుండే అరవైవేలమందికి పైగా సైనికులు భర్తీ అయ్యారు!"

"మీ శ్రద్ధాభక్తులకు ప్రభుత్వం చాలా సంతోషిస్తున్నది. అందువల్లే మీరు జాగీరుదార్లు అయినప్పటికీ పెద్ద సంస్థానాధీశులతో వ్యవహరించినట్టుగా మీతో వ్యవహరిస్తున్నది మా ప్రభుత్వం!" థామస్ అన్నాడు.

కర్నల్ డిక్ "మీకెందుకు మీరు చూస్తూవుండండి. ఇకముందుకూడా ఇలాగే జరుగుతుంది!" అన్నాడు.

రాజా అన్‌సింగ్ కర్నల్ చేతిని ఆవేశంతో స్పర్శించి, అన్నాడు "మీరు నా జాగీరును కాశ్మీరునుండి వేరుపరిస్తే

చాలా ఉపకారం చేసినవారవుతారు. మహారాజుగారెటూ దిగిపోతున్నారు. ఇది తగిన సమయం !"

థామస్ అందుకొన్నాడు "రాజాసాహెబ్ ! నేను అదే ప్రయత్నంలో ఉన్నానని మీకూ తెలుసు! కాని ఇప్పుడు ఈ అల్లరి సమయంలో మనం ఏం చెయ్యడానికీ వీలు లేదు. పరిస్థితులను కొంచం పాటున పడనివ్వండి !"

"పరిస్థితులు ఎలా పాటున పడతవండి! రోజు రోజుకూ మితిమించిపోతున్నాయి. నాలుగు ప్రాంతాలలోనూ నిప్పంటుకొన్నది. రోజూ పట్నంలోకి వేలమంది సిఖ్ఖులూ, హిందువులూ వలస వచ్చేస్తున్నారు !"

"మీరు చెప్పింది. నిజమే! కాని ఆ పరిస్థితులను అదుపులో పెట్టుకోవలసినది మీరు. వాటిని అదుపులో పెట్టుకోలేకపోతే మీ జాగీరు జాగీరే కాదు !"

ఆన్‌సింగు అన్నాడు. "సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తూనే వున్నాను !"

థామస్ లేచి నిలబడి నమస్కరిస్తూ "క్షమించండి! తల భారంగావుంది. నేనుపోయి విశ్రాంతి తీసుకుంటాను" అన్నాడు.

థామస్ వెళ్ళిపోయాక ఆన్‌సింగు మరికొంచం విడిచి పెట్టాడు "కర్నల్‌గారూ! అసలు కాశ్మీరు సింహాసనానికి మేము వారసులమండీ! మహారాజా గులాబ్‌సింగు చనిపోయాక సింహాసనం నాకు దొరకవలసినది. కాని అలా కాలేదు. సర్కారువారి ఇష్టం ! జరిగినదేదో జరిగింది ! మరి ఇప్పుడు

మహారాజుగారు సింహాసనంనుంచి దిగిపోతే..." చెప్పేన మధ్యలోనే ఆపాడు ఆన్‌సింగు.

కర్నల్ డిక్ చిరునవ్వు నవ్వాడు.

రాజా ఆన్‌సింగు చప్పట్లు చరిచాడు. ఇద్దరు ఏ.డి.సి. లు ప్రత్యక్షం అయ్యారు. వాళ్ళకు రాజా సహాబ్ సౌంజ్ఞతో ఏమిటో చెప్పాడు. ఇద్దరూ వెంటనే లోపలకు పోయి క్షణకాలంలో తిరిగివచ్చారు. వారి చేతులలో పట్టు శాలువ కప్పిన బంగారుపళ్ళెం ఒకటి ఉన్నది. రాజా ఆన్‌సింగు ఆ పళ్ళెమును కర్నల్ డిక్ ముందు పెడుతూ "దీన్ని స్వీకరించండి!" అన్నాడు.

కర్నల్ బంగారుపళ్ళెంమీది పట్టుగుడ్డనుతొలగించాడు. ఒక వజ్రాలహారం, రత్నాలు పొదిగిన రెండు బంగారు ఉంగరాలు, పచ్చలు తాపడంచేసిన రెండు పురాతనపు బంగారు గాజులు, ఒకవంద బంగారు మొహర్లూ ఉన్నాయి!

రాజా ఆన్‌సింగు అన్నాడు. "ఈ వజ్రాలహారాన్ని ఒకమాటు నేను బొంబాయి పట్టుకు వెళ్ళాను. అక్కడి షరాబులు అరవైలక్షలవరకూ ధరకట్టారు. కాని నేను డబ్బుముఖం చూసేవాడిని కాదు. కర్నల్‌గారూ! ఈ హారం మా అమ్మగారిది. దీన్ని మీకూతురికి కానుకగా ఇస్తున్నాను తీసుకోండి. మీరు వద్దనడానికి వీలులేదు. వద్దన్నారా, నేను రసపుత్రుడను, ఆ విషయం జ్ఞాపకం వుంచుకోండి!"

కర్నల్ నవ్వి "రాజాసాహబ్! మీలాంటి రసపుత్రులు జాగీర్దార్‌గా ఉండకూడదు. సంస్థానాధిపతిగా ఉండాలి!" అన్నాడు.

"ఆ బాధ్యత అంతా మీాకే వదులుతున్నాను. రేపు శ్రీనగరు వెళుతున్నారు. బహుశ ఢిల్లీ కూడా వెళ్ళవచ్చును!"

"అవును, వెళదాం అనుకొంటున్నాను!"

"జ్ఞాపకం ఉంచుకోండి!"

"కర్నల్ చిరునవ్వు నవ్వి ఆవేశంగా రాజాగారితో కరస్పర్శ చేశారు. తరువాత ఇలా అన్నాడు "మీా చేతిలో చెయ్యి వేస్తున్నాను. నేను ఇప్పుడు ఇంకేమీా చెప్పలేను. ప్రయత్నం చెయ్యడానికి అవధి నివ్వండి!"

"ఆన్‌సింగు "దారిలో ఏ భయమూా లేదుకదా? పట్నం నుండి వూడీ వెళ్ళేమార్గం బాగానే ఉంది. అయినా అవుసరం అయితే నా సైనికులను కొంతమందిని వెంటతీసుకు వెళ్ళండి!"'

"వద్దు! నా ఇంగ్లీషు సిపాయీలూ ఉన్నవరకూ నాకేమీా భయంలేదు. ఆc, మీాకు అవుసరం అయితే శ్రీ నగరునుండి డోంగరా సైన్యాన్ని పంపిస్తాను. చెప్పండి?"

వద్దు, వద్దు. వాళ్ళేమీా రానవసరంలేదు. అంతా నేను సమర్థించుకొంటాను. ఈ ముస్లీములను వెనక చాలాసార్లు స్తిమితపరిచాను. ఇప్పుడూ ఇంత గలభా జరిగేదికాదు. ఇక్కడి వాళ్ళకు సహాకారంగా పంజాబీ ముస్లీములు వచ్చారు. ఇదికాక చాలా ఇంగ్లీష్ పత్రికలుకూడా వీరివైపే మాట్లాడుతున్నాయి. ఉదాహరణకు సివిల్ అండ్ మిలట్రీ గజట్ చూడండి! ఈ అల్లరిని కాశ్మీర్ ముస్లీముల స్వాతంత్ర పోరాటం అంటున్నది. ఇక చెప్పండి. ఇంగ్లీషువాళ్ళ పత్రికలే ద్రోహులను సపోర్టుచేస్తుంటే, ఇక రాజ్యం అయినట్టే."

కర్నల్ అన్నాడు. "పత్రికలవాళ్ళు అలా రాస్తూనే వుంటారు. వాటిని లెక్ఖ చేయ్యకండి. పోతే, 'సివిల్ అండ్ మిలిట్రీ' విషయమూ నా వుద్దేశ్యంలో అది ప్రభుత్వపత్రిక కాదు. అది ఒక ప్రయివేటు కంపెనీ పత్రిక. దాని ఎడిటరు ఇంగ్లీషువాడే. కాని అంతమాత్రానికి ఏమౌతుంది? పాలసీ అంతా కంపెనీ డైరెక్టర్ల చేతుల్లో వుంటుంది. డైరెక్టర్లలో ఎక్కువమంది ముస్లిములట"

"సరె అదా విషయం"

"అవును. మీరు అనవసరంగా భయపడిపోతారు. ఇండియా రాజపుత్రులంటే ఆంగ్లప్రభుత్వానికి స్వంతకొడుకులతో సమానం!"

## 2

కర్నల్ డిక్సనూ, మాలీని పంపించిరావడానికి సంగ్రామసింగ్ రెసిడెన్సీ భవనం వరకూ వెళ్ళాడు. వాళ్ళు వెళ్ళిన తరువాత రాజాఆన్‌సింగ్ జమాదార్ కాహాన్‌సింగ్‌ను పిల్చి పట్టణపు పరిస్థితిని అడిగాడు. పట్టణం, చుట్టుపట్ల ప్రదేశాలను గురించి కాహాన్‌సింగ్ చెప్పిన వివరాలను వినేసరికి రాజాగారి ఆదుర్దా ఎక్కువ అయింది. ఇప్పటి వరకూ రాజధాని, చుట్టుపట్ల ప్రదేశాలు, ఉపద్రవరహితాలుగా వున్నాయి. ఇప్పుడు ఈ ఉద్యమపు జ్వాలలు అక్కడకూడా అలుముకుంటున్నాయి. ఇది చాలా అనర్థం.

రాజాఆన్‌సింగ్ ఇలా అన్నాడు. "ఐతే జమాదార్ గారూ! సూబేదార్ నజీర్ ముహమ్మద్ సైన్యం సంగతి ఏమయింది?"

"అది శత్రువులతో కలిసి పోయిందండీ!"

"మరి ?"

"తరువాత కమాండర్‌గారు మేజర్ సోమనాథంగార్ని సైన్యంతో పంపించారు. కాని, ఆ సైన్యమూ నాశం అయి పోయింది. అతను బ్రాహ్మణుడు, ఏం పోట్లాడుతాడు! ప్రభువులు నన్ను పంపివున్నట్లయితే...!" కాహాన్‌సింగ్ నమస్కరించాడు.

రాజాఆన్‌సింగ్ పచార్లుచేస్తూ ఆలోచించసాగాడు. తరువాత అతను తన ఏ. డి. సి. ని పిలిచి ఇలా అన్నాడు. "కమాండర్ని పిలువు. జమాదార్ కాహాన్‌సింగ్‌ను మేజర్ సోమనాథ్‌కు బదులు నియమిస్తున్నాను. ఈయనకు సైన్యాన్ని ఇచ్చి వెంటనే ఉపద్రవ స్థలాలకు పంపించండి. వెంటనే, ఇది నా ఆజ్ఞ"

"జై దేవా!" ఎ. డి. సి. వంగి నమస్కరించాడు. కాహాన్‌సింగ్ అతనితోపాటు కార్యాలయానికి వెళ్ళాడు. క్రొత్త ఆజ్ఞాపత్రాన్ని రాయించుకోవడానికి

# 3

మేజర్ కాహాన్‌సింగ్ తన సైన్యాన్ని వెంటతీసుకొని మొదట పట్నంలో ఒక చక్కర్ కొట్టాడు. వెంట బ్యాండు వాయిద్యపు జట్టుకూడా ఒకటి వున్నది. వాయిద్యగాళ్ళు ఇంగ్లీషు ఫాషన్‌లో మెరిసే దుస్తులను వేసుకున్నారు. వాయించడంకూడా ఇంగ్లీషు స్వరాలనే. ఆ వాయిద్యాలు విని గుర్రాలు మహోత్సాహంగా నడుస్తున్నాయి. ఈ విధంగా

సైన్యం (తానూర్ వాళ్ళ బజారునుండి కాష్మీర్ బజార్ వరకూ వచ్చింది. అక్కడినుంచి భైరవీమందిర్ మీదుగా, దరియానీ బజారువరకూ వచ్చింది. అక్కడినుండి వెనక్కు తిరిగి వల్లవు గొందుల్లో తిరుగసాగింది. తరువాత పైభాగంలోకి పోయి మార్చిచేయసాగింది.

ఇప్పుడు సైన్యం భోగీనాడ్ దగ్గిరకు వచ్చింది ఈపేట వ్యభిచారస్త్రీలకు నిలయం. ఇక్కడ కొంచెం ఎక్కువసేపు తనసైన్యాన్ని మార్చిచేయించాడు కాహన్ సింగ్. తనొక సైనికాధికారినని ఆపరిసరంవాళ్ళు తెల్సుకోవాలని అతని వుద్దేశ్యం! ఫతౌహాసింగ్ సునార్ కూతురు. ఇందిరా అంటే అతనికి మహాయిష్టం. వాళ్ళమేడకిందనుండి వెళ్తూ అతనొకమాటు పరదాలుకట్టిన కిటికీలవైపు తొంగికూడా చూశాడు. కానీ ఆమె కనుపించలేదు.

సరే, తరువాత చూసుకోవచ్చు!

భోడీనాడ్ కు దక్షిణదిశగా క్రిందకుదిగి డోంగరాల పేటకు పోయాడతను. తన ఇంటిముందు కాసేపు ఆగాడు. తన ముసలితండ్రికి నమస్కరించడానికి లోపలికి పోయాడు. తండ్రి అతన్ని ఆనందంతో కౌగలించుకొన్నాడు. భార్యా బిడ్డలు అందరూ చుట్టు మూగారు. వాళ్ళందరిమధ్యా అతను కుచ్చుకోడిలా కనుపిస్తున్నాడు. కొద్ది క్షణాలతరువాత అతను బయటికి వచ్చాడు.

అతనిభార్య కన్నీరు పెట్టుకోసాగింది. ఇంతకుక్రితం సోమనాథుడు వెళ్ళాడు. హతుడయ్యాడు. అతడిభార్యా విధవ అయింది. తనూ అంతేనా? విధవను సమాజ హీనంగా

చూస్తుంది. లేకపోతే తను విధవఅయినా ఏమంత బాధలేదు. కాహన్‌సింగ్ అందగాడు. యవ్వనంలో వున్నాడు. ఇద్దరు పిల్లలుకూడా పుట్టారు. అయినా భార్య అతన్ని ప్రేమించ లేకుండావుంది. అందుకు కారణం రోజూ హంటర్ దెబ్బలు తగలటమే! మొగవాడు ఎంత అందగాడే కావచ్చు! రోజూ హంటర్ దెబ్బలు కొడ్తూవుంటే ఏఆడది ప్రేమించగలదు? భార్యకు విధవనౌతాననే భయంలేదు. భర్త చనిపోతాడేమో. ననే బాధలేదు. రాత్రిళ్ళు వంటరిగా గడపవలసి వస్తుందేమో ననే దిగులూలేదు; దానికీ ఏదో ఒక అడ్డదారి చూసుకో వచ్చును. పోతే బాధల్లా విధవను సమాజం హీనంగా చూస్తుంది. అది!

భార్య ఏడుస్తూ వసారాలోకి దృష్టి మరల్చింది. అక్కడ మరిది నిలబడి వున్నాడు. అతడు వదినెదగ్గిరకు వచ్చి కన్నీరు తుడుస్తూ వోదార్చాడు. మనస్సులోనే వదినెగారి కళ్ళ అందాన్ని ప్రశంసించుకొన్నాడు. ఆమె ఏడుస్తూనే మరి దిని మనసారా తిట్టుకొన్నదిలోలోన! ఈతాగ్రిష్టుడుకూడా ఇక నాలుగురోజులుపోతే హంటర్ దెబ్బలు కొట్టడానికె సిద్ధం అవు తాడు! పీడిచెయ్యిపడ! అనుకొన్నది.

ఇంతలో మేజర్ కాహన్‌సింగ్ సైన్యాన్ని తీసుకొని ముందుకు నడిచాడు.

దారిలో ఎంతోమంది శరణార్థులైన హిందువులూ, సిక్ఖులూ గుంపులు గుంపులుగా కనుపించారు. ఈశరణార్థులను చూస్తున్నకొలదీ కాహన్‌సింగ్‌కు ముస్లిములమీాద కోపం

అధికం కాజొచ్చింది. అనేక రకాలుగా ముస్లిములను తిట్టి వివశంగా తనకోపాన్ని అణచుకొన్నాడు కాహాన్‌సింగ్.

ఈ సైన్యం వస్తున్న విషయం ముందుగానే పల్లెల్లో వ్యాపించింది. ఇదిపోయిన ప్రతిపూరిలోనూ ముస్లిములూ ముందే ఇండ్లను ఖాళీచేసి పరారీ అయ్యేవారు. ఇతని పటాలం లోని సైనికులుకూడా దిగబడి పోయిన ముస్లిం స్త్రీలపట్ల పసిపిల్లల పట్లా క్రూరంగా అసభ్యకరంగా ప్రవర్తించేవారు. ఏవూళ్ళోనైనా మనుష్యులు ఎవ్వరూ దొరక్కపోతే సైనికులు గ్రామాన్ని పూర్తిగా తగులబెట్టి బేండు వాయించుకొంటూ వెళ్ళిపోయేవారు అక్కడి నుండి.

సాయంత్రం అయ్యేసరికి ఫజల్ మంజూర్లు దాటివచ్చిన గ్రామాన్ని చేరుకొన్నారు వీళ్ళు.

గోడమీద బొగ్గుతో వ్రాసిన "హిందువులారా! మీ అమ్మల్ని...!" అనే వాక్యాన్ని చదివేసరికి ఎక్కడలేని కోపమూ వచ్చింది కాహాన్‌సింగ్‌కు. వెంటనే తన గుర్రాన్ని నిలిపి ఒక జమూదారుని పిలిపించి, ఆ వాక్యాన్ని తుడిపించి, దాని స్థానంలో "ముస్లిములారా! మీ అమ్మల్ని...! అని వ్రాయించాడు. అక్కడికీ అతనికి సంతృప్తి కలగలేదు. ఎవరైనా ఒక ముస్లి కనుపిస్తే బాగుండు. తాటవలిచి పగతీర్చు కొందును అనుకొన్నాడు. పండ్లు కొరుకుతూ వెనక వస్తున్న తన సైన్యానికి ఆజ్ఞాపించాడు. "ముందు ఎవరైనా ముస్లిం కనుపిస్తే మొదట నాకు చెప్పండి!"

"సరేనండి, హుజూర్."

చాలా దూరంవరకూ ముస్లిములూ హిందువులేకాదు ఒక్క మేకపిల్ల అయినా కనుపించలేదు. చివరకు రంగడ్ అడవిలో ఒక ముస్లిం వృద్ధస్త్రీ కనుపించింది. ఆమె వణుకుతూ నడుస్తున్నది. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి

ఒక సైనికుడు అడిగాడు "ఎవరు నీవు?"

"బాబూ నేను ముసలిదాన్ని దారి తప్పాను!"

"ఇక్కడ అడవిలో ఏం చేయను వచ్చావు?"

"సైన్యం వచ్చిందని మా వాళ్ళందరూ అడవిలోకివచ్చి దాక్కున్నారు. నేనూ వచ్చాను. నాకు రేచీకటి. రాత్రి అయితే కండ్లు కనుపించవు. ఇప్పుడు మావాళ్ళు ఎక్కడ దాక్కున్నారో నాకు తెలియలేదు తప్పిపోయాను. నీవు ఎవరు నాయనా?"

మేజర్ కాహాన్‌సింగ్ క్రూరంగానవ్వి "మే మెవరమో నీ కొడుకువచ్చి చెబుతాడులే, వూఁ చూస్తారేం? అంటించండి నాలుగు... పడవేయండి క్రిందికి!" అన్నాడు.

"హుజూర్, ఇది ముసలది మా తల్లి ఈడుది." అన్నాడొక సిపాయి.

"నేను చెబుతున్నాను. క్రిందకు పడనెట్టండి! ఇది నా ఆజ్ఞ!"

"సర్కార్! కొంచం నేను చెప్పేది వినండి...పాపం ఈ...ముసల్ది...!"

"నోరు మూసుకో, నా ఆజ్ఞను జరపకపోతే, కోర్టు మార్షల్ చేసేస్తాను!"

ముసలిది ప్రతిమలాడ సాగింది. "నాయనా నన్ను క్షమించు! నేను మనమలూ, ముది మనమలూ కల ముసలిదాన్ని! గ్రుడ్డిదాన్ని...నన్ను హింసించకండి!"

"నీ మనుమళ్ళను ఇప్పుడే చూపిస్తాం—ఊఁ, చూస్తా వేం?" కాహాన్‌సింగ్ అరిచాడు.

కాహాన్‌సింగ్ పిస్తోల్ తీసి "క్రింద పడేస్తావా, కాల్చ మంటావా ?" అరిచాడు.

సిపాయి ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వుండి పోయాడు.

కాహాన్‌సింగ్ కండ్లనుండి నిప్పులను చిందిస్తూ నాలుగు వైపులా చూశాడు. ఇంతలో ఒక జమాదార్ ముందుకువచ్చి, మొదటిసిపాయిని రెండు గుద్దులుగుద్ది వెనక్కి నెట్టివేయగా ఒక్కతన్ను తన్ని ముసలిదాన్ని క్రిందకు పడేశాడు.

ముసల్ది పెద్దగా ఆక్రందించింది.

ముసలిదాని అరుపును ఎవరూ వినలేదు కారణం; ఆ చుట్టూ అడవివున్నది. ఆ చుట్టూ మృగాలు వున్నాయి.

## 4

మేజర్ కాహాన్‌సింగ్ ఇరవై ఒక్క రోజులపాటూ ప్రాంతాన్నంతా చుట్టివచ్చి, ఇప్పుడు తిరిగి పట్టణాభిముఖుడై నాడు.

ఈ ఇరవై ఒక్క రోజులోనూ డోంగరా సైన్యం ఎన్నో ప్రాంతాలను ఉపద్రవ రహితాలుగా చేశాయి. ఎంతో

మంది ఆశతాయి ముస్లిములకు బుద్ధిచెప్పాయి. సదర్ ప్రాంతం అంతటిలోనూ విద్రోహులు పూర్తిగా నశించారు. కాక పోతే తూర్పు కాగాన్ ప్రాంతంలోని కొండల్లో అక్కడక్కడా చెదురుగా వున్నారు.

కాహన్‌సింగ్ దగ్గిర సైన్యముకూడా ఏమంత ఎక్కువగా లేదు. కొద్ది సైన్యంతోనే ఈవిధంగా పరిస్థితిని అదుపులోకి తీసుకురావడం చెప్పుకోతగ్గ విషయం. ఇందులో సైనిక బలం కంటే కాహన్‌సింగు తెలివితేటలు ఎక్కువగా పనిచేశాయి. విజయగర్వంతో పట్నం వైపు వస్తున్న కాహన్‌సింగు గత సంఘటనలను ఒకమారు తన మనోవీధిలో సాక్షాత్కరింప చేసుకొన్నాడు. తనకు కొద్దిదూరంలో సైనిక రక్షణలో వస్తున్న రాజాకర్మ ఆలీ వైపు ఒకమారు చూసి చిరునవ్వు నవ్వుకొన్నాడు. రాజాకర్మ ఆలీని బంధించిన రాత్రి అతని మనోవీధిలో మెరసింది. ఎంతో సాహసంతో రాజాకర్మ ఆలీని, జమాత్ ఆలీని బంధించి మొత్తం ముస్లిమ్ యువకులను చెల్లాచెదరు చేసేశాడు. ఎంతోమంది హిందువులనూ, సిక్కులనూ మతభ్రష్టులు కాకుండా కాపాడాడు!

ప్రక్కనే రాజాకర్మ ఆలీ పాలిపోయిన ముఖంతో, సిపాయీల కావలాలో, గుర్రాన్నెక్కి వస్తున్నాడు. వెన్నెముక లేనట్టు మనిషి జారిపోయి, గుర్రపు కుదుపులకు ఊగుతున్న అతన్ని చూసి కాహన్‌సింగు నవ్వుకొన్నాడు.

ఆరోజు రాత్రి ఏడుమైళ్ళు ముందుకుపోయి, కాగాన్ నదిని దాటి, అగస్మాత్తుగా కర్మ ఆలీమీద విరుచుకుపడ్డాడు కాహన్‌సింగు. ముట్టడి జరిగినప్పుడు కర్మఆలీ గాఢనిద్రలో

వున్నాడు. అతని గాజియానే ఇస్లాం సభ్యులుకూడా నిద్రా వస్థలో వున్నారు. క్షణకాలంలో కర్మ ఆలీ బంధితుడు కావడం జహామత్ ఆలీ పారిపోవడం, ముస్లిము యువకులందరూ చెల్లా చెదరు కావడం జరిగింది.

ఈ విధంగా అశేష ప్రజ్ఞా విశేషాలతో మొత్తం ప్రాంతాన్ని శాంతపరిచాడు కాహన్‌సింగు.

మొత్తం ప్రాంతంలో శాంతినైతే నెలకొల్పాడుగాని, ఒక్క విషయం మాత్రం అతనికి ఎంతకీ అర్ధంకాకుండా వుంది...చిన్న చిన్న గ్రామాలలోని హిందూ సిక్కు రైతులూ, వ్యాపారులూ ఎంతవద్దన్నా వినకుండా అతని వెంట పట్నానికి వస్తున్నారు. ఇలాంటి శరణార్ధులు ఇప్పు డతనివెంట ఐదారు వేలమంది వున్నారు. తను ఎంత చెప్పినా ధైర్యాన్ని ఇచ్చినా వీళ్ళంతా తిరిగి వెనకటిలా తమ స్వగృహాల్లో వుండడానికి సిద్ధం కాలేదు.

మేజర్ కాహాన్‌సింగు తన గుర్రాన్ని వెనక్కి త్రిప్పి గంగా సరస్వతు లున్న వైపుకు పోయాడు. గంగా సరస్వతులు కొంతమంది సిపాయీల రక్షణలో భద్రంగా వస్తున్నారు.

"పట్నం దగ్గరకు వచ్చింది" కాహాన్‌సింగ్ నవ్వుతూ ఇద్దరు సోదరీమణులతోటి అన్నాడు. క్రమంగా అతని చూపు సరస్వతిమీదనుండి గంగమీదకు పోయింది.

"ఠాకుర్‌జీ, ఇంకెంతదూరంవుంది పట్నం?" సరస్వతి అడిగింది.

"ఇవ్వాళ మధ్యాహ్నానికి జేరుతాము" మేజర్ అన్నాడు.

"అక్కడి ఇళ్ళన్నింటినీ రేకుల్తో కప్పుతారుటగా?"

"అన్నిటికీకాదు, కొన్నిటికి మాత్రం కప్పుతారు. మనం కనోతియా వెళ్ళామంటే అక్కడినుండి పట్నం చక్కగా కనుపిస్తుంది. చూడవచ్చు!"

సరస్వతిముఖం ఆనందంతో విప్పారింది. గంగ ఇంత సేపటినుండి మౌనంగా వుంది. ఆమె కాహాన్ సింగ్ వైపు చూడ్డంలేదు. సరస్వతివైపు చూడ్డంలేదు.

మేజర్ ముందుకువచ్చి గంగను ఉద్దేశించి "ముందు దారి బాగుంటుంది. నాతోపాటు గుర్రాన్ని పరుగెత్తిస్తావా?" అనడిగాడు.

గంగ సమాధానం చెప్పకుండానేగుర్రాన్ని ముందుకు తోలింది. కాహాన్‌సింగ్ ఆమెను అనుసరించాడు. అలా వారిద్దరూ కొంతదూరంవెళ్ళి ఇక గుర్రాలను మెల్లగాతోల సాగారు. వారలా ముందుకు పోవడంచూసి ఒకసిపాయి ఇలా అన్నాడు" భీమ్‌సింగ్! మన మేజరుగారు ఇంతవరకూ ఏపిల్ల కోసరము ఇలా బాధపడలేదు!"

"అవును షంశేర్! కాని పిల్లనుచూడు, ఎలాంటి చురుకో!"

"కాని, భీమ్‌సింగ్! సైనికుడైనవాడు ఆడదానికోసరం, ఇంత సమయాన్ని ఖర్చుచేయరాదు! వెనక మనమేజర్‌గారు ఇలా వుండేవారుకాదు. ఆడదంటే, ఒక్కచూపు చూచేవారు. పైకి ఎత్తి క్రిందకు దించేవారు! ఇప్పుడీ అమ్మాయే మేజరు గార్ని ఎత్తి కుదేస్తున్నది!

పెట్టదల్చుకోలేదతను. మౌనంగా గంభీరంగా ఉండిపోయాడు. ఈ గంభీరత గంగకు నచ్చింది. దుఃఖావేశంలో గంగ ఒకటి రెండుసార్లు కాహాన్‌సింగ్‌ను అవమానించింది కూడాను. కాని, మేజర్ దాన్ని పట్టించుకోలేదు. అలా అతన్ని అవమానపర్చి నందుకు ఇప్పుడు పశ్చాత్తాపం పడుచున్నది గంగ!

కాహాన్‌సింగ్ గుర్రాన్ని ఆపి "ఏమిటి ఆలోచిస్తు న్నావు ?" అనడిగాడు

గంగకు క్రొత్తగా స్పృహ వచ్చినట్టయింది. "ఏమిటి?" అనడిగింది.

"ఇప్పుడు మనం కనౌతియాకు వచ్చాము. అటు చూడు !"

చిన్న చిన్న పల్లెలతో చుట్టబడివున్న పెద్ద పట్నం గంగ దృష్టిని ఆకర్షించింది. చుట్టూ నదులూ, తోటలూ వున్నాయి. పట్నం మధ్యలో ఎత్తయిన కోట. కోటకు డోంగరా ఝండా!

"ఇదేనా పుంఛ్ పట్నం ?"

"అవును."

పట్నంలోని బజార్లూ ఇళ్ళూ చిన్నవిగా కనుపిస్తు న్నాయి. ప్రతి బజారుకూ జండాలు. ప్రజలు చీమల్లా ఆరా టంగా అటూఇటూ తిరుగుతున్నారు.

"ఏమిటిది...ఎందుకలా తిరుగుతున్నారు ?" గంగ అడిగింది.

"మన స్వాగతానికి ఏర్పాట్లు చేస్తున్నారు? కాహాన్ సింగ్ గంగ చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు.

గంగ తనచేతిని విడిపించుకొనలేదు.

"గంగ! నన్ను పెండ్లి చేసుకొంటావా?" కాహాన్ సింగ్ అడిగాడు.

గంగ చిరునవ్వు నవ్వుతూ కాహాన్‌సింగ్‌వంక ఓరగా చూసి, గుర్రాన్ని పరుగుతీయించింది.

కాహాన్‌సింగ్ ఆనందంతో చేయిఎత్తి సైన్యానికి ఆజ్ఞ చేసి తనుకూడా గుర్రాన్ని పరుగుతీయించాడు. కొద్ది దూరం లోనే ఆమెను కలుసుకొన్నాడు. అమాంతం గంగను ఎత్తు కొని తన గుర్రంమీద కూర్చోపెట్టుకొన్నాడు కాహాన్‌సింగ్.

---